శ్రీ వైష్ణవ సంప్రదాయ గ్రంథమాల—8-వ ప్రసూనము.

# తిరువేంగడముడయాన్ల (శ్రీవేంకటాచలపతి)

విషయముగ

భగవదనుగ్రహీత వినిర్మల విశదతమ విజ్ఞానభక్తిసంపన్నులగు

శ్రీ దివ్యసూరులు (ఆళ్వార్లు) ఆనతిచ్చిన

# మంగళాశాసన పాశురములు

శ్రీవేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో దర్శనవిభాగాధ్యక్షులును నగు

సాహిత్య న్యాయ వేదాన్తశిరోమణి, ఉభయవేదాన్త విద్వాన్

శ్రీ తి. కు. వేం. న. సుదర్శనాచార్యస్వామివారిచే

వ్రాయఁబడిన ఆంధ్ర టీకా తాత్పర్య విశేషార్థములతోఁ గూడినవి




తిరుమల తిరుపతి దేవస్థానములవారిచే ప్రకటితములు

శ్రీరస్తు

# విషయానుక్రమణిక.

| గ్రన్థ విషయములు | పృష్ఠ సంఖ్య |
|---|---|



——[o]——

శ్రీరస్తు

# మంగళాశాసనము

ఆళ్వార్గళ్ వాళ్ళి, అరుళిచ్చెయల్ వాళ్ళి,
తాళ్వాదుమిల్ కురవర్తామ్ వాళ్ళి – ఏళ్ పారుమ్
ఉయ్య అవర్గళ్ ఉరైత్తవైగళ్తామ్ వాళ్ళి,
శెయ్యమఱై తన్నుడనే శేర్న్దు.

(ఉపదేశరత్నమాల)

దీనికి సంస్కృతాంధ్రానువాదములు (సంపాదకీయములు)

జయన్తు దివ్యసూరయ, స్తథా తదీయసూక్తయో
జయన్తు దోషలేశతో విహీనదేశికాస్సమే ।
జయన్తు సప్తలోకగ ప్రపన్నజీవనాయ తై
ర్జయన్తు నిర్మితాః కలా స్సహ శ్రుతిప్రమాణకైః ॥

ఆళ్వారులు సర్వోత్కర్షములతో వర్ధిల్లుదురుగాక; వారానతిచ్చిన దివ్య ప్రబంధములును సర్వతః ప్రసిద్ధములై వర్ధిల్లునుగాక; ఏవిధమైన అవకర్షముగూడ లేని పూర్వాచార్యులు వర్ధిల్లుదురుగాక; ఏడులోకములును నుజ్జీవించునటుల, పరమ కృపతో వారానతిచ్చిన వ్యాఖ్యాన రహస్యములును, నిత్యనిరవద్యములగు వేదశాస్త్రములతోఁగూడ, దశదిగన్తవ్యాప్తములై విరాజిల్లునుగాక;



శ్రీమతే రామానుజాయ నమః

# ప్రణామాంజలి

---

భూతం సరశ్చ మహదాహ్వాయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥

(శ్రీభట్టరువారు ఆనతిచ్చినది)

పొయ్‌గై యార్ పూదత్తార్ పేయార్, పుగళ్ మళిశై
ఐయనరుళ్ మాఱన్ శేరలర్ కోన్—తుయ్యబట్ట
నాదన్ అన్బర్ తాళ్ తూళి నఱ్పాణన్ నఱ్కలియన్
ఈదివర్ తోన్ఱియ్ త్తడైవా మిఙ్గు.

(శ్రీమణవాళమహామునులు ఆనతిచ్చినది)

దీనికి సంస్కృతానువాదము (సంపాదకీయము)

కాసార - భూత - మహదాహ్వాయ - భక్తిసార -
శ్రీమచ్ఛతారి - కులశేఖర - భట్టనాథాః ।
భక్తాంఘ్రిరేణుముని యాన - కలిద్రుహోఽపి
భూమౌ వితేను రమరాః క్రమతోఽవతారమ్ ॥

శ్రీరస్తు
శ్రీమతే వేంకటేశాయ పరస్మై బ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# ప్రస్తావన.

ఈ గ్రన్థము—మన శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపరిశోధనాలయమునందలి శ్రీవైష్ణవ సంప్రదాయగ్రన్థమాలలో నష్టమ ప్రసూనముగ నావిర్భవించినది.

నేను పై గ్రన్థమాలాసంపాదనకార్యమున నియుక్తుఁడనైన వెంటనే, మొట్టమొదటఁ జేయవలసిన కైంకర్యముగ, శ్రీవేంకటాచలపతి దివ్యసన్నిధిలోఁ బ్రతినిత్యము పారాయణమే జేయఁబడు సూక్త, స్తోత్ర - దివ్యప్రబంధాదులకు దేశభాషలలో టీకా తాత్పర్యాదుల సంతరించి ప్రకటించుటనుగ, తీర్మానించుకొంటిని. అర్థానుసంధానముతోఁగూడఁ జేయు పారాయణమే విశేషఫలప్రదమగును. అర్థగౌరవమువలన స్తోత్రములయందలి గౌరవప్రతిపత్తులు ఇనుమడించుటయేగాక, వాని అనుసంధానమే అత్యర్థప్రీతికరమై, అమన్దానన్దమును జేకూర్చునుగదా! అందుచేఁ బ్రప్రథమమున సుప్రభాత స్తోత్ర ప్రపత్తి మంగళాశాసనములకు, వివిధభాషలలోను టీకాతాత్పర్యముల వ్రాయించుటయేగాక, స్వయముగను ఆంధ్రద్రావిడభాషలలో విశిష్టమగు వ్యాఖ్యానములనుగూడ వ్రాసియున్నాను.

నిత్యానుసంధాన స్తోత్ర పాశురాదులను నొకచోటఁజేర్చి పారాయణము జేయువారల సౌకర్యమునకై ముద్రించి ప్రకటించితిమి. ఆ కార్యక్రమమునందలి ప్రయత్నమే, ఈ తిరువేంగడముడయాన్ మంగళాశాసన పాశురములయు, వాని టీకాతాత్పర్యములయు ప్రచురణమునకును హేతువు. ఇందు, అరవభాషలోని టీకాతాత్పర్యములు, మొట్టమొదటనే ముద్రింపఁబడి ప్రచారములోనికి వచ్చినవి. ఆంధ్రమునందలి టీకాతాత్పర్యములు మాత్రము, అన్నిటికన్న మొదట వ్రాయఁబడినవైనను, ఆంధ్రలిపిలో ననేక గ్రన్థములు ముద్రణీయములుండుటచే ముద్రణాంశమున వెనుకఁబడి, భగవద్భాగవతాచార్యాది దివ్యకటాక్ష ప్రసరణముచే నిప్పటికైనను, సహృదయతల్లజుల దృష్టిగోచరములగుచున్నందులకు నే నెంతయును సంతోషించుచున్నాను. దేవుడు చాల మేలుచేసిన, నాచే విరచితములగు శ్రీ వేంకటేశ సుప్రభాత స్తోత్ర వ్యాఖ్యానాదులును, నచిరకాలముననే వెలుఁగునుజూడ గలవని విశ్వసించుచున్నాను.

## భగవంతుని మూర్తిభేదములు, వానిప్రయోజనములు

సర్వేశ్వరుడు, పర-వ్యూహ-విభవ-అన్తర్యామి-అర్చావతారములను నైదు ప్రకారములతో నాయా ప్రదేశములలో నిత్యసన్నిధిఁజేయుచు, అనాది మాయాప్రవర్తితమగు సంసారసాగరమున మునింగి అపారయాతనల ననుభవించుచుండు సంసారిచేతనుల నుద్ధరించుటకై, అనేక విధములగు ప్రయత్నములఁ జేయుచున్నాఁడు.

"స వా ఏష పురుషః పంచధా పంచాత్మా" అను శ్రుతి, ఈ విషయములను బాగుగ వ్యక్తీకరించుచున్నది.

అందు, పరస్వరూపమనగా—శుద్ధ సత్త్వమయమై, అత్యర్కానల దీప్తమై, పరమ భోగ్యమైయుండు శ్రీవైకుంఠమనఁబడు పరమపదమున అనన్త - గరుడ - విష్వక్సేనాది నిత్యసూరులచేతను, శుక—వామదేవాది ముక్తజనంబులచేతను సదా సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందును ననుభవింపఁబడు శ్రీ భూనీళానాయకుఁడగు శ్రీమన్నారాయణుని అప్రాకృతమగు దివ్యమంగళ విగ్రహము.

వ్యూహమనఁగా—సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధనామములచేఁ గీర్తింపఁబడుచు, క్షీరాబ్ధి మధ్యమున శేషపర్యంకశాయియై, నిఖిలలోకరక్షణ జాకరూకమగు యోగనిద్ర ననుభవించుచు బ్రహ్మ, ఇన్ద్రా, ఈశానాది దేవతలచేతను, మహర్షులచేతను సేవింపఁబడు మూర్తివిశేషము.

విభవమనఁగా—దుష్టశిక్షణార్థము, శిష్టసంరక్షణార్థము, ధర్మసంస్థాపనార్థమును, సర్వేశ్వరుఁడు, ఆ యా దేశకాలపాత్రానుగుణముగ స్వేచ్ఛతో స్వీకరించు రామ, కృష్ణాదిరూపము లగు మూర్తిభేదములు.

అన్తర్యామి స్వరూపమనఁగా—చేతనా చేతనాది నిఖిల ప్రపంచమునందును, లోపలను వెలుపలను వ్యాపించియుండి, పదార్థముల సత్తను సంరక్షించుచుండు సకలభూత సుహృత్తమ మగు మూర్తివిశేషము.

ఇఁక, అర్చావతారమనఁగా — భక్తులకు నభిమతమైన పదార్థములలో, వారి కభిమతమైన మూర్తులలో నిత్యసన్నిహితుఁడై యుండి, వారలు సమర్పించు పూజలఁగైకొని, నిత్యసంతుష్టుఁడై యుండి, వారల యపేక్షితములఁబూర్తిజేయుటకై గృహముల యందును, దేవాలయములయందును ఆగమశాస్త్రానుసారము ప్రతిష్ఠింపఁబడిన విగ్రహములలో నావిర్భవించి యుండు పరమాత్ముని దివ్యమంగళ మూర్తివిశేషము.

## అర్చావతార మహిమ

ఈ పైదు ప్రకారములయందును, అర్చావతారమే, సకల శుభాశ్రయమై, నిఖిలచేతనులకు నిత్యసమాశ్రయణీయమై, సకల కల్యాణగుణపరిపూర్ణమై యుండుటచే సంసారుల కందుబాటులోనుండు ప్రశస్తతమమైన దివ్యమంగళ మూర్తివిశేషము.

"పూర్తియుళ్ళదుం అర్చావతారత్తిలే, ఆళ్వార్‌గళ్ పలవిడఙ్గళిలుం ప్రపత్తిపణ్ణిర్ట్రుమ్ అర్చావతారత్తిలే. 'పూర్ణమ్' ఎన్గైయాలే ఎల్లాగుణఙ్గళుం పుష్కలఙ్గళ్. ప్రపత్తిక్కు అపేక్షితఙ్గళాన సౌలభ్యాదిగళ్ ఇరుట్టఱైయిల్ విళక్కుప్పోలే ప్రకాశిప్పదు ఇఙ్గేయిఱే, పూర్తియైయుం, స్వాతన్త్ర్యత్తైయుం కులైత్తుక్కొణ్డు, తన్నై అనాదరిక్కిఱవర్‌గళై తానాదరిత్తు నిఱ్కిఱ విడమ్. భూగత జలమ్‌పోలే అన్తర్యామిత్వమ్; ఆవరణజలమ్‌పోలే పరత్వమ్; పాఱ్కడల్‌పోలే వ్యూహమ్; పెరుక్కాఱుపోలే విభవఙ్గళ్; అదిలే తేఙ్గిన మడుక్కళ్‌పోలే అర్చావతారమ్. ఇదుతాన్, శాస్త్రఙ్గళాలే తిరుత్తవొణ్ణాదే, విషయాన్తరఙ్గళిలే మణ్డి, విముఖరాయ్

ప్పోరుం చేతనర్కు వైముఖ్యత్తై మాఱ్ఱి రుచియై విళవిక్కక్కడవదాయ్, రుచి పిఱన్దాల్ ఉపాయమాయ్, ఉపాయపరిగ్రహం పణ్ణినాల్ భోగ్యమాయ్ ఇరుక్కుమ్" అని అర్చావతార మహిమను శ్రీ పిళ్లైలోకాచార్యులవారు తమ శ్రీవచనభూషణ గ్రన్థమున బహు విమర్శగ నభివర్ణించియున్నారు.

## విగ్రహారాధనముయొక్క ఆవశ్యకత.

"విగ్రహారాధనము మిక్కిలి ప్రధానమైనది" అని పెక్కు మతస్థులు అంగీకరించి యున్నారు. దీనికే "సమూర్తయజనము" అని ఆగమశాస్త్రములయందు వ్యవహారము. ఇదియే ఉత్తమ బ్రహ్మవిద్య.

[1] "అద్భ్యః సంభూతః పృథివ్యై రసాచ్చ" [2] "హృదా మనీషా మనసాఽభిక్లృప్తః" [3] "యుక్తగ్రావా జాయతే దేవకామః" [4] "అశ్మానమాఘాణం ప్రపద్యే" అను మొదలుగాఁగల వేదవాక్యములు విగ్రహారాధన క్రమము నభివర్ణించుచున్నవి.

---

1. అద్భ్యః = జలముయొక్కయు, పృథివ్యై = భూమియొక్కయు, రసాత్ = సారమైన భాగమునుండి, సమ్భూతః = ఉద్భూతమైన శిల, విశ్వకర్మణః = బ్రహ్మచే, సమవర్తత = బాగుగఁజేయఁబడినది. (చతుర్ముఖుని సంకల్పముచే భగవానుని దివ్యమంగళ విగ్రహమునకును, గోపుర మండప ప్రాకారాదులకును దగిన సర్వలక్షణ సమ్పన్నమైన ప్రశస్తమగు సాలగ్రామశిల ఉద్భవించినది అని భావము). తస్య = ఆ శిలకు, త్వష్టా = విశ్వకర్మ (శిల్పి), రూపమ్ = కరచరణాది యుక్తమైన మనోహరమగు దివ్యమంగళ విగ్రహమును, విదధత్ = నిర్మించెను, తత్ = ఆ నిర్మాణము, పురుషస్య = పరమపురుషుని యొక్క, అగ్రే = ఆవిర్భవింపఁబోవు, విశ్వం = ప్రసిద్ధమైన, ఆజానమ్ = దివ్యసన్నిధానమునకుఁ గారణమైయున్నది.

2. "న సందృశే తిష్ఠతి రూపమస్య, న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ; హృదా మనీషా మనసాఽభిక్లృప్తో య ఏతద్విదు రమృతాస్తే భవన్తి". అస్య = ఈ భగవానునియొక్క, రూపమ్ = రూపము, సందృశే = దృష్టిగోచరముగ, న తిష్ఠతి = ఉండుటలేదు, కశ్చిత్ = ఎవఁడును, ఏనమ్ = ఇతనిని, చక్షుషా = కంటిచే, న పశ్యతి = జూడలేఁడు, అయినను, హృదా = శ్రుతిప్రమాణముచేతను, మనీషా = మన్వాది స్మృతులచేతను, మనసా = భగవచ్ఛాస్త్రములని ప్రసిద్ధిఁజెందిన ఆగమశాస్త్రములచేతను, అభిక్లృప్తః = బింబరూపముగ, యే = ఎవరు, విదుః = తెలిసికొనుచున్నారో ; తే = వారలు, అమృతాః = మోక్షమును బొందెదరు.

3. "యతో వీరః కర్మణ్యః సుదక్షో యుక్తగ్రావా జాయతే దేవకామః". వీరః = భగవానుఁడు, కర్మణ్యః = అర్చనాదులచే నారాధింపఁబడి, సుదక్షః = భక్తుల యభీష్టముల ననుగ్రహించువాఁడై, దేవకామః = క్రీడింపవలయునని సంకల్పించి, యుక్తగ్రావా = శిలామూర్తిగ, జాయతే = ఆవిర్భవించుచున్నాఁడు.

4. ఆఘాణం = శిల్పిచే శాస్త్రోక్తముగఁజేయఁబడి, భగవచ్ఛాస్త్రవిధులతోఁ బ్రతిష్ఠాదులు జేయఁబడిన, అశ్మానం = శిలామూర్తియైన భగవానుని, ప్రపద్యే = శరణుజొచ్చుచున్నాను.

"ఏతద్రూపం ప్రతిష్ఠాప్య శుద్ధయా శిలయా నృప!
తస్మై దేహ్యఖిలాన్ భోగాన్ పూర్ణో భూత్వా సుపుష్కలాన్ ।
అప్రాకృతాగ్నో విరజాః సాత్వికో౽యమితి స్మరన్ ॥"

అని శ్రీపాద్మసంహితయందును,

"సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణామ్ ।
కృత్వా౽౽త్మనః ప్రీతికరీం సువర్ణరజతాదిభిః ।
తా మర్చయేత్ తాం ప్రణమేత్ తాం నమేత్ తాం విచిన్తయేత్ ॥
విశ త్యపాస్తదోషస్తు తామేవ బ్రహ్మరూపిణీమ్ ॥"

అని విష్ణుధర్మోత్తరమునందును,

"ప్రవః ప్రాన్త మన్ధసా ధియా తే మహేశూరాయ విష్ణవే చార్చత"

అని ఋగ్వేదమునను,

"అథాగ్నౌ నిత్యహోమాన్తే విష్ణోః నిత్యార్చా సర్వదేవార్చా భవతి....
భక్త్యా భగవంతం నారాయణమర్చయేత్"

అని వైఖానస శ్రౌత సూత్రమునందును

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవేష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియో౽సి మే ॥"

అని భగవద్గీతయందును భగవంతుని దివ్యమంగళవిగ్రహారాధనము పరమోపాదేయమని నిరూపింపఁబడియున్నది.

## దివ్య తిరుపతులలో శ్రీవేంకటాచలము

అట్టి భగవద్విగ్రహములలో స్వయంవ్యక్తములు దివ్యతేజోవిరాజితములై భక్తజన మందారములై విరాజిల్లుచున్నవి. అందు "తిరువేంగడ"మను శ్రీవేంకటాచలము....మహా ప్రభావ సమ్పన్నమగు దివ్యదేశమూర్ధన్యమై, సకల దిగన్తవిశ్రుతమై, సర్వజన సంసేవ్యమై, కల్యాణకల్పకమై, సకలాభీష్టఫలప్రదమై, సర్వతోముఖ విభవవిరాజతమై, సర్వతః ప్రసిద్ధమై, సకలలోక తిలక స్థానీయమై యలరారుచున్నది.

శ్రీవైష్ణవ దివ్యదేశములలో నాళ్వార్ల మంగళాశాసనముగల దివ్యదేశములే మిక్కిలి ప్రశస్తములైనవి. వేదపురాణాదులయందు వీని మాహాత్మ్యము ప్రతిపాదింపఁబడియున్నను, ఆళ్వారులచేఁ గీర్తింపఁబడి, వారి విగ్రహములతోఁగూడియుండు దివ్యక్షేత్రములే "దివ్యతిరుపతు"లని వ్యవహరింపఁబడుచున్నవి. శ్రీవైష్ణవ సంప్రదాయమున నట్టి దివ్యతిరుపతులు నూట యెనిమిది గలవని ప్రసిద్ధమైయున్నది.

ఈ నూటయెనిమిది దివ్యతిరుపతులయందును, కోయిల్ (శ్రీరంగము), తిరుమలై (శ్రీవేంకటాచలము), పెరుమాళ్‌కోయిల్ (శ్రీకాంచీపురము)—అను మూడు దివ్యదేశములును అనేకులగు ఆళ్వార్ల మంగళాశాసన విషయములగుటచేతనే, ప్రధానములై విరాజిల్లుచున్నవి.

ఆళ్వార్లందఱును శ్రీరంగమునుగూర్చి మంగళాశాసనము జేసియుండుటచేతను, ఆచార్యులందఱును అందత్యన్త ప్రవణులైయుండుటచేతను, ఈ లీలా విభూతిలోని దివ్యదేశములలో నది ప్రథమ ప్రధానస్థానము నాక్రమించుకొనియున్నది. అటులనే, నిఖిలలోకములకును తిలకస్థానీయముగనుండు నీ శ్రీవేంకటాచలముగూడ దివ్యదేశతల్లజమై యలరారుచున్నది.

## శ్రీవేంకటాచల మహిమను దెలుపు ప్రమాణవాఙ్మయము

[1] అరాయి ; కాణే ! వికటే గిరిం గచ్ఛ సదాఽన్వే ।
శిరింబిటస్య సత్త్వభిః, తేభిష్ట్వా చాతయామసి ॥ (ఋగ్వేద 7-153-8)

[2] రయిః కకుద్మాన్ విదధ ద్వినష్టం రయివద్విధానమ్ ।
తస్మై కకుత్త్రే వికటాయ పిత్రే స్వాహా ॥ (పారమాత్మికోపనిషత్)

ఏవం శ్రీకృష్ణరూపేణ క్రీడితో వేంకటాచలే ।
అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః ।
ఏవం వేదమయస్సాక్షాత్ గిరిశః పన్నగాచలః ॥ (బ్రహ్మపురాణమ్)

అని వేదపురాణాదులయందు శ్రీ వేంకటాచల మాహాత్మ్యము అభివర్ణింపఁబడియున్నది.

మఱియును, ఈ శ్రీవేంకటాచలమునుగూర్చి పంద్రెండు పురాణములలోఁ గీర్తింపఁబడియున్నది. ఆ యా భాగముల నన్నిటినిజేర్చి "వేంకటాచల మాహాత్మ్య" మనుపేర శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు, మూలమును, హిందీ, ఆంధ్ర, ద్రావిడ ప్రముఖములగు దేశభాషామయములగు టీకలతోడను ప్రచురించియున్నారు.

"పసిండి వేంగడత్తుఱైవర్" అనువారు ఈ సంకలనము జేసిరని కొందఱు చెప్పుచున్నారు. శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులవారును ఒక వేంకటాచల మాహాత్మ్యమును గ్రథనముఁజేసినటుల, వారి మనుమఁడు అన్నమాచార్యచరిత్రమునఁ బేర్కొనియున్నాడు. అది యేదియో తెలియుటలేదు. ఇందలి సత్యమును విమర్శకులు విమర్శింతురు గాక.

---

1. హే అరాయి = ఓ పేదవాడా ! కాణే = గ్రుడ్డివాడా ! (ఐశ్వర్యశూన్యులును, అంగవికలులునునై దీనాతిదీనులును నగు ఓ ప్రజలారా!) వికటే గిరిం = శ్రీవేంకటాచలమును గూర్చి, గచ్ఛ = నడువుము, సదాఽన్వే = అచ్చటకుఁ జని, అచంచలమగు ధ్యానయోగము నవలంబింపుము, శిరింబిటస్య = శ్రీ మహాలక్ష్మికి పీఠస్థానమగు శ్రీ వేంకటాచలపతియొక్క, సత్త్వభిః = సాత్త్వికములగు, తేభిః = ఆ దయావాత్సల్యాది దివ్యకల్యాణగుణగణములచే, త్వా చాతయా మసి = మీ పాపముల దహింపజేసి, మీకు పరమపురుషార్థమును ప్రసాదించెదము.

2. రయిః = నిరవధికైశ్వర్య స్వరూపుఁడును, కకుద్మాన్ = వృషభాచలవాసియును, విదధద్వినష్టం = అందఱికిని అన్నివిధములగు వరముల ప్రసాదించువాఁడును, రయివద్విధానమ్ = ఋగ్యజుస్సామాథర్వణములను వేదములయందు పరమప్రసిద్ధుఁడును, కకుత్త్రే = వృషభాచల శిఖరనివాసియును నగు. వికటాయ = శ్రీవేంకటాచలపతికి, స్వాహా = నా యాత్మను సమర్పించుచున్నాను.

శ్రీ తరిగొండ వేంకమాంబ, ఆంధ్రమున నొక వేంకటాచల మాహాత్మ్యమును వ్రాసియున్నది. ఇదియేగాక, వచనరూపముగను ననేకులు వ్రాసియున్నారు.

"వేంకటాచల ఇతిహాసమాల" అను గ్రన్థమును శ్రీమద్రామానుజులవారి శిష్యావతంసులగు శ్రీమదనన్తాచార్యుల (అనన్తాళ్వాన్లవారు) విరచించినటుల శ్రీమన్మహావిద్వాన్ పురిశై శ్రీరంగాచార్యస్వామివారు దానిని ప్రచురించియున్నారు. తదుపరి, శ్రీ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్లవారు, దానిని తమ విలువయైన ఆంగ్లభూమికతోఁగూడ దేవస్థాన గ్రన్థమాలలో మఱలఁ బ్రకటించియున్నారు.

ఈ శ్రీవైష్ణవసంప్రదాయ గ్రన్థమాలలోనే "తిరుమలై ఒళుగు" అను మణిప్రవాళ భాషామయమగు గ్రన్థము నొకదానిని ప్రచురించియున్నాము. దానికిఁగూడ ఆంధ్రానువాదమును ఆంధ్రాక్షరములలో మూలముతోసహా సిద్ధముఁజేసియున్నాను. దాని ముద్రణకార్యము కొన్ని కారణములచే నిలచిపోయినది.

తిరుమల-తిరుపతి దేవస్థానములలోనుండు శాసనములనన్నిటిని, ఏర్చి పేర్చి గూర్చి, శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారు, మిక్కిలి శ్రమపడి, ఏడు సంపుటములలోఁబ్రచురించియున్నారు. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామిఅయ్యంగార్లవారు రెండు సంపుటములలో తిరుమల-తిరుపతి దేవస్థానముల చరిత్రనంతటిని వ్రాసి ప్రచురించియున్నారు. మఱియు, దేవస్థానపు ఆచార్యపురుషులలో నొకరగు శ్రీమాన్ టి. కె. టి. వీరరాఘవాచార్యులవారును తిరుపతి చరిత్రమునుగూర్చి వ్రాసియున్నారు.

## శ్రీ వేంకటాచల నామ నిర్వచనము.

"వేంకట" పదమునకు రెండువిధములైన వ్యుత్పత్తి, పురాణములలోఁ గాననగుచున్నది. అందు వరాహ పురాణమున—.

> సర్వపాపాని 'వేం' ప్రాహుః, 'కట' స్తద్దాహ ఉచ్యతే ।
> సర్వపాపహరిత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః ॥

అని నిర్వచింపఁబడియున్నది. 'వేం' అనఁగా—సర్వపాపములు, 'కట' అనఁగా—దహించునది; కాఁగా, సర్వపాపములను దహించునది 'వేంకట' మైనది.

వామన పురాణమున—

> "వకారో ఽమృతబీజం తు, కటమైశ్వర్య ముచ్యతే ।
> అమృతైశ్వర్య సంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః ॥

అని నిర్వచింపఁబడియున్నది. వకారమునకు అమృతమనియు, కటశబ్దమునకు నైశ్వర్యమనియు, కాఁగా అమృతైశ్వర్య సంఘాతరూపముగ నుండునది శ్రీవేంకటాద్రియనియును సిద్ధించుచున్నది.

శ్రీనమ్మాళ్వారులవారు, తమ తిరువాయ్మొళిలో వేరువిధముగ నిర్వచించియున్నారు— "వేం కడఙ్గళ్" అని. అప్పుడు "కట శబ్దమునకు, కడఙ్గళ్—అనఁగా, సకల ఋణములు,

పాపములును, వేం = నశించును " అని పదార్థమై, సకల ప్రతిబన్ధకములను పోఁగొట్టి సర్వేశ్వరుని దివ్యకృపాకటాక్షామృతమును ప్రసాదించునది—వేంకటాచలమని సిద్ధించుచున్నది.

" శ్రీవేంకటాచలమువంటి దివ్యక్షేత్రముగాని, శ్రీవేంకటాచలపతివంటి దివ్యదేహుఁడగు దేవుఁడుగాని మఱి యెచ్చటనులేదు " అని చేతులు పైకెత్తి సుదృఢముగ చాటుచున్నవి బ్రహ్మాణ్డాది పురాణములు—

" వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాణ్డే నాస్తి కించన ।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥ "

అని కలియుగ ప్రత్యక్షదైవతము శ్రీ వేంకటాచలపతియే యనియును,

" కృతే వరదరాజస్తు త్రేతాయాం రంగనాయకః ।
ద్వాపరే చ జగన్నాథః కలౌ వేంకటనాయకః ॥

అను శ్లోకము దెలుపుచున్నది.

## ద్రావిడభాషా వాఙ్మయము—శ్రీవేంకటాచలపతియు

ప్రాచీన వాఙ్మయమని ప్రసిద్ధిఁజెందిన అరవ వాఙ్మయమునందును శ్రీ వేంకటాచలమును గూర్చిన ప్రశంస జేయఁబడియున్నది.

అరవ వాఙ్మయమున నతిప్రాచీనముగను, ప్రామాణికముగను స్వీకరింపఁబడియున్న " తొల్‌కాప్య "మను లక్షణగ్రన్థమునకు, తత్సమకాలికులై " శిఱప్పాయిఱమ్ "అను ప్రశంసా గ్రన్థమును రచించిన " పనమ్‌పరనార్ " అను మహాప్రాజ్ఞులు, అరవదేశమునకు నెల్లలఁ జెప్పునప్పుడు —" వడవేంగడమ్—తెన్‌కుమరి " అని వేంగడ (వేంకటాచల) మును ఉత్తరపు టెల్లగాఁ గీర్తించియున్నారు.

నడుసంగపు గ్రన్థమగు " అగనానూరు " అను గ్రన్థమునందును—

" కఴల్‌పునైతిరున్దడిక్కళ్వర్ కోమాన్
మఴపులమ్ వణక్కియ మావణ్ పుల్లి
విఴవుడై విఴుచ్చీర్ వేంగడం పెరిదుమ్
పఴగువ రాదలో అరిదు " అనియు,
" వెన్‌వేల్ తిరైయన్ వేఙ్గడనెడువరై" అనియు,
వినైనవిల్ యానై వీఱల్‌పోర్‌త్తొణ్డయర్
ఇనమఴైతవఴుమ్ ఎఙ్గురు నెడుఙ్కోట్టు
ఓఙ్గువెళ్ళరువి వేంగడత్తుమ్పర్." అనియును ప్రశంసింపఁబడియున్నది.

అగనానూర్ గ్రన్థపుకాలము, క్రీ. శ. రెండవ శతాబ్దమని విమర్శకులు నిర్ధరించియున్నారు.

పైనఁ బేర్కొనఁబడిన తమిళగ్రన్థములు శ్రీవేంకటాచలమున నుండు దేవుని గురించి సూచింపకున్నను, తిరువేంగడమున "తిరువిఴా"అను మహోత్సవములు జరుగుచుండినవి—అనియు, తిరువేంగడము మిక్కిలి ప్రశస్తమైన పర్వతమనియు నభివర్ణించుచున్నవి.

క్రీ. శ. రెండవ శతాబ్దిపు గ్రన్థమని ప్రసిద్ధిఁజెందియున్న " శిలప్పదికార "మను ప్రముఖ గ్రన్థమున— " మాజాట్టుమత్తైవన్ కూత్తు " అని, ఇటుల నభివర్ణింపఁబడియున్నది—

" వీజ్గునీరరువి వేంగడమెన్నుమ్
    ఓజ్గియర్ మలయ త్తుచ్చి మీమిశై
విరికదిర్ ఞాయిఱుం తిజ్గళుం విళజ్గి
    ఇరుమరుజ్గోజ్గియ విడైనిలై తానత్తు
మిన్నుక్కోడి యుడుత్తు విళజ్గువిఱ్పూణ్డు
    నన్నిఅమేగమ్ నిన్దదుపోల
పగైయణ జ్కాఴియుమ్ పాల్వెణ్శజ్గముమ్
    తకైపెఱు తామరై క్కైయినేన్ది
నళజ్గీళరరామరర్ విఱ్పూణ్డు
    పోలమ్పూవాడైయిఱ్ పొలిన్దుతోన్ఱియ
శెజ్గణ్ నెడియోన్ నిన్ఱవణ్ణముమ్ " అని.

ఇచ్చట, "శ్రీవేంకటాచలమున నెలకొనియున్న భగవంతుఁడు—శ్రీశంఖచక్రములను ధరించి మేఘవర్ణుఁడై విరాజిల్లు శ్రీమన్నారాయణుఁడే " అని సుస్పష్టముగ నభివర్ణింపఁబడియున్నది.

మఱియును, జైనకవి యగు " ఐయనారిదనార్ " అనువారు తామువ్రాసిన " పుఱప్పొరుళ్ వెణ్బామాలై " అను కావ్యమున " పులవరాఱ్ఱుప్పడై " అను భాగమున—

" వెఱికొళ్ అఱైయరువి వేజ్గడత్తుచ్చెల్లిన్
నెఱికొళ్ పడివత్తోయ్ నీయుమ్—పొఱికట్క
ఇరుళీయుం ఞాలత్తిడరెల్లామ్ నీజ్గి
అరుళీయుం ఆఴియవన్ "

అను 'వెణ్బా' పద్యమున "తిరువేంగడముడయాన్లు — శ్రీలక్ష్మీనాథుఁడే" అని నిర్దేశించుచున్నారు.

తత్త్వ మిట్లుండగ, ముదలాళ్వార్లలో నొకరగు శ్రీపేయాళ్వార్లు.

" తాఴ్శడైయుమ్ నీళ్ముడియుమ్ ఒణ్మఴువుమ్ శక్కరముమ్
శూఴరవుమ్ పొన్నాణుమ్ తోన్ఱుమాల్—శూఴుమ్
తిరణ్డరువిపాయుమ్ తిరుమలైమే లెన్దైక్కు
ఇరణ్డురువు మొన్ఱా యిశైన్దు." అని అభివర్ణించిన పాశురమును.
వేజ్గడనాదనై వేదాన్త క్కూత్తనై
వేజ్గడత్తుళ్ళే విళైయాడుమ్ నన్దియై
వేజ్గడమ్ ఎన్ఱే విర గఱియాదవర్." అను తిరుమూలనాయనార్ల తిరుమన్త్ర పాశురమును,

" అరియారుమ్ పూమ్పొళ్ఖిల్ శూళ్ ఆమాత్తా రమ్మాన్
అరియారుమ్ పాగ త్తముదన్—అరియారుమ్
వేఙ్గడత్తు మేయానై మేవా ఉయరెల్లామ్
వేఙ్గడత్తు నోయాల్ విళిన్దు "

అను కపిలదేవనాయనార్ల శివపెరుమాన్ తిరువన్దాదిని ఆధారముగఁజేసికొని శైవులు గొందఱుఁ "శ్రీవేంకటాచలపతి శ్రీపరమశివుఁడే" అని సాధింపఁ బ్రయత్నించు చున్నారు. అందులకు నుపోద్బలకముగ నాగాభరణములను, ధనుర్మాసమున బిల్వార్చన మొదలగు వానినిఁగూడ ఉదాహరించుచున్నారు. కాని, బాగుగ పూర్వోత్తర సందర్భముల విచారించిన, ఆక్షేపముచేయువారలకే తత్త్వము బయల్పడుననుట నిశ్చప్రచమగు విషయము.

సర్వేశ్వరుఁడు, సకల చరాచర శరీరకుఁడగుటచే, నన్నిమూర్తులను తన విరాట్స్వరూపమునఁ గలిగియుండును. "అంగాన్యన్యా దేవతాః" అను శ్రుతి, ఈవిషయమును స్పష్టీకరించుచున్నది. "యఃపృథివ్యాం తిష్ఠన్" అని ఆరంభించి, "య ఆత్మని తిష్ఠన్", ఆత్మాన మన్తరో యమాత్మా న వేద యస్య ఆత్మా శరీరమ్ ఏష తే ఆత్మా అన్తర్యామ్యమృతః "అని ముగియు నన్తర్యామి బ్రాహ్మణము, జగత్తంతయును పరమాత్మునకు శరీరమని నిరూపించు చున్నది. మఱియు, "అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః, తత్సృష్ట్వా తదను ప్రవిశ్య, తదేవానుప్రావిశత్, సచ్చ త్యచ్చాభవత్" అను ఉపనిషత్తులు — భగవంతుఁడు లోపలను వెలుపలను వ్యాపించియున్నాఁడనియు, అతనికి అపృథక్సిద్ధ విశేషణముగ జగత్తంతయు నున్నదనియు, అప్పుడే జగత్తునకు సత్త గలుగుననియు, జగత్తు భగవదనన్యమగుటచే, భగవంతునకు నంగముగాని, అచేతన వస్తువుగాని, చేతనవస్తువుగాని లేదనియును, స్పష్టముగ బోధించుచున్నవి. అట్టి జగచ్ఛరీరకమగు భగవంతుని విరాట్స్వరూపమును భగవద్భక్తాగ్రేసరులు భగవంతుని నిరుపాధిక దివ్యకృపాకటాక్షమున సాక్షాత్కరించుకొందురు.

అట్లు, తమకు సర్వేశ్వరుఁడు సాక్షాత్కరింపఁజేసిన విరాట్ స్వరూపమును, "అన్ని మూర్తులును భగవచ్ఛరీరాన్తర్భూతములే" అను నధ్యవసాయమెల్లఱికిని గలుగఁజేయుటకై, తమ నిర్భరానంద పరీవాహరూపముగ నా భక్తులు, అటుల నభివర్ణించిరే కాని, వేరుగాదు.

"మునియే ! నాన్ముగనే ! ముక్కణ్ణప్పా:" అని శ్రీనమ్మాళ్వార్లును,

" పొన్ తిగళుమేని ప్పురిశడైయమ్ పుణ్ణియనుమ్
నిన్ఱులగమ్ తాయ నెడుమాలుమ్—ఎన్ఱుమ్
ఇరువరఙ్గత్తాల్ తిరివరేలుమ్ ఒరువన్
ఒరువనఙ్గ త్తెన్ఱుముళన్ " అని శ్రీపొయ్గైయాళ్వార్లును,

" మిన్పోలుమ్ శెఞ్జడైయాన్ మాలోడుమ్ ఈణ్డిశైన్దాల్
ఎన్పోలుమ్ కాణ్బార్కట్కొన్ఱిరేల్—తన్పోలుమ్
పొఱుక్కున్ఱుమ్ నీలమణిక్కున్ఱుమ్ తాముడనే
నిఱ్కిన్ఱ పోలుమ్ నెడిదు " అని కారైక్కాలమ్మయార్లును,

"ఇడమాల్ వలన్దా నిడప్పాల్
తుళ్లాయ్‌వలప్పాలోణ్ కొన్ద
వడమా లిడన్దుగిల్ తోల్‌వలమ్
ఆళియిడం వలమాన్
ఇడమాయ్ కిరిదాల్ వలఙ్గే
లివనుక్కొళ్లిల్ నలఙ్గార్
కుడమాలిడమ్ వలమ్
కొక్కరై యామెన్‌గళ్ కూత్తనుక్కే" అని శేరమాన్ పెరుమాళ్
నాయనార్లును, హరిహరు లిద్దఱును నొకే మూర్తిలో నుందురను. సమరసభావమును ప్రశం
సించి అభివర్ణించుటయు నిచ్చట గమనింపఁదగియున్నది.

ఆంధ్రవాఙ్మయమున, తిక్కన సోమయాజి మొదలగువారును హరిహరస్వరూప
మునే పరదైవముగఁ గీర్తించి. యారాధించి, శైవవైష్ణవములకు సామరస్యము గలిగించి
యున్నారు.

కాఁబట్టి, ఉపాసకులకు, వారివారి భావనను, అదృష్టపరిపాకమునుబట్టి, పరమాత్ముఁడు,
తన స్వరూపస్వభావములను ప్రకటించుచు, వారలను తరింపఁజేయును.

"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి ।
తస్య తస్య అచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ।
యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్ ॥"

అను భగవద్గీతోపదేశమును పరిశీలించిన దీని తత్త్వము బోధపడును.

## శ్రీవేంకటాచలపతి — శ్రీమహావిష్ణువేగాని వేరుగాఁదు

ఏది యెట్లున్నను, శ్రీవేంకటాచలపతి విష్ణుస్వరూపుఁడనుటలో నెవ్వరికిని సందేహము
లేదు. కొందఱి భక్తులకు హరిహర స్వరూపముతో వారి పుణ్యపరిపాకానుసారముగ సాక్షాత్క
రించెను. అందు, విష్ణుస్వరూపముతో శివస్వరూపముగూడఁ గనఁబడెను కాని, విష్ణుస్వరూప
ము లేక, కేవల శివస్వరూపము ఎవ్వరికిని సాక్షాత్కరింపలేదు. కనుక, బాధకమెయ్యది
యునులేదు.

అదియునుగాక, వక్షఃస్థలమున శ్రీమహాలక్ష్మి విజయముచేసియుండుటచేత "శ్రీవేంక
టాచలపతి శ్రియఃపతి యగు శ్రీమహావిష్ణువే" అనుట నవిచార్యమగు విషయము.

ఋగ్వేదమున — "శిరింబిటస్య = శ్రీపీఠస్య = శ్రీనివాసస్య" అనియును, "అగలగిల్లే
నిఱైయు మెన్‌ఱలర్‌మేల్‌మంగై యుఱైమార్పా" అని తిరువాయ్‌మొళిలో శ్రీనమ్మాళ్వార్లును.
"బ్రహ్మణి శ్రీనివాసే" అని శ్రీమద్రామానుజులవారును, ఈ విషయమును విశేషముగఁ
గీర్తించియున్నారు. శ్రీమన్నారాయణుని స్వరూప నిరూపక ధర్మములలో, శ్రియఃపతిత్వమే

ప్రధానమైనది ; అసాధారణమైనదియు. అందుచేతనే, శ్రీమద్విశిష్టాద్వైత సమయాచార్యవర్యులు, ఎచ్చట జూచినను మొట్టమొదట " శ్రియఃపతియై " అని భగవానుని కీర్తించుచున్నారు.

మఱియును, శ్రీమన్నారాయణునకు నసాధారణములగు శంఖ చక్రములను అన్ని ప్రమాణములును, అభివర్ణించుచున్నవి. అటులఁ దమ కసాధారణములైన శంఖ చక్రములను, తమ యన్తరంగభక్తుఁడగు శ్రీతొణ్డమాన్ చక్రవర్తికి, శత్రువులవలన గొప్ప యాపద సంభవించినపుడు, అతనికి విజయ సమ్పాదనకై ఒసంగినటుల శ్రీవేంకటాచల మాహాత్మ్యమున నున్నది. శ్రీభగవద్రామానుజులవారు, పై విషయముల నెల్లఁబరిశీలించి, మఱల శ్రీవారి శ్రీహస్తములయందు శంఖ చక్రములను బ్రతిష్ఠింపఁజేసిరి. తిరుమార్బు నాచ్చియార్లను (వక్షఃస్థల లక్ష్మిని) గూడ శ్రీవారి దివ్యవక్షఃస్థలమున తిరువాభరణముగాఁ బ్రతిష్ఠింపఁజేసి శ్రీవారికి శ్వశురపాసులుగఁగూడనైరి.

" వేంకటేశ్వర ఇతిహాసమాల "అను సంస్కృత గ్రన్థమునను, " తిరుమలై ఒళుగు " అను ద్రావిడగ్రన్థమునను, శ్రీమద్రామానుజులవారి సమయమున శైవులకును, వైష్ణవులకును జరిగిన వివాదమునుగూర్చియు, " శ్రీ వేంకటాచలపతి విష్ణుమూర్తియే " అని బహుప్రమాణోపపత్తులచే సిద్ధాన్తీకరించిన సిద్ధాన్తమును అందఱును అంగీకరించిన విషయమునుగూర్చియు విపులముగ నభివర్ణింపఁబడియున్నది. ఆ వైశద్యమును దెలిసికొనఁగోరువారు, ఆ గ్రన్థములను, తదుపోద్బలకములుగనుండు తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనములనుగూడఁ జూడగలరు.

ఇంకను గొందఱు, "శేయోన్ మేయ మైవరై యులగముమ్ ''అను తొల్‌కాప్యమున " పర్వతముల కధినాథుఁడు సుబ్రహ్మణ్యస్వామియే " అని అభివర్ణింపఁబడియుండుటచేతను, "తిరువేంగడత్తి లుఱైతరు పెరుమానే"అని అరుణగిరినాథులు తమ తిరుప్పుగళ్ గ్రన్థమున, '' తిరుమలలోనుండు దైవము శ్రీసుబ్రహ్మణ్యస్వామియే '' అని కీర్తించియుండుట చేతను, శివజ్ఞానమునివర్–అనువారు, తమ తొల్‌కాప్యప్పాయిరవృత్తిలో "శ్రీవేంకటాచలము అరవదేశమునకు నుత్తరపు హెల్లగాఁ బరమ్పరనార్లు కీర్తించినది–" శెన్తమిళ్ భాషకు పరమాచార్యులైన షణ్ముఖుఁడు నివసించియుండుటచేత '' అని యుదాహరించినందునను, " శ్రీవేంకటాచలమున నివసించియుండు దైవము శ్రీ కుమారస్వామియే '' అని చెప్పుచున్నారు. " స్వామి పుష్పరిణి " అని పుష్కరిణికి పేరుండుటనుగూడ దానికి నుపోద్బలకముగఁ జెప్పుచున్నారు. స్వామి యనఁగా—కుమారస్వామియే. "నామైకదేశే నామగ్రహణమ్ " అను న్యాయముచే నది సిద్ధము—అనియు వాదించుచున్నారు. అదియును సరిగాదు.

" పర్వతముననుండు దైవము కుమారస్వామియే " అనుట సంగతముగాదు. " కయిలై = కైలాసము" మొదలగు పర్వతములలో పరమశివమూర్తియుండుట సర్వప్రసిద్ధమగు విషయము. మఱియు " పరిపాడల్ " అను సంగగ్రన్థమున శ్రీ మహావిష్ణువుగూడ పర్వతమున నున్నటుల ముక్తకంఠముగ నభివర్ణింపఁబడియున్నది.

అప్పటి— "పులవరై యఱ్ఱియాప్పుగఴ్ఱొడుపొలిన్దు
నిలవరైతాఙ్గియ నిఱైసై యిఱ్పెయార
త్తొరైయానే మిముదల్ తొల్గుఱైయమైయుమ్
పులవరాయ్ పుఱైత్త పునైనెడుమ్ కున్ఱమ్
పలవెనిన్ ఆఙ్గవైపలవే ; పలవినుమ్
నిలవరై యాఱ్ఱి నిఱైపయ నొరుఙ్గడన్
నిన్ఱుపెఱు నిగఴుమ్ కున్ఱవై శిలవే ;
శిలవినుమ్ శిఱన్దన తెయ్వమ్ పెట్పుఱుమ్
మలరకన్ మార్పిన్ మైపడి కుడుమియ
కులవరై శిలవే ; కులవరై శిలవినుమ్
శిఱన్దదు ; కల్లఱై కడలుమ్ కానలుమ్ పోలవుమ్
పుల్లియ శొల్లుమ్ పొరుళుమ్ పోలవుమ్
ఎల్లామ్, వేఱువేఱురువిన్ ఇరుతొఴిల్ ఒరువర్
త్తాఙ్గరు నీణిలై యోఙ్గిరుమ్ కున్ఱమ్ ''

అను పాశురములున్నవి. వీనిచే "మాయోన్" అని గీర్తింపఁబడు శ్రీ మహావిష్ణువుగూడ పర్వతమున నివసించియున్నాఁడని తెలియనగుచున్నది. కనుక, "పర్వతమునందుండు దైవతము కుమారస్వామియే" యనుట సరిగాదని తేలుచున్నది.

"కుమారధార" అని ప్రసిద్ధిఁజెందిన స్థలమున కుమారస్వామి నివసించుచు శ్రీవేంకటాచలపతినిగూర్చి తపమాచరించి వరముల బొందివటుల "కుమారధారికావాస స్కన్దాభీష్ట ప్రదాయినే" అను శ్రీవేంకటేశ్వర అష్టోత్తర భాగము మనకు స్పష్టీకరించుచున్నది. అరుణగిరి నాథులు కీర్తించుట కిదియే విషయమైయుండును. పుష్కరిణులకెల్ల స్వామియగుటచే స్వామి పుష్కరిణి యనిపేరు గలిగినటుల—శ్రీ వేంకటాచల మాహాత్మ్యమున స్పష్టమగుచున్నది.

శ్రీ మహావిష్ణువునకును, "యువా కుమారః" అని వేదములయందు "కుమారుఁడు" అను వ్యవహార మున్నటులఁ దెలియుచున్నది.

శివజ్ఞానముని వ్యాఖ్యానమునకు అరుణగిరినాథ ని వాక్యమే ఆధారము. "నచ్చినార్కినియర్" అను వృత్తికారులు, "అదు నిలఙ్గడన్ద నెడుముడియణ్ణల్ ఉఱైయుమ్ వరై ప్పాదలిన్ ఎన్గ" అను గ్రన్థమున, "శ్రీమహావిష్ణువే శ్రీవేంకటాచలమున నివసించియున్నాఁడు" అని వర్ణించుచున్నారు మఱియు నితర మతస్థులువ్రాసిన "శిలప్పదికారము", "పుఱప్పొరుళ్ వెణ్బామాలై" అనునవి, ఆళ్వార్ల దివ్య ప్రబంధములతోఁబాటు "శ్రీవేంకటాచలపతి శ్రియఃపతియే" అని సుదృఢముగ నిరూపించుచున్నవి.

కాఁబట్టి, "శ్రీవేంకటాచలపతి శ్రీమన్నారాయణుఁడే" అనుట సుప్రసిద్ధమగువిషయము.

నాగశయనునకు, నాగాభరణములుగూడ నుచితములేగాని, అనుచితములుగావు

"మృగేన్ద్రం వా ఖగేన్ద్రం వా" అని విమాన మంటపాదులపై సింహముగాని, గరుత్మంతుఁడుగాని యుండవచ్చును. "తులసీదళైర్వా బిల్వదళైర్వా" అని భగవంతుని పూజా పత్రములుగ తులసీదళములుగాని, బిల్వదళముగాని యుండవచ్చును—అనియును శ్రీవైఖానసాది భగవచ్ఛాస్త్రములు చెప్పుచున్నవి. ధనకామునకు భృగువారస్నానము ప్రశస్తమని ధర్మశాస్త్రము తెలుపుచున్నది. అదియునుగాక, వక్షఃస్థలమునందుండు శ్రీ మహాలక్ష్మికి నభిషేకము భగవంతుని దివ్యమంగళ విగ్రహమునకును అభిషేకము లేనిది సంభవింపదు గనుక, ఒక అంగమునకుమాత్రము అభిషేకము సమర్పించుటకన్న, సర్వాంగాభిషేకము ప్రశస్తతమగుటచేతను భృగువార స్నానము భగవంతునకు వచ్చియుండవచ్చును. కనుక, శ్రీ వేంకటాచలమున నుండునది పరాశక్తియే—అనువాదముగూడ సరిగాదనుట ప్రసిద్ధమగు విషయమే.

మఱియును, భగవంతుఁడు భక్తపరాధీనుఁడగుటచే వారి వారి అభీష్టములఁ బూర్తి చేయుటకై భక్తు లపేక్షించునటులఁ దాను అలంకార - అభిషేక - నైవేద్యాదులను స్వీకరించుచు, తనను భక్తులకు యథేష్టవినియోగ్యునిగఁ జేసివైచి అమన్దానన్దము ననుభవించు చుండును. అట్టి సన్నివేశములు, వాని కాధారములగు నైతిహ్యములును, శ్రీ వేంకటాచల మాహాత్మ్యము, శ్రీ వేంకటాచల ఇతిహాసమాల, తిరుమల ఒఝుగు, మొదలగు గ్రన్థములలో సువిస్తరముగ ప్రమాణోపపత్తులతో నిరూపింపఁబడియున్నవి.

శ్రీయుతులగు పిళ్ళై పెరుమాళ్ అయ్యంగార్లు, వీరరాఘవముదలియార్లును తిరువేంగడత్తుమాలై, తిరువేంగడత్తన్దాది, అను గ్రన్థములను, తిరువేంగడకలమ్బకమను గ్రన్థమును విరచించి, శ్రీవేంకటాచలపతి దివ్యమహిమను లోకములకుఁ జాటియున్నారు. ఈ పెరుమాళ్ళపై పాడఁబడిన "మేఘవిడుతూదు" అను కావ్యమును మన పరిశోధనాలయమున నచ్చువేసియున్నారు. "తిరువేంగడకోవై" అను కావ్యము మొదలుగాగల పలు రసవత్తరములగు అముద్రిత గ్రన్థములును శ్రీవేంకటాచలపతి వైభవమును వర్ణించునవి లెక్కకు మీరియున్నవని తెలియుచున్నది.

## శ్రీవేంకటాచలపతియు—తెలుగు వాఙ్మయము.

ఆంధ్రవాఙ్మయమున శ్రీ వేంకటాచల ప్రసక్తి ఎప్పటినుండి వచ్చినదని చెప్పుటకుఁ దగిన ఆధారము లేవియును లేవు. అసలు ఆంధ్రవాఙ్మయమే, ఆంధ్రవాగనుశాసనుఁడని ప్రసిద్ధిఁజెందిన శ్రీ నన్నయభట్టారకుని ఆంధ్రభారతము తోడనే ఆరంభమగుచున్నది. అంతకుముందుండు గ్రన్థసంచయమేదియును మనకు గోచరమగుటలేదు. శ్రీ నన్నయభట్టారకుని వాఙ్మయమునను, శ్రీ తిక్కన సోమయాజి వాఙ్మయమునను గూడ శ్రీ వేంకటాచల ప్రసక్తి యెచ్చటను గనఁబడుటలేదు.

మొట్టమొదట తెనుఁగు లిపిలో వ్రాయఁబడిన శాసనము (Inscription) విజయనగర రాజగు మహామణ్డలేశ్వరుఁడైన మేసరగండ మంగి దేవమహారాజులుంగారి శాసనము. ఇది తిరుపతి దేవస్థాన శాసన సంపుటిలో 179-నెంబరులోనున్నది.

అది ఎట్లన—

"శ్రీ విజయాభ్యుదయ శకవరుసంబులు 1281 అగు నేంటి, వికారి సంవత్సర ఆషాఢ శుద్ద దశమి మందవారాన, స్వస్తిశ్రీ మహామండలేశ్వర మీసరగండ మంగిదేవమహారాజులు తిరుమల దేవరకు పటాదిపగగు సువర్ణాది సిఖరమును ఎతించెను. మంగళం మహా శ్రీః శ్రీః శ్రీః" అని.

తెనుఁగు వాఙ్మయమున "తిరుమలదేవర" ప్రసక్తి మొట్టమొదటగా నిచ్చటఁ గనఁబడుచున్నది. అదేకాలమున "శమ్భుదాసుఁ"డని ప్రసిద్ధిఁజెందిన ఎఱ్ఱాప్రగడ (ఆంధ్ర కవిత్రయమున మూఁడవవాఁడు) తన నృసింహపురాణమున తిరుపతిని పుణ్యక్షేత్రముగఁ గీర్తించియున్నాడు. గాలవుఁడను మహర్షి చేసిన యాత్రాక్రమమును నభివర్ణించుచు "శ్రీవేంకటాచల స్థాయిఁగొలిచె" అని నిర్దేశించియున్నాఁడు. కాని, ఇంతకన్న, ఆదేవుని గూర్చిన విశేషముల వేనినిగాని వర్ణించియుండలేదు.

12–13 వ శతాబ్దములలో నాంధ్రదేశమున విజృమ్భించిన వీరశైవమత ప్రాబల్యము వలన విష్ణుక్షేత్రమగు నీ వేంకటాచలమునకు నాంధ్రదేశమున పేరుప్రసిద్ధులు తగ్గినవని తెలియనగుచున్నవి. అందుచేతనే దీనికి సమీపమున నున్న తిక్కన, కేతన, మంజన, మారన మొదలగువారు నెవ్వరునుగూడ నీ పర్వతమునుగూర్చి కించిత్తైనను ప్రసంగించలేదని తోచుచున్నది.

15-వ శతాబ్దమున సాళువ నరసింహరాయల (క్రీ.శ. 1465—1468) కాలమునందుండి, అతని మన్ననఁబడసిన తాళ్ళపాక అన్నమాచార్యులువారును, చిన్నతిరువేంగడనాథులు మొదలగువారును శ్రీవేంకటాచలపతికి నేకాన్తభక్తులై, లెక్కకుమీరిన కీర్తనల శ్రీవారిపై విరచించి ఆంధ్రవాఙ్మయమునకే కొండొక పరిపుష్టిని, దివ్యశోభను గలుగఁజేసిరి. అటులఁ బ్రవర్తితమగు నింత వాఙ్మయము, ఇతరములగు దేశభాషలయందెందును కని విని యెఱుంగము—అనిన అతిశయోక్తిగానేరదు. ఆ శృంగార సంకీర్తనములను, ఆధ్యాత్మ సంకీర్తనములను, వారి మనుమఁడు రాగిరేకులపై చెక్కించి తిరుమలలో తాళ్ళపాకవారి అరలో భద్రపఱచియుంచెను. వానినెల్ల తీయించి, పరిశోధించి, మన పరిశోధనాలయమున సంపుటములుగ మహాప్రాజ్ఞులగు, శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు—మొదలగు పెద్దలు, అచ్చొత్తించుచున్నారని, అందఱును నెఱింగిన విషయమే. కొన్ని కీర్తనములను స్వరపరచి, అమూల్యమగు 'నొటేషన్ల' తోగూడ ప్రాజ్ఞవర్యులగు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ప్రకటించుచున్నారు.

క్రీ. శ. 1468—1478 వఱకును కర్ణాటకరాజ్యమును పరిపాలనముజేసిన విరూపాక్ష రాయలయొక్క సేనాధిపతియైయుండిన సాళువ నరసింహరాయలు 1478-వ సంవత్సరమున అతని రాజ్యమును ఆక్రమించుకొని 1487 వఱకును రాజ్యముచేసెనని తెలియవచ్చుచున్నది. అతనికి నాసమయమున శ్రీతాళ్ళపాక అన్నమాచార్యులవారు, గురువుగను, ప్రియమిత్రుఁడుగను నుండిరని తెలియుచున్నది. వారి యుపదేశముల విని, శ్రీవేంకటాచలపతి నారాధించి,

వారి నిరవగ్రహానుగ్రహ ప్రభావమున శత్రువులఁ జయించి విజయనగర సామ్రాజ్యమును జేపట్టి, శ్రీవేంకటాచల ప్రభువునకును అనేకములగు గ్రామముల దానముజేసి, బహువిధములగు కైంకర్యముల నిర్వహింపఁజేసెను.

ఇటుల, శ్రీఅన్నమాచార్యులవారి మూలముగ తాళ్ళపాక గ్రామమునకు సమీపమునందున్న టంగుటూరు గ్రామమున కధిపతిగనుండి క్రమముగ కర్ణాటక సామ్రాజ్యాధిపతియై విరాజిల్లిన ఆ నరసింహరాయల కీర్తిప్రతిష్ఠలతోఁబాటుగ, అతని కిష్టదైవమైన శ్రీ వేంకటాచలపతియొక్క నిరవధికములగు వైభవసమృద్ధులును అనన్తముగ నభివృద్ధిఁజెందినవి.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని [1]జైమిని భారతమువలనను, నన్ది మల్లయ, గంట సింగయ చేసిన [2] వరాహపురాణమువలనను, సాళువ నరసింహరాయలు శ్రీ వేంకటాచలపతి కైంకర్య నిర్వహణలో ధురంధరుఁడై యుండెనని స్పష్టముగఁ దెలియనగుచున్నది.

సాళువ నరసింహరాయులకు సేనాధిపతిగ నుండిన తుళువ నరసింహరాయలు 1487-వ సంవత్సరమున కర్ణాటక రాజ్యాధిపతియాయెను. ఈ తుళువ నరసింహదేవరాయలే, "ఆన్ధ్రభోజుఁ" డని ప్రసిద్ధిఁజెందిన శ్రీ కృష్ణదేవరాయలకుఁ దండ్రి. శ్రీ కృష్ణదేవరాయలు, శ్రీ వేంకటాచలపతిని తమ కిష్టదైవముగ నధ్యవసించి, తాను వ్రాసిన "ఆముక్తమాల్యద" అను "శూడికొడుత్తనాచ్చియార్ల" (ఆండాళమ్మవారి) చరిత్రమగు మహాకావ్యమును శ్రీవారికి అంకితముజేసెను.

శ్రీ కృష్ణదేవరాయలు, శ్రీవైష్ణవమతస్థుఁడై శ్రీవైష్ణవమతమున కలంకారభూతమైన శ్రీ ఆండాళమ్మవారి చరిత్రమును దీసికొని సర్వలక్షణపరిపూర్ణంబగు మహాప్రబంధముగ నొనరించి, శ్రీవైష్ణవమతమునకే గాక, ఆంధ్రవాఙ్మయమునకును అనున్యేయమును, అప్రతిమమును నగు శోభావిశేషమును చేకూర్చెను.

ఇట్లు, శ్రీ కృష్ణదేవరాయలే, ఆంధ్ర సామ్రాజ్యమును, ఆంధ్రవాఙ్మయమును, ఆంధ్రదేశమున శ్రీవైష్ణవమతమును విస్తరింపఁ జేసి సర్వాలంకార శోభితములుగఁ జేసినటులనే, శ్రీ వేంకటాచలపతి దివ్యవైభవమునుగూడ సకల విధములచేతను దశదిగన్తములకును వ్యాపింపఁజేసెను.

## శ్రీ కృష్ణదేవరాయలు — ఆంధ్రవిష్ణువు.

క్రీస్తుశకారంభమున నుండిన ఆంధ్రరాజులగు శాతవాహనుల ఆంధ్రసామ్రాజ్యముతోఁ బాటు, వారల ఆరాధ్యదైవతమగు ఆంధ్రవిష్ణువునుగూడ ప్రకాశింపఁజేసినది — మహాప్రభావ సంపన్నులగు శ్రీకృష్ణదేవరాయలే. వారు అంతటితో నాగక, ఆంధ్రదేశమున "శ్రీకాకుళ" క్షేత్రమున నాటినుండి నేటివఱకును విజయముఁజేసియుండు ఆంధ్రవిష్ణువే శ్రీ వేంకటాచలమున నెలకొనియున్న కల్యాణకల్పకమగు నద్భుత దైవతము" అని తనకు స్వప్నమున నా ఆంధ్రవిష్ణువే సాక్షాత్కరించి చెప్పినటులఁ గీర్తించియున్నాఁడు.

---

1. శ్రీవేంకటాద్రినాథ దయావర్ధిత రాజ్య (జైమిని భా. 5. అ. 1.)
2. శ్రీవేంకటాద్రిపతి సంసేవాహేవాకపాకనిపుణ (వరా. పు. 2 అ. 1.)

## ఆంధ్రవిష్ణువు — శ్రీవేంకటాచలపతి

ఐతరేయ బ్రాహ్మణమున విశ్వామిత్రుని శాపముచేఁ బీడితులగు పుండ్ర, పులిన్ద, మూతి, పాదనార్యులలోనుండు ఆంధ్రమహాజనులకు కులదైవతముగ నీ విష్ణువు విరాజిల్లు చుండిరి. వీరిని గురించిన కథలు పెక్కులున్నవి. ప్రాచీనాంధ్రులు, దక్షిణదిశకు వలస వచ్చి, మొట్టమొదట కృష్ణానదీతీరమునసుండు శ్రీకాకుళ క్షేత్రమున వారిరాజ్యమును వ్యవస్థాపించిరి—అని చరిత్ర గ్రంథములు తెలుపుచున్నవి.

ఆ యాంధ్రవిష్ణువే—ఆంధ్రసామ్రాజ్య వ్యవస్థాపక సార్వభౌముఁడగు శ్రీ కృష్ణదేవ రాయల స్వప్నమున సాక్షాత్కరించి "నేనే శ్రీ వేంకటాచలమునసుండు శ్రీనివాసుఁడను; దేశభాషలలో నెల్లఁ దెలుఁగు లెస్స; నేను తెలుంగు రాయఁడను: నీవు కన్నడరాయఁడవు. అందుచే, నీవు శ్రీవేంకటాచలపతి కంకితమిచ్చి యొక మహాకావ్యమును విరచింపుము" అని అతనిని నియమించెనట. ఈవృత్తాన్తమును శ్రీకృష్ణదేవరాయలే తన "ఆముక్తమాల్యద"లో నుదాహరించియున్నాడు—

"ఉ॥ ఎన్నినుగూర్తునన్న, విను, మే మునుదాల్చిన మాల్యమిచ్చిన<br>
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము, మున్ను గొంటి నే<br>
వన్నన దండయొక్క మగవాఁడిడ, నేను దెలుంగురాయడఁ<br>
గన్నడరాయ! యక్కొదువఁగప్పు ప్రియాపరిభుక్తభాక్కథ॥

ఆ॥ తెలుఁగదేలయన్న, దేశంబు దెలుఁగేను,<br>
దెలుఁగువల్లభుండ, దెలుఁగొకండ<br>
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి<br>
"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" ॥

క॥ అంకితమోయన నీకల<br>
వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁదదీ<br>
యాంకితము సేయు మొక్కొక<br>
సంకేతముగా కతఁడ రసన్నేగానే?" అని.

శ్రీ కృష్ణదేవరాయలవారి వంశస్థులగు విజయనగరరాజుల దివ్యకైంకర్యములవలననే శ్రీ వేంకటాచలపతియొక్క సిరి సంపదలును, కీర్తి ప్రతిష్ఠలును, సమభివృద్ధములైనవి.

అకాలమునందుండి, శ్రీవైష్ణవ మతాభిమానులైయ్యు అల్లసాని పెద్దనార్యుఁడు — మొదలగు కవులు, నేలకో, శ్రీ వేంకటాచలపతిని గూర్చి ప్రశంసింపలేదు. అయినను, ముక్కు తిమ్మనార్యుఁడు మాత్రము తన "పారిజాతాపహరణ"మను సర్వాంగసుందరమగు కావ్యమును శ్రీ వేంకటాచలపతి విషయమైన మంగళశ్లోకముతో నారంభించెను:—

"శ్రీమదికిం బ్రియంబెసగఁజేర్చిన యయ్యలలీల వైజయం<br>
తీ మిళితాచ్ఛ కౌస్తుభము నిద్దపుఁగాంతిఁదనర్చి యాత్మవ

క్షేమణి వేదిఁబొల్పెసగఁ జూడ్కుల పండువునేయు వేంకట
స్వామి గృతార్థుఁజేయు నరసక్షితినాథుని కృష్ణరాయనిఁ—'' అని.

శ్రీతరిగొండ వేంకమాంబ.... అను కవయిత్రి, శ్రీవేంకటాచలపతి కంతరంగభక్తురాలై, శ్రీ వేంకటాచలమాహాత్మ్యము—మొదలగు అనేక గ్రన్థములఁదెలుఁగున విరచించి శ్రీ వేంకటరమణుని దివ్యవైభవ లీలను సర్వతోముఖముగఁ బ్రశంసించియున్నది.

తరువాతి కవు లనేకులు శ్రీ వేంకటాచలపతి వైభవాదుల నభివర్ణించియున్నారు. వాని నన్నింటిని జేర్చి "శ్రీవేంకటేశ్వర స్తుతిరత్నమాల" అనుపేర సంపుటములుగ మన పరిశోధనాలయముననే ప్రకటించియున్నారు. వానిలో నా వివరము లెల్లఁ జూడనగును.

## ప్రశంసింపఁదగిన విషయము

ఇచ్చట నొక్కవిషయముమాత్రము ప్రశంసింపఁదగియున్నది. అది యేది యనఁగా— సంస్కృత గ్రన్థజాతమునందువలె ఆంధ్రవాఙ్మయ గ్రన్థజాతమునను శ్రీ వేంకటాచలపతి విష్ణువుగనే ప్రశంసింపఁబడియున్నాడు—గాని వేరుగలేదు. మీదుమిక్కిలి, "శ్రీ వేంకటాచలపతి – ఆంధ్రవిష్ణువే" అని ముక్తకంఠముగ నాంధ్ర సామ్రాజ్య సార్వభౌముఁడు చాటియున్నాడు. కనుక, ఆంధ్రులవఱకును "శ్రీవేంకటాచలపతి విష్ణువా, శివుఁడా, లేక మఱి ఇతరదేవతామూర్తియా?" యను సందేహమునకుఁ బ్రసక్తియేలేదు—అని.

కనుకనేకావలయును, ఆంధ్రులభాగ్యదైవతమగు శ్రీ వేంకటాచలపతి ఆంధ్రప్రదేశమునకే ప్రత్యక్షదైవతమై విరాజిల్లుభాగ్యము అంధ్రమహాజనులకుఁ దక్కినదని తోచుచున్నది.

## శ్రీవైష్ణవమతము — శ్రీ వేంకటాచలపతియు

ఇట్లు సర్వవాఙ్మయ ప్రసిద్ధుఁడగు శ్రీవేంకటాచలపతి, శ్రీవైష్ణవమత మూల స్తంభాయమానులగు దివ్యసూరుల (ఆళ్వార్ల) దివ్యప్రబంధములయందును విశేషముగ నభివర్ణింపఁబడియున్నాడు. అంతమాత్రమేగాదు ; శ్రియఃపతియగు శ్రీ వేంకటాచలపతికిని శ్రీవైష్ణవమతమునకు అవినాభావ సంబంధమున్నది. శ్రీవైష్ణవమతము శ్రీ వేంకటాచలపతిపై నాధారపడియున్నది ; శ్రీవేంకటాచలపతియు శ్రీవైష్ణవమతముపై నాధారపడియున్నాఁడు. శ్రీ వేంకటాచలపతి లేనిది శ్రీవైష్ణవ మతమే లేదు. శ్రీవైష్ణవమతము లేకున్న శ్రీ వేంకటాచలపతియే లేకపోయియుండును.

శ్రీ మహావిష్ణువుయొక్క సర్వమూలభమైన సంపూర్ణావతారమగు శ్రీవేంకటాచలపతి యొక్కమతమే శ్రీవైష్ణవమతము. శ్రీవైష్ణవమతమున పరమప్రాప్యుఁడు —— శ్రీ వేంకటాచలపతియే. పరమోపాయము శ్రీ వేంకటాచలపతియే. నిఖిల జగత్కారణము నతఁడే. ప్రథమాచార్యుఁడు, పరమాచార్యుఁడును నతఁడే. సర్వవిధ సంబంధియు, నిరుపాధిక బంధువును, నిఖిలకల్యాణకల్పకుఁడును నతడే.

" మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్ ।
స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥
వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాణ్డే నాస్తి కించన ।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥ "

అను ప్రమాణములు, శ్రీవైకుంఠనాధుఁడే శ్రీవేంకటాచలపతి యనియును, సకలాభీష్ట ఫలప్రదుఁడై సకలకల్యాణకల్పద్రుమమై యుండుటచే, శ్రీవేంకటాచలపతికి సమానమైన దైవముగాని, శ్రీవేంకటాచల క్షేత్రముతో సమానమైన పుణ్యక్షేత్రముగాని ప్రపంచమున వేరొండు లేదనియును స్పష్టీకరించుచున్నవి.

వీని యన్నిటికన్న, ఆళ్వార్ల మంగళాశాసన పాశురములును, ఆచార్యవర్యుల స్తోత్ర దివ్యప్రబంధములును శ్రీ వేంకటాచలపతి దివ్యమంగళ వైభవములను విశిష్టముగ నభివర్ణించుచున్నవి.

## ఆళ్వారుల చరిత్రబోధకప్రమాణములు.

ఆళ్వారుల చరిత్రాంశముల బోధించు గ్రన్థములు, సంస్కృతముననను, అరవముననను, ఆంధ్రముననను, ఆంగ్లమునను నున్నవి. అందు, దివ్యసూరిచరితము, ప్రపన్నామృతము మొదలగునవి సంస్కృత భాషయందును, గురుపరంపరాప్రభావములు. పెరియ తిరుముడి యడైవు, హరిసమయ దివాకరము మొదలగునవి అరవభాష (మణిప్రవాళము) యందును, పరమయోగి విలాసము, ఆచార్యసూక్తి ముక్తావళి, ముముక్షుజనకల్పకము మొదలగునవి తెనుఁగుభాషయందును, శ్రీవైష్ణవశైన్ట్సు —మొదలగునవి ఆంగ్లభాషయందును నున్నవి.

శాసనాది ప్రమాణములఁ గొని ఆళ్వారుల కాలనిర్ణయాదులను, ఎస్. డి. స్వామికణ్ణు ముదలియార్లును, వెంకోబారావుగారును, గోపీనాథరావుగారును, ము. రాఘవయ్యంగార్లును నవీన ప్రక్రియలతో విమర్శనాపూర్వకముగఁ జేసియున్నారు. ప్రాచీన నవీనములగు సకలాధారములనుగొని, సమన్వయప్రక్రియతో నాళ్వారాచార్యాదుల చరిత్రను వ్రాయ సంకల్పించుకొనియున్నాను. భగవంతుని అనుగ్రహమున్న నచిరకాలముననే నదియును వెలువడగలదు. ఇచ్చట సంగ్రహముగఁ గొంత దెలిపెదను.

## ఆళ్వారుల చరిత్ర సంగ్రహము.

**ఆళ్వారులు అనువారు** — అజ్ఞానాంధకారబంధురమగు నీ ప్రాకృతమండలమున సంసారసాగర నిమగ్నులైయుండు చేతనుల నుద్ధరించుటకై, పరమకృపామయుఁడగు పరమాత్ముని నియమనానుసారము ఈభూలోకమున నవతరించి, నిరన్తరము భగవద్దివ్యమంగళ గుణగణానుసంధానాస్వాదనమున మునిఁగి తేలుచు, తాము తరించి, ఇతరులనుగూడ తరింపజేసిన, పరమదయామూర్తులగు—శ్రీ భగవంతుని యంతరంగపరిజనులగు నిత్యసూర్యులు. వీరికి నిత్యవిభూతి యందలి నామధేయము — నిత్యసూరులని ; ఈ లీలావిభూతియందలి నామధేయము —— దివ్యసూరులని. ఎల్లప్పుడును సర్వేశ్వరుని సర్వమంగళగుణగణ విభూతి విగ్రహాదులను సాక్షాత్క

రించుకొనుచు "సదా పశ్యన్తి సూరయః" అను శ్రుతిప్రసిద్ధి ననుసరించి వర్ధిల్లువారు నిత్య సూరులైరి; వీరును, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును భగవత్కల్యాణగుణగణామృ తార్ణవ నిమగ్నులై, "అళ్లుజ్ఞాల్ పట్టవర్గళ్—ఆళ్వార్గళ్" అను, వ్యుత్పత్తిచే ద్రావిడమున ఆళ్వార్లనియు, సంస్కృతమున పరమయోగులు, దివ్యసూరులు — అనియు వ్యవహరింపఁ బడుచున్నారు.

"కలౌఖలు భవిష్యన్తి నారాయణపరాయణాః
క్వచిత్క్వచిన్మహాభాగా ద్రమిడేషు చ భూరిశః॥" అనియు,
"తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ,
కావేరీ చ మహాభాగా ప్రతీచీ చ సరస్వతీ॥" అనియును,

భారతాదులయందు, వీరి యవతారక్రమము అభివర్ణితమైయున్నది. దుష్టశిక్షణార్థము, శిష్ట పరిత్రాణార్థము, ధర్మసంస్థాపనార్థము, భగవంతుడు, నానాదేహములఁ బరిగ్రహించి యవత రించునటుల, వీరును నానావర్ణములయందును జనించి, సర్వాధికారమగు ప్రపత్తిమార్గమును బోధించి, సకలప్రాణులకును పరమపురుషార్థమును గరతలామలక మొనరించిరి.

ఇట్టి ఆళ్వార్లసంఖ్య పది లేక పండ్రెండు

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ — శ్రీభక్తిసార కులశేఖరయోగివాహాన్।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥
అను శ్లోకమును శ్రీ పరాశరభట్టరువారు ఆనతిచ్చియున్నారు.

ఇందు, భూతం—పూదత్తాళ్వారులు, సరః—పొయ్గైయాళ్వారులు, మహదాహ్వయ — పేయాళ్వార్లు, భట్టనాథ—పెరియాళ్వార్లు, భక్తిసార—తిరుమళ్లిశైయాళ్వార్లు. పరకాల — తిరు మంగైయాళ్వార్లు, యతీన్ద్ర — ఎమ్బెరుమానారులు (శ్రీమద్రామానుజులవారు), పరాంకుశ ముని — నమ్మాళ్వార్లు — అనువారలు కీర్తింపఁబడియున్నారు. ఇచ్చట ఉడయవరులు (రామానుజులవారు) తప్ప తక్కిన పదిమందియును ఆళ్వారులు.

ఇచ్చట, "శ్రీ భక్తిసార" అనుచోట "శ్రీ" అని వేరుగ విభజించిన, శ్రీ భూదేవుల యంశములచే జనించి, "తిరుప్పావై" మొదలగు దివ్యప్రబంధముల నానతిచ్చిన శ్రీమతి ఆండాళమ్మవారును, "యతీన్ద్రమిశ్రాన్" అనుచోట "మిశ్రాన్" అని వేరుగ విభజించిన, ఆచార్యనిష్ఠాగరిష్ఠులై పరమ పూజ్యులైన శ్రీ మధుర కవులును కీర్తింపబడుదురు. కనుక, వీరిద్దఱినిగూడ జేర్చిన పన్నిద్దరాళ్వారులగుదురు — అని కొందఱి యభిప్రాయము.

ఏది యెట్లున్నను, ఈపండ్రెండుగురును ఆనతిచ్చిన దివ్యప్రబంధములే నాలాయిరదివ్య ప్రబంధములని శ్రీవైష్ణవదివ్యదేశములయందు అనుసంధింపఁబడుచున్నందున వీ రందఱును ఆళ్వార్లనుటలో సందియమేలేదు. సకల దివ్యసూరిస్వరూపులగుటచేతను, దర్శనప్రవర్తకు లగుటచేతను, కృపామాత్ర ప్రసన్నాచార్యులగుటచేతను నిచ్చట భగవద్రామానుజమునీన్ద్రులు గూడ కీర్తింపఁబడిరి.

కాలక్రమాదుల ననుసరించి ఆళ్వారుల క్రమము—

> పొయ్‌గై యార్, పూదత్తార్, పేయార్. పుగళ్ మళిశై
> ఐయనరుళ్మాఱన్ శేరలర్‌కోన్—తుయ్యపట్ట
> నాద నన్బర్ తాళ్తూని నఱ్పాణన్ నఱ్కలియన్
> ఈదివర్ తోఱ్ఱత్తడైవా మిఙ్గు.

అని శ్రీ మణవాళమహామునులచేఁ గీర్తింపఁబడినది. ఇందు, ఆండాళమ్మవారిని, మధురకవులను చేర్పలేదు. అయినను నమ్మాళ్వార్ల సమకాలికులు మధురకవులనియు, శ్రీ పెరియాళ్వార్లసమకాలికులు ఆండాళమ్మవారనియును విద్ధించుచున్నది. ఇందు, పొయ్‌గై, పూదమ్, పేయాళ్వార్లు ముగ్గురును — ముదలాళ్వార్లని వ్యవహరింపఁబడుచున్నారు.

## ఆళ్వారుల* తిరునక్షత్ర దివ్యదేశాదులు

(1) శంఖాంశభూతులగు శ్రీ పొయ్‌గైయాళ్వార్లు—తొణ్డమణ్డలమున శ్రీ కాంచీపురమున యథోక్తకారి సన్నిధిలోని పద్మసరస్సునందలి స్వర్ణతామరస పుష్పమునందు, ద్వాపరయుగమున 60-వేల 9-నూర్ల 9-సంవత్సరములకు సరియగు సిద్ధార్థి సంవత్సర అశ్వయుజ మాస శుద్ధాష్టమీ — భౌమవాసరమున, శ్రవణ నక్షత్రమున జనించిరి.

(2) గదాంశభూతులగు శ్రీపూదత్తాళ్వారులు — తొణ్డమణ్డలమున సముద్రతీరమున నుండు "తిరుక్కడల్‌మల్లై" (మహాబలిపురము) అను నగరమున మాధవీ (కురుక్కత్తి) పుష్పమున, దానికి మరురోజు అనగా సిద్ధార్థిసంవత్సర — అశ్వయుజశుక్ల నవమీ బుధవారమున ధనిష్ఠానక్షత్రమున జనించిరి.

(3) నన్దకాంశ సంభూతులగు శ్రీపేయాళ్వార్లు-తొణ్డమణ్డలమున సముద్రతీరమునందలి మైలాపురమున ఆదికేశవస్వామి సన్నిధిలోని మణికైరవమున నదబావియందు ఎఱ్ఱకలువ పుష్పమున, దానికి మరురోజు అనగా—సిద్ధార్థి సంవత్సర అశ్వయుజమాస శుక్లపక్ష దశమీ గురువారమున, శతభిషానక్షత్రమున నవతరించిరి.

ఇట్లు ఈ ముదలాళ్వార్లు ముప్వురును, అయోని సంభూతులై, యోగమహత్త్వమున 3125 సంవత్సరములు భూమినంతటిని సంచరించుచు నుండి, తిరుక్కోవలూరునందు, వర్షించుచున్న ఒకనాటిరాత్రి, ఒక గృహస్థుని ఇంటినడవతిన్నెపై, ఒకటిగఁజేరియుండిరి. వీరిసంసర్గమునుగోరి అచ్చటికి విచ్చేసినసర్వేశ్వరుని సందర్శించుటకై సూర్య-జ్ఞాన దీపముల పొయ్‌గై-పూదత్తాళ్వార్లు జ్వలింపచేయగా, పేయాళ్వార్లు ఆ రమానాథుని సందర్శించి, వర్ణింపఁగా, ముగ్గురును పరస్పరప్రబోధితులై, ఆ పరమాత్మననుభవించి తరించి, వారి అనుభవనిష్యందములగు తిరువన్దాదిప్రబంధములచే మనలఁగూడ తరింపఁజేసిరి.

---

* ఇచ్చట, ఆళ్వారుల కాలదేశాదులు సంప్రదాయము ననుసరించి వ్రాయబడినవి; అధునాతనవిమర్శకుల దేశకాల నిర్ణయమును గూర్చియు, వాని సమన్వయమునుగూర్చియు ప్రత్యేకవ్యాసమున విమర్శింతును.

(4) అటుపై ద్వాపరయుగమున 8-లక్షల 57-వేలి 4-నూర్ల 89 సంవత్సరములకు సరియగు విభవ సంవత్సర పుష్యమాస కృష్ణపక్ష దశమీ గురువారమున మఖానక్షత్రమున, తొండమండలమునందలి "తిరుమళ్లిశై" (మహీసారము) అను నగరమున, చక్రాంశజులగు శ్రీ తిరుమళ్లిశైయాళ్వార్లు, కనకాజ్ఞీ-భార్గవఋషులకు పుత్రులై యవతరించి, హరిదాసులచే పెంచబడిరి. వీరు పరమవిరక్తులై, యోగవిద్యానిష్ఠులై 2300 సంవత్సరములు భూమినంతటిని సంచారముచేసి, పరమతములనెల్ల నిరసించి, స్వమతమును స్థాపించిరి. "నాన్ముగన్ తిరువన్దాది — తిరుచ్చన్దవిరుత్తము" అను దివ్యప్రబంధములగూడ ననుగ్రహించిరి.

(5) అటు పిమ్మట, విష్వక్సేనాంశ సంభూతులగు శ్రీ నమ్మాళ్వార్లు, పాణ్డ్యదేశమున తామ్రపర్ణీతీరమునందలి "తిరుక్కురుకూర్" అను నగరమున కలియుగారంభమునకు 43-వ దివసమున, ప్రమాది సంవత్సర వైశాఖ శుక్ల చతుర్దశీ శుక్రవాసరమున, విశాఖానక్షత్రమున, కర్కటకలగ్నమున, తిరుక్కురుఙ్గుడినమ్బి యను పెరుమాళ్ళ వరప్రసాదమున, భాగవతోత్తముల దివ్యవంశమున, "శెన్దామరైక్కణ్ణన్" అనువారికి పుసుమలై, 'కారి' అనువారికి "ఉడైయనఙ్గయార్" అను భార్యయందు జనించిరి. వీరికి సాక్షాత్తుగ, విష్వక్సేనుచే తప్త చక్రాంకనాదుల ననుగ్రహించిరి. వీరు, నిసర్గసిద్ధములగు పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు. ఉన్మత్తకములు కాగా. శ్రీ మధురకవియాళ్వారుల ననుగ్రహించుచు నానతిచ్చిన — తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది, తిరువాయ్మొళ్ళి' అను నాలుగు దివ్య ప్రబంధములు ద్రావిడవేదస్థానీయములుకాగా, ఇతరులగు నాళ్వార్లు అనతిచ్చిన ప్రబంధములు అంగోపాంగములుగ నున్నవి. కనుకనే, వీరు, ఆళ్వార్ల కందటికిని అవయవిభూతులై యున్నారు. వీరే — ప్రపన్నజనకూటస్థులు.

(6) వీరి యంతరంగ శిష్యులును, గణనాథుడగు శ్రీ కుముదుల అంశ సంభూలును నగు శ్రీమధురకవి యాళ్వార్లు, పాండ్యదేశమున తామ్రపర్ణీతీరమునందలి "తిరుక్కోళూర్" అను దివ్యదేశమున, ద్వాపరయుగమున 8-లక్షల 63-వేల 8-నూర్ల సంవత్సరములకు విక్రమ సంవత్సరమున, చైత్రమాస శుక్లపక్ష దశమీ శుక్రవారమున, చిత్తానక్షత్రమున నవతరించిరి. వీరు అష్టాంగయోగ క్రమముచే బదరికాశ్రమమున నారాయణుల నాశ్రయించి దక్షిణదిక్కున దివ్యతేజస్సును జూచి "తిరుక్కురుగూరు"నకు విచ్చేసి, శ్రీ నమ్మాళ్వార్ల నాశ్రయించి తదేక ప్రవణులై "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అను దివ్యప్రబంధమును వారి విషయమున నానతిచ్చిరి.

(7) కౌస్తుభాంశసంభూతులైన శ్రీకులశేఖరాళ్వారులు, కేరళదేశమున తిరువంజిక్కళమ్ అను నగరమున, కలియుగారంభమున 23-వ దగు పరాభవ వర్షమున కుంభమాస శుక్లదశమీ గురువాసరమున, పునర్వసు నక్షత్రమున, శేర కులమున క్షత్రియోత్తములగు దృఢవ్రత మహారాజునకు కుమారులుగ నవతరించిరి. వీరు 'పెరుమాళ్ తిరుమొళ్ళి' అను ప్రబంధ మును ప్రసాదించిరి.

(8) వైనతేయాంశజులగు శ్రీపెరియాళ్వార్లు — పాణ్డ్య మణ్డలమున శ్రీ విల్లిపుత్తూరు నగరమున, కలియుగమున 47-వ దగు క్రోధన సంవత్సర జ్యేష్ఠమాస శుక్లపక్ష ఏకాదశీ

భానువాసరమున, స్వాతి నక్షత్రమున, బ్రాహ్మణోత్తములగు శ్రీ ముకున్దాచార్యులవారికి "పద్మైయమ్మన్" అను భార్యయందు అవతరించిరి. వీరు సాదించిన ప్రబంధమునకు "పెరియాళ్వార్ తిరుమొళి" అని పేరు. వీరు భగవదనుగ్రహ విశేషమున పాండ్యరాజ సభలో పరతత్త్వ నిర్ణయమును జేసి విద్వచ్ఛుల్కమును స్వీకరించిరి. వీరి కుమార్తెయే శ్రీ ఆండాళమ్మవారు. వారును, తిరుప్పావై, 'నాచ్చియార్ తిరుమొళి' అను రెండు దివ్యప్రబంధముల నానతిచ్చిరి.

(9) శ్రీభూమి పిరాట్టియొక్క అవతారవిశేషమైన శ్రీ గోదాదేవి (ఆండాళమ్మవారు), పాణ్డ్యదేశమునందలి శ్రీ విల్లిపుత్తూరిలో శ్రీ పెరియాళ్వార్ల నందనవనమున దివ్య తులసీ (తిరుత్తుళాయ్) వృక్షమూలమున, కలియుగము 98-వ సంవత్సరమగు నళసంవత్సరమున ఆషాఢమాస శుక్లపక్ష చతుర్థీ భౌమవారమున, తులాలగ్నమున మధ్యాహ్నసమయమున, భూమినుండి ఆవిర్భవించిరి. పుత్రనిర్విశేషముగ పెరియాళ్వార్ల దంపతులచే నల్లారుముద్దుగ పోషింపఁబడిరి. బాల్యమునుండి భగవదేకాసక్తచిత్తయై, నిరన్తరము భగవత్కల్యాణగుణ చరిత్రాద్యనుసంధానైకప్రవణయై, తద్విరహవేదనానుభవరూపముగ దివ్యప్రబంధముల నను గ్రహించి, శ్రీరంగనాథుల వివాహముజేసికొని వారిసన్నిధిలో లీనమాయెను.

(10) శ్రీమద్వనమాలికాంశ సంభూతులగు శ్రీ తొండరడిప్పొడియాళ్వార్లు, చోళదేశ మున తిరుకావేరీతీరమందలి "మణ్డఙ్గుడి" అను అగ్రహారమున, కలియుగము 109-వ సంవత్సరమున మార్గశిరమాసమున, జ్యేష్ఠానక్షత్రమున "సకలవేద విశారదు"లను పుర శ్చూడులగు బ్రాహ్మణోత్తములకు జన్మించిరి. వీరు ప్రారబ్ధకర్మశేషమువలన "దేవదేవి" అను వేశ్యాసంపర్కమున సాంసారిక క్లేశములననుభవించి, శ్రీరంగనాచ్చినార్ల పురుషకారప్రభావము వలన శ్రీరంగనాథుల దివ్యకటాక్షమునకుఁ బాత్రులై, పరభక్తి పరజ్ఞాన పరమభక్తిపరిపూర్ణులై, భగవద్భాగవతకైంకర్యనిష్ఠాగరిష్ఠులై, "తిరుప్పళ్ళియెళుచ్చి", "తిరుమాలై" అను రెండు దివ్యప్రబంధముల ననుగ్రహించిరి.

(11) శ్రీవత్సాంశసంభూతులగు తిరుప్పాణాళ్వార్లు — చోళదేశమునందలి శ్రీరంగ మునకు సమీపమున కావేరీతీరముననుండు "ఉరైయూర్" అను దివ్యదేశమున వరికంకి నుండి అయోనిజులై, కలియుగమున 163-వ సంవత్సరమగు దుర్మతినామ సంవత్సరమున కార్తికశుక్లపూర్ణిమా బుధవాసరమున, రోహిణీనక్షత్రమున నవతరించిరి. పంచమవర్ణస్థుఁడగు మాలదాసరిచేఁ బోషింపబడిరి. స్వవర్ణాచారాదుల కనుగుణముగ కావేరీమధ్యభాగమునకుఁ జనక, అవతలిగట్టునుండియే వీణనుధరించి సదాసర్వకాలములయందును, భగవద్గుణానుసంధా నైకప్రవణులై గానముచేయుచు, తన్మయీభూతసర్వావయవులై, శ్రీరంగనాథుని దివ్యానుగ్రహ మునకుఁ బాత్రులై, భగవన్నియమనానుసారము లోకసారంగమునిచే భగవత్సన్నిధికిఁ దోడ్కొనఁబడి ఆపాదచూడము భగవద్దివ్యమంగళవిగ్రహము ననుభవించి, తదనుభవ పరీవాహరూపముగ, "అమలనాదిపిరాన్" అను దివ్యప్రబంధమును పాడి, భగవంతుని శ్రీపాద పీఠమున లీనమైరి.

(12) శ్రీ శార్ఙ్గాంశసంభూతులైన తిరుమంగై యాళ్వార్లు — చోళదేశమున కావేరీసాగర సంగమప్రదేశమున, "తిరుక్కురైయలూర్" అను గ్రామమున, కలియుగమున 207 - వ సంవత్సరమగు నళసంవత్సరమున, కార్తికమాస శుక్లపక్షపూర్ణిమా గురువారమున, కృత్తికా నక్షత్రమున నవతరించిరి. వీరు 'కుముదవల్లి' యను కన్యకారత్నమును ప్రేమించి, ఆమె ప్రేరణమున ప్రతిదినము వెయ్యిమందిభాగవతులకు నిత్యతదీయారాధనఁజేయుచు, దానికిఁగావలసిన ద్రవ్యమునకై చౌర్యమునగూడ ప్రవృత్తులైరి. వీరి ననుగ్రహింప నూతనవధూవరులుగఁ జనుదెంచిన శ్రీమన్నారాయణుల దివ్యాభరణాదులఁగూడ నపహరించి, ఆ భగవత్సంబంధముచే దివ్యజ్ఞానము వికసింపగా, భగవంతునిచేతనే సాక్షాత్తుగ శ్రీమదష్టాక్షరీమంత్రోపదేశమును బొంది, సదా భగవత్కైంకర్యమునందును, ఆళ్వార్ల కైంకర్యమునందును, భాగవతకైంకర్యములందును నిమగ్నులై, (1) పెరియతిరుమొழி, (2) తిరుక్కుఱుందాణ్డకమ్, (3) తిరునెడుந்தాణ్డకమ్, (4) శిఱియతిరుమడల్, (5) పెరియతిరుమడల్, (6) తిరువెழுకూత్తిరుక్కై మొదలగు ననేక దివ్యప్రబంధముల ననుగ్రహించి తరించి, అందఱిని తరింపఁజేసిరి.

వీరానతిచ్చిన దివ్యప్రబంధములు, శ్రీ నమ్మాళ్వార్లు సాదించిన ద్రావిడ వేదములకు షడంగ స్థానీయములై విరాజిల్లుచున్నవి.

## శ్రీవేంకటాచలపతికి మంగళాశాసనముజేసిన ఆళ్వార్లు

ఇట్టి మహాప్రభావ సంపన్నులగు దివ్య సూరుల (ఆళ్వార్ల) లో (1) పొయ్గై, (2) పూదత్త, (౩) పేయాళ్వార్లు, (4) తిరుమழிశై యాళ్వార్లు, (5) నమ్మాళ్వారులు, (6) కులశేఖరప్పెరుమాళ్ళు, (7) పెరియాళ్వార్లు, (8) ఆండాళమ్మగారు, (9) తిరుప్పాణాళ్వార్లు, (10) తిరుమంగై యాళ్వార్లు — అను పదిమంది ఆళ్వారులు శ్రీ వేంకటాచలపతికి మంగళాశాసనమును చేసియున్నారు.

## శ్రీవేంకటాచలపతికి ఆళ్వార్లుచేసిన మంగళాశాసన పాశురముల పట్టిక

| | ఆళ్వార్లు | దివ్యప్రబంధములు | పాశురములు |
|---|---|---|---|
| 1. | శ్రీ పొయ్గై యాళ్వార్లు : ... | ముదల్ తిరువన్దాది .... | 10 |
| 2. | శ్రీ పూదత్తాళ్వార్లు : ... | ఇరణ్డామ్ తిరువన్దాది .... | 9 |
| 3. | శ్రీ పేయాళ్వార్లు : .... | మూన్ఱామ్ తిరువన్దాది .... | 19 |
| 4. | శ్రీ తిరుమழிశై యాళ్వార్లు : .... | (1) నాన్గామ్ తిరువన్దాద .... | 12 |
| | | (2) తిరుచ్ఛన్దవిరుత్తమ్ .... | 2 |
| 5. | శ్రీ నమ్మాళ్వార్లు : .... | (1) తిరువిరుత్తమ్ .... | 8 |
| | | (2) పెరియ తిరువన్దాది .... | 1 |
| | | (3) తిరువాయ్మొழி .... | 35 |
| 6. | శ్రీ కులశేఖరాళ్వార్లు : .... | పెరుమాళ్ తిరుమొழி .... | 11 |

| | | | |
|---|---|---|---|
| 7. | శ్రీ పెరియాళ్వార్లు : .... | (1) తిరుప్పల్లాణ్డు .... | 1 |
| | | (2) పెరియాళ్వార్ తిరుమొழி .... | 7 |
| 8. | శ్రీ ఆండాళ్ : .... | (1) తిరుప్పావై .... | 1 |
| | | (2) నాచ్చియార్ తిరుమొழி... | 16 |
| 9. | శ్రీ తిరుప్పాణాళ్వార్ : .... | అమలనాదిపిరాన్ .... | 2 |
| 10. | శ్రీ తిరుమంగైయాళ్వార్ : .... | (1) పెరియతిరుమొழி .... | 55 |
| | | (2) తిరుక్కుఱున్దాణ్డకమ్ .... | 1 |
| | | (3) తిరునెడున్దాణ్డకమ్ .... | 4 |
| | | (4) శిఱియతిరుమడల్ .... | 1 |
| | | (5) పెరియతిరుమడల్ .... | 2 |
| | ఆచార్యులుచేసిన మంగళాశాసన పాశురములు | | |
| 1. | తిరువరంగత్తముదనార్లు .... | (1) రామానుజనూత్తన్దాది .... | 2 |
| 2. | శ్రీ వేదాంతదేశికులు .... | (2) అధికారసంగ్రహము .... | 1 |
| | | మొత్తము పాశురములు .... | 200 |

## ఇంకను తిరువేంగడముడైయాన్లను ప్రతిపాదించు దివ్యప్రబంధములు

### ( ఇయల్పా )

శ్రీమద్రామానుజులవారు — తామే, శ్రీమన్నాథమునులవద్దనుండి వచ్చుచున్న అనాది సమ్ప్రదాయముఖమున “ శెన్దమిழ் పాడువార్ తామ్ వణఙ్గుమ్ దేవర్ ఇవర్ ” (విశేషముగు ద్రావిడభాషలో గానముజేయు ముదలాళ్వార్లు భజించు దైవ మీతఁడు) అని వినియున్న ప్రకారము, మొట్టమొదటి యాళ్వార్లగు ముదలాళ్వార్ల యభిప్రాయమును బాగుగ నెఱిఁగి యుండుటచే, “ మూడు తిరువన్దాదులును తిరువేంగడముడయాన్లనే ప్రతిపాదించుచున్నవి ” అనియును, ఈ తిరువన్దాదులలో తిరుమన్త్రమున వ్యక్తచతుర్థ్యర్థమును ప్రతిపాదించుటద్వారా తత్సఘానార్థకమగు ఇయల్పాశేషమునకును నితఁడే ప్రతిపాద్యుఁడు—అనియును నిశ్చయంచి, అధ్యయనోత్సవమున మొట్టమొదట ” ఇయల్పా “ ప్రబంధపారాయణము నేర్పాటుచేసి యుండుటచేత ఇయల్పా ప్రబన్ధమునకు తిరువేంగడముడైయాన్లే ప్రతిపాద్యులు.

### ( తిరుప్పావు )

ఇటులనే, “తిరుప్పావు దివ్యప్రబంధమునకును తిరువేంగడముడైయాన్లే ప్రతిపాద్యులు. తిరుప్పావు ప్రబంధపు ఫలశ్రుతి పాశురమున—“ వఙ్గక్కడల్ కడైన్దమాదవనై ” అనియును, “ఈరిరణ్డుమాల్వరైత్తోళ్ శెఙ్గణ్ తిరుముగత్తు శెల్వత్తిరుమాలాల్” అనియును శ్రీ శ్రీనివాసుని అభివర్ణించి, ఆ వాత్సల్యజలధియొక్క “తిరువరుళ్ ఎఙ్గుమ్ పెఱ్ఱు ఇన్పురువర్” సర్వతో

ముఖమైన దివ్యకృపారసమును బొంది నిరవధికానందము ననుభవింతురు — అని ప్రబంధ నిగమనము జేయఁబడియున్నది.

అధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములగు తాపత్రయముచే నభిభూతులై, సంసార సాగరమున మునింగి దుర్భర యాతనల ననుభవించు చేతనులకు, వారి పాపములను నశింపఁ జేసి తత్కార్యమగు దుఃఖముల భస్మముజేసి, స్వచరణారవింద నిరంతర నిష్కపటభక్తిని బ్రసాదించి, తన దివ్యమంగళ విగ్రహసందర్శనాదుల ననుగ్రహించి, అమన్దానన్దమును కరతలామలక మొనరించు శ్రియఃపతియే — శరణ్యము.

శ్రీదేవి, అఖిలజగన్మాతయగుటచే నిరుపాధిక మాతృత్వసంబంధము వలన చేతనుల సకల కష్టనిష్ఠురముల విచారించి, వానికిఁ గారణభూతమగు నపరాధముల నైరించి, ఉపదేశ, కారుణ్యాభివర్ణనాదులచే వారల సమీకరించి, సర్వేశ్వరునిపట్ల యాభిముఖ్యముమ గలుగఁజేసి, దేవదేవ దివ్యమహిషి యగుటచే నిరుపాధిక పత్నీత్వసంబంధమువలన సర్వేశ్వరుని కోపతాపముల నుపశమింపఁజేసి, వానికిఁ గారణభూతమగు పౌరోభాగ్యమును, నిరంకుశస్వాతంత్ర్యమును దొలగించి, దయావాత్సల్యాదుల నుద్భూతములుగ నొనరించి, ఉపదేశ, సౌంధర్య - సౌభాగ్యాద్యభివర్ణనాదులచేఁ బరమపురుషుని సమీకరించి, స్వప్రజానీకమగు చేతనులయెడ అభిముఖ్యమును సంపాదించి, చేతన పరమచేతనుల సంఘటనమొనరించును.

ఆ శ్రీదేవియొక్క ఆ పురుషకారప్రభావమును, ఆ పురుషకార ప్రభావమువలనఁగలుగు సర్వేశ్వరుని దివ్య కారుణ్యప్రధానమును దెలియఁజేయుటకై "వఙ్గక్కడల్ కడైన్ద" అని అమృతమథన వృత్తాన్తమును, అట్టి క్లిష్ట సమయమునందును క్షీరార్ణవమునందుండిన నిఖిల చరాచరములకును నేవిధమైన క్లేశమును గలుగక సుఖముగనుండు పరిస్థితిని ప్రసాదించిన పరమపురుషుని పరమౌదార్య కారుణ్యములను, ఆ ఘటితఘటనాసామర్థ్యమును నభివర్ణించి, అది యంతయును "శ్రీమహాలక్ష్మీ సంబంధోపజ్ఞమే"-అని తెలుపుటకై "మాదవనై" అని కీర్తించిరి. విరోధినిరసనమును దెలియఁజేయుటకై "కేశవనై" అని విశేషించిరి. అట్లు చేతనుల సర్వపాపములను దహింపఁజేసి వారలకు సర్వాభీష్టములఁ బ్రసాదించు దేవదేవుఁడు శ్రీ వేంకటరమణుఁడే గదా? మొదటినుండియు శ్రీమన్నారాయణుని యవతారములనెల్ల గీర్తించుచువచ్చి, కడపటి పాశురమున, కల్యాణాద్భుతగాత్రుఁడై శ్రీవేంకటాచలమున నెలకొని యుండు శ్రీ శ్రీనివాసుని దివ్యావతారముతో ముగించిరి. శాస్త్రములయందు నిరూపింపఁబడు సర్వశాఖాప్రత్యయన్యాయాదులచే సామాన్యవాచిశబ్దములకెల్ల విశేషవ్యక్తిలో పర్యవసానముగాన తిరుప్పావు దివ్యప్రబంధమున యంతయును శ్రీనివాసునిలోనే పర్యవసానమనుట సిద్ధమైన విషయము. "బ్రహ్మణి శ్రీనివాసే" అనియేగదా శ్రీమద్భాష్యకారులును నభివర్ణించిరి.

మఱియును, "ఈరిరణ్డుమాల్వరైత్తోళ్" అను విశేషణముగూడ శ్రీవేంకటాచలపతినే విశేషించుచున్నది. శంఖచక్రాలంకృతమగు నూర్ధ్వహస్తద్వయము, కటతట సంఘటిత, స్వపాదకమల సందర్శక ముద్రాలంకృతమగు నధోహస్తద్వయమును, శ్రీ వేంకటాచలపతి దివ్యమంగళవిగ్రమునకే అసాధారణములైనవి. ఇచ్చట —

ఊర్ధ్వౌ హస్తౌ యదీయౌ ప్రతిభటదళనే బిభ్రితః శంఖచక్రే
సేవ్యావంఘ్రీ స్వకీయా వభిదధదపరో దక్షిణో యస్య పాణిః
తావన్మాత్రం భవాబ్ధిం గమయతి భజతా మూరుగో వామపాణిః
శ్రీవత్సాంకశ్చ లక్ష్మీ ర్యదురసి లసత్తస్తం భజే వేంకటేశమ్ ॥

అను శ్లోకము అనుసంధింపఁదగియున్నది.

అదియునుగాక, శ్రీ సుదర్శన చక్రము కర్మయోగమును, శ్రీ పాంచజన్యము జ్ఞాన యోగమును, కటిహస్తముద్ర భక్తియోగమును, పాదసందర్శి వైకుంఠహస్తముద్ర ప్రపత్తి యోగమును దెలుపుచుండుటచే, గీతాచార్యుఁడగు శ్రీ కృష్ణుని దివ్యమంగళవిగ్రహము, ఈకలి యుగమున నిట్టి కల్యాణాద్భుతమగు నర్చావిగ్రహమైనటుల, వాని ముఖపద్మమునుండి నిసృతమగు గీతామృతసింధువుగూడ, విలక్షణహస్తముద్రా స్వరూపమున సేవ సాదించుచున్న దను సమన్వయము, బంగారునకు తావి అబ్బినట్లుండును గదా ?

ఇచట దాసుని యీ శ్లోకమును అనుసంధింపుఁడు :—

చక్రం శాస్తి సుకర్మయోగకలనం, జ్ఞానం చ శంఖస్తథా
పాణి శ్చారుకటిప్రసంజితతలః శ్రీభక్తియోగం తథా ।
శ్రీమత్పాదసరోజదర్శకకరో యోగం ప్రపత్తిం పరం
యస్యాన్వర్థచతుర్భుజ స్స భగవాన్ జేజేతు లక్ష్మీసఖః ॥

అన్నిటికన్న నీ పాశురమున గమనింపఁదగిన విశేషాంశము — "శెల్వ త్తిరుమాలాల్" అని. "తిరుమాలాల్" అనిన చాలునుగదా ? అంతమాత్రముచేతనే "శ్రీనివాసుని దివ్యకృప" అను పరమార్థము సిద్ధించుచుండగా, మొదటనే "మాదవనై" అను విశేషణము గూడ ప్రయోగింపఁబడియుండగా, ఈ "శెల్వ" అను "విశేషణ" మెందులకు ? ఆ సారస్యమును తలచిజూడఁగఁ జూడఁగ, శ్రీఆండాళమ్మవారికి తిరువేంగడముడైయాన్లయందుండు నిరుపాధిక నిరవధిక ప్రణయ ప్రావణ్యము, మధురాతిమధురముగ నాస్వాద్యమగుచున్నది.

అందుచే, "శెల్వ" పదబోధ్యమానమగు నా దివ్యసంపద, దివ్యకల్యాణ సంపత్సఖుఁ డగు శ్రీ శ్రీనివాస మందారమునకుఁజెందినదే దప్ప, ఇతరము గాదని తేలుచున్నది.

కాఁబట్టి, తిరుప్పావు నిగమనపాశురమేగాక, తిరుప్పావు మొత్తముగూడ తిరువేంగడ ముడైయాన్ల మంగళాశాసన పరమే—అనుటలో సందియములేదు.

కనుకనే గావలయు,

శూడికొడుత్త శూడర్క్కొడియే ! తొల్పావై
పాడియరుళవల్ల పల్వళయాయ్—నాడినీ
"వేఙ్గడవఱ్కు ఎన్నైవిది" ఎన్ఱ ఇమ్మాత్ర్రమ్
నామ్ కడవా వణ్ణమే నల్గు — అని మహాప్రాజ్ఞులును, అనుభవరసికులును, కవి సహృదయ తల్లజులునునగు శ్రీ ఉయ్యకొండార్లు (పద్మవిలోచనులు) ప్రశంసాపద్యము (తనియను)నానతిచ్చిరి.

## (తిరువాయ్‌మొழி — 7-4. ఆழி ఎழ)

ఇంకను, తిరువాయ్‌మొழి దివ్యప్రబంధమునందలి 7-వ పత్తు 4-వ తిరువాయ్‌మొழి యగు "ఆழிఎழ" అను దశకమునుగూడ తిరువేంగడముడైయాన్ల మంగళాశాసనపరముగ పెద్దలు అధ్యవసించుచున్నారు. తిరుమలలో, నేటికిని, దీనిని, తిరువేంగడముడైయాన్ మంగళాశాసనరూపముగఁ బ్రతిదినమును అధ్యాపకులు అనుసంధానము చేయుచున్నారు.

ఈ దశకమున సమ్మాళ్వార్లకు నాశ్వాసమును గలుగఁజేయుటకై సర్వేశ్వరుఁడు — (1) త్రైవిక్రమవ్యాపారము, (2) అమృతమథన వృత్తాన్తము, (3) భూమ్యుద్ధరణ వృత్తాన్తము, (4) జగన్నిగరణ వ్యాపారము, (5) భారత సమరనిర్వాహకత్వము, (6) హిరణ్యవధ వృత్తాన్తము, (7) లఙ్కాపురభంగవ్యాపారము, (8) బాణాసురబాహువిచ్ఛేదనము, (9) జగత్సృష్టి ప్రకారవైభవము, (10) గోవర్ధనోద్ధరణ ప్రకారము — అను తన విజయపరంపరలను వీరికి సాక్షాత్కరింపఁజేయగా, సందర్శించి యమన్దానన్దము బొందుచున్నారు.

అందు, మొదటిపాశురమున—

ఆழிఎழச్చఙ్గుమ్ విల్లుమెழ, త్తిశై
వాழிఎழత్తణ్డుమ్ వాళుమెழ, అణ్డమ్
మోழైయెழ ముడిపాదమెழ, అప్పన్
ఊழிఎழ ఉలగఙ్కొణ్డవాఱే — అని యారంభించి,

శ్రీ సుదర్శనాళ్వాన్లు విజయశీలురై యుండగ, శ్రీ పాంచజన్యాళ్వాన్లు శ్రీశార్ఙ్గము, కౌమోదకీ నన్దకములును విజయశీలురై యుండగ, మంగళాశాసనధ్వని వృద్ధిఁబొందునటులను, అండభిత్తి భిన్నమై ఆవరణజలము లోపలఁబ్రవేశించునటులను, దివ్యకిరీటము, శ్రీపాదపద్మములు పెరుగునటులను, మంచికాలము గలుగునటులను, సర్వేశ్వరుఁడు లోకముల స్వీకరించిన ప్రకారము ఏ మాశ్చర్యకరమగు విషయము? అని అభివర్ణింపఁబడుచున్నది. చివరి పాశురమున, "కున్ఱమెడుత్తపిరాన్" అని గోవర్ధనోద్ధరణవ్యాపారము అభివర్ణింపఁబడియున్నది.

మొదటిపాశురము, త్రివిక్రమావతారవైభవప్రతిపాదికముగఁ బ్రాచీనవ్యాఖ్యాతలందఱును సమన్వయించియున్నారు. ఈవిషయమంతయును యథాతథముగ తిరువేంగడముడయాన్లకును సమన్వయమగుచున్నది. ఇటులనే, చివరిపాశురము, గోవర్ధనోద్ధరణవైభవప్రకాశకమనుట స్పష్టము.

ఇట్లీ దశకమున, తిరుప్పావైనందు వలె, విభవావతారములలోఁ ద్రివిక్రమావతారముతో నారంభించి, శ్రీ కృష్ణావతారవైభవమగు గోవర్ధనోద్ధరణవ్యాపారముతో నిగమనము చేయఁబడి యున్నది.

"కున్ఱమేన్ది కుళిర్‌మழை కాత్తవన్,
అన్ఱు ఞాలమళన్దపిరాన్, పరన్
శెన్ఱుశేర్ తిరువేంగడమామలై,
ఒన్ఱుమే తొழ నమ్ వినై ఓయుమే ॥

అని, ప్రపన్నజనకూటస్థులైన శ్రీ నమ్మాళ్వార్లు, ఆ విజయవైభవమును తిరువేంగడ ముడయాన్లకే సమన్వయము జేసియున్నారు.

శ్రీమద్వేదాన్తదేశికులును — ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళియందు, "విక్రాన్త్యా పిష్టపానా మమృత మథనతః" అని ఆరంభించి, "గోవర్ధనాద్రేః స్ఫుటజగదవనప్రక్రియం శ్రీశ మాహ" అని అన్తమున, శ్రీపడగు శ్రీవేంకటాచలపతి వైభవ ప్రకాశముగ నీ దశకమును సమన్వయము జేసియున్నారు.

మఱియును, ప్రతిపాశురమునను "అప్పన్" అని కీర్తింపఁబడియున్నది. ఈ "అప్పన్" అను వ్యవహారము "మలైఅప్పన్" అని తిరువేంగడముడైయాన్లకే అసాధారణముగ నున్నది. "మలైఅప్పన్" అని, తిరుమలలోని ఉత్సవమూర్తికి వ్యవహారము ఇప్పటికిని సర్వజనప్రసిద్ధమైయున్నది.

పై కారణములనెల్ల పర్యాలోచనజేసియే, పెద్దలు, "అఱియేన్" దశకమును గూడ, తిరువేంగడముడయాన్ మంగళాశాసన పాశురములలోఁ గలిపి అనుసంధించుచున్నారని తోచుచున్నది.

## ఈ సంపుటమునందలి విశేషములు

తత్త్వ మిటులున్నను, స్పష్టముగ తిరువేంగడనామధేయ పరిమితమైయుండు మంగళాశాసన పాశురములను మాత్రమే యెత్తుకొని మూల సంపుటిని మన పరిశోధనాలయమున భక్తుల యుపయోగార్థము మొదట నచ్చొత్తించితిమి తదను గుణముగనే అరవభాషలోని టీకాతాత్పర్యములను గూర్చి అచ్చొత్తించితిమి. కాని, ఈ తెనుఁగు సంపుటమున, ఆళ్వారుల కాలక్రమముననుసరించి ఆ యా ప్రబంధముల క్రమమునుగూడ పాటించి, ఆ యా యాళ్వార్ల పాశురముల నన్నిటిని అనుస్యూతముగ నొక్కచోటనే జేర్చి ప్రకటించుచున్నాము. పూర్వుల వ్యాఖ్యానముల నన్నిటిని పరిశీలించి, సర్వసాధారణముగ పాఠకలోకమునకు పాశురముల నర్థముఁజేసికొనుటకు గావలసిన అంశములనెల్లజేర్చి, యావచ్ఛక్యము సంగ్రహించి, లలితోచిత సన్నివేశ రమ్యముగ నీ ఆంధ్రటీకాతాత్పర్యముల సమకూర్చితిమి. ఇందుచేఁ బాఠకులకుఁ చాల సౌకర్యముండునని మా యభిప్రాయము. మఱియు నాధునిక పద్ధతిలో పాఠకులకు గావలసిన సౌకర్యమునెల్ల సమకూర్చితిమి. తిరువేంగడముడయాన్ల చరిత్రము నంతటిని సంగ్రహించి, వారిని గూర్చిన సర్వోదన్తములను పీఠికలో మనవిచేసికొనియున్నాము. అనుబంధరూపముగను, అకారానుక్రమణికలో ననేక విషయములఁ జేర్చియున్నాము. సహృదయులగు పాఠకులకును, విమర్శకులకును ఈ విషయము లెల్ల, మిక్కిలి ప్రయోజన సమ్పాదకములగునని మా దృఢవిశ్వాసము. వారల కటుల కించిత్తైనను ప్రయోజనము గలుగుచో, మా యీ ప్రయత్నము సఫలమగునని దలఁచుచున్నాము.

# కృతజ్ఞతాఽఽవిష్కరణము

కలియుగ ప్రత్యక్షదైవతమగు శ్రీ శ్రీనివాసుని దివ్యసన్నిధానమున, ఈ సంప్రదాయ గ్రన్థప్రచురణను తమ ఉచితజ్ఞతను వెచ్చించి, వ్యవస్థాపించిన మహోదయులగు శ్రీమాన్ కెత్తె వేంకటస్వామినాయుఁడు (బహుకాలము తిరుమల తిరుపతి దేవస్థాన సంఘాధ్యక్షులుగను, మదరాస్ రాష్ట్ర ధర్మాదాయ మంత్రిశేఖరులుగను, వుండిన మహానుభావులు) గారికి మొట్టమొదట నా కృతజ్ఞతను దెలుపుకొనవలసియున్నది.

అటులనే, ఈ గ్రన్థమాలాప్రచురణప్రచారములకుఁ గావలసిన సకలసదుపాయములను మిక్కిలి దయతో నేర్పఱచి, సర్వవిధములఁ జేయూతయొసఁగి, ఈ గ్రన్థముద్రణమునకును మహోపకారమొనరించిన, తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తృ సంఘసభ్యులకును, మహాప్రాజ్ఞులగు తదధ్యక్షచరణులకును, శ్రీవారి సర్వవిధకైంకర్యముల నిర్వహణతోబాటు, యాత్రికుల కనేకవిధములగు సౌకర్యముల నేర్పాటు జేయుటయందే తమ జీవిత సర్వస్వము అంకితము చేసిన మన దేవస్థాన కార్యనిర్వాహకాధ్యక్ష మహోదయులగు శ్రీ చెలికాని అన్నారావు గారికిని హార్దమైన కృతజ్ఞతను దెలుపుకొనుట మాత్రమే గాక, నేనెంతయును ఋణపడియున్నాను.

ఇటులనే, పరిపక్వవిజ్ఞానానుభవ మండితులగుటచేఁ దమ అమూల్యములగు సదుపదేశముల నొసఁగి, సర్వవిధముల నీ గ్రన్థమాలా సమ్పాదనమున నన్ను నడిపించుచు, నాయందు పరమానుగ్రహమును ప్రదర్శించుచు శ్రీ వేంకటేశ ప్రాచ్యవిద్యాపరిశోధనాలయాధ్యక్షులుగ నుండిన మహాప్రాజ్ఞులగు శ్రీమాన్ పరవస్తు వేంకటరామానుజస్వామి మహోదయులకును నేను మిక్కిలి అధమర్ణుఁడను.

మేమిచ్చు సర్వపరిశ్రమలకోర్చి, సకలవిధములైన సహకారములతో నీ గ్రన్థమాలను, విశేషించి, ఈ గ్రన్థమును, సర్వాంగసుందరముగ ముద్రించి యిచ్చిన, సర్వసమర్థులగు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయ నిర్వాహకులకును, సౌమ్యులగు కార్యకరులకును నా కృతజ్ఞతను దెలుపుకొనకున్న, నా విధిని నేను నిర్వర్తించినవాఁడను కాఁజాలను.

# శరణాగతి

ఎందుకును కొఱగాని ఈదాసునిఁగూడ, తమ యవ్యాజదివ్యకృపకుఁబాత్రునిగాఁజేసికొని, ఒక వస్తువునుజేసి, సత్తను గలిగించి, విజ్ఞానప్రవత్తులఁ బ్రసాదించి, ప్రయోజకునిగాఁ జేసి, పరమపురుషార్థమగు తమ దివ్య కైంకర్యనిర్వహణముననే మొదటనుండియు నియోగించి, విశిష్య, ఇప్పుడు, ఆత్మార్థప్రియమగు, తమదివ్యకల్యాణగుణ చరిత్రవైభవ ప్రకాశనైకతానంబగు ఈ సంప్రదాయ గ్రన్థమాలా సమ్పాదన కార్యమునను నియమించి, నాచే నీ కార్యముల నిర్వర్తింపఁజేయుచు, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధములఁ గటాక్షించుచు, తమ కంతరంగపరిజనునిగాఁ జేసికొని, అమందానందము ననుభవించుచున్న, పరమదయానిధియు, వాత్సల్యజలధియు, సర్వస్వామియు. నస్మత్స్వామియునగు, శ్రీ వేంకటాచలాధీశుఁడై, కలియుగ ప్రత్యక్షదైవతమై విరాజిల్లుచుండు, శ్రీ శ్రీనివాసభగవానుని దివ్యపాదారవిందముల నెల్లప్పుడును నా యుత్తమాంగమున నలంకరించుకొని త్రికరణశుద్ధిగఁ బ్రణమిల్లుచున్నాను.

ఇట్టి మహాభాగ్యమును, ఇట్టి యనుసంధానమును, నా కెల్లప్పుడును, నా పరదైవతమగు శ్రీనివాసుఁడు, పరమవాత్సల్యముతో ననుగ్రహించునుగాక—అని ఆ యాశ్రిత జనమందారుని, పరమ కరుణామూర్తిని సాంజలిబంధుఁడనై ఎల్లప్పుడును శరణువేడుచున్నాను.

శ్రీ వేంకటేశ్వర సంస్కృత
మహావిద్యాశాల, తిరుపతి.
శ్రీ హేమలమ్బ మిథున శుక్ల
సప్తమీ గురువాసరము.
4—7—1957

ఇట్లు
విజ్ఞాపించు
శ్రీమద్భాగవత దివ్యచరణ చంచరీకము
తి. కు. వేం. న. సుదర్శనదాసుఁడు.



శ్రీరస్తు
శ్రీమతే వేంకటేశాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# తిరువేంగడముడైయాన్ల (శ్రీవేంకటాచలపతి)

విషయమున

శ్రీ ఆళ్వార్లు (దివ్యసూరులు) ఆనతిచ్చిన

# మంగళాశాసన పాశురములు

శ్రీమతే భట్టనాథాయ నమః

## శ్రీ పెరియాళ్వార్లు – ఆనతిచ్చిన

### తిరుప్పల్లాణ్డు ౧-వ పాశురము

అవ :— సర్వేశ్వరుడు, శ్రీపెరియాళ్వార్లచే పరతత్త్వనిర్ణయమును చేయించి, వారికి జరుగు సన్మానవైభవమును చూడవలయునను కుతూహలముతో, శ్రీభూదేవులతోగూడ గరుడవాహనారూఢుడై, ఆళ్వార్లకు గజోత్సవము జరుగుచుండుచోటికి విచ్చేసెను. వారిని సందర్శించినంతనే, వారియందలి ప్రీతిప్రకర్షము మిన్నుముట్టగ, "ఎట్టి వస్తువునైనను హాతమార్చు నీ ప్రకృతిమండలమునకు అప్రాకృతమగు దివ్యమంగళవిగ్రహముతో నీతడు జనుదెంచెనే? ఈ వస్తువునకెట్టి అవద్యము వాటిల్లునో గదా!?" అని భయపడి, ఏదోషములును సోకకుండుటకై, ఆళ్వార్లు భగవంతునకు మంగళాశాసనమును చేయుచున్నారు.

* పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు,
పలకోడి నూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్ తోళ్ మణివణ్ణా, ఉన్
శేవడి శెవ్వి తిరుక్కాప్పు. ౧

టీక :— పల్ ఆండు=అనేకవత్సరములు వర్థిల్లుదువుగాక, (నీకు సకలవిధమంగళములను గలుగుగాక) పల్ ఆండు = చాల కాలము వర్థిల్లుదువుగాక, (నీకు విజయము గలుగు గాక.) పల్లాయిరత్తు ఆండు = పలువేలవర్షములు (లెక్కలేనన్ని వేలసంవత్సరములు) వర్థిల్లుదువు గాక. (ఆచంద్రార్కము జయశీలుడవై యుందువు గాక) పలకోటి నూఱాయిరమ్ = పలుకోటినూర్లసంవత్సరములు (కాలతత్త్వమున్నంతవఱకును) జయశీలుడవై (మంగళదేవతాలింగతుడవై) వర్థిల్లుదువు గాక. మల్ = చాణూరముష్టికులను మల్లుల, ఆణ్డ = దర్పమడంచి జయించిన, తిణ్ తోళ్ = సుదృఢములై దివ్యకమనీయములగు ఆజానుబాహువులచే విరాజిల్లుచుందు, మణివణ్ణా = ఇంద్రనీలమణులవంటి శరీర కాంతి గలవాడా! ఉన్ = దేవరవారియొక్క, శేవడి = ఎఱ్ఱదామరలవలె మనోజ్ఞములగు శ్రీపాదములయొక్క, శెవ్వి = నిస్సీమమగు సౌందర్యమునకు, తిరుక్కాప్పు = నిరవద్యమగు రక్షగలుగు గాక. (ఆచందార్కస్థాయియై వెలుంగుగాక).

తా॥ దేవరవారు జయశీలురై పలువత్సరములు వర్థిల్లుదురుగాక! కాలతత్త్వమున్నంతవరకును మంగళదేవతాసమన్వితులై విరాజిల్లుచుందురు గాక! స్వామీ! దేవరవారికి మంగళము; సుమంగళము! దుర్జయులగు చాణూర ముష్టికులనుమల్లుల బలదర్పముల నడంచి, వారలనిరసించిన సుదృఢములగు సుందరబాహువులతో నలంకృతుడవై, ఇంద్రనీలముల వంటి శరీరకాంతితో విరాజిల్లు మాస్వామీ! నీకు అనవరతమును మంగళములు గలుగుగాక! పలువేలవత్సరములు, పలుకోటి నూరువేలసంవత్సరములు నిరవధికములగు మంగళములు గలుగుగాక! కాలతత్త్వమున్నంత వరకును దేవరవారి ఎఱ్ఱతామరలవంటి శ్రీపాదములయొక్క సౌందర్యమునకు నిరవద్యమగు రక్షగలుగుగాక! ఎల్లప్పుడును, ఏవిధమైన అవద్యములు లేక, నిరవధికమగు సౌందర్యముతో మాపాలిటిపెన్నిధానమగు దేవరవారి శ్రీమత్పాదారవిందద్వంద్వము నిత్యసముజ్జ్వలమై విరాజిల్లు గాక!

వి. వి :— అప్రాకృతదివ్యమంగళవిగ్రహవిశిష్టుడగు ఎంబెరుమానులను (సర్వేశ్వరుని) ఈ ప్రాకృతమండలమున సందర్శించినంతనే వీరికి, నేయవద్యము వాటిల్లునో? అని భయశంకితులై, దివ్యసౌందర్యసౌకుమార్యాది కల్యాణగుణోపేతమగు విగ్రహముతో గూడుకొనియున్న దేవరవారి ఈయుల్లోక సౌందర్యము ఎప్పటికిని మారక, నిత్యమై వెలుంగుగాక! అని మొట్టమొదట "కల్లాణ్డు పల్లాణ్డు" అని రెండుసారులు ఆతురతతో గీర్తించుచున్నారు. పల్లాణ్డు - అను పదమునకు మొత్తముగ మంగళమని అర్థము. నిప్పువద్దకు ఒకబిడ్డ వెళ్ళినేని "నిప్పు, నిప్పు" అని అఱచుటగద లోకమున వ్యవహారములో నున్నది. అట్లే, ఆళ్వార్లును ఇచ్చట ద్విరుక్తిని ఉపయోగించిరి. "పల్లాణ్డు" అను పదమునకు పలుసంవత్సరములు అని, పదార్థమును గూడ కొందరు వర్ణించుచున్నారు. అప్పుడు పలుసంవత్సరములు వర్ధిల్లుదువు గాక! అని అర్థము చెప్పుకొనవలయును.

నూత్తాయిరత్తు — అనుచోట "నూత్తాయిరముమ్" అనియు, శేవడి—అను చోట "శెవ్వడి" అనియు పాఠాన్తరములు.

శ్రీ పెరియాళ్వార్ల తిరువడిగళ్ళే (శ్రీమత్పాదారవిన్దములే) శరణము

———

శ్రీరస్తు

శ్రీమతే వేంకటేశాయ నమః

శ్రీమతే సరోయోగినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ పొయ్‌గై యాళ్వార్లు ప్రసాదించిన ముదల్ తిరువన్దాదిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

శ్రియఃపతియై, సకలకల్యాణ గుణాకరుడైన సర్వేశ్వరుడు, సంసారి చేతనుల నుజ్జీవింపజేయుటకై వినిర్మల విజ్ఞానవిభూషితులగు దివ్యసూరుల (ఆళ్వారుల) నవతరింపజేసెను. వారలలో మొట్టమొదటి వారగు ముదలాళ్వారులు, వేఱువేఱుదివ్యదేశములో నవతరించి, భగవత్కల్యాణ గుణగణానుభవమే ధారకపోషక భోగ్యములుకాఁగా, దినదినప్రవర్ధమానులై, భగవన్నిత్యసన్నిధాన పరిపూతములగు దివ్యతిరుపతుల సేవించుచు, భూమండలమునంతటిని పరిభ్రమించుచుండిరి. అట్టితఱి సర్వేశ్వరుడు, వారలననుగ్రహింప సంకల్పించి, గాఢాంధకారబంధురమగు జడివానను గురిపించెను. ఆసమయమున తలదాచుకొనుటకై, వారు ముగ్గురును, తిరుక్కోవలూరను దివ్యదేశమున నొక వాకిటి తిన్నెపై చేరిరి. అచ్చటి స్థలము చాలపరిమితమైయున్నందున ఒకరినొకరు నొరుసుకొనుచు, ఎట్లో యొకవిధముగ, నిలబడియుండిరి.

ఈ అదనునెఱిగి, త్రివిక్రమస్వామి, తమ దివ్యమంగళమహావిగ్రహముతో వారల మధ్య ప్రవేశించి, మిక్కిలి సమ్మర్దమును కలుగజేసెను. ఆళ్వారులు ఈ మహాశ్చర్యమును, సర్వేశ్వరుని ఆసౌలభ్యమును గండ్లారగాంచి, సంభ్రమాశ్చర్యసమ్మోద పులకితగాత్రులై, మంగళాశాసన మొనరించిరి. అందు శ్రీ పొయ్‌గై యాళ్వారులు—భూమినే ప్రమిదెగను,

సముద్రనీరమునే నెయ్యిగనుచేసి, సూర్యుడను ప్రదీపమును వెలిగించిరి ; శ్రీ పూదత్తాళ్వారులు—ప్రేమమును శరావమున, ఔత్సుక్యమను నెయ్యిని పోసి, చిన్తయను వత్తినివేసి, జ్ఞానమను దీపమును వెలిగించిరి; శ్రీ పేయాళ్వారులు—పూర్వులు వెలిగించిన ప్రదీపములచే, అజ్ఞానాంధకారము పటాపంచలుకాగా, సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహమును సాక్షాత్కరించిరి. అటుపిమ్మట, మువ్వురును పరస్పర ప్రబోధితులై, తిరువన్దాది దివ్యప్రబంధముల నానతిచ్చిరి.

అందు శ్రీ పొయ్‌గైయాళ్వారులు, ప్రసిద్ధతమపుణ్యక్షేత్రమైన శ్రీమత్కాంచీ నగరమున "తిరువెహ్కా" అను దివ్యక్షేత్రమున దివ్యపుష్కరిణిలోని ఒక బంగారుతామరపుష్పమునుండి, ద్వాపరయుగమున 8, 62, 901 సంవత్సరమగు సిద్ధార్ధిసంవత్సరమున తులామాసమున శుక్లపక్షమున అష్టమీతిథియందు మంగళవారమున శ్రవణనక్షత్రమున, శ్రీపాంచజన్యాంశజులై ఆవిర్భవించి, తమ "ముదల్ తిరువన్దాది" అను దివ్యప్రబంధమూలమున జ్ఞానదీపమును ప్రజ్వలింపజేసి, అజ్ఞానాంధకారమును నిర్మూలించి, నిఖిలలోకములను సుజ్జీవింపజేసిరి.

వీరు తిరువేంగడముడైయాన్లకు ( శ్రీ వేంకటాచలపతికి ) మంగళాశాసనమును చేసియున్నారు. ఆ పాశురములిందు వ్యాఖ్యానింపబడుచున్నవి.

(26) అవ :— మనోవాక్కాయములను త్రికరణములచే భగవత్కైంకర్యమొనరించుట పరమపదముననే గద లభ్యమగును? ఈ లోకమునం దెట్లు సిద్ధించును ? అనిన పరమపదమునందలి నిత్యసూరులుగూడ సర్వేశ్వరుని "సౌలభ్య" మను కల్యాణగుణమును అనుభవించుటకునై తిరుమలకు వేంచేయుచున్నారు. కనుక, తిరుమలలోనే మోక్షసామ్రాజ్యము కరతలామలకమగునని ఆనతిచ్చుచున్నారు.

ఎழுవార్ విడైకొళ్వార్ ఈన్తుழாయానై,
పழுవా వాగై నినైన్దు వైగల్ తొழுవార్,
వినై చ్చుడరై నన్దువిక్కుమ్ వేజ్గడమే, వానోర్
మనచ్చుడరై తూణ్డుమ్ మలై.

టీక :— ఎழுవార్ = నిరవధికములగు ఐశ్వర్యములను అపేక్షించువారలును, విడైకొళ్వార్ = ఈశ్వరుని వదలి స్వాత్మానుభవమును జేయు కేవలులును, ఈన్ = సొగసైన, తుழాయానై = తిరుత్తుழாయ్ (తులసి) మాలలు గలవానిని, పழுవా వగై = పరమోపాయమని, నినైన్దు = అనుసంధించి, వైగల్ = ఎల్లప్పుడును, తొழுవార్ = ఆశ్రయించు భగవత్కాములును, వినై = (ఈముగ్గురి) పాపములనెడు, శుడరై = అగ్నిని, నన్దువిక్కుమ్ = నాశనముజేయు, వేంగడమే = తిరువేంగడమనెడు పర్వతమే, వానోర్ = నిత్యసూరులయొక్క, మనచ్చుడరై = తిరువుళ్ళమనెడు ప్రదీపమును, తూణ్డుమ్ = ఎగద్రోసెడు, మలై = పర్వతము.

తా॥ ఐశ్వర్యము గావలయునని, పైపై ప్రార్థించువారలును, "ఆత్మప్రాప్తియే చాలును, నీవువలదు" అని భగవంతుని సన్నిధిని విడిచి వెళ్ళువారలును, "నీనిని మేము విడువకుండ నుండవలయును" అని భావించి సర్వకాలములయందును సర్వవిధకైంకర్యములనుచేయు వారలును నగు, ఐశ్వర్య, కైవల్య, భగవత్ప్రాప్తికాములను ముగ్గుఅధికారుల యొక్క ఫలప్రాప్తికి ప్రతిబంధకములగు పాపముల నన్నిటిని నిశ్శేషముగ నాశమొనర్చు 'తిరువేంగడ' మను పర్వతశ్రేష్ఠమే, పరమపదమునందు దుర్లభమగు భగవంతుని 'సౌలభ్య' మను కల్యాణగుణమును అనుభవించుటకై నిత్యసూరులు విచ్చేసి, నిత్యవాసముజేయు తిరుమల (శ్రీశైలము) గా నలరారుచున్నది.

(37) అవ :— సర్వేశ్వరుఁడు, సకలమనుజనయన విషయుఁడై రామ కృష్ణాదిరూపములతో నవతరించినప్పుడు మనము పుట్టకపోయితిమే? ఏమి మన అభాగ్యము ? అయినను, పరమసులభుఁడై ఈ భూలోకమున "తిరువేంగడ" మను దివ్యపర్వతమున నీతడు వేంచేసియుండగా, మన కేమి కొదువ ? అని ఆనతిచ్చుచున్నారు.

వగై యఱు నుణ్ కేళ్వి వాయ్‌వార్‌గళ్ నాళుమ్,
పుగై విళక్కుమ్ పూమ్పునలుమ్ ఏన్ది— త్తిశై తిశై యిఱ్,
వేదియర్‌గళ్ శెన్ఱిఱై ఞ్జుమ్ వేఙ్గడమే, వెణ్ శఙ్గమ్,
ఊదియవాయ్ మాలుగన్ద ఊర్. 32

టీక :— వగైయఱుమ్ = ఉపాయాన్తరములను నిరసించునట్టి, నుణ్ = సూక్ష్మములైన అర్థములుగల, కేళ్వి = శ్రవణమును, వాయ్‌వార్‌గళ్ = పొందియున్నట్టి, వేదియర్‌గళ్ = వేదార్థముల నెఱింగినవారలు, నాళుమ్ = ప్రతిదినమును, పుగై = ధూపమును, విళక్కుమ్ = దీపమును, పూంపునలుమ్ = పుష్పములతో గూడిన తీర్థములను, ఏన్ది = ధరించి, తిశై తిశైయుమ్ = నలుదిక్కులనుండియు, శెన్ఱు = పోయి, ఇఱైఞ్జుమ్ = ఆశ్రయించెదు, వేంగడమ్ = శ్రీవేంకటాచలమే, వెణ్ = తెల్లని, శంఖమ్ = శ్రీపాంచజన్యమును, ఊదియ = పూరించిన, వాయ్ = దివ్యాధరముగల, మాల్ = స్వామియగు శ్రియఃపతి, (శ్రీకృష్ణుడు) ఉగన్ద = అభిమానించిన, ఊర్ = దివ్యదేశము.

తా॥ శ్రీపాంచజన్యమను శ్వేతశంఖమును పూరించి, వైరుల హృదయములభేదించి, సమాశ్రితులగాపాడిన శ్రీగీతాచార్యుడగు శ్రీకృష్ణస్వామియే, ఈ భూలోకమున శ్రీవేంకటాచలమునందు నిఖిలప్రాణులకును తన దివ్యదర్శనమును ప్రసాదించుటకై వేంచేసియున్నవాడు. పరమార్థముల ప్రసాదించు వేదముల నధికరించిన వైదికులెల్లరును, విషయజ్ఞులగుటచే నలుదిక్కులనుండియు, ధూప, దీప, పుష్ప, తీర్థాది పూజాద్రవ్యములగొని పురుషోత్తము నారాధించుటకై, ఈ తిరువేంగడము నాశ్రయించుచున్నారు.

(33) అవ :— పరమపదమునందలి సకలప్రాణులును మనకు నుద్దేశ్యులైనట్లు, తిరువేంగడమునయందు నిఖిలప్రాణులును మనకు పరమోద్దేశ్యులే—అని ఆనతిచ్చుచున్నారు.

ఊరుమ్ వరియరవమ్ ఒణ్కుఱవర్ మాల్యానై,
పేర వెఱిన్ద పెరుమణియై — క్కారుడైయ,
మిన్నెన్ఱు పుఱ్ఱడైయుమ్ వేఙ్గడమే, మేలశురర్,
ఎమ్మెన్ను మాల ఇడమ్. 35

టీక :— మాల్ = పెద్ద, యానై = ఏనుగులు, పేర = (ఒకకొండ పెకిలినడచు నట్లు) లేచిపోవుటకై ఒణ్ కుఱవర్ = విలక్షణులైన బోయవాండ్రు, ఎఱిన్ద = విసిరి వేసిన, పెరు = శ్లాఘ్యమైన, మణియై = మాణిక్యమును, ఊరుమ్ = సంచరించునట్టిదియు, వరి = రేఖలు గలిగిన, అరవమ్ = సర్పము, కారుడైయ = మేఘములతో గూడిన, మిన్నెన్ఱు = మెఱుపని (తలంచి), పుఱ్ఱు = పుట్టను, అడైయుమ్ = ప్రవేశించునట్టి, వేంగడమే = శ్రీవేంకటాచలమే, మేల=ఉత్తములైన, శురర్ = దేవతలు (నిత్యసూరులు), ఎమ్మెన్ను=మాదియని అభిమానించు, మాలదు ఇడమ్=శ్రియఃపతి నివసించు దివ్యదేశము.

తా॥ తిరుమలలో నెల్లప్పుడును సంచరించుటయే పరమోద్దేశ్యముగా దలంచియున్నట్టి, రేఖలతోగూడుకొనియున్న సర్పము — పరమ విలక్షణులైన బోయవాండ్రు, సంచరించు పర్వతములవలెనుండు పెద్ద ఏనుగులపై, విసరివైచిన మంచిమాణిక్యమును, (ఏనుగులు మేఘముల వలెనుండుటచేతను, దానిపై విసరివేయబడిన మాణిక్యముమెఱుపు వలె నుండుటచేతను) మెఱుపనితలంచి, ఇటుపై పిడుగుపడునని, పిడుగునకు భయపడి, తన పుట్టలోజేరుచున్నది. అందుచే, మిక్కిలి కన్నులపండువై, ఆశ్చర్యమునుగొలుపు తిరువేంగడము-మనకు చాలనుపాదేయమైయున్నది.

వి. వి :— (1) లోకమున మెఱుము మెఱిసిన వెంటనే పిడుగు పడుటవాడుక. (2) వీనినన్నిటిని ఇట్లు వర్ణించుటచే తిరుమలలో నుండు వస్తువులన్నియును పరమోపాదేయములై యున్నవని భావము. శ్రీకులశేఖరాళ్వారులు "ఊనేఱు శెల్వామ్" అను తిరుమొళిలో తిర్యగాది జన్మములను ఆశపడిరి గదా!

(3) ఏనుగులు, కొండశిలలు, తిరుగుచున్న పెద్దఅరణ్యములతోడను, సైకత స్థలములతోడను, శ్రీగుహప్పెరుమాళ్ళవంటి భగవద్భక్తులగు బోయవాండ్రతోడను, ఎల్లప్పుడును భగవద్గుణానుసంధానవ్యగ్రులగు బోయెతలతోడను గూడి, మహామహిమోపేతమై తిరువేంగడము విరాజిల్లుచున్నదనియు సూచింపబడుచున్నది.

(39) అవ :— ఆపత్సమయముల యందు దుష్టులనిరసించి సాధువుల గాపాడుటకై, భగవంతుడు అవతారములనెత్తు చుండును. అట్లుగాక, పరమప్రీతితో నెల్లప్పుడును నివసింపవలయునను ఆశతో వేం చేసియున్నది — తిరువేంగడముననే ; అని తిరుమలయొక్క వైభవము నభివర్ణించుచున్నారు.

ఇడన్దదు బూమి ఎడుత్తదు కున్ఱమ్,
కడన్దదు కఞ్జనై మున్ అఞ్జ — క్కిడన్దదువుమ్,
నీరోద మాకడలే నిన్ఱదువుమ్ వేఙ్గడమే,
పేరోద వణ్ణర్ పెరిదు. 39

టీక :— పేర్ ఓదమ్ వణ్ణర్ = పెద్దఅలలుగల సముద్రమువంటి వర్ణముతోగూడి కొనియున్న దివ్యమంగళవిగ్రహవిశిష్టుడగు సర్వేశ్వరుడు, ఇడన్దదు = పట్టువిడిపించినది. భూమి = భూమిని ; ఎడుత్తదు = ఎత్తినది, కున్ఱమ్ = పర్వతమును ; మున్ = మునుపు, అంజ = భయపడునట్లు, కడన్దదు = మథించినది, కంజనై = కంసుని ; కిడన్దదు = పవ్వళించియున్నది, నీర్, ఓదమ్, మా, కడల్ = అపారమైనజలముగలిగి, పెద్దఅలలతో నిండియున్న, గొప్ప, సముద్రము (న) ; పెరిదు = స్థిరముగ, నిన్ఱదు = నిలచియున్నది ; వేంగడమే = శ్రీవేంకటాచలము (న నే).

తా॥ ప్రళయాపత్సమయమున గలిగిన బాధలు తీఱుటకై భూమిని ఉద్ధరించిరి ; ఇంద్రునిచే గలిగిన బాధలు తీఱుటకై గోవర్ధనమునెత్తిరి ; కంసునిచే గలిగినబాధలు తీఱుటకై అతనిని మథించిరి ; నిఖిలలోకముల మొఱలువినుటకై క్షీరాబ్ధిలో శయనించిరి ; మనబోటివారలెల్లఱును, ఎల్లప్పుడును, తనివి తీర సేవించుటకై తిరువేంగడమున వేంచేసియున్నారు.

భూమి నుద్ధరించిన సౌందర్యమును సేవించుట—ప్రళయాపత్కాలముననే ; పర్వతమునెత్తిన సౌందర్యమును తిలకించుట—గోవర్ధనోద్ధరణ కాలముననే; జయమువలన గలిగిన సౌందర్యాతిశయమును సేవించుట— కంసుని వధించినప్పుడే; నిద్రాసౌందర్యమును సందర్శించుట—క్షీరార్ణవముననే ; స్థిరముగ నిలచియున్న సౌందర్యగరిమమును సేవింపగలుగుట — శ్రీ వేంకటాచలముననే సంప్రాప్తమగు నని భావము.

(40) అవ :— రాక్షసులకురాజైన హిరణ్యాసురుని సంహారించి లోకముల గాపాడిన శ్రీనృసింహస్వామి స్థిరముగ వేంచేంసియున్నది — తిరువేంగడముననే యని యభివర్ణించుచున్నారు.

పెరువిల్ పగళ్ళి కుఱవర్ కై చ్చెన్దీ
వెరువి ప్పునమ్ తుఱన్ద వేళ్లమ్ — ఇరువిశుమ్బిల్,
మీన్ వీళ్గ క్కణ్డు అఞ్జుమ్ వేఙ్గడమే, మేలశురర్,
కోన్ వీళ్గ క్కణ్డుగన్దాన్ కున్ఱు. ౪౦

టీక :— పెరువిల్ = పెద్దధనుస్సులను, పగళ్ళి = వాడియైనబాణములనుగల, కుఱవర్ = బోయవాండ్రయొక్క, కై = చేతులయందలి, శెంతీ = ఎఱ్ఱని అగ్నికి, వెరువి = భయపడి, పునమ్ = పొలములను, తుఱన్ద = విడిచిన, వేళ్లమ్ = ఏనుగులు, ఇరువిశుమ్బిల్ = విశాలమైన ఆకాశమునుండి, మీన్ = నక్షత్రము, వీళ్గ = పడగా, కణ్డు = చూచి, అంజుమ్ = భయపడునట్టి, వేంగడమే = శ్రీవేంకటాచలమే, మేల్ = పూర్వము, అశురర్ కోన్ = రాక్షసులకురాజైన హిరణ్యాసురుడు, వీళ్గ = నశింపగా, కణ్డు = చూచి, ఉగన్దార్ = సంతోషించిన శ్రీనృసింహస్వామి వేంచేసియుండు, కున్ఱు = పర్వతము.

తా॥ పెద్దధనుస్సులను వాడియైన బాణములను ధరించి వేటకు బయలుదేరిన బోయవాండ్రచేతులయందు వెలుగుచున్న ఎఱ్ఱనిదివిటీలను జూచి, పొలములనువదలి పరుగెత్తుచున్న ఏనుగులు, ఆకాశమునుండి నక్షత్రములు పడగా, వానిని చూచి బెదురుచున్నవి. ఇట్లు, చూచుటకు కనులపండువై యుండు శ్రీవేంకటాచలమే — లోకములబాధించుచు రాక్షసులకు రాజై యుండిన హిరణ్యాసురుని సంహరించి, లోకములు సంతోషింపగా, తాను సంతోషించు సర్వేశ్వరుని నిత్యనివాసమగు—దివ్య పర్వతము.

(68) అవ :— క్రింది పాశురమున విశుద్ధమగు జ్ఞానమునకు సర్వేశ్వరుడు విషయమగునని అభివర్ణించిరి; ఈ పాశురమున "వాని స్వరూప రూప దివ్యకల్యాణగుణములు తెలిసికొనుటకు శక్యములుగావు" అని ఆనతిచ్చుచున్నారు.

ఉణర్ వారార్ ఉన్ పెరుమై? ఊళిదోఱూళి
ఉణర్ వారార్ ఉన్నురువ న్దన్నై? — ఉణర్ వారార్?,
విణ్ణగత్తాయ్! మణ్ణగత్తాయ్! వేఙ్గడత్తాయ్!, నాల్వేద
ప్పణ్ణగత్తాయ్! నీ కిడన్ద పాల్. ౬౮

టీక :— విణ్ అగత్తాయ్ = నిత్యవిభూతియగు పరమపదమును నివాసస్థానముగా గలవాడా! మణ్ = భూలోకమైన ఈ లీలావిభూతిని గూడ, అగత్తాయ్ = వాసస్థానముగా గలవాడా! వేంగడత్తాయ్ = "తిరువేంగడ" మను దివ్యపర్వతమున వేంచేసియున్నవాడా! పణ్ = స్వరప్రధానమైన, నాల్ వేదమ్ = నాలుగు వేదములను, అగత్తాయ్ = వాసస్థానముగా గలవాడా! (నిఖిలవేదములచేతను ప్రతిపాదింపబడువాడా!) ఉన్ = దేవరవారియొక్క, పెరుమై = గొప్పతనమును, ఊళిదోఱూళి = నిఖిలకాలములయందును, ఉణర్వార్ = తెలిసికొనజాలిన వారలు, ఆర్ = ఎవరు? ఉన్ = దేవరవారియొక్క, ఉరువన్దన్నై = స్వరూపమును, ఉణర్వార్ = తెలిసికొనజాలినవారలు, ఆర్ = ఎవరు? నీ కిడన్ద = దేవరవారుపవ్వళించియున్న, పాల్ = క్షీరసముద్రమును, ఉణర్వార్ = తెలిసికొనజాలినవారలు, ఆర్ = ఎవరు? (ఎవరును లేరని భావము)

తా॥ నిత్యవిభూతియందును, లీలావిభూతియందును, రెండింటిని ఉద్ధరించుటకై దివ్యమైన తిరుమలయందును వేంచేసియుండు, దివ్యకల్యాణగుణచేష్టితుడవగు నో స్వామీ! నిఖిలవేదప్రతిపాద్యులగు దేవరవారి తిరుకల్యాణగుణముల వైభవములను, స్వరూపచేష్టితాదుల పరమార్థమును, దేవరవారు యోగనిద్రజెందుచుండు క్షీరసముద్రముయొక్క మహిమమును, ఈ భూతభవిష్యద్వర్తమాన కాలములలో, తెలిసికొనగలవారలెవ్వరు? ఎవ్వరును లేరు. నీ స్వరూపగుణచేష్టితములు దురూహములు.

వి. వి :— (1) కాలతత్త్వమున్నంతవఱకును ప్రయత్నించినను భగవంతుని స్వరూపరూపగుణములు దురవగాహములు.

(2) స్వరప్రధానములై, పరమార్థముల ప్రబోధించు వేదశాస్త్రములకు ప్రవర్తకుఁడు సర్వేశ్వరుఁడు - అని అభిప్రాయము.

(76) అవ :— సర్వేశ్వరుని తోడి సంబంధముగల తిరువేంగడమే, సకల సౌభాగ్యములను కరతలామలక మొనరించుననిన, వానిని సేవించువార లుజ్జీవింతు రని వేరె చెప్పవలయునా? అని ఆనతిచ్చుచున్నారు.

వழినిన్ఱు నిన్నైత్తొழువార్ వழువా,
మొழినిన్ఱ మూర్త్తియరే యావర్—పழుదొన్ఱుమ్,
వారాద వణ్ణమే విణ్కొడుక్కుమ్, మణ్ణళన్ద,
శీరాన్ తిరువేఙ్గడమ్. ౭౬

టీక :— వழి = (భక్తి) మార్గమునందు, నిన్ఱు = నిలిచి, నిన్నై = దేవరవారిని, తొழువార్ = ఆశ్రయించువారు, వழువా = నాశములేని, మొழి = వేదవాక్యములందు, నిన్ఱ = ప్రతిపాదింపబడిన, మూర్త్తియర్ = స్వరూపముగలవారుగా, ఆవర్ = అగుదురు, మణ్ = భూమిని, అళన్ద = కొలిచి (ఆక్రమించి)న, శీరార్ = కల్యాణగుణగణములను గలవాఁడా! తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలము, పழుదు ఒన్ఱుమ్ = ఏ కొంతయును, వారాదవణ్ణమ్ = రాకుండునటుల, విణ్ = పరమపదమును, కొడుక్కుమ్ = ఇచ్చును.

తా॥ తైలధారవలె విచ్ఛేదములేని స్మృతిసంతతిరూపమగు 'ధ్యాన' 'నిధిధ్యాసనా' దిపదములచే వ్యవహరింపబడు భగవద్విషయకమగు భక్తిమార్గమున అత్యన్తప్రవణులై యుండు పరమభక్తాగ్రేసరులు, యథాభూతవాదియగు వేదమునఁ జెప్పబడినటుల, పరంజ్యోతిస్స్వరూపుడగు పరమపదనాథుని దివ్యసన్నిధిని బొంది, మోక్షసామ్రాజ్యసుఖముల ననుభవింతురు. కాని, ఆ భక్తిమార్గము విశిష్టాధికారులకు దప్ప, ఇతరులకు సాధ్యముకాదు. ఇక, పరావరవిభాగములేక నిఖిలప్రాణులను ఉజ్జీవింపజేయుటకై, తన శ్రీపాదములను అందఱి తలలపైనను ఉంచి, ఉద్ధరించిన

పరమోదారస్వభావుడగు శ్రీత్రివిక్రమావతారుడు, పరమకృపతో విజయముచేసియున్నట్టి, తిరువేంగడమను పర్వతము, తన నాశ్రయించిన మాత్రముననే, ఒక కొఱంతయును రానీయక, ఎల్లతిక్కిని పరమపదమును కరతలామలక మొనరించును. ఈ పర్వతమునకును సర్వేశ్వరుని స్వభావము గలదని పరమతాత్పర్యము.

వి. వి :— (1) పళుదు ఎ·మొழி (నాశనములేనివాక్యము) — వేదము ; అందు ప్రతిపాదింపబడుమూర్తియనగా - స్వరూపావిర్భావము. " పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే " అని శ్రుతి. "తమ్మైయే నాళుం వణఙ్గిత్తొழுవార్కు — తమ్మైయే యొక్క — అరుళ్ శెయ్‌వార్ " అను పాశురముచే ఈ యర్థమును ఆళ్వార్లు ఆనతిచ్చియున్నారు.

(2) " తిరువేంగడమామలై, ఒన్ఱుమే తొழ నమ్‌వినై ఓయుమే " అను నమ్మాళ్వారుల పాశురము, ఇచ్చట అనుసంధింపదగినది.

(3) ఈ పాశురమును శ్రీ ఎమ్బార్లు ప్రతినిత్యము ప్రాతఃకాలమున అనుసంధించుచుండిరట.

(77) అవ :— సర్వేశ్వరుడు పరమప్రీతిమీఱ వేంచేసియున్నట్టి దివ్యదేశములు విరాజిల్లుచుండగా, సంసారము సంభవించునా ? అని ఆనతిచ్చుచున్నారు.

వేఙ్గడముమ్ విణ్ణగరుమ్ వెஃకావుమ్ అஃకాద
పూఙ్గిడఙ్గిల్ నీళ్ కోవల్ పొన్నగరుమ్ - నాన్గిడత్తుమ్,
నిన్ఱాన్ ఇరున్దాన్ కిడన్దాన్ నడన్దానే,
ఎన్ఱాల్ కెడుమామ్ ఇడర్. 22

టీక :— వేఙ్గడముమ్ = శ్రీ వేంకటాద్రియు, విణ్ణగరుమ్ = పరమపదమును, వెஃకావుమ్ = శ్రీ కాంచీపురమునందలి యథోక్తకారి సన్నిధియును, అஃకాద = లోటులేని, పూ = పుష్పములుగల, కిడఙ్గిల్ = అగడ్తలచె చుట్టబడియుండు, నీళ్ = విలక్షణమైన, కోవల్ = తిరుక్కోవలూరు అనెడు, పొన్నకరుమ్ = శ్లాఘ్యమగు పట్టణమును, (అనెడు) నాన్గిడత్తుమ్ = ఈ నాలుగు దివ్యదేశముల యందును, (వరుసగ) నిన్ఱాన్ = నిలచియున్నాడు, ఇరున్దాన్ = కూర్చుండియున్నాడు,

కిడన్దాన్ = పవ్వళించియున్నాడు, నడన్దాన్ = సంచరించుట కుద్యుక్తుడై వేంచేసియున్నాడు, (అని) ఎన్ఱాల్ = అనుసంధించినయెడల, ఇడర్ = దుఃఖములన్నియును, కెడుమామ్ = ఉపశమించును.

తా॥ నిఖిలలోకములందలి ప్రాణులనందఱిని సంరక్షించుటకై, పరమకృపాకరుడగు శ్రీమన్నారాయణుడు, శ్రీవేంకటాచలమున — నిన్ఱ తిరుక్కోలము (నిలచియుండు విగ్రహము) తోడను, పరమపదమున — శీవిగ నమరి కూర్చునియుండు దివ్యమంగళవిగ్రహముతోడను, శ్రీకాంచీపురమునందలి శ్రీయథోక్తకారి సన్నిధియందు — పవ్వళించియుండు దివ్యమంగళవిగ్రహముతోడను, పరమమనోజ్ఞములగు పుష్పములతో విరాజిల్లుచున్నదై, అగడ్తలతో జుట్టబడి రమణీయతమంబై యుండు, శ్రీతిరుక్కోవళూరు నగరమున — నడచుట కుద్యుక్తమగు తిరుమేనితోడను, వేంచేసియున్నాడు. అచ్చటికి వెళ్ళి, సేవించు భాగ్యములేకున్నను, ఇట్లు అనుసంధించినంత మాత్రముననే, నిఖిలప్రాణులకును, దుఃఖములన్నియును తొలగిపోవును.

వి॥ వి:— (1) విణ్ణగరమ్ - నూటయెనిమిది దివ్యతిరుపతులలో పరమపదము గూడ చేరినదగుటచే "పరమపదమే" కావచ్చును. లేక, కాంచీపురమునందు "పరమేశ్వర విణ్ణగరము" కావచ్చును. ఉప్పిలిప్పన్ సన్నిధియందు కూర్చొనియుండు తిరుమేని లేనందున, అది మాత్రముకాదు.

(౭౭) అవ :— పరమభోగ్యమగు ఈ వెంకటాచలమే, శ్రీసీతాదేవి కోర్కెదీర్చుటకై, మునుపు మారీచుడను మాయమృగమును సంహరించిన శ్రీరామచంద్రమూర్తి వేంచేసియుండు దివ్యక్షేత్రము — అని సాధించుచున్నారు.

పడైయారుమ్ వాట్కణ్ణార్ పారశినాళ్, పైమ్బూమ్
తొడైయలోడు ఏన్దియ తూబమ్—ఇడైయిడైయిల్
మీన్మాయ మాశూణుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్,
మాన్మాయ వెయ్దాన్ వరై. ౭౭

టీక :— పడై = ఈ పేరుగల అయుధముతో, అరుమ్ = సమానమైన, వాళ్ = కాంతిగల, కణ్ణార్ = నేత్రములుగల యువతులు, పారశినాళ్ = ద్వాదశినాడు, పైపూ తొడైయలోడు = మనోజ్ఞములైన పుష్పహారములతో గూడ, ఏన్దియ = ధరించి యున్న, దూపమ్ = ధూపము, ఇడైయిడైయిల్ = మధ్యమధ్యను, మీన్ = నక్షత్ర ములతో గూడిన ఆకాశము, మాయ = కనబడనటుల, మాశూణుమ్ = నల్లగా చేయు చున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే, మేల్ ఒరునాళ్ = మునువు ఒకదివసమున, మాన్ = మారీచుడను మాయజింకను, మాయ = మడయునట్లు, ఎయ్‌దాన్ = అంబును ప్రయోగించిన శ్రీరామచంద్రమూర్తి వేంచేసియుండు, వరై = పర్వతము.

తా॥ ద్వాదశి దినమున, విశేషముగ, తిరువారాధనము సమర్పించుటకై, సుతీక్ష్ణములగు నేత్రోత్పలములతో మిరుమిట్లుగొలుపు యువతీ జనము, చిత్రవిచిత్రములుగాఁ గట్టిన రమణీయతమములగు మాలలతోఁ గూడ, తీనికొనివచ్చియున్న దివ్యధూపములు, నక్షత్రములతో గూడిన ఆకాశమునుగూడ, కనబడనటుల నల్లగ ఎచ్చట చేయుచున్నవో, అట్టి శ్రీవేంకటాచలమే, మున్నొక రోజు మాయామృగమై వచ్చియున్న మారీచుని, ఒక్క బాణప్రయోగముచే సంహరించిన శ్రీచక్రవర్తి త్తిరుమగనారులు (శ్రీరామచంద్రమూర్తి) వేంచేసియుండు దివ్యదేశము. ఆ చక్రవర్తి త్తిరుమగనారులే తిరువేంగడముడైయానులై, ఈ కలియుగమున వేంచేసి యున్నారని భావము.

వి. వి :— ఒక వనితయొక్క ప్రీతినిసంపాదించుటకై మాయామృగమును వెంబడించి చనిన, పరమకరుణానిధియగు శ్రీరామచంద్రమూర్తి నిత్యవాసము చేయు పర్వతమగుటచే, స్త్రీలును సులభముగ ఆశ్రయింపదగియున్నది— ఈ వేంకటాచలము— అని వ్యంగ్యము.

(99) అవ :— ధ్యాననిమగ్నులగు పరమర్షుల హృదయకమలమున వాసముచేయువాడును, క్షీరసముద్రమున తిరువనన్తాళ్వానులపై పవ్వళించియుండువాడును, శ్రీ వేంకటాచలమున విజయముచేసియున్న శ్రియఃపతియును, ఒకఁడే యని అధ్యవసింపుము; అని తమ మనస్సును ప్రబోధించుచున్నారు.

ఉళ్ళకణ్డాయ్ నన్నెఞ్జే ఉత్తమ నెన్రుమ్,
ఉళ్ళకణ్డాయ్ ఉళ్ళువా రుళ్ళత్తు — ఉళ్ళకణ్డాయ్,
వెళ్ళత్తి నుళ్ళానుమ్ వేఙ్గడత్తు మేయానుమ్,
ఉళ్ళత్తి నుళ్ళానెన్రు ఓర్. ౯౯

టీక :— నల్ నెంజే = మంచిమనస్సా, ఉత్తమన్ = పురుషోత్తముడు, ఉళన్ కణ్డాయ్ = మన సత్తను నిలుపుటకై వేంచేసియున్నాడు గదా ! ఎన్రుమ్ = ఎల్లప్పుడును, ఉళన్ కణ్డాయ్ = మానసంరక్షణమున జాగరూకుడైయున్నాడు గద ! ఉళ్ళువార్ = ధ్యానించు పరమయోగులయొక్క, ఉళ్ళత్తు = మనస్సులయందు, ఉళన్ కణ్డాయ్ = వాసము చేయువాడు గద ! వెళ్ళత్తిల్ = క్షీరసముద్రమున, ఉళ్ళానుమ్ = యోగనిద్రజెందువాడును, వేంగడత్తు మేయానుమ్ = శ్రీ వేంకటాచలనివాసియును, ఉళ్ళత్తిల్ = హృదయమునందు, ఉళ్ళాన్ = నిత్యవాసము జేయువాడు, ఎన్రు = అని, ఓర్ = అధ్యవసింపుము.

తా॥ "ఎంబెరుమానులు (సర్వేశ్వరుడు) మనకు స్వామియై, విరాజిల్లుచున్నారు" అని అధ్యవసించుటకు అనుకూలమై యుండు నాదు మంచిమనస్సా ! లేని సర్వేశ్వరుని ఉన్నాడని చెప్పుటకాదు. అతని సత్తయే మనసంరక్షణమునకు హేతువై యున్నది. మతిభ్రమగలిగి, కంఠమున ఉరిత్రాటిని తగిలించుకొందు మేని, ఆత్రాటిని గోసి, మనలను సంరక్షించువాడు అతడే సుమా ! అతడు పరసమృద్ధ్యేక ప్రయోజనుడు. తాను ప్రవేశింప సంసిద్ధుడై యున్నప్పుడు, నిషేధింపని పరమభాగవతోత్తముల హృదయములను విడచి వెళ్ళజాలడు. క్షీరసముద్రమున వేంచేసియుండుటయు, శ్రీ వేంకటాచలమున నధివసించియుండుటయును, మనహృదయములలో బ్రవేశించుట కనువగు అవసరమును ప్రతీక్షించుటకే — అని గుర్తెఱుంగము.

వి. వి :— మనస్సును ఒక స్వతన్త్రద్రవ్యముగను, దానికొక హృదయమున్నట్లును, చమత్కరించి వర్ణించుచున్నారు.

శ్రీ పేయాழ్వార్ల తిరువడిగళ్ళే శరణము.

శ్రీరస్తు

శ్రీమతే వేంకటేశాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ పూదత్తాళ్వార్లు ప్రసాదించిన రెండవ తిరువన్దాదిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

శ్రీ పూదత్తాళ్వారులు, తొండమండలమున మహాబలిపురమున మల్లెపొదరింటిలో నీలోత్పలమున, ద్వాపరయుగమున 8,62,901. వ దగు సిద్ధార్థిసంవత్సరమున, తులామాసమున, శుక్లపక్షమున, నవమీతిథిని, బుధవారమున, ధనిష్ఠానక్షత్రమున, శ్రీగదాంశజులై అవతరించిరి. వీరు, తమ రెండవ తిరువన్దాదియను దివ్యప్రబంధమున తిరువేంగడముడై యాన్లను మంగళాశాసనము చేసిరి. ఆ పాశురములు ఇందు వ్యాఖ్యానింపబడుచున్నవి.

క్రింది తిరువన్దాదిలో, పొయ్గైయాళ్వార్లు, ఉభయ విభూతి యుక్తుడగు శ్రీమన్నారాయణుడు జగములకు శేషి — అని నిర్ణయించిరి. ఈ 2-వ తిరువన్దాదిలో పూదత్తాళ్వార్లు, ఆ ఉభయ విభూతులను తను భక్తి ప్రకర్షముచే ననుసంధించి, పరవశులై, దివ్యప్రబంధమును గానము చేయుచున్నారు. పొయ్గైయాళ్వారులకు భక్తిలేదా ? అనినచో, ఉన్నది ; కారణకార్యరూపమగు అవస్థాభేదమే విశేషము. ఉభయ విభూతులను అనుసంధించుటచే గలిగిన పరజ్ఞానమువారిది ; వీరిది పరిపక్వమైన పరభక్తిరూపాపన్నమైన పరజ్ఞానము.

(25) అవ :— జగదుత్పత్తికి సర్వేశ్వరుడు కారణమగుట మాత్రమే కాదు, ఉత్పన్నములైన పదార్థములకు గలుగు ప్రతిబంధకములను పోగొట్టువాడును, తిరువేంగడమున వేంచేసియున్నవాడును—ఆ పరాత్పరుడే—అని చెప్పుచున్నారు.

శెన్ఱదు ఇలజ్గైమేల్ శెవ్వేతన్ శీఱ్ఱత్తాల్,
కొన్ఱదు ఇరావణనై కూఱ్ఱుజ్గాల్, — నిన్ఱదువుమ్
వేయోజ్గు తణ్ శారల్ వేజ్గడమే, విణ్ణవర్ దమ్
వాయోజ్గు తొల్ పుగళ్లాన్ వన్దు. —౨౪

టీక :— విణ్ణవర్ దమ్ = నిత్యసూరులయొక్క, వాయ్ = ముఖాంబుజములచే, ఓజ్గు=స్తోత్రము చేయబడిన, తొల్ = అనాదియైన, పుకళ్లాన్ = కీర్తిగల సర్వేశ్వరుడు, వన్దు = అవతరించి, శెవ్వే = నేరుగ, శెన్ఱదు = నడచివెళ్ళినది, ఇలజ్గైమేల్ = లంకా నగరము మీద, తన్=తనయొక్క, శీఱ్ఱత్తాల్=కోపము చేత, కొన్ఱదు = సంహరించినది, ఇరావణనై = రావణుని, కూఱుజ్గాల్ = (నిజము) చెప్పిన చో, నిన్ఱదువుమ్ = నిలచియున్నది, వేయ్ఓజ్గు = వెదురుచెట్లు పెరిగి పెద్దవై యుండుటచే, తణ్ శారల్ = చల్లగనుండెడు చరియలుగల, వేంగడమే = శ్రీ వేంకటాద్రియందే

తా॥ పరమపదమున నిత్యసూరులచే నెల్లప్పుడును స్తుతింపబడుచు, సేవింపబడుచుండు ఆపరవాసుదేవుడే — త్రేతాయుగమున శ్రీరామచంద్ర మూర్తిగ నవతరించి, సాధుజనుల రక్షించుటకై, లోకకంటకుడగు రావణుని సంహరించెను. ఆ పరాత్పరుడే ఈ కలియుగమున నిఖిలప్రాణుల సంరక్షించుటకై, మిక్కిలి ఎత్తైన వెదురుపొదలు గలిగి చల్లనై యుండు జరియలతో గూడి పరమభోగ్యమగు, శ్రీ వేంకటాచలమున విజయము చేసియున్నాడు.

(28) అవ :— భగవంతుడు నిత్యవాసముచేయు పరమపదమునకు వెళ్ళవలయునని నేను కుతూహలపడగ, ఆ సర్వేశ్వరుడు, నా మనస్సునందే నిత్యవాసముచేయవలయునని ఆశపడి, వచ్చియున్నాడు—అని ఆనతిచ్చుచున్నారు.

మనత్తుళ్ళాన్ వేజ్గడత్తాన్ మాకడలాన్, మత్తుమ్
నినైప్పరియ నీళరజ్గత్తుళ్ళాన్, — ఎనైప్పలరుమ్
తేవాది దేవ నెనప్పడువాన్, మున్నొరునాళ్
మావాయ్ పిళన్ద మగన్. ౨౫

టీక :— ఎన్నైప్పలరుమ్ = పూజ్యులగు పెద్దలందరిచేతను. దేవాదిదేవన్ = నిత్యసూరులకు అధిపతి, ఎనప్పడువాన్ = అని కీర్తింపబడువాడును, మాకడలాల్ = అతివిశాలమైన క్షీరాబ్ధిలో శేషశాయియైయుండువాడును, మున్నొరునాళ్ = మునుపు ఒకప్పుడు, మా = గుఱ్ఱపురూపమును ధరించివచ్చిన కేశియను రాక్షసునియొక్క, వాయ్ = నోటిని, పిళన్ద = చీల్చివైచిన, మగన్ = పసిబాలుడైన శ్రీకృష్ణుడును, మఱ్ఱుమ్ = మరియు, నిన్నైప్పు అరియ = పరిచ్ఛేదింప శక్యముకాని, నీళ్ = వైశాల్యము గలిగిన, అరజ్గత్తు = శ్రీరంగమునందు, ఉళ్ళాన్ = వేంచేసియున్నవాడును, వేంగడత్తాన్ = శ్రీ వేంకటాద్రియందు విజయముచేసియుండు వాడునునగు సర్వేశ్వరుడు, మనత్తు = నా హృదయమునందు, ఉళ్ళాన్ = నిత్యవాసము చేయుచున్నాడు.

తా॥ శ్రియఃపతియై, నిత్యముక్తానుభావ్యుడై, శ్రీవైకుంఠమున వేంచేసియుండు పరవాసుదేవుడే, క్షీరాబ్ధియందు నాగపర్యంకమున పవ్వళించి, యోగనిద్రననుభవించుచుండు వ్యూహస్వరూపుడై యున్నాడు. ఆతడే, ద్వాపరయుగమున బాలకృష్ణుడై అవతరించి, గుఱ్ఱపురూపమును ధరించి లోకులబాధించు కేశియను దుష్టరాక్షసుని సంహరించెను. ఆతడే, సప్తప్రాకారపరివృతమై, పరమవిలక్షణమైయుండు శ్రీరంగమను దివ్య క్షేత్రమున శ్రీరంగనాథుడై వేంచేసియున్నాడు. ఆతడే, ఈ కలియుగమున నెల్లప్రాణులకును, తన సందర్శనాదులనిచ్చి, రక్షించుటకై శ్రీ వేంకటాచలమున నెలకొనియున్నాడు. ఆతడే, నేనతని నిత్యనివాసమగు పరమ పదమునకు వెళ్ళవలయునని కుతూహలపడుచుండగ, నా మనస్సున నిత్య వాసము చేయుచున్నాడు.

(33) అవః— నామనోవాక్కాయములు, తిరువేంగడముడైయానుల విషయమున ప్రవణములై యుండుట మాత్రమేగాక, విషయాంతరములను పరిత్యజించియున్నవి — అని అభివర్ణించుచున్నారు.

తుణిన్దదు శిన్దై తుழாయలజ్గల్, అజ్గమ్
అణిన్దవన్ పేర్ ఉళ్ళత్తుప్పల్ గాల్, — పణిన్దదువుమ్
వేయ్‌పిఱజ్గు శారల్ విఱల్ వేజ్గడవనైయే,
వాయ్‌తిఱజ్గళ్ శొల్లుమ్ వగై. 33

టీక :— శిన్దై=మనస్సు, తుழாయలంగల్=తిరుత్తుழாయ్ (తుళసి) మాలలను, అజ్గమ్=తనదివ్యమంగళవిగ్రహమున, అణిన్దవన్=అలంకరించుకొనియున్న సర్వేశ్వరుని యొక్క, పేర్=తిరునామములను, ఉళ్ళత్తు=ధ్యానింప, తుణిన్దదు=తెగించినది; అజ్గమ్=శరీరము, పల్కాల్=పలుమారు, పణిన్దదువుమ్=ఆశ్రయించినదియు, వేయ్=వెదుళ్ళచేత, పిఱజ్గు=నిండియున్న, శారల్=చరియలుగల, విఱల్=మహోన్నతమగు, వేంగడవనై యే=శ్రీ వేంకటాచలమునకు అధిపతియైనవానినే; వాయ్=నోరు, తిఱజ్గళ్=వానికల్యాణగుణములను, శొల్లుమ్వగై=అనుసంధించుక్రమమున, తుణిన్దదు=సాహసించినది.

తా॥ దట్టములగు వెదురుపొదలతో నిండియుండి, కనులపండువగు శ్రీవేంకటాచలమునకు అధినాథుడై, దివ్యతులసీదామములచే నలంకృతమగు దివ్యవక్షస్థలముతో విరాజిల్లు సర్వేశ్వరుని తిరునామములను సదా సర్వకాలము ధ్యానింప నామనస్సు తెగించినది. వాక్కు, వాని స్వరూప స్వభావములను కీర్తించుటకు తెగించినది. శరీరము, పలుమారులు వానిని నమస్కరించుటకు సాహసించుచున్నది.

(45) అవ :— నిత్యసూరులకును స్పృహణీయములైన సర్వేశ్వరుని తిరువడిగళ్ళలో ఆసక్తిగలిగియుండువారు ఇతరములగు లాభాలాభములను లక్ష్యపెట్టరు.

ఉళదెన్ఱు ఇఱుమావార్ ఉణ్డిల్లై యెన్ఱు,
తళర్ద లదనరుగు మ్శారార్, — అళవరియ
వేదత్తాన్ వేజ్గడత్తాన్ విణ్ణోర్ ముడితోయుమ్,
పాదత్తాన్ పాదమ్ పయిన్ఱు. ౮౫

టీక :— అళవరియ=అసంఖ్యాకములైన, వేదత్తాన్=వేదములచే ప్రతిపాదింపబడువాడును, వేజ్గడత్తాన్=శ్రీవేంకటాచలము నివాసముగ గలవాడును, విణ్ణోర్=నిత్యసూర్యులయొక్క, ముడి=శిరస్సులను, తోయుమ్=ఒరుచుకొనుచున్న (స్పృశించుచున్న), పాదత్తాన్=శ్రీపాదములుగల సర్వేశ్వరునియొక్క, పాదమ్=పాదారవిందములను, పయిన్ఱు=ఆశ్రయించి, ఉళదు ఎన్ఱు=ధనధాన్యములున్నవని, ఇఱుమావార్=గర్వపడరు; ఉణ్డు=ముందొక కాలమందుండెను; ఇల్లై=ఇప్పుడు లేదు; ఎన్ఱు=అనితలంచి, తళర్దల్=శోకించుటయును, అదనరుగుమ్=దానిసమీపమునందును శారార్=సమీపించరు.

తా॥ అనంతవేదప్రతిపాద్యుడైన తిరువేంగడముడైయానుల యొక్క, నిత్యసూరులును తమ తలలపై ధరించుచున్న, శ్రీపాదములను ఆశ్రయించినవారు భోగభాగ్యములచే గర్వింపరు. ఇది ఉన్నది, అది లేదు—అని కొరవపడరు. వారికి విచారగంధమే ఉండదు.

(46) అవ :— చేతనులను స్వాధీనముచేసికొనుటకొరకే సర్వేశ్వరుడు దివ్యదేశములయందు వేంచేసియున్నాడు—అని సెలవిచ్చుచున్నారు.

పయిన్ఱదు అరఙ్గమ్ తిరుక్కోట్టి, పన్నాళ్
పయిన్ఱదువుమ్ వేఙ్గడమే పన్నాళ్, — పయిన్ఱదు
అణితిగழుమ్ శోలై అణినీర్ మలైయే,
మణితిగழுమ్ వణ్ తడక్కై మాల్. ౪౬

టీ :— మణితిగழుమ్ = ఇన్ద్రనీలమణులవలె ప్రకాశించెడు తిరుమేనిని, వణ్ తడమ్ కై = ఔదార్యమును సూచించు విశాలమైన శ్రీహస్తములనుగల, మాల్ = సర్వేశ్వరుడు, పయిన్ఱదు = పవ్వళించియున్నది, అరఙ్గమ్ = శ్రీరంగమునను, తిరుక్కోట్టి = తిరుక్కోట్టియూరునను; పల్ నాళ్ = చిరకాలముగ, పయిన్ఱదువుమ్ = నివసించుచున్నది, వేంగడమే = తిరుమలయందును, పల్ నాళ్ = చాలకాలముగ, పయిన్ఱదు = వేంచేసియున్నది, అణితిగழుమ్ = సౌందర్యముచే శోభిల్లునట్టి, శోలై = తోపులుగల, అణి = రమణీయమైన, నీర్మలైయే = తిరునీర్మలయందే.

తా॥ ఇంద్రనీలములవలె ప్రకాశించు దివ్యమంగళవిగ్రహమును, ఔదార్యసూచకమగు విశాలములైన శ్రీహస్తములను గలిగియుండు శ్రీసర్వేశ్వరుడు—శ్రీరంగమునను, తిరుక్కోట్టియూరునందును చిరకాలముగ పవ్వళించియున్నాడు; తిరువేంగడమున అనాదికాలమునుండియు నిలచియున్నాడు; సుందరతములగు పూందోటలతో కన్నులపండువయై యుండు తిరునీర్మలయందు బహుకాలముగ వేంచేసియున్నాడు.

(53) అవ :— లతలతోను, వృక్షములతోను నిండియుండి, పుణ్యతీర్థములతో నొప్పారు శ్రీవేంకటాచలమునే, నే నెల్లప్పుడును ఆశపడుచున్నాను.

నెఱియార్ కుழల్కఱ్ఱై మున్నిన్ఱు పిన్ తాழ్న్దు,
అఱియా దిళఙ్గిరియెన్ఱెణ్ణి, — ప్పిరియాదు
పూఙ్గొడిక్కళ్ వైగుమ్ పొరుపున ల్కున్ఱెన్నుమ్,
వేఙ్గడమే యామ్విరుమ్బుమ్ వెఱ్పు. ౫౩

టీక :— నెఱియార్ = చలింపక తపస్సుచేయు మహాతాపసులయొక్క, మునిన్ఱు = ముందటిభాగమునుండి, పిన్ తాழ్న్దు = వెనుకకు వ్రేలాడుచున్న, కుழల్ కఱ్ఱై = జడలను, అఱియాదు = తెలిసికొనలేక, ఇళఙ్ గిరిఎన్ఱు = చిన్న పర్వతమని, ఎణ్ణి = తలంచి, పిరియాదు = ఎడబాయకుండు పూ = పుష్పవ లతో నిండిన, కొడిక్కళ్ = తీగలు, వైగుమ్ = అల్లుకొనియున్నట్టిదియు, పొరు = అలలుకొట్టుచున్న, పునల్ = పుణ్యతీర్థములుగల, కున్ఱెన్నుమ్ = పర్వతమనెడి, శ్రీ వేంకటాద్రియే, యామ్ = మేము, విరుమ్బుమ్ = ఆశపడునట్టి, వెఱ్పు = పర్వతము.

తా॥ ఎండకుగాని, వానకుగాని, చలికిగాని చలింపక, తీవ్రతపో నిమగ్నులగు మహాతాపసులయొక్క, ఫాలతలము (ముందటిభాగము) నుండి వెనుకకు వ్రేలగట్టబడియుండు పెద్దజటాజూటములను చూచి, చిన్న పర్వతములేమో యని భ్రమించి, వానిపై దట్టముగ నల్లుకొనియుండు పూదీగలతో కన్నుల పండువయైయుండునదియు, అలలతో నిండియుండు పుణ్యతీర్థములతో విరాజిల్లు తిరువేంగడమను పర్వతమే—మే మెల్లప్పుడును ఆశపడు పర్వతము.

(54) అవ :— ఆళ్వారులు తిరుమలకు వెళ్ళవలయునని ఆశపడుచుండగ, ఆ తిరువేంగడముడైయానులు, తిరుమలను వీడి, వీరిహృదయమునందు నివసింప నాశపడిరి. అప్పుడు "సర్వేశ్వరా! నీవు నీ నిత్యవాస స్థలమును విడువకూడదని ప్రార్థించుచున్నారు.

వెఱ్పెన్ఱిరుఞ్జోలై వేఙ్గడమెన్ఱివ్విరణ్డుమ్,
నిఱ్పెన్ఱు నీమదిక్కుమ్ నీర్మైపోల్, — నిఱ్పెన్ఱు
ఉళఙ్గోయిల్ ఉళ్ళమ్ వైత్తుళ్ళినేన్, వెళ్ళత్తు
ఇళఙ్గోయిల్ కైవిడేలెన్ఱు. ౫౪

టీక ;— శోలై = తిరుమాలిరుమ్ శోలై, వేజ్గడమ్ = శ్రీవేంకటాచలము, ఎన్రు = అనుతిరునామములుగల, ఇరుమ్ = విశాలములైన, వెర్పుఎన్రు = పర్వతములనెడు, ఇవ్విరణ్డుమ్ = ఈ రెండును, నిర్పుఎన్రు = నీకు నిత్యవాసస్థానములని, నీ మదిక్కుమ్ = నీవు గౌరవించెడి, నీర్మైపోల్ = స్వభావమువలె, ఉళ్ళమ్ = నా హృదయమనెడు, కోయిల్ = వాసస్థలమును, నిఱ్పుఎన్రు = దివ్యక్షేత్రమని, ఉళ్ళమ్ వైత్తు = అన్వవసించి, వెళ్ళమ్ = క్షీరసముద్రమనెడు, ఇళమ్కోయిల్ = బాలాలయమును, కైవిడేల్ = విడనాడవలదు, ఎన్రు = అని, ఉళ్ళినేన్ = ప్రార్థించితిని.

తా॥ తిరుమాలిరుమ్ శోలై (కళ్ళళగర్ సన్నిధి), శ్రీవేంకటాచలము — అను ఈ రెండు పర్వతములును నీకు నిత్యవాసస్థానములని నీవు అభిమానించుచున్నావు. అట్లే స్వభావసిద్ధమగు నీ సౌశీల్యమువలన నా హృదయమును గూడ నిత్యవాసస్థానమని అభిమానించుచున్నావు. దానికి నేను చాల కృతజ్ఞుడనే. ధన్యోస్మి. కాని, దీనియందలి భ్రమచే, నీకు విడిదిచోటగు క్షీరసముద్రమును మాత్రము వదలకుము — అని ప్రార్థించుచున్నారు.

(72) అవ :— తిర్యక్ జంతువులును తిరుమలను ఆశ్రయించుచున్నవి. అహా! ఏమి దీని వైచిత్ర్యము! అని ముగ్ధులగుచున్నారు.

పోదఱిన్దు వానరజ్గళ్ పూజ్శునై పుక్కు, — అజ్గలర్న్ద
పోదఱిన్దు కొణ్డేత్తుమ్ పోదు, — ఉళ్ళమ్! — పోదు
మణి వేజ్గడవన్ మలరడిక్కే శెల్ల
అణి వేజ్గడవన్ పేరాయ్న్దు. ౭౨

టీక :— వానరజ్గళ్ = కోతులుగూడ, పోదు = బ్రాహ్మముహూర్తమును, అఱిన్దు = తెలిసికొని, పూ=పుష్పములతోశోభిల్లు, శునై = దొనలయందు, పుక్కు = ప్రవేశించి, అజ్గు = అచ్చోట, అలర్న్ద = వికసించిన, పోదు = పుష్పములను, అఱిన్దుకొండు = కోసికొని (వచ్చి ఆరాధించుటకై), ఏత్తుమ్ = స్తోత్రములుచేయుచున్నవి. ఉళ్ళమ్ = ఓ మనసా!, పోదు = (స్తోత్రముచేయుటకై నీవును) వెళ్లుము,

వేజడవన్ = తిరువేంగడముడైయానులయొక్క, పేర్ = తిరునామములను, ఆయ్న్దు= విచారించి, మణి = నీలరత్నమువంటి తిరుమేనుగల, వేఙ్గడవన్ = శ్రీవేంకటాచలపతి యొక్క, మలరడిక్కే = పుష్పములవంటి చరణములను, శెల్ల = చేరునటుల, పోదు= పుష్పములను, అణి = అలంకరింపుము.

తా॥ ఓ మనసా! కోతులును బ్రాహ్మముహూర్తమును తెలిసికొని, మంచిపుష్పములుగల పర్వతతీర్థములందు ప్రవేశించి, అచ్చట మిక్కిలి మనోహరములై, వికసించిన పూవులను కోసికొని, ఆ సర్వేశ్వరుని సందర్శించి స్తోత్రముజేయుటకై వెళ్ళుచున్నవి; నీవును ఆ భగవంతుని స్తోత్రముజేయుటకై వెళ్ళుము; ఆ తిరువేంగడముడయానులయొక్క తిరునామములను అనుసంధించుకొనుచు, ఇన్ద్రనీలములవంటి తిరుమేనుగల శ్రీవేంకటాచలపతియొక్క పుష్పములవంటి శ్రీపాదములను పుష్పములను, అలంకరింపుము.

వి. వి :— ఈ పాశురమున - "పోదు" అనుపదము నాలుగు ప్రదేశములలో ప్రయోగింపబడియున్నది. మొదటిచోట, పోదు - కాలము; 2, 4. చోట్ల, పోదు - పుష్పము ; 3. చోట, పోదు - బయలుదేరుము - అని అర్థము లనుసంధేయములు

(75) అవ :— గొప్ప కవినని డప్పాలుకొట్టుకొంటిరే! ఏదీ! చూతము; ఒక పాశురమును కవనముచేయుడు చూతము—అనగాఁ జెప్పుచున్నారు.

> పెరుగు మదవేழ்మ్ మాప్పిడిక్కు మున్నిన్ఱు,
> ఇరుక ణిళమూఙ్గిల్ వాఙ్గి — అరుగిరున్ద,
> తేऩ్ కలన్దు నీట్టుమ్ తిరువేఙ్గడమ్ కణ్డీర్,
> వాన్ కలన్ద వణ్ణన్ వరై. 75

టీక :— మా = శ్లాఘ్యమైన, పిడిక్కు = ఆడుఏనుగునకు, మున్ నిన్ఱు = ఎదురుగ నిలుచుకొని, ఇరు = రెండు, కణ్ = గణుపులుగల, ఇళమ్ = లేతదైన, మూఙ్గిల్ = వెదురును, వాఙ్గి = పెకలించితీసి, అరుగు = సమీపమున, ఇరున్ద = ఉన్నట్టి, తేన్ = తేనెలో, కలన్దు = అద్ది, నీట్టుమ్ = ఇచ్చునట్టి, పెరుగు = స్రవించు

చున్న, మదమ్ = మదజలముగల. వేళ్రమ్ = ఏనుగులుగల, తిరువేజ్గడమ్ కణ్డీర్ = శ్లాఘ్యమైనట్టి తిరుమలయేగద, వాన్ = మేఘములతో, కలన్ద = సమానమైన, వణ్ణన్ = వర్ణముగల తిరుమేనుగల్గిన సర్వేశ్వరుడు, వరై = (నిత్యవాసము జేసెడి) పర్వతము.

తా॥ ఈ వేంకటాచలమున, మదజలముస్రవించెడి ఉత్తమజాతి ఏనుగులు, తమప్రియురాండ్రగు ఆడుఏనుగులకు ఎదురుగ నిలుచుకొని, రెండు గణుపులుగలట్టి లేతవెదుళ్ళను తమ తొండములతో పెకలించి తీసికొని, సమీపమున నున్నట్టి తేనెతెట్టెలలో ముంచి, వానికి అందించుచున్నవి గద ! ఆహా ! ఏమి సౌభాగ్యము ? ఏమి సారస్యము ? నీలమేఘవర్ణుడైన ఆ సర్వేశ్వరుడు నివసించునది — ఈ పర్వతముననే గద !

వి. వి :— (1) ఈ మత్తగజవృత్తాన్తముచే సర్వేశ్వరుడు, తన దేవిని యానందింపజేయుటకై, ఆమె సూచించు కార్యముల, తదింగిత పరాధీనుడై యనుష్ఠించుచు, చేతనుల సంరక్షించుచున్నాడు — అను విషయము సూచింపబడుచున్నది.

(2) "వరై శెయ్ మాక్కళిఱ్ఱు" ( పెరియతిరు. 1-3-5 ) అను పాశురము ఇచ్చట ననుసంధింపదగినది.

శ్రీ పూ తాళ్వార్ల తిరువడిగళే శరణము

శ్రీరస్తు

శ్రీమతే వేంకటేశాయ నమః

శ్రీమతే మహదాహ్వాయమునయే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ పేయాళ్వార్లు ప్రసాదించిన మూడవ తిరువన్దాదిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

అయోనిజులును, భగవత్కటాక్షలబ్ధములగు దివ్యజ్ఞానభక్తులుగల ముదలాళ్వార్లు ముగ్గురిలో మూడవవారగు శ్రీపేయాళ్వార్లు, ద్వాపర యుగమున 8,52,901 వ దగు సిద్ధార్థినామసంవత్సరమున తులామాసమున శుక్లదశమీ గురువాసరమున శతభిషానక్షత్రమున, శ్రీనందకాంశజులై, మైలాపూరునందలి మణికైరవమనెడు భావియందు ఎఱ్ఱకలువ పుష్పము నందు ఆవిర్భవించిరి. వీరు, మహాయోగులై లోకమును కొంచెమైనను గమనింపక, భగవదేక నివేశితమనస్కులై, ఉన్మత్తులవలె సంచరించు చుండిరి. అందుచే, వీరికి పేయాళ్వార్లని తిరునామముగల్గెను. వీరికి మహదాహ్వాయులని మఱియొక తిరునామమును గలదు.

సర్వేశ్వరుడు ఉభయవిభూతియుక్తుడని అనుసంధించిరి — మొదటి వారగు పొయ్‌గైయాళ్వార్లు. దానిని తెల్పునది నారాయణశబ్దమని అందించిరి — రెండవవారగు పూదత్తాళ్వార్లు. ఆ నారాయణశబ్దమునకు శ్రీశబ్దమును గూడ చేర్చుకొనవలెనని మూడవవారగు పేయాళ్వార్లు అనుబంధమును చేర్చిరి. జ్ఞానమును చెప్పునది — "వైయన్దగళి" ప్రబంధము; జ్ఞానవిపాకమగు భక్తిని అభివర్ణించునది — "అన్బేదగళి" ప్రబంధము; ఆ భక్తిచే భగవంతుని సాక్షాత్కరించుకొనిన విధమును తెలుపునది — "తిరుక్కణ్డేన్" ప్రబంధము.

(14) అవ :— క్రింద, ఇంద్రియజయము బహుదుశ్శకమని ఆన తిచ్చిరి. అట్లైన, అశక్తులందఱును నశించిపోవలసినదేనా ? వారలకు ఎప్పటికిని ముక్తిలేదా ? అనిన, సులభమగు ఉపాయమును ఆనతిచ్చుచున్నారు.

మాల్పాల్ మనఞ్జుళిప్ప మజ్గైయర్ తోళ్ కైవిట్టు,
నూల్పాల్ మనమ్ వైక్క-నోయ్విదామ్, — నాల్పాల
వేదత్తాన్ వేజ్గడత్తాన్ విణ్ణోర్ ముడితోయుమ్,
పాదత్తాన్ పాదమ్ పణిన్దు. ౧౪

టీక :— నాల్పాలవేదత్తాన్ = చతుర్విధములగు వేదములచే ప్రతిపాదింపబడు వాడును, వేజ్గడత్తాన్ = శ్రీ వేంకటాచలనివాసియు, విణ్ణోర్ ముడితోయుమ్ పాదత్తాన్ = నిత్యసూరులయొక్క కిరీటములచే తాకబడిన శ్రీపాదములుగల సర్వేశ్వరునియొక్క, పాదమ్ = శ్రీపాదములను, పణిన్దు = ఆశ్రయించి, మాల్ పాల్ = సర్వేశ్వరునియందే, మనమ్ = చిత్తమును, శుళిప్ప = ఉంచినయెడల, మజ్గైయర్ తోళ్ = యువతీజనముల బాహులతలయందలి, కైవిట్టు = ఆశను వదలి, నూల్ పాల్ = వేదాంతశాస్త్రములయందు, మనమ్ వైక్క = మనస్సును నిలుప, నోయ్విదామ్ = సులభమగును.

తా॥ ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగువేదములచేతను ప్రతిపాదింపబడు వైభవముగల తిరువేంగడముడయానులను, నిత్యసూరులందఱును గూడ వచ్చి, తమ కిరీటములు శ్రీవారి శ్రీపాదములకు తగులునట్లు నమస్కరించుచున్నారు. అట్టి శ్రీవేంకటాచలపతి శ్రీపాదములనాశ్రయించి నచో, వారియందు మనస్సు నిలచును. అప్పుడు, యువతిజన బాహులతలనుండి విడివడి, వేదాంతశాస్త్రములయందు మనస్సునునిలుప సాధ్యమగును.

(26) అవ :— సర్వేశ్వరుడు ఆశతో నివసించు దివ్యదేశము లేవి ? అనిన చెప్పుచున్నారు.

శిఱన్దవెన్ శిన్దైయుమ్ శెజ్గణరవుమ్,
నిఱైన్దశీర్ నీళ్ కచ్చి యుళ్ళుమ్, — ఉఱైన్దదువుమ్
వేజ్గడముమ్ వెహ్కావుమ్ వేళుక్కై ప్పాడియుమే,
తామ్ కడవార్ తణ్తుழாయార్. ౨౬

టీక :— తణ్ తుழாయార్ = శీతలములును, సుగంధములును, రమణీయములును నైన తిరుత్తుழாయ్‌మాలలను ధరించియుండు సర్వేశ్వరుడు, ఉఱైన్దదువుమ్ = నిత్యవాసము చేయునవి, నిఱైన్దశీర్ నీళ్ కచ్చియుళ్ళుమ్ = పరిపూర్ణములైన భోగభాగ్యములతో శోభిల్లుచుండు శ్రీ కాంచీనగరమునందును, వేంగడముమ్ = శ్రీ వేంకటాద్రియందును, వెహ్కావుమ్ = యథోక్తకారిసన్నిధియందును, వేళుక్కైప్పాడియుమే = వేళుక్కైప్పాడి యను దివ్యదేశమునందును ; శిఱన్ద = శాఘ్యమైన, ఎన్ శిన్దైయుమ్ = నా మనస్సును, శెజ్గణ్ = ఎఱ్ఱని నేత్రములుగల, అరవుమ్ తామ్ = ఆదిశేషునిమాత్రము, కడవార్ = అతిక్రమింపజాలరు. అనగా — మిక్కిలిప్రేమతో విడువజాలరు అని భావము.

తా॥ దివ్యములై పరమభోగ్యములగు శ్రీతుళసీదామములచే నలంకరింపబడియున్న శ్రీమన్నారాయణుడు, భోగభాగ్యములతో సంపన్నమై సువిశాలమైయుండు శ్రీ కాంచీపురమునందును, దివ్యవైభవోపేతమగు శ్రీ వేంకటాచలమునను, యథోక్తకారి సన్నిధియందును, వేళుక్కైప్పాడి యను దివ్యదేశమందును నిత్యవాసముచేయుచున్నారు. నామనస్సునందును, ఆదిశేషునియందును, మిక్కిలిప్రేమతో అతడు ఎడబాయజాలక నివసించియున్నాడు.

వి. వి :— ఇచ్చట "శిఱన్ద" అని ఆழ்வారులు తమ తిరువుళ్ళమును విశేషించుటకు కారణము — సర్వేశ్వరుడు ఆశపడి పైనబడుటకు ఆస్పదమైయుండుటయే యని ఎఱుంగునది.

(2) వెహ్కా — యథోక్తకారిసన్నిధి. వేళుక్కై — "కామాసికా" అని వ్యవహరింపబడు అழகియశింగర్ (నృసింహస్వామి) సన్నిధి. ఈ దివ్యదేశములును శ్రీ కాంచీపురమున నున్నవి.

(3) వేళుక్కైప్పాడి - అనుదానిని రెండుగా విభజించి "వేళుక్కై తిరువాయ్ ప్పాడి" అనియును అర్థము చెప్పవచ్చును.

(30) అవ :— భగవంతుడు సన్నిహితుడై నచో అతనియందు స్నేహమునుచూపవచ్చును — అని తలచి అతడు సన్నిహితుడై యుండు దివ్యదేశముల సెలవిచ్చుచున్నారు.

శేర్న్ద తిరుమాల్ కడల్ కుడన్దై వేఙ్గడమ్,
నేర్న్దఎన్ శిన్దై నిఱైవిశుమ్బు, — వాయ్న్ద
మఱైపా డగమ్ అనన్దన్ వణ్ తుళాయ్ కణ్ణి,
ఇఱైపాడి యాయ ఇవై. 30

టీక :— కడల్ = క్షీరసముద్రము, కుడన్దై = తిరుకుడన్దై, వేఙ్గడక్ = శ్రీ వేంకటాచలము, నేర్న్ద ఎన్ శిన్దై = ఋజువైన నాహృదయము, నిఱైవిశుమ్బు = సర్వసంపూర్ణమైన పరమపదము, వాయ్న్దమఱై = నిత్యనిర్దుష్టములగు వేదములు, పాడగమ్ = తిరుప్పాడకము, అనన్దన్ = అనన్దాళ్వాను, ఆయ = అయిన, ఇవై = ఇవి యన్నియు, వణ్ తుళాయ్క్కణ్ణి = పరమభోగ్యములగు తిరుత్తుళాయ్ మాలుగల పుండరీకాక్షుడైన, తిరుమాల్ = శ్రియఃపతి, శేర్న్ద = వేంచేసియున్నట్టి, ఇఱైపాడి యాయ = రాజధానులు (పుణ్యక్షేత్రములు)

తా॥ క్షీరాబ్ధి, తిరుకుడన్దై, శ్రీ వేంకటాచలము, నిష్కపటమగు నా మనస్సు, సర్వసంపదలతో నిండియున్న పరమపదము, నిత్యనిర్దుష్టము లగు వేదములు, తిరుప్పాడకము, అనన్దాళ్వాన్—మొదలగు నివియన్నియును, దివ్యపరిమళములు వీచుచున్న దివ్యతుళసీదామములను ధరించిన శ్రియఃపతి పరమప్రీతితో నివసించు ప్రదేశములు.

వి. వి :— (1) ఇఱైపాడి—రాజధాని. (2) దివ్యతిరుపతులయందు సేవసాదించు నట్లు, ఆళ్వారులకు వేదములయందును సర్వేశ్వరుడు సేవసాదించుచున్నాడు— అని, వేదములగూడ చేర్చి చెప్పుటచే తెలియుచున్నది.

(3) నిఱైవిశుమ్బుమ్ — పా.

(32) అవ :— సర్వేశ్వరుడు వేనిని నివాసస్థానములుగ జేసికొనెను- అనిన, బదులు చెప్పుచున్నారు,

పాఱ్కడలుమ్ వేఙ్గడముమ్ పామ్బుమ్ పనివిశుమ్బుమ్,
నూఱ్కడలుమ్ నుణ్ణూల తామరై మేల్,—పాఱ్ప—
ట్టిరున్దార్ మనముమ్ ఇడమాగ క్కొణ్డాన్,
కురున్దొశిత్త గోపాలగన్. 3౭

టీక :— కురున్దు = అడవినిమ్మచెట్టును (కొందరు అడవియామిడి.—అనియు దీనందురు), ఒశిత్త = విఱిచిన, గోపాలకన్ = గొల్లపిల్లవాడై అవతరించిన సర్వేశ్వరుడు, పాఱ్కడలుమ్ = క్షీరాబ్ధిని, వేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, పామ్బుమ్ = ఆదిశేషుడును, పనివిశుమ్బుమ్ = శీతలమగు పరమపదమును, నూల్కడలుమ్ = శాస్త్ర సాగరమును, నుణ్నూల = సూక్ష్మములైన అంశములను దెలుపుశాస్త్రములయందు వర్ణింపబడిన, తామరై మేల్ = హృదయకమలమునందును, పాల్పట్టు = చిత్తమును నిలిపి, ఇరున్దార్ = తపస్సుచేయుచున్న యోగులయొక్క, మనముమ్ = మనస్సును, ఇడమాగక్కొణ్డాన్ = తనకు నివాసస్థానములుగ జేసికొనెను.

తా॥ ఆశ్రితులవిరోధుల నిరసించి, వారలకు పరమసులభుడై, తన సర్వస్వమును దానమిచ్చు శ్రీకృష్ణస్వామియై అవతరించిన సర్వేశ్వరుడు—క్షీరాబ్ధి, శ్రీవేంకటాచలము, పరమపదము, ఆదిశేషుడు, శాస్త్రసాగరము, ఉపనిషత్ప్రతిపాద్యమగు హృదయకమలము, యోగులహృదయాంబుజము—ఇది మొదలుగాగలవానియందు, నిత్యవాసము చేయుచున్నాడు.

వి. వి :— పనివిసుమ్బు — ఈ సంసారమున ననుభవించిన తాపములనన్నింటినితీర్చు పరమపదము (2) నూల్కడల్ — సముద్రమువలె అపారమైన శ్రుతి-స్మృతి ఇతిహాసపురాణములు మొదలగు శాస్త్రములు.

(39) అవ :— వేదశాస్త్రప్రతిపాద్యుడగు శ్రీవేంకటాచలపతి తమ హృదయమున నిత్యవాసముచేయుచున్నాడని చెప్పుచున్నారు.

ఇఱైయాయ్ నిలనాగి ఎణ్డిశైయుమ్ తానాయ్,
మఱైయాయ్ మఱైప్పొరుళాయ్ వానాయ్,—ప్పిఱైవాయ్న్ద
వెళ్ళత్తరువి విళఙ్గొలినీర్ వేఙ్గడత్తాన్,
ఉళ్ళత్తి నుళ్ళే ఉళన్. 3౮

టీక :— ఇఱైయాయ్=సర్వస్వామియై, నిలనాగి=పృథివి మొదలగు భూతములకు అంతర్యామియై, ఎణ్ తిశైయుమ్ తానాయ్ = అష్టదిక్కులును తానై, మఱైయాయ్ = నిఖిలవేదస్వరూపుడై, మఱైప్పొరుళాయ్ = ఆ వేదముల అర్థమును తానేయై, వానాయ్ = పరమపదస్వరూపుడై, పిఱై=చంద్రుని, వాయ్న్ద=ఒరయుచున్న, వెళ్ళమ్ = ప్రవాహములుగల, అరువి = సెలయేళ్ళయందు, విళఙ్గు = ప్రకాశించుచు, ఒలి = శబ్దించుచున్న, నీర్ = జలములుగల, వేంగడత్తాన్ = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నవాడు, ఉళ్ళత్తిన్ ఉళ్ళే = నా మనస్సులోపల, ఉళన్ = నిత్యవాసము చేయుచున్నాడు.

తా॥ సర్వస్వామియై, పృథివ్యాదులకు అంతర్యామియై, సర్వదిక్కులును తానేయై, వేదస్వరూపుడై, వేదార్థస్వరూపుడై, పరమపదరూపుడై, చంద్రుని ఒరయుచు ఎత్తైనచోటులనుండి ప్రవహించుచున్న సెలయేళ్ళతో గూడుకొనియున్న శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు సర్వేశ్వరుడు, నాహృదయమున నిత్యవాసము చేయుచున్నాడు.

వి. వి :— (1) "పిఱైవాయ్న్ద" ఇది వేంగడమునకు విశేషణము, చంద్రమండలమువఱకు వ్యాపించియున్న శిఖరములుగల వేంగడమని అర్థము. లేక, "వెళ్ళమ్ అరువి" అను దానికి విశేషణము కావచ్చును.

(2) "మఱైమేల్ తాన్ నిన్ఱు ఎన్కనత్తుళ్ళిరున్దానై" అను తిరువాయ్మొళ్ళి పాశురమిచ్చట అనుసంధింప దగినది.

(40) అవ :— ఈ వేంకటాచలమునందు వేంచేసియున్నవాడే, నిఖిలలోకములను తన శ్రీపాదముల స్పర్శచే తరింపజేసిన త్రివిక్రమావతారులు—అని చెప్పుచున్నారు.

ఉళ్ళక్కణ్డాయ్ నల్ నెఞ్జే! ఉత్తమనెన్ఱుమ్,
ఉళ్ళక్కణ్డాయ్, ఉళ్ళువారుళ్ళత్తు — ఉళ్ళక్కణ్డాయ్,
విణ్ణోడుఙ్గ క్కోడుయరుమ్ వీఙ్గరువి వేఙ్గడత్తాన్,
మణ్ణోడుఙ్గ త్తానళన్ద మన్. ౪౦

టీక :— నల్ నెజ్ఞే = ఓ నా మంచిమనసా ! ఉత్తమన్ = పురుషోత్తముడు, ఉళన్ కణ్డాయ్ = ఉన్నాడని తెలిసికొనియున్నావు గద ! ఎన్నుమ్ = ఎల్లప్పుడును, ఉళన్ కణ్డాయ్ = ఉన్నాడని తెలిసికొనియున్నావు గద ! ఉళ్ళువార్ = ధ్యానము చేయునట్టి యోగులయొక్క, ఉళ్ళత్తు = హృదయకమలములయందు, ఉళన్ కణ్డాయ్ = ఉన్నాడని తెలిసికొన్నావు గద ! విణ్ ఒడుఙ్గ = ఆకాశము ఒరయునట్లు, కోడు = శిఖరములు, ఉయరుమ్ = పెరుగుచున్నట్టిదియు, వీఙ్గు = వృద్ధిపొందుచున్న, అరువి = సెలయేళ్ళుగల, వేంగడత్తాన్ = తిరువేంగడముడయానులే, మణ్ = భూలోక మంతయును, ఒడుఙ్గ = వ్యాపించునట్లు, తాన్ అళన్ద మన్ = తాను కొలచిన స్వామి.

తా॥ ఓ మంచిమనసా ! పురుషోత్తముడు మనలను సంరక్షించుటకై యున్నాడు ; అతని సంకల్పమే మన స్వరూపసత్తకు హేతువై యున్నది. అతడు ఎల్లప్పుడును ఉన్నాడు. అతనిని ఎల్లకాలముల యందును ఎడతెగక భక్తితో ధ్యానించుచుండు పరమయోగుల హృదయ కమలములయందు నివసించుచున్నాడు. త్రివిక్రమావతారమున నతడు, ఉపరితనలోకములనన్నింటిని వ్యాపించుటకై వృద్ధిజెందినట్లు, తన శిఖరములను, ఆకాశము ఒరయునట్లు అభివృద్ధిజెందించుచు, ఎల్లప్పుడును పారుచుండు రమణీయములగు సెలయేళ్ళతో నిండియుండు శ్రీవేంకటాచలమున నివసించు స్వామియే ఈ భూలోకమును, ఊర్ధ్వలోకములను అన్నింటిని, తన శ్రీపాదములతో గొలిచిన శ్రీ త్రివిక్రమస్వామి.

(45) అవ :— సకల ప్రాణులకును పరమసులభముగ సేవసాదించుటకై, తిరుమలలో శ్రీ స్వామివారు నిత్యసన్నిహితులై యున్నారని తెల్పుచున్నారు.

పురిన్దు మదవేళ్ళమ్ మాప్పిడియోడు ఊడి
త్తిరిన్దు శినత్తాల్ పొరుదు, — విరిన్దశీర్
వెణ్కోట్టు ముత్తుదిర్క్కుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్
మణ్కోట్టు కొణ్డాన్ మలై. ౪౫

టీక :— మదమ్ = మదముగల, వేళమ్ = ఏనుగు, మా = శ్లాఘ్యమైన, పిడియోడు = ఆడుఏనుగుతో గూడ, పిరిన్దు = సంశ్లేషించి, ఊడి = కోపగించి, తిరిన్దు = సంచరించి, శినత్తాల్ = (రాళ్ళయందు ప్రతిఫలించిన తమ రూపముతోడ) కోపముతో, పొరుదు = యుద్ధముచేసి, విరిన్ద = విస్తృతములై, శీర్ = వీరలక్ష్మితో గూడుకొనియున్న, వెణ్ = తెల్లని, కోడు = దంతములనుండి, ముత్తు = ముత్య ములను, ఉదిర్కుమ్ = రాల్చుచున్న, వేఙ్గడమే = శ్రీవేంకటాచలమే, మేలొరునాళ్ = మునుపొకదినమున, మణ్ = భూదేవిని, కోట్టు = కొమ్ములతో, కొణ్డాన్ = పై కెత్తినటువంటి, శ్రీ వరాహస్వామియొక్క, మలై = పర్వతము.

తా॥ మదపు ఏనుగులు—అనురూపములగు ఆడుఏనుగులతో సంశ్లే షించి, ప్రణయకలహమున నటునిటు తిరుగుచున్నవై, స్వచ్ఛమైన రాళ్ళ యందు ప్రతిబింబించిన తమ రూపములను జూచి, వేరు ఏనుగులని భావించి, వానితో పోరాడునపుడు, ఒరిపిడిచే తెల్లనిదంతములనుండి ముత్యములను ఎచట రాల్చుచున్నవో; అట్టి శ్రీవేంకటాచలమే—పూర్వము తన కొమ్ములతో జలార్ణవమునుండి భూమిని ఉద్ధరించిన శ్రీ వరాహస్వామి వేంచేసియుండు పర్వతము.

(58) అవ :— తిర్యక్ జంతువులును క్రీడారసమనుభవించు శ్రీ వేంకటాచలమే—శ్రీ త్రివిక్రమస్వామి వేంచేసియుండు దివ్యస్థలమని చెప్పు చున్నారు.

తెళ్ళిన్ద శిలాతలత్తిన్ మేలిరున్ద మన్ది,
అళ్ళిన్ద కడువనైయే నోక్కి, — విళఙ్గియ
వెణ్ మదియమ్ తావెన్నుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్
మణ్ మదియిల్ కొణ్డుగన్దాన్ వాళ్వు. ౫౮

టీక :— తెళ్ళిన్ద = నిర్మలమైన, శిలాతలత్తిన్ మేల్ = చలువరాతిబండపై, ఇరున్ద = ఉన్నటువంటి, మన్ది = ఆడుకోతి, అళ్ళిన్ద = ప్రేమగల, కడువనైయే = తన భర్తయగు మొగకోతిని, నోక్కి = జూచి, విళఙ్గియ = ప్రకాశించుచున్న, వెణ్ = తెల్లని, మదియమ్ = చంద్రుని, తా = (నాకు) తెచ్చియిమ్ము, ఎన్నుమ్ = అని

చెప్పుచున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే, మేలొరునాళ్ = మునుపొక కాలమున, మదియిల్ = (తన) బుద్ధిసూక్ష్మముచేత, మణ్ = భూమిని, కొండు = స్వాధీన పఱచుకొని, ఉగన్దాన్ = సంతోషించిన సర్వేశ్వరుడు, వాழ்வు = సుఖముగనుండు స్థలము.

తా॥ పూర్వకాలమున, యుక్తితో మహాబలిచక్రవర్తివద్ద భూమిని స్వాధీనపఱచుకొని, స్వాశ్రితులగు దేవతలను సంరక్షించి, తాను మిక్కిలి సంతోషించిన శ్రీ త్రివిక్రమావతారుడగు సర్వేశ్వరుడు, పరమప్రీతితో వేంచేసియుండు స్థలము—నిర్మలములైన స్ఫటికశిలాతలములయందు విహరించుచు ప్రణయరసమనుభవించుచుండు ఆడుకోతి, తననాథుడగు మొగకోతిని జూచి, ఆకసమున తెల్లగ ప్రకాశించు చంద్రుని తెచ్చియిమ్మని కోరుచుండు, పరమరమణీయమగు శ్రీ వేంకటాచలమే.

వి. వి :— (1) “మన్ది” అనగా — ఆడుకోతి, “కడువన్” అనగా — మొగకోతి.

(2) “మణ్ మదియిల్ కొణ్డు” — పరమదానశీలుడగు మహాబలివద్ద యాచకముదప్ప వేఱుపాయము పాఱదుగదా! అని తీర్మానించుకొనుట — బుద్ధిచాతుర్యకార్యమేగద.

(61) అవ :— సర్వేశ్వరుడు భక్తులప్రతిబన్ధకములను పోగొట్టుట మాత్రమేగాదు చేయునది ; పరమార్థమున, పరమపదనివాసియగు నతడు దివ్యదేశములలో పరమప్రీతితో వేంచేసియుండుటయు, సమాశ్రితుల సంరక్షించుట కొఱకే. కనుకనే నిత్యసూరులును నిచ్చట నివసించుచున్నారు

* పణ్ణొల్లామ్ వేణ్డమ్ పాట్కడల్ వైగున్దమ్,
కొణ్ణుగ్గు తైవార్ క్కు కోయిల్ పోల్, — వణ్డు
వళఙ్గిళరుమ్ నీళ్ శోలై వణ్ పూఙ్గడిగై,
ఇళఙ్గుమరన్ దన్ విణ్ణగర్. ౬౧

టీక :— పణ్డొల్లామ్ = పూర్వకాలమునందంతయును, వైకున్దమ్=శ్రీవైకుంఠమును, కొణ్డు = వాసస్థానముగా జేసికొని, అఙ్గు = అచ్చట, ఉఱైవార్క్కు = నిత్యవాసము చేయువారికి, (ఇప్పుడు) వేంగడమ్=శ్రీ వేంకటాచలము, పాఱ్కడల్ = క్షీరాబ్ధియు, వణ్డు=తుమ్మెదలు, వళమ్కిళరుమ్=గుంపులుగుంపులుగ సంచరించుచున్న, నీళ్ శోలై =శ్లాఘ్యమైనపూదోటలచే, వణ్ పూ=రమణీయమై పరమభోగ్యమైయున్న, గడిగై = తిరుక్కడిగై యను దివ్యదేశమును, ఇళమ్ కుమరన్ తన్ = "యువా కుమారః" అను శ్రుతియందు వర్ణింపబడినట్లు, ఎల్లప్పుడును చిన్నికుమారుడైయుండు సర్వేశ్వరునియొక్క, విణ్ణగర్ = విణ్ణగరమును, దివ్యదేశమును, కోయిల్ పోల్ = వాసస్థానములవలెనున్నవి.

తా॥ శ్రీ వేంకటాద్రియు, క్షీరాబ్ధియు, తుమ్మెదలు గుంపులు గుంపులుగ ఎగురుచు ఝుంకారముచేయుచుండుటచే మిక్కిలి మనోజ్ఞములగు దివ్యారామములతో నిండియున్న తిరుక్కడిగై యను దివ్యదేశము, సర్వేశ్వరుడు నిత్యయౌవనపూర్ణమగు మూర్తితో వేంచేసియున్న తిరువిణ్ణగరమ్ అను దివ్యదేశము—ఇవి యన్నియును, మునుపు పరమపదమున నిత్యవాసముచేయుచుండు నిత్యసూరులకు, ఇప్పుడు వాసస్థానములై యున్నవి.

వి. వి :— ఈ పాశురమునకు మూడువిధములుగ అన్వయము చెప్పుకొనవచ్చును. (1) అందొకవిధము నిరూపింపబడినది. (2) పణ్డొల్లామ్ — పూర్వమున, వేంగడమ్, పాఱ్కడల్, వైగన్దమ్ కొణ్డు, అఙ్గు ఉఱైవార్క్కు - వైకుంఠమునను, క్షీరసముద్రమునను, శ్రీ వేంకటాచలమునను నిత్యవాసముజేయుచుండు నా శ్రియఃపతికి, (ఇప్పుడు) వణ్డువళమ్ కిళరుమ్ నీళ్ శోలైవణ్ పూమ్ కడిగై - తుమ్మెదలు గుంపులు గుంపులుగ సంచరించుచున్న పూదోటలతో విరాజిల్లుచున్న శ్రీ ఘటికాచలము, ఇళమ్ కుమరన్ దన్ విణ్ణగర్ - బాలకుమారుడుగా సర్వేశ్వరుడు వేంచేసియున్న తిరువిణ్ణగరమును, కోయిల్ పోల్ - వాసస్థానములైయున్నవి. అని (3) పరిశుద్ధమై, పరమభోగ్యమైన, నామనస్సు వాసస్థానముగ లభింపనప్పుడు, వైకుంఠము మొదలగు దివ్యదేశములయందు నివసించుచుండెడు సర్వేశ్వరుడు, ఇప్పుడు పరమప్రీతితో నామనస్సుననే నివసించుచున్నాడు- అనియును, అన్వయము చెప్పుకొనవచ్చును.

(62) అవ :— సర్వేశ్వరుడు పరమసులభుడై వేంచేసియుండు దివ్యదేశములను పరిగణించుచున్నారు.

విణ్ణగరమ్ వెహ్కా విరిదిరైనీర్ వేఙ్గడమ్,
మణ్ణగరమ్ మామాడ వేళుక్కై, — మణ్ణగత్త
తెన్కుడన్దై తేనార్ తిరువరఙ్గమ్ తెన్కోట్టి,
తన్ కుడఙ్గై నీరేత్తాన్ తాఴ్వు. ౬౨

టీక :— విణ్ణగరమ్=తిరువిణ్ణగరము, వెహ్కా=(కాంచీపురములోని) యథోక్తకారిసన్నిధియు, విరిదిరైనీర్ = విస్తీర్ణములై పెద్దపెద్దఅలలుకలిగియుండు పుణ్యతీర్థములతో నిండియున్న, వేంగడమ్ = తిరువేంగడమ్, (శ్రీ వేంకటాచలము) మణ్ణగరమ్ = భూలోకవైకుంఠమైన, మామాడమ్ = గొప్పమేడలుగల, వేళుక్కై = తిరువేళుక్కై యనెడు దివ్యదేశము, మణ్ణగత్త = భూలోకమునందు, తెన్ = పరమశ్లాఘ్యమైన, కుడన్దై=తిరుక్కుడన్దై (కుంభకోణమ్), తేన్ ఆర్ = తేనెలతో నిండియున్న పుష్పములుగల పూదోటలతో సమృద్ధమైన, తిరువరఙ్గమ్=శ్రీరంగము, తెన్ కోట్టి = దక్షిణదేశమందున్న తిరుక్కోట్టియూరును, తన్ = తనయొక్క, కుడమ్కై = అరచేతిలో, నీరేత్తాన్ = బలిచక్రవర్తినుండి దానజలమును పరిగ్రహించిన, త్రివిక్రమస్వామి, తాఴ్వు = పరమసులభుడై వేంచేసియుండు దివ్యదేశములు.

తా॥ స్వాశ్రితులగు దేవతలను సంరక్షించుటకై, వామనుడై, మహాబలిచక్రవర్తిని మూడడుగుల భూమిని యాచించి, ముల్లోకములను తన శ్రీపాదములచే గొలిచిన శ్రీ త్రివిక్రమస్వామి వేంచేసియుండు దివ్య దేశములు—తిరువిణ్ణగరమ్, యథోక్తకారి సన్నిధి, దివ్యములగు పుణ్యతీర్థములతో నిండియున్న తిరువేంగడము, భూలోకవైకుంఠమైన తిరువేళుక్కై, పరమపావనక్షేత్రమగు కుంభకోణము, పరమభోగ్యమైన శ్రీరంగము, పరమశ్లాఘ్యమగు తిరుక్కోట్టియూరు,—అనునవి.

వి. వి :— తాఴ్వు - పల్లముగానుండు ప్రదేశములు

(63) అవ :— సర్వేశ్వరుడు ఆழ్వార్లకు తన దివ్యమంగళ విగ్రహమున ఇతరదైవతముల చిహ్నములను గూడ ధరించి, సేవసాదింపగా, ఆహా! ఇదియేమి సౌశీల్యము; సౌలభ్యము—అని ఆశ్చర్యపడుచున్నారు.

తాழ్ శడైయుమ్ నీళ్ ముడియుమ్ ఒణ్ మழுవుమ్ శక్కరముమ్,
శూழ్ అరవుమ్ పొన్నాణుమ్ తోన్రుమాల్, — శూழுమ్
తిరణ్డరువి పాయుమ్ తిరుమలై మేల్ ఎన్దైక్కు,
ఇరణ్డురువుమ్ ఒన్రాయ్ ఇశైన్దు. 63

టీక :— శూழுమ్ తిరణ్డు = చుట్టిపారుచు సమృద్ధములైయున్న, అరువి = సెలయేళ్ళు, పాయుమ్ = ఎల్లప్పుడును ప్రవహించుచుండు, తిరుమలై మేల్ = శ్రీ వేంకటాచలమునందు వేంచేసియుండు, ఎన్దైక్కు = మా స్వామికే, తాழ్ శడైయుమ్ = వ్రేలాడుచున్న జటలును, నీళ్ ముడియుమ్ = సొగసైన, పొడుగైన కిరీటమును; ఒణ్ మழுవుమ్ = సుందరమైన గొడ్డలియు, శక్కరముమ్ = సుదర్శనచక్రమును; శూழ் = నడుమునుచుట్టుకొనియుండు, అరవుమ్ = సర్పము, పొన్ నాణుమ్ = బంగారు మొలత్రాడును, గలిగియుండుటచే, ఇరణ్డు ఉరువుమ్ = హరిహర స్వరూపములు రెండును, ఇశైన్దు = చేరి, ఒన్రాయ్ తోన్రుమ్ = ఒకటిగ తోచుచున్నవి. ఆల్ = ఆశ్చర్యము.

తా॥ సుభగశీతలములగు కొండకాలువలతో పరమరమణీయమైయుండు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు శ్రీ స్వామివారికి తలపై— జటలు, సువర్ణకిరీటము, చేతిలో—గొడ్డలి, చక్రము, మొలలో—నాగాభరణము, బంగారుమొలనూలు — ఇవన్నియు నుండుటచే, హరిహర స్వరూపములు రెండును అమరియున్నవి. ఆహా ఏమి ఆశ్చర్యము!

వి. వి :— జటలు, గొడ్డలి, నాగాభరణము — మొదలగు హరచిహ్నములను, సువర్ణకిరీటము, చక్రము, బంగారుమొలనూలు — మొదలగు హరిచిహ్నములను రెండింటిని ధరించి, తిరువేంగడముడైయాన్లు సేవసాదించుచున్నారు. ఆహా! ఏమివారి సౌశీల్యము? ఏమి ఆశ్చర్యము — అని ఆழ్వారులు వ్యాముగ్ధులగుచున్నారు.

(68) అవ :— కపిత్థస్వరూపుడగు రాక్షసుని, వత్సాసురుని, పరిమార్చిన శ్రీశ్రీకృష్ణస్వామి వేంచేసియుండు శ్రీవేంకటాచలమున తిర్యగ్జంతువులును, శృంగారరసమును అనుభవించుచున్నవని వర్ణించుచున్నారు.

పార్ త్త కడువన్ శునై నీర్ నిழల్ కణ్డు,
పేర్ త్తోర్ కడువ నెనప్పేర్ న్దు — కార్ త్త,
కళఙ్గనిక్కు కైనీట్టుమ్ వేఙ్గడమే, మేల్ నాళ్
విళఙ్గనిక్కు కన్నెఱిన్దాన్ వెఱ్ఱు. ౬౮

టీక :— శునై నీర్ =కొండకాలువలనీటిలో, పార్ త్త=తొంగిచూచిన, కడువన్ = మగకోతి, నిழల్ = తనఛాయను, కణ్డు = చూచి, పేర్ త్తోర్ = శత్రువైన, కడువన్ = మఱియొకకోతి, ఎన=అని, తలచి, పేర్ న్దు=అవతలకువెళ్ళి, కార్ త్త=నల్లని, కళంగనిక్కు = కలేపండ్లకై, కైనీట్టుమ్ = చేయిజాచుచున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే, మేల్ నాళ్ = పూర్వము, విళఙ్గనిక్కు = రాక్షసావేశముగల, కన్రు = వత్సాసురిని, ఎఱిన్దాన్ = విసరికొట్టిన శ్రీకృష్ణస్వామియొక్క, వెఱ్ఱు = పర్వతము.

తా॥ అసురావిష్టమగు కపిత్థమును, వత్సాసురుని పై విసరికొట్టి నశింపజేసిన శ్రీకృష్ణస్వామి వేంచేసియుండు శ్రీవేంకటాచలమున పరిశుద్ధములగు కొండకాలువలనీటిలో కోతులు తొంగిచూచి, తమ నీడ, అందు ప్రతిఫలింపగ, అది మఱియొక వానరమని తలంచి, భయపడి, అవతలకువెళ్ళి, నల్లని కలేపండ్లను తినుచు, చూపరులకు అధికమగు సంతోషమును కలుగజేయుచున్నవి.

వి. వి :— తిరువేంగడముననుండు సకలచరాచరములును ఉపాదేయములగుటచే, అందుండు వానరముల చేష్టితముల గూడ నభివర్ణించుచున్నారు.

(69) అవ :— ఈ ఆళ్వార్లు, తమకు భగవంతుని విరహతాపము మితిమీఱగ, తమ స్వరూపమును మఱచి, తమను ఒక విరహదగ్ధయగు నాయకిగ భావించి, మిక్కుటమగు విరహావస్థను అనుభవించుచుండిరి. ఆ విరహావస్థను వీరితల్లి అభివర్ణించుచున్నది.

వెఱ్పెన్ఱు వేఙ్గడమ్ పాడుమ్, వియన్ తుళాయ్,
కఱ్పెన్ఱు శూడుమ్ కరుఙ్గుళల్ మేల్, — మల్ పొన్ఱ
నీణ్డతోళ్ మాల్ కిడన్ద నీళ్ కడల్ నీరాడువాన్,
పూణ్డనాళెల్లామ్ పుగుమ్. ౬౯

టీక :— వెఱ్పెన్ఱు=పర్వతము అను నపుడెల్లను, వేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, పాడుమ్ = (నా కూతురు) పాడుచున్నది. కరుమ్ కుళల్ మేల్ = నల్లని తన కేశపాశములపై, వియన్ తుళాయ్ = శ్లాఘ్యమగు శ్రీ తులసీదామములనే, కఱ్పుఎన్ఱు= తగినవని, శూడుమ్ = ముడుచుకొనుచున్నది, మల్ = (చాణూరముష్టికులను) మల్లులను, పొన్ఱ = చంపిన, నీణ్డతోళ్ = దీర్ఘములైన బాహువులుగల, మాల్ = సర్వేశ్వరుడు, కిడన్ద = పవ్వళించియున్న, నీళ్ కడల్ = విశాలమైన క్షీరాబ్ధియందు, నీరాడువాన్ = జలకమాడుటకు, పూణ్డనాళెల్లామ్ = ఉదయించిన దినములన్నింటియందును, (ప్రతి దినమును), పుగుమ్ = వెళ్ళవలయునని ఉవ్విళ్ళూరుచున్నది.

తా॥ ఆ తిరువేంగడముడయానుల యందలి విరహము అగ్గలము కాగ, నా కుమార్తె బహుయాతనలను అనుభవించుచున్నది. ఎవ్వరైనను ప్రసంగవశమున పర్వతమను పదమును ఉచ్చరించినచో, తిరువేంగడమును కీర్తించుటకు ఆరంభించుచున్నది. మల్లెలు, మొల్లలు—మొదలగు పూమాలలకన్న తులసీమాలికలే పరమభోగ్యములని, వానినే ఎల్లప్పుడును తన కుంతలములలో ధరించుచున్నది. మల్లులను జంపిన శ్రీకృష్ణస్వామి పవ్వళించియున్న క్షీరాబ్ధియందు జలకమాడవలెనని ఎల్లప్పుడును కుతూహలపడుచున్నది. చూచితిరా! ఈమె దురవస్థ—అని నాయకీభావమును పొందిన ఆళ్వారుల యొక్క తల్లి చెప్పుచున్నారు

వి. వి :— పాడుమ్ - పాడుడు ; శూడుమ్ - ముడిచికొనుడు ; పుగుమ్ - అవగాహింపుడు—అని లోకములకు నుపదేశించుచున్నారు. అని అర్థము చెప్పవచ్చును.

(70) అవ :— తన భక్తుల దేహయాత్రను, తన నాశ్రయించుటకు అనుకూలపఱచు పరమదయాకరుడగు శ్రీమన్నారాయణుడు నివసించు తిరుమల ఇదియే—అని అభివర్ణించుచున్నారు.

పుగుమదత్తాల్ వాయ్‌పూశి క్కీళ్ తాళ్‌న్దు, అరువి,
ఉగుమదత్తాల్ కాల్ కళువి కై క్కయాల్, — మిగుమదత్తేన్
విణ్డమలర్ కొణ్డు విఱల్ వేఙ్గడవనైయే,
కణ్డు కణఙ్గుమ్ కళిఱు. ౭౦

టీక :— పుగు = తన నోటిలోపడుచున్న, మదత్తాల్ = మదజలముచే, వాయ్‌పూశి = నోటినిగడిగి, కీళ్ తాళ్‌న్దు = క్రిందికి ప్రవహించుచున్న, అరువి = కొండకాలువలవలె, ఉగు = కారుచున్న, మదత్తాల్ = మదజలముచే, కాల్ కళువి = కాళ్ళను కడిగి, మిగు = మిక్కిలి, మదమ్ = మత్తునుగలుగజేయు, తేన్ విణ్డ = తేనెలతో నిండియుండు, మలర్ = పుష్పములను, కైయాల్ = తన తొండముచే, కొణ్డు = తీసికొనివచ్చి, కళిఱు = ఏనుగు, విఱల్ వేంగడవనై = మహాబలిష్ఠులైన శ్రీనివాసుని, కణ్డువణఙ్గుమ్ = సేవించి నమస్కరించును.

తా॥ నోటిలోపడుచున్న తన మదజలముచే తన నోటినికడిగి పరిశుద్ధముచేసికొని, కొండకాలువవలె క్రిందికి ప్రవహించుచున్న మదజలములచే పాదములను కడిగికొని, మిగులమత్తును గలిగించు తేనెలతో నిండియుండు వికసించిన పుష్పములను తొండములతో గోసికొని, ఏనుగు గూడ తిరువేంగడముడైయాన్లను సేవించి తన జన్మమును సార్థకపఱచుకొనుచున్నది. తిర్యగ్‌జాతి జంతువులును ఆ తిరుమలయొక్క పవిత్రతా మాహాత్మ్యమున భగవంతునియందు భక్తిగలవై, అతని నారాధించి ధన్యములగుచున్నవని పరమార్థము.

వి. వి :— (1) తిరుమలలో తిర్యగ్జంతువులు గూడ సదాచారపరాయణములై భగవానుని సేవించుచున్నవి — అని సూచింపబడుచున్నది.

(2) మదించిన ఏనుగునకు కుంభస్థలమునుండియూ, గండస్థలములనుండియు స్రవించుమదజలము, దానినోటిలో పడును; కాళ్ళపై ప్రవహించును, ఈ స్వాభావసిద్ధమైన కార్యములను ఆళ్వారులు, తమ అధ్యవసాయమునకు అనుగుణముగ వర్ణించుచున్నారు.

(71) అవ :— అహంకారమును నిర్మూలించు తిరువేంగడమే శ్రీకృష్ణస్వామికి నిత్యవాసమైయున్నదని అభివర్ణించుచున్నారు.

కళిఱు ముగిల్ కుత్త క్కై యెడుత్తోడి,
ఒళిఱు మరుప్పొశిగై యాళి — పిళిఱి
విழ, క్కొన్ఱు నిన్ఱదిరుమ్ వేఙ్గడమే, మేల్ నాళ్
కుழక్కన్ఱు కొణ్డెఱిన్దాన్ కున్ఱు. ౭౧

టీక :— కళిఱు = ఏనుగు, కై = తనతొండమును, ఎడుత్తు = ఎత్తుకొని, ఓడి = పరుగెత్తి, ముగిల్ = మేఘములను, కుత్త = గ్రుద్దగా ; పిళిఱి విழ = అట్టి ఏనుగు గూడ) భయపడునట్లు, ఒళిఱు = ప్రకాశించుచున్న, మరుప్పు = తెల్లని దంతములును, ఒళి = ప్రకాశించుచున్న, కై = తొండముగల, యాళి = "యాళి" అను జంతువు, కొన్ఱు = (దానిని) చంపి, నిన్ఱు = గర్వముతో నిలచి, అదిరుమ్ = గర్జించుచున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే ; మేల్ నాళ్ = పూర్వకాలమున, కుழక్కన్ఱు = చిన్నదూడను, (వత్సాసురుని) కొణ్డుఎఱిన్దాన్ = ఎత్తివిసరివైచిన శ్రీకృష్ణ స్వామియొక్క కున్ఱు = పర్వతము.

తా॥ మదించియున్న ఏనుగు, మేఘమును జూచి, అది తనకు ప్రతిపక్షియని తలంచి, తాళజాలక, తన తొండమునెత్తుకొని పరుగెత్తి, ఆ మేఘమును తుత్తునియలగునట్లు మోదుచుండగా, — దానిని చూచి సహింపజాలక, ఆ మత్తగజము గూడ భయపడునట్లు గర్జించుచు, తన తెల్లనిదంతములును, బలిష్ఠమగు తొండమును ప్రకాశించుచుండ, శరభము (యాళి) వేవేగనే తెంచి దానిని సంహరించుచున్నది. అట్టి పరమాశ్చర్యములకు నిలయమగు శ్రీవేంకటాచలమే—మున్ను కపిత్థ—వత్సాసురుల నొక ప్రయత్నముననే సంహరించినశ్రీకృష్ణస్వామి వేంచేసియుండు దివ్యపర్వతము.

(72) అవ :— శ్రీ వేంకటాచలమే, సర్వోత్తములగు నిత్యసూరులకును స్వామియైన శ్రీమన్నారాయణుని నివాసస్థలము—అని చెప్పుచున్నారు.

కన్ఱినాయ కుఱమగళిర్ కోల్ వళై క్కై,
శెన్ఱు విళై యాడుమ్ తీఙ్గళై పోయ్, — వెన్ఱు
విళఙ్గుమది కోళ్ విడుక్కుమ్ వేఙ్గడమే, మేలై
ఇళఙ్గుమరర్ కోమా నిడమ్. ౭౨

టీక :— కున్ఱు ఒన్ఱిన్ = శ్రీ వేంకటాచలమొకటియే, ఆయ = ప్రాప్యముగ గలవారై, శెన్ఱు = వెళ్ళి, పిణ్ణైయాడుమ్ = విహరించుచున్న, కుఱమగళిర్ = బోయతల యొక్క, కోల్ కై = సుందరములైన చేతులతో, వళై = వంచబడిన, తీప్పొఱై = అందమైన వెదుళ్ళు, పోయ్ = పట్టువిడుటవలన పైకి వెళ్ళి, వెన్ఱు - (రాహువును) జయించి, విళఙ్గుమ్ = ప్రకాశించుచున్న, మతి = చంద్రునియొక్క, కోళ్ = భయమును, విడుక్కుమ్ = పోగొట్టుచున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే, మేలై = సర్వోత్తములైన, ఇళమ్ కుమరర్ = నిత్యయౌవన కౌమారమును గలిగిన నిత్యసూరులకు, కోమాన్ = స్వామియైన శ్రీమన్నారాయణుడు, ఇడమ్ = నివసించుస్థలము

తా॥ భగవదనుభవామృతమును ఎల్లప్పుడును పానముచేయు చుండుటచే నిత్యకౌమారవయస్కులగు నిత్యసూరులకును స్వామియైన సర్వేశ్వరుడు నివసించు శ్రీ వేంగడము, పరమైశ్వర్యములకు పుట్టినిల్లై యున్నది. జ్ఞానశూన్యులలో మొదటివారగు కిరాతస్త్రీలును, శ్రీ వేంకటాచలమే, మనకు పరమప్రాప్యమని దృఢాధ్యవసాయముతో నున్నారు. సత్యసంధుడైన శ్రీరామచంద్రమూర్తి, ధర్మాత్ముడు—అను దృఢాధ్యవసాయముతో, సౌమిత్రిచే విడువబడిన బాణము, దుర్జయుడగు ఇంద్రజిత్తునుగూడ సంహరించినట్లు, కిరాతస్త్రీలును, అట్టి దృఢాధ్యవసాయముగల వారలగుటచే, వారు విహరించునప్పుడు క్రిందికిలాగి విడిచిన వెదుళ్ళు, ఆకసమునకు నెగసి, చంద్రునిబాధించు దుర్జయుడగు రాహువును సంహరించి, చంద్రుని ప్రకాశింపజేయుచున్నవి. చూచువారలకు ఈకార్యమెంతయును ఆశ్చర్యజనకముగ నున్నది.

(73) అవ :— ఆదిత్యమండలాన్తర్వర్తియై, యతని రథమును నడిపించువాడును, శ్రీ వేంకటాచలమున కుంభనర్తనముచేయుచు వేంచేసియున్నవాడునునగు సర్వేశ్వరుని పాదారవిందములను స్తోత్రము చేయుటయే నానాలుకకు పరమార్థము — అని సాధించుచున్నారు.

ఇడమ్ వలమే ఏழ் పురవి ఇరవి త్తేరోట్టి,
వడముగ వేజ్గడత్తు మన్నుమ్ — కుడమ్ నయన్ద,

కూత్తనాయ్ నిన్ఱాన్ కురై కழలే కూఱువదే,
నా త్తన్నాలుళ్ళ నలమ్. 23

టీక :— ఏழ్ పూణ్డ = ఏడుగుఱ్ఱములుకట్టిన, ఇరు తేర్ = సూర్యునిరథమును, ఇడమ్ = ఎడమ పక్కకు, వలమ్ = కుడిప్రక్కకు. ఓడి = (వాని అంతర్యామిగనుండి) నడిపించి, వడమగమ్ వేంగడత్తు = ఉత్తరదిక్కునందు ముఖ్యక్షేత్రమైన శ్రీ వేంకటాచలమున, మన్ను మ్ = నిత్యవాసము చేయువాడును, నయన్ద = మిక్కిలి ప్రేమగలవాడై, కుడమ్ కూత్తనాయ్ = గోపికలతో కుంభనర్తనము చేయువాడునై, నిన్ఱాన్ = వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క, కురై = శబ్దించుచున్న, కழల్ = తిరువడిగళ్ళను, కూఱువదే = స్తోత్రము చేయుటయే, నాత న్నాల్ ఉళ్ళ = నా నాలుకచే నాకులభించెడి, నలమ్ = పురుషార్థము.

తా॥ కాలమునకు నిర్వాహకుడై, సమస్తలోకముల సంరక్షించు సూర్యుని, ఏడుగుఱ్ఱములుకట్టిన రథమును, మహామేరువునకు కుడియెడమలుగ, (దక్షిణాయన, ఉత్తరాయనములుగ) వాని అంతర్యామియై నడిపించువాడును, ఉత్తరదిక్కునకు తిలకస్థానమైనయుండు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయువాడును, భక్తులగు గోపికల యాదలి నిరవధికప్రేమచే కుంభనర్తనముచేయువాడునునై, వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క ఆభరణముల అలజడిచే మ్రోగుచున్న శ్రీపాదములను స్తోత్రము జేయుటయే నాకు నాలుకఉన్నందులకు పరమప్రయోజనము.

వి. వి :— (1) సర్వేశ్వరునకు సూర్యమండలము గూడ వాసస్థానము.
(2) "సప్త యుంజన్తి రథమేక చక్రమ్" అని వేదమునందును,
"హయాశ్చ సప్త చ్ఛన్దాంసి తేషాం నామా నిమే శ్రుణు
గాయత్రీ చ బృహత్యుష్ణిక్ జగతీ త్రిష్టుభేవ చ ।
అనుష్టుప్ పంక్తిరిత్యాద్యాః ఛన్దాంసి హరయో రవేః" అని పురాణముల యందును, "కా ర్ పురవి యేழ் పూణ్డ తని యాழி తేదార్ నిన్ఱ కదిరోన్" అని శిఱియతిరుమడలందును చెప్పబడియున్నది.

(75) అవ :— ఆశ్చర్యములకు ఆటపట్టగు శ్రీ వేంకటాద్రియే, వేంగై పుష్పముల పరిమళములతో మనోజ్ఞమైయుండు, శ్రీకృష్ణస్వామి వాసస్థలము — అని ఆనతిచ్చుచున్నారు.

శార్ న్దకడు తేయ్ప్ప త్తడావియకోట్టుచ్చివాయ్,
ఊర్ న్దియజ్గుమ్ వెణ్ మదియి నొణ్ముయలై, — శేర్ న్దు,
శినవేజ్గై పార్ క్కుమ్ తిరుమలై యే, ఆయన్
పునవేజ్గై నాఱుమ్ పొరుప్పు. 2౫

టీక :— తడావియ = మిక్కిలి విశాలములైన, కోడు = శిఖరములయొక్క, ఉచ్చివాయ్ = కొనలయందు, అడు = క్రింద భాగములను, తేయ్ప్ప = రాచుకొను, నటు, శార్ న్దు ఊర్ న్దు = దగ్గరగను, మెల్లగను, ఇయజ్గుమ్ = సంచరించుచున్న, వెణ్ మదియిన్ = తెల్లని చందమామయందలి, ఒణ్ ముయలై = సుందరమైన కుందేటిని, వేజ్గై = పులి, శేర్ న్దు = సమీపించి, శినమ్ = కోపముతో, పార్ క్కుమ్ = చూచుచున్న, తిరుమలై యే = శ్రీ వేంకటాచలమే, ఆయన్ = శ్రీకృష్ణునికి, పునమ్ = వాసస్థానమై, వేజ్గై = వేజ్గై పుష్పములు, నారుమ్ = పరిమళించుచున్న, పొరుప్పు = పర్వతము.

తా॥ మిక్కిలి విశాలములై యుండు నేపర్వతశిఖరాగ్రములయందు భోగ్యతాతిశయముచే మెల్లగ సంచరించు తెల్లని చంద్రునియందలి నల్లటి కుందేటిని, అచ్చటి అరణ్యములయందు నివసించు పులి ఒకటి చూచి, దానిని సమీపించి, మిక్కిలి కోపముతో గాంచుచున్నదో; అట్టి శ్రీ వేంకటాద్రియే—శ్రీకృష్ణస్వామి నివసించు, వికసించి, పరిమళించు వేంగై పుష్పములతో నలరారునట్టి పర్వతము.

వి. వి :— ఈ పర్వతశిఖరములు, అందు నివసించు శ్రీ త్రివిక్రమస్వామివారి యొక్క వైభవమును ప్రకటించుటకో యనునట్లు, చంద్రమండలమువఱకు వ్యాపించి యున్నవనియు, చంద్రుడు అచ్చటి రమణీయములగు స్థలములలో నేవదీంచుకొనుచుండు ననియు, స్వాశ్రితుల యందలి కళంకమును ఓర్వజాలని పరమాత్ముని దివ్యమహిమను వెల్లడించుటకో యన, లోకోపకారకుడగు చంద్రునకు కళంకము నాపాదించు కుందేటిపై ఆ పర్వతశిఖరనివాసియగు వ్యాఘ్రము తన కోపమును వెల్లడించుచున్నదనియును. అట్టి పరమ విలక్షణమగు పర్వతమున నిఖిలప్రాణిసులభుడై, తన కల్యాణగుణముల పరిమళము దశదిశలకును వ్యాపింపజేయుచు పరాత్పరుడు వేంచేసియున్నాడనియును— ఇట్లనేకములగు వ్యంగ్యార్థము లిచ్చట కొల్లలుగనున్నవి.

(౨౭) అవ :—తిరువేంగడముడై యానులతో గూడ, తిరుమలలో నివసించు బోయవాండ్లును, పరమోద్దేశ్యులై యున్నారని సెలవిచ్చు చున్నారు.

ముడిన్ద పొళుదిల్ కుఱవాణర్, ఏనమ్
పడిన్దుళు శాల్ పైన్దినై గళ్ విత్త, — త్తడిన్దెళున్ద,
వేయ్ఙ్గళై పోయ్ విణ్ తిఱక్కుమ్ వేఙ్గడమే మేలొరునాళ్,
తీఙ్గుళల్ వాయ్ వైత్తాన్ శిలమ్బు. 45

టీక :— ముడిన్దపొళుదల్ =కడచటికాలమును శెళ్ళబుచ్చుచున్న వృద్ధులైన) కుఱవాణర్ = కిరాతులు, ఏనమ్=పందులు, పడిన్దు = ఊనునట్లుగ, ఉళు = దున్నిన, శాల్ = పొలములయందు, పైతినైకళ్ = మంచి తినైయనుధాన్యమును, విత్త=చల్లగ, (ఆపైరు పెంపొందుటకై పెట్టిన నీరు మొదలగు వానిచే,) తడిన్దు=(అక్కడ) నరకబడి, ఎళున్ద = (తిరుగ) పైకిలేచిన, వేయ్ = వెదుళ్ళయొక్క, కళై = కొనలు, పోయ్= పోయి, విణ్ = ఆకసమును, తిరక్కుమ్ = బ్రద్దలుచేయుచున్న, వేఙ్గడమే = శ్రీ వేంకటాచలమే, మేల్ ఒరునాళ్ = మునుపొకకాలమున, తీఙ్గుళల్ = మనోజ్ఞమైన పిల్లఁగ్రోవిని, వాయ్ వైత్తాన్ = తన బింబాధరమునందుంచుకొనిన శ్రీ కృష్ణుని, శిలమ్బు= పర్వతము.

తా॥ ఆ శ్రీవేంకటాచలమున నింకను పెక్కు ఆశ్చర్యములు చూడ నగుచున్నవి. అచ్చట నివసించు ముదుసలిబోయవాండ్రు, అచటనుండు వెదురుపొదలను నరికి, ఆస్థలములను పందులతోదున్ని ధాన్యములను చల్లి, పైరుచేయుచున్నారు వీరు ఆపైరు పెంపొందుటకై పారించిన నీరు మొదలగు సౌకర్యములను ఆధారముగ జేసికొని ముందటి వెదురుదుంపల నుండి వెదుళ్ళుమొలచి, వానికొనలు ఆకాశమును బ్రద్దలుచేయుచున్నవి. అట్టి శ్రీ వేంకటాచలమే — మున్నొకకాలమున, తన దివ్యబింబాధరమున పిల్లనగ్రోవిని ఉంచుకొని, పాటనుపాడి, జగత్తునంతటిని మోహింపజేసిన శ్రీ కృష్ణుడు నివసించుచున్న రమణీయమగు దివ్యపర్వతము.

వి. వి :— (1) ముదుసలిబోయవాండ్రు తమ జాతివృత్తిని వదలి కృషిలో ప్రవర్తించినందులకు కారణమును చెప్పుచున్నది. "ముడిన్ద పొళుదిన్" అను భాగము- (2) శిలమ్బు — పర్వతము.

శ్రీ పేయాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

శ్రీరస్తు

శ్రీమతే వేంకటేశాయ నమః

శ్రీమతే భక్తిసారమునయే నమః

శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ తిరుమళిశై యాళ్వార్లు ప్రసాదించిన
## నాన్ముగన్ తిరువన్దాదిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

దీనిని ప్రసాదించిన తిరుమళిశై యాళ్వార్లు, తొండమండలమున తిరుమళిశై (మహీసారము) అనెడు దివ్యక్షేత్రమున ద్వాపరయుగమున 8,62,901 వ దైన సిద్ధార్ది సంవత్సరమున తులామాసమున కృష్ణపక్ష ప్రథమతిథియందు, ఆదివారము, మఖానక్షత్రము—వీనితో గూడిన శుభ దినమందు, తులాలగ్నమున శ్రీసుదర్శనాంశజులై అవతరించిరి. వీరు కనకాంగి యను అప్సరస్త్రీయందు భార్గవమహర్షికి కుమారులై యవతరించిరి. వీరిని పెంచినవారు హరిదాసులు.

ఈ ఆళ్వార్లు, కేవలము భగవత్కటాక్షమునే ధారకపోషక భోగ్యములుగ జేసికొని, యోగాభ్యాసనిరతులై, ముదలాళ్వార్లను సంధించి, వారలతో గూడి, దివ్యదేశములనన్నిటిని సంచరించి, "నాన్ముగన్ తిరువన్దాది" మొదలగు దివ్యప్రబంధములను సాదించిరి.

ముదలాళ్వార్లు, అనుభావ్యవస్తువును నిష్కర్షించి చూపిరి. వీరు దానిని విపులముగ పరిష్కరించిరి. జీవాత్మలయందే ఈశ్వరత్వబుద్ధిని నిలిపి అనర్థపడుచుండు సంసారులకు "బ్రహ్మరుద్రేంద్రాదులందఱును, మనవలె, బద్ధచేతనులే; నారాయణు డొక్కడే పరదైవము" అని ఈశ్వరునియొక్క పరత్వమును ఉపపాదించి, వారలను ఉజ్జీవింపజేసిరి.

వీరు, నాన్ముగన్ తిరువన్దాదిలో 13 పాశురములచే తిరువేంగడముడైయాన్లను మంగళాశాసనము జేసియున్నారు.

(3౮) అవ:— అందీ పాశురమున, దాసుని రక్షించుటకే శ్రీమన్నారాయణుడు ఈ భూలోకమున పుణ్యక్షేత్రములయందు నివసించుచున్నాడు—అని ఆనతిచ్చుచున్నారు.

కుఱిప్పెనక్కు క్కోట్టియూర్ మేయానై యేత్త,
కుఱిప్పెనక్కు నన్మై పయక్క—వెఱుప్పనో,
వేఙ్గడత్తు మేయానై మెయ్వినైనోయ్ ఎయ్దామల్,
తాన్కడత్తుమ్ తన్మైయాన్ తాళ్. 3౮

టీక:— క్కోట్టియూర్ మేయానై = తిరుక్కోట్టియూరను దివ్యదేశమునందు వేంచేసియుండు వానిని, వేంగడత్తు మేయానై = శ్రీ వేంకటాచలమున నిత్యవాసము చేయువానిని, ఏత్త = స్తుతించుటను, ఎనక్కు = దాసునికి, కుఱిప్పు = ఉద్దేశ్యము; నన్మై = మంచి కార్యములను, పయక్క = వృద్ధిజేయుచుండుటకు, ఎనక్కు = దాసునికి, కుఱిప్పు = అభిప్రాయము; మెయ్వినైనోయ్ = శరీరమునకు సంబంధించిన కర్మములను వ్యాధులను, ఎయ్దామల్ = సోకకుండునట్లు, తాన్ = తానే, కడత్తుమ్ = నన్ను తరింపజేయు, తన్మైయాన్ = స్వభావముగల సర్వేశ్వరునియొక్క, తాళ్ = శ్రీపాదములను, వెఱుప్పనో = ఉపేక్షింతునా?

తా॥ దాసునికి తన దివ్యమంగళవిగ్రహమును సందర్శింపజేసి, నా కర్మవ్యాధులను నివర్తింపజేయుటకై పరమకృపతో తిరుక్కోట్టియూరునందును, శ్రీ వేంకటాద్రియందును, పరమసులభుడై వేంచేసియుండు మా స్వామియొక్క పరమభోగ్యములగు తిరువడిగళ్ళను నేను ఉపేక్షింపగలనా? ఎల్లప్పుడును వానిని స్తుతించుటయే నాకు పరమోద్దేశ్యము.

(3౯) అవ:— మనోవాక్కాయములచే నెల్లప్పుడును ఆ తిరువేంగడముడయానులనే సేవించెదను—అని ఆఴ్వార్లు కృపజేయుచున్నారు.

అఱైప్పుల్ తిరువేఙ్గడత్తానై క్కాణ,
ఇఱైప్పుల్ తిరుక్కూడల్ కూడ—మఱైప్పె
రరువి మణివరన్ఱి వన్దిఴియ, యానై,
వెరువి యరవొడుఙ్గుమ్ వెఱ్పు. 3౯

టీక :— తిరువేంగడత్తానై = శ్రీవేంకటాచలాధిపతిని, కాణ = సేవించ, అழைప్పన్ = పిలుతును ; పేర్ మாழை = మిక్కుటములగు వర్షములచే ప్రవహించుచున్న, అరువి = కొండకాలువలు, మణివరన్ఱి = మణులను కుప్పలుకుప్పలుగ జేర్చుకొని, వన్దు = వచ్చి, ఇழி యు = క్రిందపడగ, ఆనై = ఏనుగు, వెరువి = భయపడి, అరవు = కొండచిలువయను సర్పముయొక్కనోటిలో, ఒడుఙ్గుమ్ = (ఎచ్చట) పడుచున్నదో, వెఱ్ప్పు = అట్టి శ్రీ వేంకటాచలమును, కూడ = చేరవలయునని, తిరుక్కూడల్ = ఇసుకచే చక్రాకారముగ వ్రాసి, ఇழை ప్పన్ = సందర్శింతును.

తా॥ నే నెల్లప్పుడును శ్రీవేంకటాచలపతిని సందర్శింపవలయునని ఆశపడి, దీనాతిదీనుడనగు నాకు సేవసాదింపుమని మొరలిడుచున్నాను. వర్షములు మిక్కుటమగుటచే గట్లనొరయుచు, రత్నములను చేర్చుకొని, పారుచున్న కొండకాలువలు, పెద్దధారలతో క్రిందపడగ, వానిని చూచి, ఏనుగులు భయపడి, పరుగెత్తి, నోరుతెరచుకొనియుండు కొండచిలువ బారినిపడి, మరణించుచున్నవి. అట్టి వినోదములకు ఆటపట్టగు శ్రీవేంకటాద్రిని సత్వరమే చేరవలెనని, ఇసుకయందు దాని ఆకారమును వ్రాసి, ఎల్లప్పుడును చూచుచున్నాను.

వి. వి :— "తిరుక్కూడ ఇழைప్పన్". కూడల్ ఇழைత్తల్ - అనగా శకునము చూచు ప్రకారము. ఇసుకలో మండలాకారముగ గీతగీచి, అందులో అనేక వలయాకారపు గీతలగీచి, రెండురెండుగా ఎంచునప్పుడు సరిసంఖ్యలో ముగిసిన కార్యపూర్తియగును; బేసి సంఖ్యయైన కార్యభంగమగును. దీనినే "కూడల్" "కూడలిழைత్తల్, వళైత్తల్" కూడఱ్కుటి— అని పలువిధములుగ అరవమున వ్యవహరింతురు. "తెళ్ళియార్ పలర్" అను పాశురమున ఆండాళమ్మగారు దీని ననుష్ఠించియున్నారు.

(2) ఈ "కూడలిழைత్తల్" అనునది స్త్రీలకే చెందినదగుటచే ఆழ்వారులు నాయకీభావమునుబొంది దీనిని సాదించుచున్నారు— అని కొందఱు చెప్పుచున్నారు

(40) అవ :— శ్రీ వేంకటాచలమునే నే నెల్లప్పుడును సంకీర్తనము చేయుచున్నాను. అందుచే, నాకును, నాబంధువులకును మోక్షము కరతలామలకమైనది. ఆహా! ఏమిదాని వైభవము — అని ఆశ్చర్యపడుచున్నారు.

వెఱ్ఱ్పెన్ఱు వేఙ్గడమ్ పాడినేన్, వీడాక్కి
నిఱ్కిన్ఱేన్ నిన్ఱు నినైక్కిన్ఱేన్, — కఱ్కిన్ఱ
నూల్ వలైయిల్ పట్టిరున్ద నూలాట్టి కేళ్వనార్,
కాల్వలైయిల్ పట్టిరున్దేన్ కాణ్. ౮౦

టీక :— వెఱ్ఱ్పెన్ఱు = పర్వతమను ప్రసక్తి వచ్చినపుడెల్లను, వేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, పాడినేన్ = సంకీర్తనము చేసితిని : (అందువలన నాకును నా బంధువులకును, వీడు = మోక్షమును, ఆక్కి నిఱ్కిన్ఱేన్ = కలుగజేసికొనియున్నాను; నిన్ఱు = స్థిరముగనుండి, నినైక్కిన్ఱేన్ = ధ్యానము చేయుచున్నాను; కఱ్కిన్ఱ = అభ్యసించుచున్న, నూల్ వలైయిల్ = వేదశాస్త్రములనెడు వలలయందు, పట్టిరున్ద = (ప్రతిపాదింప) బడుచున్న, నూలాట్టికేళ్వనార్ = శ్రీ లక్ష్మీదేవికి భర్తయైన సర్వేశ్వరుని యొక్క, కాల్ వలైయిల్ = తిరువడిగళ్ళను వలయందు, పట్టిరున్దేన్ కాణ్ = పడిపోయితిని సుమీ !

తా॥ ఎచ్చటనైనను, ఏ విధముగనైనను పర్వతమను ప్రసక్తి వచ్చినపుడెల్ల శ్రీ వేంకటాచలమునే బహుభంగుల సంకీర్తన మొనరించితిని. అంతమాత్రముననే నాకును, నన్ను చేరిన వారలకును, మోక్షము కరగతమైనది. ఇప్పుడు దానిఫలితమును బాగుగ తెలిసికొని, ఎడతెగక తిరుమలనే ధ్యానించుచున్నాను. వేదశాస్త్రములయందు ప్రతిపాదింపబడు భక్తియను వలయందు శ్రియఃపతి చిక్కుకొనియున్నాడు. అతని పాదారవిందములను వలయందు నేను చిక్కుకొనియున్నాను. పరమభోగ్యములగు తిరువేంగడముడయానుల దివ్యపాదారవిందములను సందర్శించినంత మాత్రమున ఎట్టివారలకును మనస్సు తనాయత్తమై నిష్కళంక భక్తి నిష్ఠ ఏర్పడుననియును, అందువలన భగవంతుడు సులభుడగుననియును పరమతాత్పర్యము.

వి. వి :— (1) నిన్ఱు నినైక్కిన్ఱేన్ — బుద్ధిపూర్వకముగ మనమొక మంచి మాటను చెప్పుకున్నను సర్వేశ్వరుడు తానే వానిని స్వీకరించుచున్నాడు. ఏమి యాశ్చర్యము ! అని దీనినే అనుసంధించుచు తదేకపరుడనైయున్నానని భావము.

(2) కట్కొన్న నూల్ వలైయిల్ పట్టిరున్ద నూలాట్టి కేళ్వనార్ - "మంత్రాధీనంతు దైవతమ్" అనునట్లుల, అపౌరుషేయమై, నిత్యనిర్దుష్టమై, పరంపరగ నధ్యయనము చేయబడు వేదశాస్త్రములచే ప్రతిపాదింపబడు వారగుటచే, పెరుమాళ్ళు "నూలాన్" అనియు, పిరాట్టి "నూలాట్టి" అనియును వ్యవహరింపబడుచున్నారు. నూలాట్టి కేళ్వనయిన పురుషసింహము శాస్త్రవిహితములగు కర్మ-జ్ఞానయోగములతో గూడిన భక్తియోగమను వలలో జిక్కికొనును. ఆ పురుషోత్తమ సింహమును కేవలము సాధనాన్తరములచే గట్టసాధ్యము గాదు. అట్టి, పురుషాధముడనగు నేను దేనికిని కట్టుబడక, నాకు తోచినట్టుల తిరుగుచుంటిని. నన్ను వారి శ్రీపాదపద్మములు కట్టివైచినవి. సర్వేశ్వరుడు ఒక వలలో చిక్కుకొనెను; నేను మఱియొక వలలో దగుల్కొని యున్నాను — అని అన్తరార్థము.

(41) అవ :— మిక్కిలి ఆశతో శ్రీ వేంకటాచలపతి నా హృదయమున ప్రవేశించెను. నాకు అతని వేంకటాచలమును సందర్శింపవలయునని కుతూహలము ఉత్కటమైయున్నది — అని సెలవిచ్చుచున్నారు.

కాణలుఱుగిన్ఱేన్ కల్లరువి ముత్తుదిర,
ఓణ విழవిలొలియదిర, — ప్పేణి
వరువేఙ్గడవా ఎన్నుళ్ళమ్ పుగున్దాయ్,
తిరువేఙ్గడమదనై చ్చెన్ఱు. ౪౧

టీక :— అరువి = సెలయేళ్ళు, కల్ = రత్నములను, ముత్తు = ముత్యములను, ఉదిర = వెదజల్లుచుండగ, ఓణవిழవిల్ = శ్రీ శ్రవణనక్షత్రోత్సవమున, ఒలి = మంగళాశాసన ధ్వనిని, అదిర = చేయుచుండగ. (దానిననాదరించి), పేణివరుమ్ = ఆశపడివచ్చి, ఎన్నుళ్ళమ్ = నా హృదయమున, పుగున్దాయ్ = ప్రవేశించితివి; వేఙ్గడవా = ఓ వేంకటాచలపతీ! తిరువేఙ్గడమ్ అదనై = నీ నిత్యనివాసస్థానమగు తిరువేంగడమునకు శెన్ఱు = వెళ్ళి, కాణల్ = సేవింపవలయునని. ఉరుగిన్ఱేన్ = కరగిపోవుచున్నాను

తా॥ శబ్దించుచు ప్రవహించుచున్న సెలయేళ్ళు — రత్నములను, ముత్యములను వెదజల్లుచు, గొప్ప ఆరవారముతోనున్నవి. దీనికితోడు నీ జన్మనక్షత్రమగు శ్రీ శ్రవణనక్షత్రముతో గూడిన పండుగదినమున భక్తులెల్లరును నలుదిక్కులనుండి విచ్చేసి, భక్తిమీఱ, మంగళాశాసనముల

చేయుచున్నారు. అట్టి సమయమున వానినెల్ల ననాదరించి, మిక్కిలి యాశతో నా హృదయమున ప్రవేశించియున్నావు. ఆహా! ఏమి నీ సౌశీల్యము! పరమభోగ్యమగు నీ తిరువేంగడ పర్వతమును సందర్శింప వలయునని నేను చాల ఆశపడుచున్నాను.

వి వి:— నేను తిరుమలకు వచ్చి దేవరవారిని సేవింపవలయునని ఆశపడు చుండగా, మీరు వచ్చి నా హృదయమున నివసించుచున్నారు. ఇక నేనేమి చేయ గలను? అని భావము గూడ చెప్పవచ్చును.

(42) అవ:— దివ్యములగు సిరిసంపదలతో దులదూగుచు, భక్తులపాపములను పరిహరించు శ్రీ వేంకటాచలమును సత్వరమే ఆశ్ర యింపుడు — అని జనులను ప్రబోధించుచున్నారు.

> శెన్ఱు వణఙ్గుమినో శేణుయర్ వేఙ్గడత్తై,
> నిన్ఱు వినై కెడుక్కుమ్ నీర్మైయాల్, — ఎన్ఱుమ్
> కడిక్కమల నాన్ముగనుమ్ కణ్మూన్ఱత్తానుమ్,
> అడిక్కమల మిట్టేత్తుమ్ అఙ్గు. ౪౨

టీక:— ఎన్ఱుమ్ = ఎల్లప్పుడును, కడి = పరిమళించుచున్న, కమలమ్ = భగ వానుని నాభికమలమును జన్మదేశముగగల, నాన్ముగనుమ్ = చతుర్ముఖ బ్రహ్మయు కణ్మూన్ఱత్తానుమ్ = త్రినేత్రుడగు పరమ శివుడును, అడి = పాదారవిందములయందు కమలమ్ = తామరపుష్పములను, ఇట్టు = సమర్పించి, ఏత్తుమ్ = (ఎచ్చట) స్తోత్రము చేయుచున్నారో, అఙ్గు = అట్టి తిరుమలకు, శెన్ఱు = వెళ్ళి, నిన్ఱు = నిలచి, నీర్మైయాల్ = స్వభావముచే, వినై = పాపములను, కెడుక్కుమ్ = పోగొట్టునటువంటి, శేణుయర్ = మిక్కిలి ఉన్నతమైన, వేంగడత్తై = శ్రీ వేంకటాచలమును, వణఙ్గుమినో = నమస్కరింపుడు (ఓ స్నేహితులారా! ఆశ్రయింపుడు)

తా॥ నిత్యపరిమళమిళితమగు పరమాత్ముని నాభికమలమున నుద్భ వించిన శ్రీ చతుర్ముఖ బ్రహ్మయు, అతనికి కుమారుడై దివ్యమహి మాన్వితుడై త్రినేత్రుడగు పరమశివుడును, భగవంతుని శ్రీపాదముల యందు దివ్యములగు తామరపుష్పములను సమర్పించి, తిరువేంగడముడ యానులను స్తోత్రముజేయుచున్నారు. పాపముల బోగొట్టు స్వభావము గలట్టి పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమును సత్వరమే ఆశ్రయింపుడు.

వి షి :— "శేన్" అను పదమునకును ఔన్నత్యమే అర్థముగనుక, "శేణ్ ఉయిర్" అనగా మిక్కిలి యున్నతమైన — అని అర్థము సిద్ధించును.

(2) పాపముల బోగొట్టుటయే తిరుమలకు స్వభావము. వేం — సర్వపాపములను కట — దహించునది — అని, నామధేయమే ఈ విషయమును విశదీకరించుచున్నది. "వేఙ్గడఙ్గళ్" అను నమ్మాళ్వార్ల పాశుర మిచ్చట ననుసంధింపదగినది.

(43) అవ :— దివ్యమహిమాన్వితులగు బ్రహ్మరుద్రులును శ్రీ స్వామివారికి దివ్య నీరాజనముల సమర్పించుటకై సంధ్యాకాలమున తిరుమలకు విచ్చేయుచున్నారు. అట్టి తిరువేంగడమును మీరును ఆశ్రయింపుడు—అని ప్రబోధించుచున్నారు.

> మఙ్గుల్ తోయ్ శెన్ని వడవేఙ్గడత్తానై,
> కఙ్గుల్ పుగున్దార్గళ్ కాప్పణివాన్ — తిఙ్గళ్,
> శడైయేఱ వైత్తానుమ్ తామరై మేలానుమ్,
> కుడైయేఱత్తాఙ్గువిత్తు కొణ్డు. ౪౩

టీక :— తిఙ్గళ్ = చంద్రుని, శడై ఏఱవైత్తానుమ్ = తన జటాజూటమున నలంకరించుకొనియున్న పరమశివుడును, తామరై మేలానుమ్ = దివ్య సౌంగధ్య సౌకుమార్యముల కాటపట్టగు దివ్యతామరపుష్పమునందు నివసించు చతుర్ముఖ బ్రహ్మయును, తామ్ = తాము, కుడై = గొడుగు మొదలగు సాధనములను, ఏఱనువిత్తుకొణ్డు = సంపాదించుకొని, మఙ్గుల్ తోయ్ = మేఘమండలమునకు వ్యాపించియున్న, శెన్ని = శిఖరములుగల, వడవేఙ్గడత్తానై = ఉత్తరదిక్కునందున్న శ్రీ వేంకటాచలమునకు అధిపతియైనవానికి, కాప్పు అణివాన్ = తిరువెందికాప్పు (నీరాజనము—మంగళహారతి) సమర్పించుటకై, కఙ్గుల్ = సంధ్యాసమయమున, పుగున్దార్గళ్ = వచ్చి ప్రవేశించిరి.

తా॥ చందమామను అలంకారముగ జటలయందుంచుకొనిన పరమశివుడును, దివ్యమగు తామరపుష్పమందుద్భవించిన చతుర్ముఖ బ్రహ్మయు, ఈ పర్వతపు శిఖరములు మేఘమండలమును ఒరుసుకొనుచుండుటచే పెద్దవర్షము కురియుచుండగ, గొడుగులను ఎత్తిపట్టుకొని కొంతవర్షములో తడియుచు, సమయముమించిపోవునేమో యను భయముచే, ఉత్తరదిక్కునకు తిలకస్థానీయమైయుండు శ్రీ వేంకటాచలమునకు,

శ్రీ స్వామివారికి సంధ్యాకాలమున మంగళహారతుల సమర్పించుటకై, ససంభ్రమమున వేచ్చియుచున్నారు. అట్టి దివ్యవైభవోపేతమగు తిరుమలను, మీరును వెళ్ళి, ఆశ్రయింపుడు.

వి. వి :— ఇచ్చట భత్రము చెప్పినది - చామరము మొదలగు నిఖిలభోగోపకరణములకును ఉపలక్షణము.

(44) అవ :— ఎట్టివారలనైనను హితైషియై సంరక్షించు సర్వేశ్వరుడు విజయము చేసియుండు శ్రీ వేంకటాద్రిని, ఇంద్రియములన్నియును స్వాధీనముగనున్నపుడే వెళ్ళి ఆశ్రయింపుడు—అని జనులను ప్రబోధించుచున్నారు.

కొణ్డు కుడఙ్గాల్మేల్ వైత్త కుழవియాయ్,
తణ్డవరక్కన్ తలైతాళాల్ — పణ్డెణ్ణి,
ప్పోమ్ కుమరన్ నిఱ్కుమ్ పొழిల్ వేఙ్గడమలైక్కే,
పోమ్ కుమరరుళ్ళీర్ ! పురిన్దు. ౪౪

టీక :— కొండు = ఎత్తికొని, కుడఙ్గాల్ మేల్ = ఒడిలోనుంచుకొనబడిన, కుழవియాయ్ = చిన్నబిడ్డయై, తణ్డ = దండింపదగిన, అరక్కన్ = రావణాసురుని, తలై = (పది) తలలను, పండు = పూర్వకాలమున, తాళాల్ = తన శ్రీపాదములచే, ఎణ్ణిప్పోక్కు = లెక్కపెట్టి అంతర్ధానమైన, కుమరన్ = నిత్యకౌమారముగల సర్వేశ్వరుడు, నిఱ్కుమ్ = వేంచేసియున్నట్టి, పొழిల్ = రమణీయములగు ఉద్యానవనములతో గూడుకొనియుండు, వేఙ్గడమలైక్కే = శ్రీ వేంకటాద్రికే, కుమరరుళ్ళీర్ = కౌమారావస్థయందు (ఇంద్రియములు స్వాధీనములైయుండునపుడే) నుండు వారలారా! (మీరలు) పురిన్దుపోమ్ = వెళ్ళి ఆశ్రయింపుడు.

తా॥ రావణుడు ఒకప్పుడు బిడ్డయైయున్న పరమాత్మనియెత్తుకొనగా, "పరమక్రూరుడవగుటచే నీ పదితలలును ఒకప్పుడు ఛేదింపబడును" అని తన శ్రీపాదములచే తలలపై గిరిసూచించి, ఆబిడ్డ, అన్తర్ధానమాయెను. అట్టి దుష్టశిక్షకుడగు పరమాత్ముడు వేంచేసియుండు శ్రీ వేంకటాచలమును పటుకరణులైయుండునపుడే మీరలెల్లరును వెళ్ళి ఆశ్రయింపుడు.

వి. వి:— (1) ఈ పాశురమున నుదాహరించిన కథ, "తామే యమగర్ క్కటియు" (1-తి 40-పా) అను పాశురమునను, "అయ్ త్తవరు మహైలన్" (3-తి 75-పా) అను పాశురమునను ఉల్లేఖింపబడినది. ఈ కథ, "శీమాలిగనవనోడు" అను పాశురమున జెప్పినకథ-లె పురాణములలో గనుడకపోయినను, ఆళ్వారులకే భగవదనుగ్రహ విశేషమున స్ఫూరించినది — అని సమాధానము చెప్పుకొనవలయును.

(2) వయసు ముదిరిన తరువాత మనస్సుచే స్మరించుటకును శక్యము గాదు. కాన, యౌవనము పోకముందే తిరుమలకు వెళ్ళుడు — అని "కుమరరుళ్ళీర్" అను పదముచే నుపదేశించుచున్నారు.

(45) అవ :— సంసారులకు మాత్రమేగాక, నిత్యసూరులకును సంసేవ్యమై తిరుమల యలరారుచున్నది — అని పాడించుచున్నారు.

పురిన్దు మలరిట్టు ప్పుణ్డరీగ ప్పాదమ్,
పరిన్దు పడుకాడు నిఱ్పు, — త్తెరిన్దెఙ్గుమ్
తానోఙ్గి నిఱ్కిన్ఱాన్ తణ్ణరువి వేఙ్గడమే,
వానోర్ క్కుమ్ మణ్ణోర్ క్కుమ్ వైప్పు. ౪౫

టీక :— పురిన్దు = ఆశ్రయణోన్ముఖులై, పుణ్డరీగప్పాదమ్ = పుండరీకములవలె పరమభోగ్యములైన తిరువడిగళ్ళయందు, మలర్ = దివ్యములగు పుష్పములను, ఇట్టు = సమర్పించి, పరిన్దు = ఆశపడి, పడుకాడునిఱ్పు = వదల లేక అక్కడనే యుండునట్లు, ఎఙ్గుమ్ = సర్వదేశములయందును, తెరిన్దు = ప్రకాశించి, తాన్ = తాను, ఓఙ్గి = సర్వాధికుడై, నిఱ్కిన్ఱాన్ = వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క, తణ్ = చల్లని, అరువి = కొండకాలవలు పాఱుచున్న, వేంగడమే = శ్రీ వేంకటాచలమే, వానోర్ క్కుమ్ = పరమపదవాసులగు నిత్యసూరులకును (దేవతలకును) మణ్ణోర్ క్కుమ్ = భూమియందు నివసించు మనుష్యులకును, వైప్పు = పెన్నిధియైయున్నది.

తా॥ నిరతిశయ భోగ్యములగు సర్వేశ్వరుని తిరువడిగళ్ళలో దివ్యములగు కుసుమముల సమర్పించి, పరమప్రీతితో నెల్లప్పుడును సేవించుచుండుట కనువగునట్లు అన్ని దేశముల యందును వ్యాపించి, సర్వాధికుడై యుండు సర్వేశ్వరుడు వేంచేసియుండు పరమభోగ్యమగు శ్రీవేంకటాద్రియే, నిత్యవిభూతిలో నుండు నిత్యసూరులకును, లీలావిభూతిలో నుండు మనుష్యులకును పరమసులభమైన పెన్నిధిగానున్నది.

(1) వి. వి :— "పరిన్దు" — "పోవు" అనగా — అస్థానే భయశంకనుగొని మంగళాశాసనము చేయుట.

(2) "పడుకాడు నిఱ్ఱ" — ఛేదింపబడిన వృక్షములవలె కాళ్ళు కదలక నిలుచుట.

(3) వైప్పు - నిధి. నిధివలె మిక్కిలి స్పృహణీయమైనది.

(46) అవ :— జ్ఞానులకును, అజ్ఞానులకును శ్రీ వేంకటాచలమే శరణ్యమని నుడువుచున్నారు.

వైప్పన్ఱ్ మణివిళక్కామ్ మామదియై, మాలుక్కెన్ఱు
ఎప్పాఴుదుమ్ కైనీట్టుమ్ యానైయై, — ఎప్పాదుమ్
వేడువళైక్క క్కుఱవర్ విల్లెడుక్కుమ్ వేఙ్గడమే,
నాడువళైత్తాడు మేల్ నన్ఱు. ౪౬

టీక :— మామదియై = పూర్ణచంద్రుని, మాలుక్కు = సర్వేశ్వరునికి, మణివిళక్కామ్ = మంగళదీపముగ, వైప్పన్ ఎన్ఱు = సమర్పించెదను అని, ఎప్పొఴుదుమ్ = ఎల్లప్పుడును, కైనీట్టుమ్ = తొండమును పైకెత్తుకొని పరవశమైయుండు, ఆనైయై = ఏనుగును, వేడు = వేటకాండ్రు, ఎప్పొదుమ్ = ఎక్కడికిని పోనీయక, వళైక్క = చుట్టు ముట్టగ, కుఱవర్ = బోయవాండ్రు, విల్ ఎడుక్కుమ్ = (వారిమీద) ధనుస్సును (ఎచ్చట) ఎక్కుపెట్టుదురో, (అట్టి) వేఙ్గడమే = శ్రీ వేంకటాచలమే, నాడువళైత్తు = లోకములన్నిటిని ప్రదక్షిణముజేసి, ఆడుదుమేల్ = నర్తనమాడుటకంటె, మేల్ = మంచిది.

తా॥ తిరుమలయందు నివసించుటచే దివ్యజ్ఞానము గలిగినందున, ఒక ఏనుగు, సకలకలాపూర్ణుడగు చంద్రునిజూచి, ఇది సర్వేశ్వరునకు మంగళదీపముగనున్న మంచిదని యుద్దేశించి, తన తొండముతో చంద్రుని పట్టుకొనుటకై ప్రయత్నించుచు, పరవశమైయుండెను. అట్టి ఏనుగును ఎక్కడికి పోనీయక, వేటకాండ్రు నలుప్రక్కలను చుట్టుకొనిరి. పరమ భక్తాగ్రణియగు నా గజమునకు నట్టి యాపదసంభవించిన, దానిని జూచి సహింపజాలక, అచ్చట నివసించు బోయవారు, వారలపై బాణవర్షముల కురిపించి, ఆ ఏనుగును సంరక్షించుచున్నారు. ఇట్లు తనయందు నివసించు

వారలకు గూడ పరమధర్మములు బోధించుచు దివ్యజ్ఞానమును గలుగజేయు శ్రీ వేంకటాచలమును ఆశ్రయించుట, నిఖిలలోకములకు ప్రదక్షిణము చేయుటకంటె మేలుగాగలదు.

వి. వి:— (1) చంద్రమండలము వఱకును తిరుమల యౌన్నత్యము వ్యాపించి యున్నదని అర్థము సిద్ధించుచున్నది.

(2) తిరుమలలో నివసించు, వానరములు, మృగములు — అను భేదము లేక సకల ప్రాణులును, సర్వేశ్వరునకు కైంకర్యము చేయుటయే ముఖ్యకార్యముగ భావించి చేయుచున్నవి — అని సూచింపబడుచున్నది.

(3) ఆళ్వారులు, తమవలెనే సర్వజన్తువులును సర్వేశ్వరుని సేవించి తరించుచున్నవి — అని భావించుచున్నారు

(4) బోయవాండ్రు కూడ, భాగవతశిఖామణియగు వాయేనుగు సత్కార్యమును గుర్తెఱింగి, దానికి సంభవించిన ఆపదను గమనించి, ఆ యాపదను బాపుటయే తమకు పరమధర్మమని భావించి, ఆ యేనుగును సంరక్షించుటకై బాణముల ప్రయోగించుచున్నారు — అనుభావము చెప్పుకొనవలయును. ప్రపన్నజనసంరక్షణమే పరమధర్మము — అని గుర్తెఱింగిన వారలుగదా తిరుమలలో నివసించు బోయవాండ్రును. శ్రీవచనభూషణమున — "ద్రౌపదీపరిభవమ్ కణ్డిరున్దదు కృష్ణాభిప్రాయత్తాలే (అర్జునునుక్కు) ప్రధానదోషమ్; పాండవర్గళైయుం నిరసిక్క ప్రాప్తమాయిరుక్క వైత్తదు, ద్రౌపదియినుడైయ మంగళసూత్రత్తుక్కాగ" అను గ్రంథభాగముచే, ప్రపన్న పరిభవమును జూచి మిన్నకుండుట మహాపచారమని, శ్రీపిళ్ళైలోకాచార్యులవారు ఆనతిచ్చియున్నారు.

(47) అవ:— నీలమేఘనిభ దివ్యమంగళగాత్రుడగు సర్వేశ్వరుని నిత్యనివాసస్థానము — పరమభోగ్యమగు తిరువేంగడమే; కాబట్టి, దాని నాశ్రయించి తరింపుడు — అని యందఱిని ప్రబోధించుచున్నారు.

నల్ మణి వణ్ణనూర్ ఆళియుమ్ కోళరియుమ్,
పొన్మణియుమ్ ముత్తముమ్ పూమరముమ్, — పన్మణినీ
రోడు పొరుదురుళుమ్ కానముమ్ వానరముమ్,
వేడుముడై వేఙ్గడమ్. ౪౭

టీక :— అళియుమ్ = శరభమృగములును, కోళ్ అరియుమ్ = పరాక్రమము గల సింహములును, పొన్ = బంగారమును, మణియుమ్ = మాణిక్యములును, ముత్తముమ్ = ముత్యములును, పూ మరముమ్ = పుష్పించిన వృక్షములును, పల్ మణి = నవరత్నములను, నీరోడు = ప్రవాహముతోడజేసి, వారుము అరువిగళుమ్ = దొర్లి పడుచున్న, కానముమ్ = అడవులును, వానరముమ్ = కోతులును, వేడుమ్ = బోయవాండ్రును, ఉడై = కలిగియున్న, వేఙ్గడమే = శ్రీ వేంకటాచలమే, నల్ మణివణ్ణన్ = ఇంద్రనీలములవంటి వర్ణముగల సర్వేశ్వరుడు నివసించు, ఊర్ = ఊరు.

తా॥ మిక్కిలి పరాక్రమముగల సింహశరభాది మృగములును, దేదీప్యమానములగు సువర్ణరత్నమాణిక్యములును, దివ్యగంధములతో గూడియుండు పూవులుగల మంచివృక్షములును, సుభగశీతలములైపారు సెలయేళ్ళును, కన్నులపండువై చూపట్టు గహనారణ్యములును, వేడు కలుగొలుపు వానరములును, కిరాతులును—వీనితోగూడి, పరమశ్లాఘ్యమై యుండు శ్రీ వేంకటాచలమే—ఇంద్రనీలమణివర్ణుడగు పరమపురుషుని భాగ్యనగరము.

(48) అవ :— దుష్టులను శిక్షించునదియు, శిష్టులను రక్షించునదియు సర్వేశ్వరునకు దివ్యస్థానమైనదియును శ్రీ వేంకటాచలమే; ఈ రహస్యమును గుర్తెఱింగి, అందఱును ఆశ్రయించి, తరింపుడు. ఈ తరుణమును జారవిడువకుడు—అని పరమకరుణాకరులై ఎల్లఱిని ప్రబోధించుచున్నారు.

వేఙ్గడమే విణ్ణోర్ తొழுవదువుమ్, మెయ్మ్మైయాల్
వేఙ్గడమే మెయ్ వినై నోయ్ తీర్ప్పదువుమ్, — వేఙ్గడమే
దానవరై వీழ త్తన్నాழிప్పడై తొట్టు,
వానవరై క్కాప్పాన్ మలై. ౪౮

టీక :— విణ్ణోర్ = నిత్యసూరులు. మెయ్మ్మైయాల్ = పరమప్రాప్యముగ, తొழுవదువుమ్ = ఆశ్రయించునది, వేఙ్గడమే = శ్రీ వేంకటాచలమునే. మెయ్ = సంకటములను గలుగజేయునట్టి, వినై నోయ్ = పాపములను వ్యాధులను, తీర్ప్పదువుమ్ =

తీర్ప్పవదియును, వేఙ్గడమే = శ్రీ వేంకటాద్రియే, దానవరై = దానవులను, వీழ = నిర్మూలించుటకై, తన్ = తన, ఆழிప్పడై = చక్రాయుధమును, తొట్టు = ధరించి, వానవరై = దేవతలను, కాప్పాన్ = రక్షించెడు సర్వేశ్వరుడు పరమప్రీతితో నివసించు, మలై = పర్వతము, వేఙ్గడమే = శ్రీ వేంకటాచలమే.

తా॥ ఎల్లప్పుడును పరమపదవాసుని దివ్యమంగళ విగ్రహమును సందర్శించి, దివ్యానందము ననుభవించు పరమపదవాసులగు నిత్యసూరులును, పరమప్రీతితో ఆశ్రయించునది — ఈ వేంకటాచలమునే. భక్తులను బాధించు పాపవ్యాధులను నిర్మూలించునదియు — ఈ వేంకటాద్రియే. క్రూరులగు రాక్షసులసంహరించి, స్వాశ్రితులగు దేవతల గాపాడు శ్రీసుదర్శనచక్రమును ధరించిన శ్రియఃపతి నివసించునదియును — ఈ వేంకటాచలమునసే.

వి వి:— (1) భక్తులపాపములను దహింపజేయుటచే "వేంగడమ్" అని తిరుమలకు పేరువచ్చినదను భావముతో రెండవపాదమును సాధించినట్లున్నది.

(2) సర్వేశ్వరుడు తన చక్రాయుధముచే నసురులసంహరించి, దేవతల గాపాడు నటులనే, మన మతనిని ఆశ్రయించితిమేని, మనపాపరాక్షసులను నశింపజేసి మనలను కాపాడుటకే తిరుమలలో భగవానుడు వేంచేసియున్నాడు — అని ఉత్తరార్ధముచే సూచింపబడుచున్నది.

(90) అవ :— శ్రీ వేంకటాచలపతికి దివ్యములగు పుష్పములను పర్చికూర్చి సమర్పించువారలు మోక్షసామ్రాజ్యమును చూరగొందురు— అని ఆనతిచ్చుచున్నారు.

పీన్ తిరున్దు విణ్ణాళ్ వేణ్డువార్, వేఙ్గడత్తాన్
పాల్ తిరున్ద వైత్తారే పల్ మలర్ గళ్, — మేల్ తిరున్దు
వాழ்వార్ వరుమది పార్త్తు అన్బినరాయ్, మఱ్ఱవర్క్కే
తాழ்వాయిరుప్పార్ తమర్. ౯౦

టీక :— పీర్ త్తిగన్డు = మహామహిమలతో గూడియుండి, విణ్ = పరమపదమును, అళవేణ్డువార్ = పరిపాలింపనాశపడువారు, వేంగడత్తాన్ పాల్ = శ్రీ వేంకటాచలపతియొక్క దివ్యపాదారవిందములయందు, పల్ మలర్ గళ్ = అనేకములగు దివ్యపుష్పములను, తిరున్దవైత్తార్ = ఏరికూర్చి సమర్పించువారలు; వరుమ్మది = సర్వేశ్వరుని తిరువుళ్ళమునందుండు దానిని, ఉరున్దుపార్త్తు = చక్కగా గుర్తించి, అన్బినరాయ్ = నిరవధికమగు ప్రేమగలవారలై, అవర్కే = ఆ సర్వేశ్వరునికే నిత్యకైంకర్యముజేయు శ్రీవైష్ణవులకు, తాళ్వాయిరుప్పార్ తమర్ = దాసానుదాసులై యుండువారు, మఱ్ఱుమ్ = ఇంకను, మేల్ = మేలుగలవారలై, వాళ్వార్ = సుఖింతురు.

తా॥ శ్రీ వేంకటాచలనాథునకు దివ్యములగు పుష్పములను మాలలు గట్టి సమర్పించువారలు, నిరతిశయ మహిమాన్వితులై, పరమపదసామ్రాజ్యమును పరిపాలింపగలుగుదురు. వారికంటెను, సర్వేశ్వరుని తిరువుళ్ళమును గనిపెట్టి, వానికి పరమప్రీతిసంపాదకములగు నిరవధికములైన కైంకర్యముల ననుష్ఠించుచుండు శ్రీవైష్ణవులకు దాసానుదాసులై యుండువారలు, మంచిమేలులు గలుగ, బ్రహ్మానందమును అనుభవించుచుందురు.

వి వి :— భాగవతులచే నంగీకరింపబడినవారలు అందరికంటెను సుశ్రేష్ఠులు అని ఈ పాశురమునకు ప్రధానతాత్పర్యము.

(2) వరుమ్ మదిపార్త్తు-సర్వేశ్వరుని తిరువుళ్ళమును గుర్తెఱింగి మెలగువారు. లేక, వీరి తిరువుళ్ళము ననుసరించియే, సర్వేశ్వరుని లీలావిధులుండును. "భవన్తి లీలావిధయశ్చ వైదికాస్త్వదీయ గంభీర మనోనుసారిణః" అను శ్రీ యామునాచార్యుల వారి స్తోత్రరత్నశ్లోక మిచ్చట ననుసంధింపదగినది.

శ్రీరస్తు

శ్రీమతే భక్తిసారమునయే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తిరుమళిశై యాళ్వార్లు ప్రసాదించిన తిరుచ్చన్దవిరుత్తములోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

మృదుమధురమై, చెవులకింపగు నాదమునిచ్చు వృత్తమగుటచే, దీనికి తిరుచ్చన్దవిరుత్తమని పేరుగలిగినది. ఈ ప్రబంధమున శ్రీతిరుమళిశై యాళ్వార్లు, "విషయాన్తర దేవతాన్తరములయందు ప్రవణులై నశింపక, సర్వేశ్వరుని గుణకీర్తనముననే కాలమును గడపి యుజ్జీవింపుడు"—అని తాము పొందిన పరమభాగ్యమును సంసారుల కుపదేశింపుచున్నారు. ఇందు తిరువేంగడముడైయాన్ విషయముగ రెండు పాశురములున్నవి.

(60) అవ :—అందీపాశురమున సర్వేశ్వరుడు తనకు భోగస్థానములగు దివ్యదేశములయందు వేంచేసియుండుట, ఆశ్రితులగు భక్తులయందలి వ్యామోహముచేతనే — అని సాదించుచున్నారు.

శెళుఙ్గొళుమ్బెరుమ్బని పొళిన్దిడ ఉయర్న్ద వేయ్,
విళున్దులర్న్దెళున్దు విణ్పుడైక్కుమ్ వేఙ్గడత్తుళ్ నిన్ఱు,
ఎళున్దిరున్దు తేన్ పొరున్దు పూమ్బొళిల్ తళైక్కొళుమ్,
శెళున్దడఙ్కుడన్దైయుళ్ కిడన్దమాలుమల్లైయే. ౬౦

టీక :— శెళుఙ్ = కాగి, కొళుమ్ = ధారలై పడుచున్న, పెరుమ్పని = గూడమంచు, పొళిన్దిడ = ప్రవహింపగ, ఉయర్న్ద = ఉన్నతములైన, వేయ్ = వెదుళ్ళు, విళున్దు = మంచురాళ్ళయొక్క భారమును తాళజాలక క్రిందికివంగినవై, ఉలర్న్దు = సూర్యుని కిరణములచే మంచుకరగిపోగ, ఎళున్దు = పైకిలేచి, విణ్పుడైక్కుమ్ = ఆకాశమును ఎచ్చట చొచ్చుకొనిపోవు చున్నవో, అట్టి, వేఙ్గడత్తుళ్ =

శ్రీ వేంకటాచలమున, నిన్ఱు=వేంచేసియుండునది, తేన్=భ్రమరములు, ఎழுన్దుయన్ది=లేచివ్యాపించి, పొరున్దు=సంచరించుచున్నట్లున్నదియును, తన్రై=విశాలమై, కొழுమ్=ప్రకాశించునదై, పూ=విరివిగ పుష్పించిన, లతలుగల, పొழிల్=ఉద్యానవనములతో నిండినదై, శెழுమ్=సుందరమైన, తడమ్=తటాకములను గలిగినదై యుండు, కుడన్దైయుళ్=తిరుక్కుడన్దై దివ్యక్షేత్రమున, కిడన్ద=పవ్వళించియున్న, మాల్లయే=ఆశ్రితవ్యామోహముగల్గిన, పరమాత్ముడే గద !

తా॥ ఎచ్చట, రాత్రులయందు కరగిధారలుగ పడుచుండు గూడ మంచువర్షించుచుండగ, మిగుల ఉన్నతములైన వెదుళ్ళు, ఆ మంచుగడ్డల భారమును తాళజాలక క్రిందికివంగినవై, ఉదయమైన తరువాత సూర్య కిరణములుపడి మంచుగడ్డలు కరగగ చివ్వునలేచి ఆకసమును చీల్చుచున్నవో, అట్టి శ్రీ వేంకటాచలమున వేంచేసియుండువాడు—తుమ్మెదలు మూగి, మకరందమును పానముచేయునట్లు విరివిగ వికసించిన పుష్పములతో నిండియుండు దివ్యోద్యానములచే విరాజిల్లుచున్నదియును, రమణీయములగు దివ్యతటాకములతో గన్నులపండువై యుండునట్టియును నగు తిరుక్కుడన్దై దివ్యక్షేత్రమున ఆదిశేషునిపై పవ్వళించియుండు ఆశ్రిత వ్యాముగ్ధుడగు ఆపరంధాముడే గద !

వి. వి :—(1) తిరుమలలోనుండు సకల పదార్థములును ఉపాదేయములే, కనుక "శెழுమ్ కొழுమ్ పెరుంపని" అని మంచును అధిక ప్రావణ్యముతో సభివర్ణించిరి.

(2) "శెழுమ్ కొழுమ్" అనుదానిని "వేయ్-వెదుళ్ళు" అనుదానికి అన్వయించి "శెழுఙ్గొழுమ్ ఉయర్న్దవేయ్, పెరుం పని పొழிన్దిడ శ్ழுన్దు" అనియు అర్థము చెప్పవచ్చును. అప్పుడు తిరువేంగడముడైయాన్ల విశేషకటాక్షామృత సేచనమున నభివృద్ధి చెందు వెదుళ్ళగుటచే సెంతయు యుక్తము.

(31) అవ :— పరవ్యూహవిభవావతారములన్నియును దేశకాల విప్రకృష్టములగుటచే అందఱికిని అందుబాటులో లేవనియోచించి, సకల ప్రాణులకును తన సందర్శనమిచ్చి వారల నుజ్జీవింపజేయుటకై, పరమ సులభుడై, శ్రీ వేంకటాచలమున సర్వేశ్వరుడు వేంచేసియున్నాడు.

ఈ సదవకాశమును జారవిడువక ఎల్లఱును అచ్చటికి వెళ్ళి, వారిదివ్య పాదారవిందముల నారాధించి, ఉజ్జీవింపుడు — అని ఉపదేశించుచున్నారు.

> కడైన్దుపాఱ్కడల్ కిడన్దు కాలనేమియెక్కడిన్దు,
> ఉడైన్దవాలిదన్ దనక్కు ఉదవవన్దు ఇరామనాయ్,
> మిడైన్ద ఏழ் మరజ్గళుమ్ అడజ్గవెయ్‌దు, వేజ్గడమ్
> అడైన్దమాలపాదమే అడైన్దునాళుమ్ ఉయ్‌మ్మినో. ౮౧

టీక :— కడైన్ద = దూర్వాసశాపముచే (భ్రష్టైశ్వర్యుడగు ఇంద్రునకు ఐరావతము, కల్పకవృక్షము మొదలగు దివ్యవస్తువులను అనుగ్రహించుటకై) మథింపబడిన, పాఱ్కడల్ = క్షీరసముద్రమున, కిడన్దు = (ఆశ్రితసంరక్షణమునకై) యోగనిద్ర ననుభవించియు, (ఆ దేవతలను తనభుజబలముచే పీడించిన), కాలనేమియై = కాలనేమి యనునసురుని, కడిన్దు = జయించి, ఉడైన్ద = (పగదీర్చుకొనని మనజన్మము వలనేమి ఫలముఅని) వికలమైన మనస్సుగల, వాలితన్దనుక్కు ఉదవ = వాలితమ్ముడైన సుగ్రీవుని ఆపదను పోగొట్టుటకై, ఇరామనాయ్‌వన్దు = చక్రవర్తి తిరుమగనారులై అవతరించి, మిడైన్ద = ఒకటితో నొకటిచేరి నిబిడమైయున్న, ఏழ் మరజ్గళుమ్ = ఏడుమద్దిచెట్లను, అడజ్గ = గిరిరసాతలములతో గూడ, ఎయ్‌దు = భేదించి, వేజ్గడమడైన్ద = తిరుమలలో వేంచేసియున్న, మాలపాదమే = ఆశ్రితులయందు వ్యామోహముగల ఆ స్వామియొక్క తిరువడిగళ్ళనే, అడైన్దు = అనన్యప్రయోజనులై ఆశ్రయించి, నాళుమ్ = ఎల్లప్పుడును, ఉయ్‌మిన్ = ఉజ్జీవింపుడు.

తా॥ ఐశ్వర్యమదమత్తుడై ఇంద్రుడు ఒకానొకప్పుడు దూర్వాస మహర్షిని అవమానపరచెను. సులభకోపుడగు ఆ మహర్షి దానిని సహింపజాలక, వాని ఐశ్వర్యమంతయు నశించునట్లును, రాక్షసులచే నపజయము పొందునట్లును శపించెను. ఆ శాపప్రభావమువలన, ఇంద్రుడు రాక్షసులకునోడి, భ్రష్టైశ్వర్యుడై, శ్రీమన్నారాయణు నాశ్రయించెను. అతనిని అనుగ్రహించుటకై క్షీరాబ్ధిని మథించి, ఐరావతము కల్పవృక్షము మొదలగు వానిని అతనికి ప్రసాదించి, ఇంక ఎవరైనను ఆపదల నను భవించుచో, వారి ఆపదలనుగూడ నివారించుటకై, అచ్చటనే పవ్వళించి

యున్నారు. మరియును, ఆ దేవతలను పీడించిన కాలనేమియను క్రూర రాక్షసుని వధించెను. వాలితమ్ముడగు సుగ్రీవుడు తనను ఆశ్రయింపగ, వాని ఆపదను తీర్చుటకై శ్రీరామచంద్రమూర్తియై అవతరించి, సప్తసాల వృక్షములను గిరిరసాతలములను ఒక్క బాణముతో భేదించి, వాలిని సంహారించి, అతనిని కాపాడెను. ఇట్లు, ఆశ్రితసులభుడై యుండు సర్వేశ్వరుడు — ఎల్ల దేశములయందలి, ఎల్ల కాలములయందలి ఎల్ల ప్రాణులును తనను, వచ్చి, సేవించి, తరింపవలయుననెడి పరమౌదార్యముతో శ్రీ వేంకటాచలమున, వచ్చి నిలిచియున్నారు. పరమభోగ్యములగు అతని పాదారవిందముల నాశ్రయించి, ఎల్లరును ఉజ్జీవింపుడు.

వి వి :— "కాలనేమి" అనువాడు రావణుని మామ. తారకాసుర యుద్ధమున వీడు భగవంతునిచే సంహరింపబడెను.

శ్రీ తిరుమఴిశైయాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

శ్రీరస్తు

శ్రీమతే శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీమతే శఠగోపమునయే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువాయ్మొళి

3-వ పది, 3-వ తిరువాయ్మొళిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

ఈ ప్రబంధమును ప్రసాదించినవారు — ఆళ్వార్లందఱికిని అవయవిభూతులును, ప్రపన్నజనకూటస్థులునైన శ్రీ నమ్మాళ్వార్లు. వీరు, పరమపావనమైన తామ్రపర్ణీ నదీతీరమున, సౌందర్య సౌభాగ్యములకు నాటపట్టగు శ్రీకురుకూర్ దివ్యక్షేత్రమున, కలియుగారంభమునకు 43-వ దివసమునకు సరియగు ప్రమాది సంవత్సర వృషభ శుక్ల చతుర్దశీ శుక్రవారమున, వైశాఖ నక్షత్రమున, కటకలగ్నమున, శ్రీ "కారియార్" అను వైష్ణవోత్తములకు, శ్రీ "ఉడయనంగైయార్" శ్రీ "నాథనాయకమ్మ" అను పత్నియందు "తిరుక్కుఱుజ్గుడినమ్బి" పెరుమాళ్ళ దివ్యానుగ్రహమున నవతరించిరి.

వీరు లోకమునందలి ఇతర శిశువులవలె స్తన్యపానాదుల నొల్లక, ఏడ్వక, నిమీలితనేత్రులై, అవతరించినది మొదలు శ్రీ భగవదేకాయత్తచిత్తులైయుండిరి. ఇదియేమి చిత్రమని తల్లిదండ్రులు మొదలగువారు ఆశ్చర్య చకితులై, ఏమియునుతోచక, పండ్రెండవ దివసమున "పొలిన్దు నిన్ఱపిరాన్" అను పెరుమాళ్ళ సన్నిధికి దీసికొని చెళ్ళిరి. వెంటనే వీరు నేత్రముల దెఱచి పెరుమాళ్ళను తృప్తిమీఱసేవించి, అచ్చటనుండి మెల్లగ జరిగి జరిగి, అంతకుపూర్వమే శేషాంశమున నవతరించియున్న

"తిరుప్పుళియాళ్వార్" అనెడి తింత్రిణీవృక్షపు మూలభాగమునకు విచ్చేసి, అచ్చటి తొఱ్ఱలో పద్మాసనాసీనులై, యోగముద్రాముద్రితులై, 16-సంవత్సరములు నా జ్ఞానముద్రతో మౌనము నవలంబించియుండిరి. వీరి మహిమాతిశయమును గుర్తెఱింగి శ్రీ మధురకవులను మహనీయులు, వీరి నాశ్రయించి సకలశుశ్రూషలను చేయుచుండిరి.

ఇట్లు, శ్రీనమ్మాళ్వారులు, సవాసనముగ లోకయాత్రను పరిత్యజించి, భగవచ్ఛరణైకాన్త్యాత్యన్తిక నిరవధిక భక్తియోగనిష్ఠాగరిష్ఠులై యుండుటను జూచి, ఆయా దివ్యదేశములయందు విజయముచేసియున్న ఎమ్బెరుమానులు (అర్చామూర్తులు) అందఱును, ఆ తింత్రిణీ మూలమునకే విచ్చేసి సేవసాదించిరి. ఆళ్వార్లు, ఆ పెరుమాళ్ళనందఱిని సేవించి, తదనుభవ జనిత ప్రీతికారితోల్లోక పరభక్తి పరజ్ఞాన పరమభక్తులు ఉన్మకస్తనులు కాగా, తత్పరీవాహరూపముగ, తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది, తిరువాయ్‌మొழி—అను నాలుగు దివ్యప్రబంధములను సాదించిరి. అందు, 100-పాశురములుగల తిరువిరుత్తము ఋగ్వేద సమమనియు, 7-పాశురములుగల తిరువాశిరియము యజుర్వేద సమమనియు, 87-పాశురములుగల పెరియ తిరువన్దాది అధర్వణవేద సమమనియు, 1102-పాశురములుగల తిరువాయ్‌మొழி సామవేద సమమనియు ప్రామాణికులంగీకరించుచున్నారు.

ఈ ప్రబంధములయందు, వీరు అత్యన్తప్రావణ్యముతో తిరువేంగడముడైయాన్లకు మంగళాశాసనము జేసియున్నారు. అందు, తిరువాయ్‌మొழிలో 35-పాశురములున్నవి. అందును, ప్రాప్యప్రాపక నిష్కర్షకములగు రెండు ప్రధానమైన (1) ఒழிవిల్ కాలమ్, (2) ఉలగముణ్డ—అను తిరువాయ్ మొழிల (దశకముల) లో తిరువేంగడముడైయానుల వైభవమునే అభివర్ణించియున్నారు. "ఒழிవిల్ కాలమ్" అనునది పరమ ప్రాప్యనిష్కర్షకము; "ఉలగముణ్డ పెరువాయా" అనునది పరమ సాధన నిష్కర్షకము.

(1) అవ :- అందు, ప్రపన్న జనకూటస్థులైన శ్రీ నమ్మాళ్వార్లు ఉత్తరదిక్కునందుండు తిరుమలలో సర్వేశ్వరుని సేవించి, అతని నిరవధిక సౌందర్య సౌభాగ్యములయందత్యన్త ప్రవణులై, అతని నిచ్చటనే యను భవింపవలయునని ఆశపడి, తమకు సహాయముగ తమ మనస్సును భగవ ద్భక్తులను ఆహ్వానించుచున్నారు-ఒழிవిల్ కాలమను నీ పాశురమున.

* ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని,
వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్,
తెழிకుర లరువి త్తిరువేఙ్గడత్తు,
ఎழிల్ కొళ్ శోది ఎన్దై తన్దై తన్దైక్కే. ౧

టీక :- తెழிకురల్ అరువి=శబ్దించుచున్న సెలయేళ్ళతో గూడుకొనియున్న, తిరువేంగడత్తు = తిరువేంగడమను తిరుమలలో వేంచేసియున్న, ఎழிల్ కొల్ శోది = సుందరమగు దివ్యమంగళవిగ్రహముతో గూడుకొనియున్న, ఎన్దై తన్దై తన్దైక్కు = నా స్వామికి స్వామియైనవాని స్వామికి, నామ్ = మనము, ఒழிవు ఇల్ కాలమ్ ఎల్లామ్ = విచ్ఛేదములేక ఎల్లకాలములయందును; ఉడనాయ్ = (అన్ని ప్రదేశముల యందును వానితో) గూడియుండి, మన్ని = (అన్ని అవస్థలయందును) అతనిని వదల కుండువారలమై, వழுవు ఇలా=(భంశము లేక, (కైంకర్యములయందు ఏ భాగమునుగూడ వేరెవరికిని ఇవ్వకుండునట్లుగ), అడిమై = అన్ని కైంకర్యములను, శెయ్యవేణ్డుమ్ = చేయవలసినది.

తా॥ సర్వకాలములయందును శబ్దించుచున్న సెలయేళ్ళతో గూడుకొనియున్న శ్రీ వేంకటాచలమున నిరవధిక సౌందర్యసౌభాగ్య ములతో దులదూగుచు వేంచేసియుండు మన స్వామికి, సర్వదేశ సర్వ కాల సర్వావస్థలయందును చేయుదగిన సమస్త కైంకర్యములను, వానికి ఎల్లప్పుడును దాసభూతులమగు మనము, చేయవలయును; వేంచేయుదుము.

(2) అవ :— పరమపదమునకు పోయి సర్వేశ్వరునికి కైంకర్యము చేయుటయేగదా, అందఱికిని ప్రాప్యమైయున్నది. అట్లుండ, మమ్ముల నిచ్చట కైంకర్యముచేయుటకు ఆహ్వానించుచున్నారు; ఇది ఎట్లు ఉపపన్నమగును? అనగా-నిత్యసూరులును, తిరుమలకు విచ్చేసిగదా! వాని కల్యాణగుణముల ననుభవించి వానికి కైంకర్యమును చేయుచున్నారు. కాబట్టి, మనకును ఇదియే పరమప్రాప్యము అనుచున్నారు.

ఎన్నైత్తన్నైత్తన్నై తన్నైత్తన్నైక్కుమ్
మున్నై, వానవర్ వానవర్ కోనొడుమ్,
శిన్దుపూమగిழుమ్ తిరువేఙ్గడత్తు,
అన్దమిల్ పుగழ్ క్కా-రెழిలణ్ణలే. ౨

టీక :— వానవర్ కోనొడుమ్ = నిత్యసూరులకు స్వామియైన శ్రీ విష్వక్సేనాళ్వారులతో గూడ, వానవర్ = నిత్యసూరులు, శిన్దుపూ = సమర్పించు పుష్పములు, మగిழుమ్ తిరువేంగడత్తు = (తనను తాకినంతమాత్రముచేతనే) వికసింపజేయుచున్న తిరువేంగడమున వేంచేసియున్నవాడై ; కార్ ఎழిల్ = నీలమేఘనిభమంజుల విగ్రహుడై యున్న, అణ్ణలే = స్వామియే, ఎన్నైత్తన్నైత్తన్నైత్తన్నైత్తన్నైక్కుమ్ = నా స్వామికియొక్క-స్వామియైన వానియొక్క- స్వామికిని, మున్నై = పరమశేషియైయున్నాడు.

తా॥ నిరతిశయకీర్తిసంపన్నుడై, నీలమేఘ నిభమంజులవిగ్రహుడై, తిరువేంగడమున వేంచేసియున్నట్టి నా స్వామి, తన కల్యాణ గుణములచే నన్ను, తనదాసులకు దాసునిగా చేసియున్నాడు. నిత్యసూరులును, వారికి స్వామియైన శ్రీ విష్వక్సేనాళ్వారులును, నావలెనే వాని కల్యాణగుణములలో అత్యంతప్రవణులై, తిరుమలకు విచ్చేసి, పుష్పములతో నతని నారాధించుచున్నారు. అందుచే నాతనికి కైంకర్యము చేయుటయే పరమప్రయోజనము. అందుకొరకు విచ్చేయుడు.

వి. వి :—(1) తిరువేంగడముడయానులు మన స్వామికి స్వామి అని చెప్పుటచే, మనము వారి దాసులకు దాసులము- అని సిద్ధించుచున్నది.

(2) నా స్వామికి స్వామియైనవానికి స్వామికి స్వామియైనవాని స్వామి అనుటచే, అతడు అందఱికిని స్వామియనియు, అతనికి స్వామియైన వాడెవ్వడును లేడనియును సిద్ధించుచున్నది.

(3) అళ్వార్లు, తమను సర్వేశ్వరుని దాసులకు దాసులనుగా చెప్పుకొనుటచే వాని కల్యాణగుణములయందు అత్యంతప్రవణులై, అతనికి నిత్యకైంకర్య మొనర్చువారల యందు గౌరవమును చూపుచున్నారని తెలియుచున్నది

(3) అవ :—సర్వేశ్వరుడు మనము అనుభవించుటకు అనుకూల మగునట్లు సులభుడగునా? అనిన, అతడు మిక్కిలి ఉదారుడు. అదెట్లనగా—నిత్యసూరులకు, సదా సర్వకాలములయందును తనను అనుభవించుటకు దగినట్లు సర్వస్వాధీనుడై యున్నాడు గద! అని "అణ్ణల్ మాయన్" అను పాశురమున సెలవిచ్చుచున్నారు—

అణ్ణల్మాయన్ అణికొళ్ శెన్దామరై
క్కణ్ణన్, శెజ్ఞనివాయ్ క్కరుమాణిక్కమ్,
తెణ్ణిఱై చ్చునై నీర్ త్తిరువేంగడత్తు,
ఎణ్ణిల్ తొల్ పుకర్ వానవరీశనే. 3

టీక :—మాయన్ = సౌందర్యము, సౌకుమార్యము, లావణ్యము మొదలగు తన దివ్యమంగళ విగ్రహముయొక్క కల్యాణగుణములచే) ఆశ్చర్యభూతుడై, అణికొళ్ = అలంకారయుక్తమైన, శెన్దామరైక్కణ్ణన్, శెమ్కనివాయ్ కరుమాణిక్కమ్ = శెన్దామరలవంటి దివ్య నేత్రములను, దొండపండువంటి ఎఱ్ఱని అధరోష్ఠమును (క్రింది పెదవివి), ఇంద్రనీలములవంటి దివ్యదేహమును గలవాడై, తెళ్ నిఱై = పరిశుద్ధమై, సంపూర్ణమైన, శునైనీర్ = సెలయేళ్లను కలిగియున్న, తిరువేంగడత్తు = శ్రీవేంకటాచలమున, ఎణ్ణిల్ తొల్ పుకర్ = లెక్కింప శక్యముకాని, అనాది సిద్ధములగు కల్యాణగుణములచే గలిగిన కీర్తిని కలిగియున్న, అణ్ణల్ = స్వామియైనవాడు, వానవర్ ఈశన్ = నిత్యసూరులకు నధిపతియైన సర్వేశ్వరుడు. (వారలు తనను అనుభవించునట్లు వేంచేసియున్న వాడని భావము).

తా॥ ఆభరణముల యపేక్షలేకయే, స్వతస్సిద్ధముగ సుందరమగు దివ్యమంగళ విగ్రహము గలవాడును, అసంఖ్యేయములగు దివ్యకల్యాణ గుణములచే గలిగిన కీర్తితోఁగూడుకొన్నవాడునునై విలసిల్లు సర్వేశ్వరుడు, నిత్యసూరులు తనను అనుభవించునట్లు, సర్వస్వదానము చేయుచున్నాడు. మనము అతనిని అనుభవించుటకు వీలగునట్లు, ఆస్వామి, తిరుమలకు విచ్చేసి, వేంచేసియున్నారు. కనుక, మనమును అతనిని అనుభవింపవచ్చును.

(4) అవ :—సర్వేశ్వరుడు, నిత్యసూరులు తనను అనుభవించునట్లు చేయుచున్నాడు అని చెప్పవలయునా! నీచుడనగు దాసునకును అట్టి భాగ్యమును కలుగచేయలేదా? అని, ఆతని ఔదార్యాదికమును "ఈశన్ వానవర్" అను పాశురమున అభినుతించుచున్నారు—

ఈశన్ వానవర్కెన్బన్ ఎన్ఱాల్, అదు
తేశమో తిరువేఙ్గడత్తానుక్కు ?
నీశనేన్ నిఱై వొన్ఱుమిలేన్, ఎన్ కణ్
పాశమ్ వైత్త పరఞ్జుడర్ చ్చోదిక్కే. ౪

టీక :— నీశనేన్ = నీచుడనై (ఆత్మకు తగని గుణముల గలవాడనై). నిఱై ఒన్ఱుమ్ ఇలేన్ = పరిపూర్తి (ఆత్మకు తగినగుణములు) ఏమియును లేనివాడనైయుండు, ఎన్ కణ్ = నావిషయమున, పాశమ్ వైత్త = అభిమానమునుంచిన, పరఞ్జుడర్ శోదిక్కు = మిక్కిలి కాంతియుక్తమగు దివ్యమంగళ విగ్రహముతోఁగూడియున్న, తిరువేంగడత్తానుక్కు = శ్రీవేంకటాచలమున నెలకొనియున్నవానికి, వానవర్ ఈశన్ ఎన్బన్ = "నిత్యసూరులకు తనదివ్యానుభవమును ఒసంగుచు నిర్వాహకుడైయున్నాడు" అని వర్ణించితిని, ఎన్ఱాల్ = అన్నచో, అదు తేశమో = అది యొక తేజస్సగునా? (అది వానికి ఒక మహిమ యగునా?)

తా॥ ఆత్మకు దగని గుణములు గలవాడనై, ఆత్మకు దగిన గుణము లేమియును లేనివాడనై, పరమనీచుడనై యున్న, నావిషయమునగూడ సర్వేశ్వరుడు విశేషప్రీతిని చూపుచున్నాడు. ఇట్లగుచో, నతడు నిత్యసూరులకు తమ్ము అనుభవించు భాగ్యమును కలుగచేయుచున్నాడు— అని చెప్పినచో, అతనికి ఏదేని ఆధిక్యము గలుగునా? కలుగదనిభావము.

వి. వి :—(1) ఆత్మకు తగనిగుణములు ఏవి అనగా :— 'దేహమే ఆత్మ' అని తలంచు భ్రమము, దానివలన కలిగిన వికారములు, ఆశ, ద్వేషమును. తొలుతవి రెండును స్వరూపమునకు సంబంధించినవి ; మిగతవి రెండును స్వభావమునకు సంబంధించినవి.

(2) ఆత్మకుతగిన గుణములేవి అనగా :—క్షేమ, అద్వేషము, అనసూయ, సహనము— మొదలగునవి.

(5) అవ :—నేను తనను అనుభవించునట్టి భాగ్యమును నాకు కలుగచేసియున్నాడు—అని చెప్పుటయును, అతని కొక గొప్పతనమగునా ? అతని ఔదార్యము ఇంతయని ఎవరికైనను వర్ణింపతరమా? అని "శోది యాగి" అను పాశురమున అభివర్ణించుచున్నారు—

శోదియాగి ఎల్లావులగుమ్ తొழுమ్,
ఆదిమూర్తియెన్రాల్ అళవాగుమో ?
వేదియర్ ముழு వేదత్తముదత్తై,
తీదిల్ శీర్ త్తిరువేఙ్గడత్తానైయే. ౫

టీక :—వేదియర్ =వేదాధ్యయనమున సంపన్నులగువారియొక్క, ముழு వేదత్తు అముదత్తై=సమస్తవేదములయందును పరమపురుషార్థ స్వరూపుడుగ నభివర్ణింపబడువాడును, తీదుఇల్ శీర్ =(కొంచెమైనను) దోషములేని, కల్యాణగుణములు గలిగియున్నవాడునునైవేంచేసియుండు తిరువేంగడముడయానులను, శోదియాగి—నిరతిశయ తేజోవిశిష్టుడై, ఎల్లావులగుమ్—సమస్తలోకములును, తొழுమ్—సేవించునట్టి, ఆదిమూర్తి= ఆది (కారణ) స్వరూపుడు, ఎన్రాల్ —అనినచో, అళవు ఆగుమో? = పరిమితమగునా? అది వానికొక ఆధిక్యమును సంపాదించునా ? యనిభావము.

తా॥ అత్యంతము నీచుడనగు నావిషయమున గూడ నిరవధికమగు ప్రీతిని యుంచియున్నాడు— అని చెప్పితిని. ఇది అతనికి ఒక గొప్పతనమగునా ? అతడు పరమపురుషార్థ స్వరూపుడు ; హేయప్రత్యనీక గుణాకరుడు. అతని దివ్యమంగళ విగ్రహముయొక్క సౌందర్యమునకు అంతులేదు. అతడే నిఖిల జగత్తులను సృజియించు మూలకారణమైనవాడు— అని అతని మహిమాతిశయములను నిత్యనిర్దుష్టములగు వేదములుగదా

అభివర్ణింపవలసియున్నది ! నీచాతినీచులమగు మనచే నభివర్ణింపశక్యమా? మిక్కిలి యుదారస్వరూపుడగు నా సర్వేశ్వరుడు, తన పాదారవిందముల యందు సదా సర్వకాలము కైంకర్యముచేయునట్టి దివ్య సంపత్తును మన కెల్ల అకును, కలుగచేయును. కనుక, అందఱును విచ్చేయుడు.

వి. వి :–(1) లోకమున తమకంటె నీచులెవ్వరును లేరు. తామే అందరికంటెను అపకృష్టులు—అని ఆళ్వారుల అభిప్రాయము. కాబట్టి, తామే ఆ భగవంతునకు కైంకర్యము చేయుచున్నప్పుడు, లోకమున అందఱును వాని కైంకర్యము చేయుట కర్హులే, అని " ఉలగుమ్ తొழுమ్ " అనుదానిచే సూచించుచున్నారు.

(2) "తీమఇల్"—ఇచట దోషమనగా – తనను ఆశ్రయించువారలలో నితడు అధికుడు, కనుక స్వీకరింపతగినవాడు ; ఇతడు అపకృష్టుడు, కాబట్టి, పరిత్యజింపదగిన వాడు ; అనుతలంపు.

(6) అవ :–సర్వేశ్వరుని కైంకర్య మొనర్చుటకు ఉపాయ మేది? అనగా, దాని నిందు సెలవిచ్చుచున్నారు—

వేఙ్గడఙ్గళ్ మెయ్‌మే ల్వినై ముழுవుమ్,
తాఙ్గళ్ తఙ్గట్కు నల్లనవే శెయ్‌వార్,
వేఙ్గడత్తుఱై వార్‌క్కు నమవెన్నల్
ఆఙ్గడమై, అదుశుమన్దార్గట్కే. ౬

టీక :—వేంగడత్తు ఉఱైవార్క్కు = శ్రీవేంకటాచలమున వేంచేసియున్న శ్రీనివాసునకు, నమోఎన్నల్ ఆమ్ = నమస్కారము అనిచెప్పుట అను, కడమై అదు= ఈ విధిని, శుమందార్‌గట్కు = నిర్వహించుచున్నవారలకు, కడఙ్గళ్ =(కైంకర్య ప్రతిబంధకములైన) కర్మములు, మేల్ వినై = ఇకపైని కలుగబోవు కర్మములు, ముழுవుమ్ వేమ్—అన్నియును నిశ్శేషముగ నశించిపోవును, (భస్మీపటలములగునని భావము), మెయ్ = ఇది నిజము, తాఙ్గళ్ = (ఇట్టి ప్రతిబంధకములు తొలఁగిన) వారలు, తఙ్గట్కు నల్లనవే—తమ తమకు ఇష్టములగు కైంకర్యములనే, శెయ్‌వార్ = చేయుదురు.

తా॥ నిరాటంకముగ సర్వేశ్వరునకు కైంకర్య మొనర్చుటకు ఉపాయమేయ్యది? అని అందురేని, శ్రీ వేంకటాచలమున నెలకొనియుండు "శ్రీ శ్రీనివాసునకు నమస్కార" మనుటయే. ఇది పరమ సులభమగు ఉపాయము. దీని నెల్లరును అనుష్ఠింపవచ్చును. ఇది మనస్వరూప మునకు అనుగుణమగు వ్యాపారము. ఈ 'నమః' అనుమాటనే సర్వేశ్వరుడు ఒక గొప్పగా దలంచి, మనము ముందుచేసిన కర్మములను, పైపై చేయబోవు కర్మములను నశింజేయును. ఇది ముమ్మాటికిని నిజము.

(7) అవ :—ఇట్టి పరమ ఫలమును పొందుటకు శ్రీ వేంకటాచల పతిని ఆశ్రయింపవలయునా? అవసరములేదు. ఈ వేంకటాచలమే అట్టి ఫలమును అనుగ్రహించును. అని ఈ పాశురమున అభివర్ణించుచున్నారు:

శుమన్దు మామలర్ నీర్ శుడర్ తూపమ్ కొణ్డు,
అమర్న్దువానవర్ వానవర్కోనోడుమ్,
నమన్దెழుమ్ తిరువేఙ్గడమ్ నఙ్గట్కు,
శమన్గొళ్ వీడుతరుమ్ తడఙ్కున్ఱమే. ౭

టీక :—మామలర్ నీర్ శుడర్ దూపమ్కొండు = పరమ శ్లాఘ్యములైన పుష్పములను, దివ్యములగు తీర్థములను, దివ్యదీపధూపాదులను పరమభక్తితో తీసికొనివచ్చి, అమర్న్దు = స్థిరచిత్తులైయుండి (కైంకర్యమునే పరమ ప్రయోజనముగా భావించి), వానవర్ కోనోడుమ్ = నిత్యసూరులకు నిర్వాహకుడైన (అధిపతియైన) శ్రీమద్విష్వక్సేనులతోగూడ, వానవర్ = నిత్యసూరులు, నమన్దు = నమస్కారముచేసి, ఎழుమ్ ఉ (కైంకర్యమను పరమఫలమును పొందుటచే నెచ్చట) ఆనందమును అనుభవించుచున్నారో (అట్టి), తిరువేంగడమ్ తడమ్ కున్ఱమే = శ్రీ వేంకటాచలమను మహోన్నతమగు పర్వతమే, నఙ్గట్కు = మనకు, శమన్ కొళ్ వీడుతరుమ్ = (తాము చేయు కైంకర్యమునకు) సమమైన కైంకర్య స్వరూపమగు మోక్షమును లభింపజేయును.

తా॥ శ్రీవేంకటాచలము, సర్వేశ్వరుని పాదారవిందములను ధరించు చున్నదై, అతడు లక్ష్మీసనాథుడై యథేష్టముగ లీలారసమనుభవించుటకు దగినట్లు అనుకూలములను కలుగజేయుచు, విరాజిల్లుచున్నది. ఆ పర్వతమే, మనము చేయు కైంకర్యములకు దగిన పురుషార్థములను అనుగ్రహించును. ఈ విషయము నెట్లు నిరూపించుట యనగా — నిత్యసూరులును, వారలకు స్వామియైన శ్రీమద్విష్వక్సేనులును ఆరాధనమునకు దగిన శ్లాఘ్యములగు ఉపకరణములను గొనివచ్చి, ప్రయోజనాంతర నిరపేక్షులై, శ్రీ వేంకటాచలమునకువచ్చి, సర్వేశ్వరుని సేవించి, వాని కశేష శేషోచిత కైంకర్యములను అనుష్ఠించుచు, మహానందమును అనుభవించుచున్నారు గద! మనకును, ఇట్టి భాగ్యమును, ఈ తిరుమలయే అనుగ్రహించును. నందియ సేదియును లేదు.

వి. వి :—(1) 'నంగట్కు' అనుటచే మన గుణదోషముల పరికించి ఫలముల నివ్వక, తిరుమలయే పరమకరుణతో భాగ్యముల నిచ్చును. అని సూచింపబడుచున్నది.

(2) 'వీడు' అనగా, మోక్షము. భగవంతుని దివ్యమంగళ విగ్రహమునుగండ్లార సేవించి, భక్తిప్రకర్షమతిశయింపగా, అతనికి సర్వవిధ కైంకర్యముల నొనర్చుట.

(8) అవ :—తిరుమల, సర్వేశ్వరునకు అత్యన్త ప్రీతిపాత్రమై, ప్రాప్యమైయున్నదిగదా! అది వేఱొక ప్రయోజనమును లభింపజేయవలయునా ? అదియే పరమప్రాప్యము—అని యీ పాశురమున ఆనతిచ్చుచున్నారు—

* కున్రమేన్ది కుళిర్మళై కాత్తవన్,
అన్రుఞాలమ్ అళన్దపిరాన్, పరన్
శెన్రుశేర్ తిరువేజ్గడమామలై,
ఒన్రుమే తొళ నమ్ వినై ఓయుమే. ౮

టీక :—కున్రమ్ ఏన్ది = ("గోవర్ధనము" అను) పర్వతము నెత్తి. కుళిర్ మళై కాత్తవన్ = చల్లనివర్షమునుండి (గోకులమును) రక్షించినవాడును, అన్రుఞాలమ్ అళన్ద పిరాన్ = ముందుకాలమున తన పాదారవిందములచే లోకముల గొలిచి (తన శ్రీపాదముల

స్పర్శమును నిఖిలలోకములకును గలుగజేసి) మహోపకారమొనరించిన, పరన్ = పరాత్పరుడగు, శ్రీనివాసుడు, శెన్ఱు శేర్ = పరమపదమునుండి విచ్చేసి, నివసించియున్న, తిరువేంగడమామలై ఒన్ఱుమే = శ్రీవేంకటాచలమను మహాపర్వతమును ఒక్కదానిని మాత్రమే, తొழ = సేవింపగా, నమ్వినై ఓయుమే = మన క్లేశము లన్నియును తీరును గద!

తా॥ సర్వేశ్వరుడు, తన స్వరూప స్వభావములచేతను, కల్యాణ గుణముల ప్రోద్బలమువల్లను, గోకులమును రక్షించుటయు, త్రివిక్రమావతారుడై భూమిని కొలుచుటయు, ఇవి మొదలుగాగల సంఘటనలచే తనకును, ఇతరులకును అంతులేని సంతోషమును ఇచ్చువాడుగ నున్నాడు. అతడు, పరమపదమును విడచి, మిక్కిలి ఆశతో వచ్చి తిరుమలలో నివసించుచున్నాడు. అందుచే, అట్టి మహావైభవోపేతమగు తిరుమలయే—మనకు ప్రాప్యము గద ! వేరు ప్రయోజనమును మనము అర్థింపవలయునా? ఆ తిరుమలను నమస్కరించితిమేని, మన క్లేశము లన్నియును స్వయముగనే పటాపంచలై పోవును.

వి. వి :— ఇచ్చట “కున్ఱమేన్దిక్కుళిర్ మழைకాత్తవన్” అనియు, పై పాశురమున “ఆయన్” అని యీ ఆళ్వార్లు అనతిచ్చియుండుటచే, తిరువేంగడముడయానులకు “గోపనుడు” అను పేరు ప్రసిద్ధమైయుండినదని తెలియుచున్నది.

(9) అవ :—మనకు ప్రాప్యుడు తిరువేంగడముడయానులు కాని, తిరుమల ఎట్లగును ? అనిన, దీనికి ఉత్తరమును సెలవిచ్చుచున్నారు...

ఓయుమ్ మూప్పు ప్పిఱప్పు ఇఱప్పు ప్పిణి,
వీయుమాఱు శెయ్వాన్ తిరువేఙ్గడత్తు
ఆయన్, నాళ్ మలరామ్ అడిత్తామరై,
వా యుళ్ళుమ్ మనత్తుళ్ళుమ్ వైప్పార్గట్కే. ౯

టీక :— తిరువేంగడత్తు ఆయన్ = శ్రీ వేంకటాచలమున విరాజిల్లుచుండు గోపాలుడు, నాళ్ మలరామ్ అడిత్తామరై = అప్పుడే వికసించిన తామరపుష్పమువలె (మృదులములై, సుందరములై) ఉండు వాని తిరువడిత్తామరలను, వాయ్ ఉళ్ళుమ్ మనదు ఉళ్ళుమ్ వైప్పార్గట్కు = వాక్కునను, మనస్సునను, ఉంచుకొని, అనుసంధించు

వారలకు, ఓయుమ్‌మూప్పు = అనేకములగు బాధల కలుగజేయు వార్ధక్యము, పిఱప్పు = జననము, ఇఱప్పు = మరణము, పిణి = వ్యాధి, ఇవి మొదలగునవి అన్నియును, వీయుమా అు శెయ్‌వాన్ = నశించునట్లు చేయును,

తా॥ తిరువేంగడమున విజయముచేసియుండు శ్రీనివాసుడగు గోపాల రత్నము, తన పాదారవిందములను ఎల్లప్పుడును ధ్యానించుచు స్తోత్రముచేయువారలకు సంసారమందున్న జన్మ జరామరణాది సకల క్లేశములను నశింపజేయును. ఇట్లు చేయు మహిమ, అతనికి ఈ తిరువేంగడమున నివసించుటవలననే సంప్రాప్తమైనది. కనుక, ఈ తిరుమలయే మనకెల్లఱకును పరమప్రాప్యము.

(10) అవ :—క్రిందచెప్పిన కారణములచే పరమభోగ్యమగు తిరువేంగడమునకు శీఘ్రముగ వెళ్లి, దానిని అనుభవింపుడు—అని ఈ పాశురమున ఆనతిచ్చుచున్నారు —

> వైత్తనాళ్వరై ఎల్లై కుఱుగిచ్చెన్ఱు,
> ఎయ్‌త్తిళైప్పదన్ మున్నమ్ అడైమినో,
> పైత్తపామ్బణై యాన్ తిరువేఙ్గడమ్,
> మొయ్‌త్తశోలై మొయ్‌పూన్దడమ్ తాళ్వరే. ౧౦

టీక :— పైత్తపామ్బు అణైయాన్ =(సర్వేశ్వరునియొక్క దివ్యమంగళ విగ్రహస్పర్శసుఖముచే) విస్తృతములైన పడగలుగల ఆదిశేషుని పడకగా గలిగిన సర్వేశ్వరునియొక్క, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలముయొక్క మొయ్‌న్దశోలై = ఎచట చూచినను దట్టములై, కనులపండువయైయుండు పూదోటలతో కూడుకొనియున్న, మొయ్ పూమ్ తడమ్ తాళ్వరే = మనోజ్ఞములగు పుష్పములతోగూడి విస్తృతములగు సాను (చరియ) ప్రదేశములను, వైత్తనాళ్ =(సర్వేశ్వరుని సంకల్పవిశేషముచే)నిర్ణీతమైన ఆయుర్భాగముయొక్క, వరైఎల్లై=కడపటి ఎల్ల, కుఱుగి = సమీపించి, ఎయ్‌దు = ముసలితనముచే అనేకములగు బాధలుగలిగి, ఇళైప్పదన్ మున్నమ్ = నశించిపోవుటకు ముందే, శెన్ఱు అడైమినో = పోయి చేరుడు.

తా॥ సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుడు నివసించుచున్న తిరుమలయందలి పూదోటలలోని మనోజ్ఞములగు పుష్పములతోగూడి సుందరములై, విస్తృతములై యుండు చరియలను, మీ ఆయుఃకాలము గడచి, ముసలితనముచే పలుబాధలను అనుభవించుటకు ముందే, శీఘ్రిమే పోయి చేరుడు.

(11) అవ :—నిగమనమున ఈ తిరువాయ్‌మొழிని అభ్యసించిన వారలకు ఫలమును ఆనతిచ్చుచున్నారు—

* తాళ్ పరప్పి మణ్ తావియ ఈశనై,
నీళ్ పొழிల్ కురుకూర్ చ్చడగోపన్ శొల్,
కేழிలాయిరత్తు ఇప్పత్తుమ్ వల్లవర్,
వాழ்వర్ వాழ் వెయ్‌ది ఞాలమ్‌పుగழ்వే. ౧౧

టీక :— తాళ్ పఱప్పి = పాదారవిందములను పెద్దవిగజేసికొని, మణ్ తావియ ఈశనై = భూమిని కొలచిన సర్వేశ్వరు నుద్దేశించి, నీళ్ పొழிల్ = సువిస్తృతములగు పూదోటలతో గూడుకొనియున్న, కురుకూర్ శడగోపన్ శొల్ = తిరునగరిలో వేంచేసి యుండు శ్రీ శఠగోప దివ్యసూక్తులు ఆనతిచ్చిన, కేழிల్ ఆయిరత్తు = సాటిలేని వెయ్యి పాశురములలో, ఇప్పత్తుమ్ వల్లవర్ = ఈ పదిపాశురములను బాగుగ నభ్యసించిన వారలు, ఞాలమ్ పుగழ = లోకములన్నియు స్తోత్రము చేయునట్లు, వాழ் వు = (తిరుమలలో నివసించుటయను) భాగ్యమును, వెయ్‌ది = పొంది, వాழ் వర్ = సుఖించుదురు.

తా॥ ఎల్లప్రాణులును తనను సేవించి ఉజ్జీవించుటకు అనువగునట్లు, తన శ్రీపాదములను వ్యాపింపజేసి, లోకముల గొలిచిన, శ్రీ త్రివిక్రమావతారుడగు స్వామినిగూర్చి శ్రీనమ్మాழ்వార్లు ప్రసాదించిన తిరువాయ్‌మొழி దివ్యప్రబంధములోని ఈ పదిపాశురములను బాగుగ నభ్యసించినవారలు, అందఱును స్తోత్రముచేయునట్లు, నిరతిశయ సంపత్సౌభాగ్యముల కాకరమగు తిరుమలలో నిత్యనివాసభాగ్యమునుబొంది, దివ్యసుఖములను అనుభవింతురు.

శ్రీ నమ్మాழ்వార్ల తిరువడిగళే శరణము



## ఈ తిరువాయ్మొళికి శ్రీ వేదాంతదేశికులవారి

### ద్రమిడోపనిషత్తాత్పర్యరత్నావళి శ్లోకము

స్థానోత్కర్షాత్సుదీప్తం, శ్రమహరవపుషం, స్వాంగపర్యాప్తభూషమ్,
తేజిష్ఠం నీచయోగాత్, ప్రణమితభువనం, పావనం సన్నతానామ్ ।
ప్రాప్త్యర్థస్థానం, అంహః ప్రశమనవిషయం, బంధవిచ్ఛేదిపాదమ్
భేజే శ్రీఘ్రాభియానక్షమశుభవసతిం, లబ్ధతార్చ్యాభిముఖ్యమ్ ॥

టీక :- స్థానోత్కర్షాత్ = తిరుమలయను దివ్యక్షేత్రముయొక్క అతిశయమువలన సుదీప్తమ్ = నిరతిశయదీప్తియుక్తుడును, శ్రమహరవపుషమ్ = కాలమేఘమువలె సమాశ్రితులకు శ్రమమునుపోగొట్టునట్టి దివ్యమంగళవిగ్రహయుక్తుడును, స్వాంగపర్యాప్తభూషమ్ = తన దివ్యావయవములచేతనే పరిపూర్ణమైన భూషణములుగలవాడును, నీచయోగాత్ = నీచులతో సంబంధించుటవలన తేజిష్ఠమ్ = అత్యంతతేజస్సు గలవాడును, ప్రణమితభువనమ్ = సకలలోకములచేతను నమస్కరింపబడువాడును, సన్నతానామ్ = ఆశ్రయించినవారలను, పావనమ్ = వారివిరోధులబోగొట్టి పరిశుద్ధులజేయువాడును, ప్రాప్త్యర్థస్థానమ్ = మోక్షము పొందుటకు సాధనమైన దివ్యక్షేత్రము కలవాడును, అంహః ప్రశమనవిషయమ్ = ప్రాప్తిప్రతిబంధకములగు పాపములపోగొట్టునట్టి దేశములుగలవాడును, బంధవిచ్ఛేదిపాదమ్ = జన్మజరామరణాది సంసారక్లేశముల నశింపజేయెడి పాదారవిందములు గలవాడును, శీఘ్రాభియానక్షమశుభవసతిమ్ = శీఘ్రముగ నాశ్రయింపదగిన మనోహరమగు వాసస్థానముగలవాడును, అగు సర్వేశ్వరుని, లబ్ధతార్చ్యాభిముఖ్యమ్ = పొందింపబడిన అర్చావతారమందలి అభిముఖ్యముగలవానినిగ, భేజే = (నమ్మాళ్వార్లు) ఆశ్రయించిరి.

తా॥ సర్వేశ్వరుడు—(1) తిరువేంగడమనెడి తిరుమలయందు వేంచేసియుండుటవలన నిరవధికతేజోవంతుడనియు, (2) కాలమేఘమువలె, తనను సేవించినవారి శ్రమమును పోగొట్టునట్టి, దివ్యమంగళవిగ్రహముగలవాడనియు, (3) సద్యోవికసితములగు సరసిజములవలె మనోహరములైన దివ్యనేత్రములచే బరిపూర్ణాలంకారము గలవాడనియు, (4) అతినీచులైనచేతనులతో సంశ్లేషించుటవలన నిరధిక తేజోవంతుడనియు, (5) సకలలోకములును నమస్కరించునట్టి పాదపద్మములు గలవాడనియు

(6) స్వాశ్రితులకు నాశ్రయణవిరోధులపోగొట్టి, వారిని పరిశుద్ధులనుగా చేయువాడనియును, (7) సకలచేతనులకును ఆశ్రయింపదగిన దేశమునందు వేంచేసియున్నవాడనియు, (8) తాను నివసించుచున్న దేశమును ఆశ్రయించువారల సకలపాపముల పోగొట్టువాడనియు, (9) తన పాదపద్మములచే, ఆశ్రితులయొక్క జన్మజరామరణాద్యనేకవ్యాధుల పోగొట్టువాడనియు, (10) ఏప్పుడో, ఆశ్రయించెదమని విళంబింపక, ఆతిశీఘ్రముగ నాశ్రయింపదగిన తిరుమలయందు వేంచేసియున్నవాడనియును, వాని నిరతిశయ కల్యాణగుణముల ననుసంధించినవారలై, ఆళ్వార్లు ఈ మూడవ పత్తు మూడవ తిరువాయ్‌మొళిలోని 10 పాశురములచే, వానిని యథా మనోరథముగ ననుభవించిరి.

శ్రీ నిగమాన్తమహాదేశికుల తిరువడిగళ్ళే శరణము.

---

ఈ తిరువాయ్‌మొళికి శ్రీవాదికేసరిఅళగియమణవాళజీయర్లవారి

ద్రమిడోపనిషత్సంగతి శ్లోకము

సర్వత్ర సర్వసమయే సకలా స్వవస్థా-
స్వభ్యర్థయ న్నిఖిలదాస్యరసాన్ మునీన్ద్రః ।
శ్రీ వేంకటాద్రినిలయస్య పరస్య పుంసః
నిస్సీమశీలగుణ మప్యవద త్తృతీయే ॥

టీక :— సర్వత్ర = సర్వదేశములయందును, సర్వసమయే = సర్వకాలములయందును, సకలాసు అవస్థాసు = సమస్తమైన అవస్థలయందును, నిఖిలదాస్యరసాన్ = సర్వకైంకర్యరసములను, అభ్యర్థయన్ = యాచించుచున్నవారై, మునీన్ద్రః = శ్రీ శఠగోపముని, శ్రీ వేంకటాద్రినిలయస్య = శ్రీ వేంకటాచలమును వాసస్థానముగాగల, పరస్య పుంసః = పరమపురుషునియొక్క, నిస్సీమశీలగుణమ్ = అవధిలేని సౌశీల్యగుణమును తృతీయే = ఈ మూడవ తిరువాయ్‌మొళియందు, అవదత్ = సాదించిరి.

తా॥ సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును, సకలవిధ కైంక ర్యములను యాచించినవారలై సర్వేశ్వరునియొక్క నిరవధికకల్యాణ గుణములను ఈ మూడవపత్తు మూడవ తిరువాయ్‌మొழியందు శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిరి.

శ్రీ వాదికేసరి అழగియమణవాళ జీయర్ల తిరువడిగళ్ళే శరణము

---

## ఈ తిరువాయ్ మొழிకి శ్రీ మణవాళమహామునులు ప్రసాదించిన తిరువాయ్‌మొழி నూత్తన్దాది పాశురము

ఒழிవిలా క్కాల ముడనాగి మన్ని
వழுవిలా వాట్చెయ్యమాలుక్కు — ఎழுశిగర
వేఙ్గడత్తు ప్పారిత్త మిక్కనలం శేర్ మాఱన్
పూజక్కழలై నెఞ్జే పుగழ்

టీక :— ఒழுవు ఇలా క్కాలమ్ = విచ్ఛేదములేని సర్వకాలములయందును, ఉడనాగి మన్ని = విశ్లేషింపకయుండి, మాలుక్కు = భగవంతునకు, వழுవుఇలా = విచ్ఛేదములేని, అట్చెయ్య = కైంకర్యములను చేయుటకు, ఎழுశిగరవేంగడత్తు = ఉన్నతములైన శిఖరములుగల తిరుమలయందు, పారిత్త = కోరిన, మిక్కనలమ్ శేర్ = నిరవధిభక్తితో కూడిన, మారన్ = ఆళ్వారులయొక్క, పూమ్కழలై = పుష్పములవలె సుకుమారములైన శ్రీపాదములను, నెంజే = ఓ మనసా, పుకழ் = స్తుతింపుమా.

తా॥ తిరుమలయందు, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును భగవంతునికి సర్వవిధ కైంకర్యములను జేయవలయునని కోరినవారును, అత్యన్తభక్తియుక్తులునునైన ఆళ్వార్లయొక్క పుష్పహార సుకుమారములైన శ్రీపాదపద్మములను ఓ మనసా ! నీ వెల్లప్పుడును స్తుతించి యుజ్జీవింపుమా.

శ్రీ పెరియజీయర్ల తిరువడిగళ్ళే శరణము

---

శ్రీరస్తు
శ్రీమతే శ్రీనివాసపరబ్రహ్మణే నమః
శ్రీమతే శఠగోపమునయే నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువాయ్మొழி

" ఉలగమ్ముణ్డ పెరువాయా " అను — 6-వ పది, 10-వ తిరువాయ్మొழிలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

(1) అవ :— శ్రీ నమ్మాళ్వార్లు, క్రింది తిరువాయ్మొழிలో, తమకు సర్వేశ్వరుని బాహ్యాశ్లేషము ఇచ్చుటనే లభింపవలయును, లేక, తమను వైకుంఠమునకు పిలుచుకొని వెళ్ళవలయును—అని, పెద్ద ఆర్తనాదముతో మొరలిడిరి. కాని, సర్వేశ్వరుడు దానిని సరకు చేయలేదు. కాబట్టి, ఇటుపై అతనిని సాక్షాత్కరించుకొనుటకు, అతని పాదారవిందములలో శరణాగతి చేయుటతప్ప, వేరు ఉపాయములేదు—అని తీర్మానించుకొని, ఈ తిరువాయ్మొழிలో, తిరువేంగడముడయానులయొక్క అత్యద్భుతములగు కారుణ్యావాత్సల్యాది దివ్యకల్యాణగుణములను 9 పాశురములలో నభివర్ణించి, 10-వ పాశురమున శ్రీ పెరియపిరాట్టియార్లను పురుషకారముగ చేసికొని, భగవచ్చరణారవిందములయందు, సాంగోపాంగముగ ప్రపత్తిని చేయుచున్నారు.

అందు, మొదటి పాశురమున, అఖిలజగద్రక్షణార్థము తిరుమలలో నిత్యసన్నిహితుడవై యున్న నిన్ను, స్వతస్సిద్ధశేషత్వ స్వరూపుడనగు నేను చేరగల్గిన ఉపాయమును ఆనతివ్వవలయునని ప్రార్థించుచున్నారు.

* ఉలగముణ్డ పెరువాయా ! ఉలప్పిల్ కీర్త్తి ! అమ్మానే,
నిలవుమ్ శుడర్ శూழ் ఒళిమూర్త్తి ! నెడియాయ్ ! అడియేన్ ఆరుయిరే,
తిలద ములగుక్కాయ్ నిన్ఱ తిరువేఙ్గడత్తు ఎమ్బెరుమానే,
కులతొల్ అడియేన్ ఉనపాదమ్ కూడుమ్ ఆఱు కూఱాయే. ౧

టీక :— ఉలగమ్ ఉణ్డ పెరువాయా = లోకములను ప్రళయకాలమున ఆరగించిన పెద్దనోరుగలవాడా! ఉలప్పిల్ కీర్త్తి = అంతములేని కారుణ్య వాత్సల్యాదికల్యాణ గుణములచే గలిగిన నిష్కలంకమగు కీర్తిగలవాడా! అమ్మానే = స్వామీ! నిలవుమ్ శుడర్ శూழ் ఒళి మూర్త్తి = మిక్కిలి ప్రకాశించుచున్న, తన కాంతిచే లోకములను వ్యాపించి, వానిని గూడ ప్రకాశింపజేయుచున్న అప్రాకృతమగు దివ్యమంగళవిగ్రహము గలవాడా! అడియేన్ ఆర్ ఉయిరే = దాసునకు పూర్ణమైన ప్రాణస్వరూపుడా! నెడియాయ్ = వైకుంఠమను ఊర్ధ్వలోకమున నివసించువాడా! ఉలగుక్కు = లోకములకు, తిలదమాయ్ నిన్ఱ = తిలకముపలె అలంకారభూతమై విరాజిల్లుచున్న, తిరువేంగడత్తు = శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు, ఎమ్ పెరుమానే = మా స్వామీ! కులతొల్ అడియేన్ = వంశపరంపరగా అనాదికాలముగ దాసభూతుడనైయున్న నేను, ఉన పాదమ్ = దేవరవారి తిరువడిగళ్ళను, కూడుమ్ ఆఱు = చేరుమార్గమును, కూఱాయే = కృపతో నానతిమ్ము.

తా॥ ప్రళయమను ఆపత్సమయమున దయార్ద్రచిత్తుడవై, లోకములన్నిటిని నీ యుదరమున భద్రముగ నుంచుకొని రక్షించితివి. అసంఖ్యాకములగు వాత్సల్యాదికల్యాణగుణపరిపూర్ణుడవై వెలుంగుచున్నావు. స్వభావసిద్ధమైన కాంతి సౌందర్యములచే లోకములన్నిటిని వ్యాపించి, ప్రకాశింపజేయు, అప్రాకృత దివ్యమంగళవిగ్రహమును గలిగియున్నావు. నాకు నీవు స్వామి. నేను నీకు వంశపరంపరగా దాసభూతుడను. ఈ విషయములన్నిటిని బాగుగ నాకు తెలియపరచియున్నావు. నిన్ను విడచి ఒకక్షణమైనను జీవింపజాలను 'ఎల్లరును నన్ను సేవించి ఉజ్జీవింతురు గాక' అని పరమకృపాకరుడవై, అందఱును సేవించుటకు అనువగునట్లు, నిఖిల లోకములకును అలంకారభూతమైన తిరువేంగడమను తిరుమలలో, ప్రీతిమీఱ వేంచేసియున్నావు. అనుగ్రహముంచి నీ పాదారవిందములలో జేరు ఉపాయమును నాకు ప్రసాదింపుము.

వి. వి:— (1) లోకములను ప్రళయాపత్తునుండి రక్షించుటకు నీనోటిని బాగుగ తెఱచుట మొదలగు వ్యాపారములను మిక్కిలి త్వరగ చేసితివి. అట్టి వాత్సల్యౌదార్యములుగల నీవు ఏల నన్ను గమనింపకయున్నావు. వానిని "ఆపత్కాలమున గద నేను రక్షించినది; మీకు అట్టి ఆపద ఏమి వచ్చినది" అని అడిగెదరా? ఆ ఆపదలన్నియును

ఒక్కప్పుడి నాకు ఒక్కనికే వచ్చియున్నవి. ప్రళయకాల జలార్ణవమున మునుంగుట గదా! అట్టి ఆపత్తు" అని అందురేమో? నేను మాత్రము సంసారమహార్ణవమున మునిగి శ్రమపడుచుండలేదా? "మమ్ము రక్షింపుము" అని అపేక్షింపని అచేతనముల గూడ రక్షించితివే! "కరణమిలా నన్ను రక్షింపుము" అని మొఱలిడు నన్ను రక్షింపవా? ఇట్టి అర్థములన్నిటిని సూచించుటకై "ఉలగముణ్డ పెరువాయా" అని ప్రయోగించిరి. (2) "కూఱాయే" నీకది ప్రయోగించుటకు ఒకేపదమైయుండును. నాకదియే మహా పురుషార్థము. "మా శుచః" (దుఃఖింపకుము) - అని శ్రీకృష్ణుడవై నీవు అర్జునుని బుజ్జగించితివి. ఇప్పుడును అట్టి యొకమాటను ప్రసాదించి, నా దుఃఖమును పరిహరింపుము- అనిభావము.

(2) అవ :— "నాతోఁజేరుటకు నీ పాపపుంజములు ప్రతిబంధకములుగానున్నవి. అవి నశించినప్పుడు గద నిన్ను స్వీకరింపవచ్చును" అని సర్వేశ్వరుడు ఆనతిచ్చినట్లుభావించి, అందులకు ప్రత్యుత్తరమును ఈ పాశురమున చెప్పుచున్నారు.

కూఱాయ్ నీఱాయ్ నిలనాగి క్కొడువల్లశురర్ కులమెల్లామ్,
శీఱా ఎఱియుమ్ తిరునేమి వలవా తెయ్వ క్కోమానే,
శేఱార్ శునై త్తా మరై శెన్దీ మలరుమ్ తిరువేఙ్గడత్తానే,
ఆఱా నన్బిల్ అడియే నున్నడి శేర్ వణ్ణమ్ అరుళాయే. ౨

టీక :— తెయ్వమ్ క్కోమానే! = దేవతలకు స్వామియైనవాడా! కొడువల్ అశురర్ = పరమక్రూరులై బలాధికులగు రాక్షసులయొక్క, కులమ్ ఎల్లామ్ = వంశము లన్నియును, కూఱాయ్ = భిన్నాభిన్నములై, నీఱాయ్ = (వాని శేషమొక్కటియును తెలియకుండునట్లు) భస్మీభూతమై, నిలన్ ఆగి = (అదియును తెలియకుండునట్లు) ఒట్టి నేలమాత్రము మిగులునట్లుచేసి, శీఱా = (ఇన్ని చేసియు) సర్వమువలె బుసకొట్టుచు, ఎఱియుమ్ = జ్వలించుచున్న, తిరునేమి = సహస్ర - అరములుగలిగిన చక్రాయుధమును, వలవా! = కుడిప్రక్కన ధరించియున్నవాడా! శేఱుఆర్ = బురదతో నిండియుండు, శునై, = కొండనుడుగులలోని, తామరై = తామరపుష్పములు, శెన్దీరుమ్ = ఎఱ్ఱని అగ్నివలె వికసించుచుండు, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలమున అమరియున్న వాడా! ఆరా అన్బిల్ = ఎప్పటికిని తీరని గొప్ప ఆశతో గూడుకొనియున్న అడియేన్ = దాసుడగు నేను, ఉన్ అడి = దేవరవారి తిరువడిగళ్ళను, శేర్ వణ్ణమ్ =, చేరునట్లు, అరుళాయ్ = కృపజేయవలయును.

తా॥ క్రూరులై బలాధికులగు అసురులవంశములనెల్ల ఉన్నచోటు తెలియకుండునట్లు నీ చక్రాయుధాగ్నిచే భస్మీపటలముచేసితివి. అట్లు చేసియు కోపముతీరక, సర్పమువలె బుసకొట్టుచుండు చక్రాయుధమును కుడిచేతిలో ధరించియున్నావు. ఇట్లు నిన్నాశ్రయించిన దేవతలకు సంభవించిన క్లేశములనన్నిటిని నీవే పోగొట్టుచున్నావు. ఇట్లుండ నీయందే తీరని కుతూహలముతో బాధపడుచుండు దాసుని ప్రతిబంధకములను గూడ నీవే పరిహరింపవలయును. బురదతో నిండియుండు సరస్సులయందు ఎఱ్ఱని అగ్నివలె వికసించు తామరపుష్పములతో విరాజిల్లుచుండు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు మాస్వామీ! పైపై వృద్ధిజెందుచున్న నీ విషయమైన ఆశ యను మహాసముద్రమునమునిగియున్న నన్ను నీ పాదారవిందములలో జేరునట్లు అనుగ్రహింపవలయును.

వి. వి :— (1) కుసై —అనగ కొండలలోనుండు చిన్నమడుగు (2) " శెన్ తీవలరుమ్ " అనుటను భావమేమనగ — తమ కాంతిచే తిరుమలయంతయు ప్రకాశించునట్లు అధిక కాంతియుక్తములై, సుభగశీతలములై, సుమృష్టనాళములై, వికసించునవి — అని.

(3) అవ :— "మోక్షము నివ్వవలయునని అనుచున్నారే! దానికి కారణ మేదియేని లేక ఇవ్వదగునా? " అని సర్వేశ్వరుడు ఆక్షేపించినట్లు భావించి, అందులకు ప్రత్యుత్తర మొసంగుచున్నారు.

వణ్ణ మరుళ్ కొళ్ అణిమేగవణ్ణా మాయ వమ్మానే,
ఎణ్ణమ్ పుగున్దు తిత్తిక్కుమ్ అముదే ఇమైయోర దిపతియే,
తెణ్ణలరువి మణిపొన్ ముత్తలై క్కుమ్ తిరువేఙ్గడత్తానే,
అణ్ణలే ఉన్నడిశేర అడియేఱ్కావా వెన్నాయే. 3

టీక :— ఇమైయోర్ = దేవతలకు నిత్యసూరులకు, అధిపతియే = స్వామియైనవాడా! వణ్ణమ్ అరుళ్ కొళ్ = స్వభావసిద్ధమైన కృపారసముగల, అణిమేగవణ్ణా = సుందరమైన మేఘమువంటి వర్ణము గలవాడా! మాయ = ఆశ్చర్యగుణచేష్టితుడగు

అమ్మానే = స్వామీ! ఎణ్ణుళ్ = నా మనస్సులో, పుగున్దు = ప్రవేశించి, తిత్తిక్కుమ్ = మధురసాస్వాద ముగల, అముదే = అమృతస్వరూపుడా! తెళ్ నల్ అరువి = స్వచ్ఛములైన మంచి సెలయేళ్ళు, మణి = రత్నములను, పొన్ = బంగారమును, ముత్తు = ముత్యములను, అలైక్కుమ్ = అలలచేగట్టుకు చేర్చుచున్న, తిరువేంగడత్తానే = తిరువేంగడమను తిరుమలలో విజయము చేసియున్నట్టివాడా! అణ్ణలే = నీ స్వామిత్వమును నాకు తెలిపినవాడా! అడి - తిరువడిగళ్ళను, శేర = చేరుటను, అడియేర్కు = దాసునకు, ఆఆ ఎన్నాయే = అయ్యో అయ్యో అని కరుణించి, అనుగ్రహింపుము!

తా॥ దేవరవారు నిత్యసూరులకు స్వామియైయున్నారు. కనుక, మీతో చేరుట. వారలు వేంచేసియున్నను ఇంద్రనీలమణివలె అత్యాశ్చర్యకరమగు దివ్యమంగళవిగ్రహముతో గూడ పరమానుగ్రహముతో నా మనస్సున ప్రవేశించి, నాకు పరమభోగ్యామృతమైయున్నారు. దేవరవారు దాసునికి స్వామి యనియు, దేవరవారికి నేను దాసుడననియు, నాకు తెలియజేసితిరి. పరిశుద్ధమై, మనోజ్ఞములగు సెలయేళ్ళ అలలచే గట్టులయందు చేర్చబడు బంగరు, రత్నములు, ముత్యములు మొదలగు వానిచే రమణీయమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నావు. ఈ కార్యములనన్నిటిని ఎందులకై చేసితిరి! స్వభావసిద్ధమగు మీ కృపాకార్యములే గద ఇయ్యవి అనిర్హేతుకకృపనే నా మీదను ప్రసరింపజేసి, 'అయ్యో వీడుచాల శ్రమపడుచున్నాడే'—అని దయార్ద్రచిత్తులై మీ పాదారవిందములను చేరునట్లు దాసుని అనుగ్రహింపుడు.

(4) అవ :— ఇట్లు ఆళ్వార్లు ప్రార్థింపగ, సర్వేశ్వరుడు, "నేను నీ మనస్సున ప్రవేశించినది మీరుచేసిన పుణ్యమును వ్యాజీకరించుకొనియే. ఇప్పుడు మీరు ప్రార్థించినట్లు చేయుటకును ఏదైనను వ్యాజము కావలయును గద!" అని సర్వేశ్వరుడు అనతిచ్చినట్లుభావించి, అందులకు ప్రత్యుత్తరము నొసంగుచున్నారు.

ఆవా! ఎన్నాదులగత్తై యళైక్కు మశురర్ వాణాళ్ మేల్,
తీవాయ్ వాళి మళై పొళిన్ద శిలైయా! తిరుమామగళ్ కేళ్వా!

తేవా శురర్‌గళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే!
పూవార్ కళ్ఴల్‌గళ్ అరువినైయేన్ పొరున్దుమాఱు పుణరాయే. ౪

టీక :— ఆఆ ఎన్నాదు = అయ్యోఅయ్యో అని కనికరము కొంచెమైనను లేక, ఉలగత్తై = లోకులను అలైక్కుమ్ = బాధించునట్టి, అశురర్ = రాక్షసులయొక్క వాళ్ఴ్ నాళ్ మేల్ = జీవించురోజులపై, (ప్రాణములపై), తీవాయ్ = అగ్ని ముఖములగు (కొనలయందు నిప్పు గల్గిన), వాళి మళ్ఴై = బాణములవర్షమును, పొళ్ఴిన్ద = వర్షించిన, శిలకొండా = ధనుర్ధరుడా! తిరుమామగళ్ కేళ్వా = శ్రీలక్ష్మీదేవికి ప్రాణనాథుడైన వాడా! తేవా = నిరవధిక తేజోవిశిష్టుడా! శురర్ గళ్ = సురలు (నిత్యసూరులు), మునిక్కణఙ్గళ్ = ఋషులసమూహమును, విరుమ్బుమ్ = నివసింప) ఆశపడు, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలపతీ! పూ ఆర్ = దివ్యపుష్పములతో పూర్ణములై యున్న, కళ్ఴల్ గళ్ = పాదారవిందములను, అరువినయేన్ = తీవ్రమైన దోషముల చేసిన దాసుడు, పొరున్దుమాఱు = చేరుమార్గమును, పుణరాయే = అనుగ్రహింపవలయును.

తా॥ అసురులు కొంచెమైనను కనికరములేక లోకముల పీడించుటను చూచి సహింపలేక, ఆ అసురుల ప్రాణములదీయుటకై కొనలయందు అగ్నినిగలిగి తీక్ష్ణాతితీక్ష్ణములగు బాణములను వర్షించి, (వారలసంహరించి), లోకములకు మహోపకారముచేసిన మహనీయుడా! ఆ అసుర సంహారముగల్గిన జయలక్ష్మినిచూచి, ప్రణయప్రకర్షముతో పిరాట్టిచే గాఢాలింగనముచేసికొనబడి, అందుచే సుందరతమంబై ప్రకాశించుచున్న దివ్యమంగళవిగ్రహము గలవాడా! నిత్యసూరులును, ఋషులును ఆశపడి, బృందములు బృందములుగ విచ్చేసి, సేవించుచున్న తిరువేంగడమను పర్వతమున వేంచేసియున్న ఓ స్వామీ! ఇదివరకును నీవు ఏర్పఱచిన ఉపాయములు నాకు ప్రయోజనపడవు. దేవరవారికి ఏదైనను వ్యాజము కావలసియున్నచో, ఒక క్రొత్తఉపాయమును కల్పించి, సేవార్థులు సమర్పించు పుష్పములతో పూర్ణములై, ఉజ్జ్వలములైయున్న నీ పాదారవిందములలోనన్ను చేర్చుకొని, అసురులను సంహరించి, లోకముల బాధలను నివర్తింపజేసినట్లు నా దుఃఖములనుసైతము పోగొట్టుమా!

వి. వి :— (1) శ్రీ చక్రవర్తి తిరుమగనారులు ఖరదూషణాదుల సంహరించి, తిరిగివేంచేయునప్పుడు శ్రీ సీతాపిరాట్టి గాఢాలింగన మొనరించుకొనిరి. అసురజయముచే గల్గిన సౌందర్యమును, పిరాట్టి గాఢాలింగనముచే గల్గిన సౌందర్యాతిశయమునుజేర్చి, వారు అధికముగ ప్రకాశించిరి. ఈ విషయము ఈ పాశురమున మొదటి రెండు పాదముల యందును చెప్పబడుచున్నది. (2) నిఖిలప్రాణులును, సర్వేశ్వరుని విభూతిభూతులు; వారలయందు ప్రీతినుంచకపోవుట ఒకదోషము; దానిపై వారలను బాధించుట ఇంకను దోషము. ఈ రెండుదోషములనుచేయుచున్న అసురుల చూచుచు సర్వేశ్వరుడు మిన్నకుండ గలడా ?

(5) అవ :— "నీవు క్రొత్తగ ఒక ఉపాయమును కల్పించుము" అనిచెప్పితిరే; అది నాచే సాధ్యపడునా ? అని సర్వేశ్వరుడు ప్రశ్నించి నట్లు భావించి, అందులకు సమాధాన మొసంగుచున్నారు.

పుణరానిన్ఱ మరమేழ் అన్ఱెయ్ద ఒరువిల్ వలవావో,
పుణరేయ్ నిన్ఱ మరమిరణ్డిన్ నడువే పోన ముదల్వావో,
తిణరార్ మేగ మెనక్కళిఱు శేరుమ్ తిరువేఙ్గడత్తానే,
తిణరార్ శార్ఙ్గత్తు ఉనపాదమ్ శేర్వ దడియే నెన్నాళే.

టీక :— పుణరానిన్ఱ = నిబిడమైయుండు, (ఒకటితో నొకటి దట్టముగ చేరి యుండు) మఱమ్ ఏழு = సప్త(సాల) వృక్షములను, అన్ఱు = అప్పుడు, (సుగ్రీవునికి నమ్మకముగలుగజేయవలసిన సమయమున, ఎయ్ద = (బాణముచే) ఒకటివేళ్ళతో పెకలించివైచిన, ఒరువిల్ వలవా ! = అద్వితీయమైన ధనుర్ధరుడవగు వీరుడా ! పుణర్ ఎయ్‌నిన్ఱ = ఒకటితోనొకటి చేరినట్లమైయున్న, మఱమ్ ఇఱణ్డిన్ = రెండుమద్దిచెట్లయొక్క, నడువే = మధ్యభాగమునుండి, పోన = (దానినికూలద్రోసి) వెళ్ళిన, ముదల్వా = జగత్కారణభూతుడా ! తిణర్ ఆర్ = ఘనతతో నిండిన, మేగమ్ ఎన = మేఘమా అని చెప్పదగిన, కళిఱు శేరుమ్ = ఏనుగులువచ్చిచేరునట్టి, తిరువేంగడత్తానే = శ్రీ వేంక టాచలాధిపతీ ! తిణర్ ఆర్ = ఘనీభవించిపూర్ణమైయున్న, శార్ఙ్గత్తు = శ్రీశార్ఙ్గ మను ధనుస్సునుగల్గిన, ఉనపాదమ్ = దేవర వారి శ్రీపాదములను, అడియేన్ = దాసుడ నగునేను, శేర్వదు = చేరుట, ఎన్నాళ్ = ఎన్నడోగద ! ఓ = అయ్యో.

తా॥ నీకు సాధ్యముగానిది ఏదియేని గలదా ? సుగ్రీవునకు నీ సామర్థ్యమున అపనమ్మకము గలుగగ, దానిని పోగొట్టుటకై ఆ నాడు

ఒక్క బాణముతో నొకటితో నొకటి చేరి గురిచేసికొట్టుటకు సాధ్యముకాని పర్వతములవంటి మద్దిచెట్లను, మహాపర్వతమును, ఒకేబాణముతో భేదించిన జగదేకధనుర్ధరుడవు కావా నీవు? ఇంతియేనా? కృష్ణుడవై అవతరించి, ఒకటితోనొకటి పెనవై చుకొనియున్న రెండు మద్దిచెట్లకు నడుమ నీ కొకకీడును లేకుండునటుల ప్రవేశించి, యమళార్జున భంజనమును చేసినవాడవుగదా నీవు? ఇవి మేఘములా? అని సందేహము పడునటుల బలసియున్న ఏనుగులును, ఇతర ప్రాణులును సంచరించుచున్న తిరువేంగడమున వేంచేసియుండు స్వామీ! దేవరవారి తిరువడిగళ్ళను నేను వచ్చి చేరునదెప్పటికో! అయ్యో!

(6) అవ :— ఇంతవఱకును సర్వేశ్వరుని తిరువడిగళ్ళను పొందవలయునని ఆళ్వార్లు ప్రార్థించిరి. అది ఎప్పట ననగా, ఆనతిచ్చుచున్నారు.

ఎన్నాళే నామ్ మణ్ణళన్ద ఇణై త్తామరై గళ్ కాణ్బదఱ్కెన్ఱు
ఎన్నాళుమ్ నిన్ఱు ఇమైయోర్ గళేత్తి ఇఱైఞ్జి ఇనమినమాయ్,
మెయ్ న్నా మనత్తాల్ వழிపాడు శెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే,
మెయ్ న్నా నెయ్ ది ఎన్నాళ్ ఉన్నడిక్కణ్ అడియేన్ మేవువదే. ౬

టీక :— మణ్ అళన్ద = భూమిని కొలచిన, తామరై గళ్ ఇణై = తిరువడిత్తామరలయొక్క జంటను, నామ్ = మనము, కాణ్బదఱ్కు = సేవించుటకు, ఎన్నాళ్ ఎన్ఱు = ఏకాలమున సంభవించునోయని, ఇమైయోర్ = నిత్యసూరులు, ఎన్నాళుమ్ = ఎల్లప్పుడును, ఇన ఇనమాయ్ = గుంపులు గుంపులుగ, నిన్ఱు = తిరుమలలో నుండి, ఏత్తి = స్తోత్రము చేసి, ఇఱైఞ్జి = నమస్కరించి, మెయ్ నా మనత్తాల్ = దేహము, వాక్కు, మనసు, అను త్రికరణములచే, వழிపాడు శెయ్యుమ్ = కైంకర్యము చేయుచుండు, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్న ఓ స్వామీ! అడియేన్ నాన్ = నీకేదాసుడనగు నేను, మెయ్ = సత్యముగ, ఎయ్ ది = ఆశ్రయించి, అడిక్కణ్ = తిరువడిగళ్ళలో, మేవువదు = నిత్యసంశ్లేషము చేయుట (విచ్ఛేదములేక కైంకర్యము చేయుట) ఎన్నాళ్ = ఏరోజో!

తా॥ ఎల్లప్పుడును నిత్యసూరులు, నీ పరత్వము (అందరికంటెను అధికుడై యుండుట) ను, నీ సౌశీల్యమును (తక్కువవారలతో కలసిమెలసి యుండుటను) ఎప్పుడు సాక్షాత్కరింతుమా — అని ఆశపడి, తిరుమలకు గుంపులుగుంపులుగ విచ్చేసి, నిన్ను స్తోత్రము చేసి నమస్కరించి, శరీరముతోడను, వాక్కుతోను, మనస్సుతోను లోకములను గొలచిన నీ తిరువడిత్తామరలకు నిరంతరము నిరవధికముగు కైంకర్యమును చేయుచున్నారు. కాబట్టి, ఇట్టి ప్రదేశమున నేను వచ్చి నిరంతరము మీ పాదారవిందములకు కైంకర్యములు చేయునట్లు అనుగ్రహింపవలెను. ఇప్పుడు అచ్చటికివెళ్ళి కైంకర్యమునుచేయునట్లు భావనమాత్రము కలుగుచున్నది. అది సత్యముగను, నిత్యముగను సిద్ధింపవలెను. అట్టి భాగ్యము ఎప్పుడు సంభవించునో!

వి వి: — లోకములను కొలచిన సమయమున అందు నివసించు ప్రాణుల గుణదోషములను పాటింపక, అందరిశిరస్సులయందును సర్వేశ్వరుడు తన తిరువడిగళ్ళను ఉంచెను. ఈ సౌశీల్యమను గుణమును ఈ భూలోకమున నే చూడనగును. ఇచ్చటనే అపస్పృష్టులు ఉందురని. అందుచే నిత్యసూరులును తిరుమలకు ఆశతో వచ్చుచున్నారు.

(7) అవ :— "మాకై ఒక అపూర్వముగు ఉపాయమును నేను కల్పింపవలెననియు, అది నాకు శక్యమనియు చెప్పితిరి. అది సాధ్యమైనను మీరు చెప్పినట్లుచేసితినేని, పక్షపాతముగలవాడనని నాకపవాదము గలుగును. కనుక క్లప్తమైయుండు ఏదేనియొక యుపాయమును అనుష్ఠింపుడు" అని సర్వేశ్వరుడు ఆనతిచ్చినట్లుభావించి, ఆళ్వార్లు ప్రత్యుత్తరమును ఒసంగుచున్నారు.

అడియేన్ మేవి యమర్గిన్ఱ అముదే ఇమైయోర దిపతియే,
కొడియా వడుపుళ్ళుడైయానే కోలక్కనివాయ్ ప్పెరుమానే,
శెడియార్ వినైగళ్ తీర్మరున్దే తిరువేఙ్గడత్తెమ్బెరుమానే,
నొడియార్ పొழுదుమ్ ఉనపాదమ్ కాణనోలా దాట్టేనే. 8

టీక :—ఇమైయోర్ అతిపతియే = నిత్యసూరులకు స్వామియైనవాడా ! అడు = (సమాశ్రితులవిరోధులకు) తాపమును గలుగజేయు, పుళ్ = గరుడుని, కొడియా ఉడై యానే = ధ్వజముగా గలిగియుండువాడా! తిరువేంగడత్తు ఎంబెరుమానే = శ్రీ వేంకటాచలాధిపతీ ! కొడిఆర్ = వృక్షములవలె అభివృద్ధమైయుండు. వినైగళ్ = పాపములను, తీర్ = పోగొట్టుటకు, మరుందే = ఔషధమైనవాడా ! కోలమ్ కని వాయ్ = పరిపక్వమైన దొండపండువలె మనోజ్ఞమైన అధరోష్ఠములు గల, పెరుమానే = గొప్పవాడా! (భోగ్యతకు అంతు పరిమితిలేనివాడా!) నాన్ = (ఈ సౌందర్యాది గుణములచే దాస్యము పొందిన) నేను, మేవి = ఆశపడి, (నిన్ను విడచి ఒకక్షణమైనను సహింపలేక) అమరుగిన్ఱ = ఎడతెగక నేను అనుభవించుచుండు, అముదే = అమృత స్వరూపుడా ! (పరమ భోగ్యభూతుడా), ఉనపాదమ్ = దేవరవారి తిరువడిగళ్ళను, కాణ = సాక్షాత్కరించుటకు, నోలాదు = కావలసిన పుణ్యమునుచేయక (ఉన్నప్పటికిని), నొడి ర్పొழுదుమ్, = ఒకక్షణకాలమైనను, ఆత్తేనే = సహింపజాలను.

తా॥ పరమపదమున నిత్యసూరులచే నిరంతరము సేవింపబడుచున్న చరణయుగళుడవై, ఆశ్రితుల విరోధులనునిరసించు శ్రీ గరుత్మంతుని పై నెక్కి దాసులకై శ్రీ వేంకటాచలమునవచ్చి నిలచియున్నావు. వృక్షములు వృద్ధిజెందునట్లు, పైపై సమభివృద్ధనులై దేవరవారిని సేవించుటకు ప్రతిబంధకములుగ నుండు నాపాపములను వ్యాధులను నివర్తింపజేయు ఔషధమువలె నీవు పోగొట్టితివి. సుందరమై దొండపండువంటి నీమోవిని నాకు సాక్షాత్కరింపజేసి, ఇతర విషయములయందు నాకుండు ఆశను నాశనముచేసి, నన్ను నీదాసునిగ చేసికొంటివి ఒక త్రుటికాలమైనను నిన్ను విడచి సహింపజాలక, నిన్ను అమృతమువలె ఎల్లప్పుడును మనసార అనుభవించునట్లు అనుగ్రహించితివి. ఇన్ని ఉపకారములను చేసిన నీవు ఈ కొంచెపు ఉపకారమును గూడ చేయవలదా ? దేవరవారిని కండ్లార సేవించుటకు తగిన భాగ్యమును నేను చేయకపోయినప్పటికి దేవరవారు అనుగ్రహింపవలదా ? ఒక క్షణకాలమైనను నిన్ను విడచి జీవించియుండజాలను.

(౮) అవ :— "మీరు చెప్పినట్లు నేనెవరికైనను అట్లు చేసి యున్నానా?" అని సర్వేశ్వరుడు ప్రశ్నించినట్లుభావించి, అందులకు ప్రత్యుత్తరము నొసంగుచున్నారు.

నోలాదాత్తేన్ ఉనపాదమ్ కాణ వెన్రు నుణ్ణుణర్విన్,
నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱై నాన్ముగను మిన్దిరనుమ్,
శేలేయ్ కణ్ణార్ పలర్ శూழ్ విరుమ్బుమ్ తిరువేజ్గడత్తానే,
మాలాయ్ మయక్కి అడియేన్పాల్ వన్దాయ్ పోలే వారాయే. ౮

టీక ;— నుణ్ ఉణర్విన్ = సూక్ష్మబుద్ధిగలిగిన, నీర్ ఆర్ కణ్డత్తు అమ్మానుమ్ = నీలవర్ణముతో నిండి ప్రకాశించు కంఠముగలిగిన (నీలకంఠుడై) దేవతలలో ముఖ్యుడైన రుద్రుడును, నిఱైనిఱైన్దనాన్ముఖనుమ్ = (అతనికంటెను అధికములైన జ్ఞానశక్తులు గలిగిన) ప్రధానుడైనచతుర్ముఖ బ్రహ్మయును, ఇన్దిరనుమ్ = దేవలోకాధిపతియగు ఇంద్రుడును, శేల్ ఏయ్ కణ్ణార్ = మత్స్యములవంటి నేత్రములతో నొప్పారువారి భార్యలును, పలర్ శూழ் = అనేకులు చుట్టిరాగ, ఉనపాదమ్ = దేవరవారి తిరుపడిగళ్ళను, కాణ = సందర్శించి అనుభవింపదగిన, నోలాదు = పుణ్యమును సంపాదింపకయే, ఆత్తేన్ = (ఆ అనుభవములేక) సహింపజాలను, (అని మొరలిడుచు), విరుమ్బుమ్ = ఆసపడునట్టి, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలపతీ! మాలాయ్ = (నిన్ను సేవింపక) పిచ్చిపట్టి, మయక్కి = మైమరచునట్లుచేసి, (ఉండగనీవు) వందాయ్‌పోల్ = (గజేంద్రుని సంరక్షణార్థమై) విచ్చేసినట్లు, అడియేన్ పాల్ = నావద్దకు, వారాయ్ = వేంచేయవలయును.

తా॥ సూక్ష్మబుద్ధిగలవాడును, హాలాహలమను కాలకూటవిషమును మ్రింగుటచే నీలవర్ణయుక్తమగు కంఠముగలవాడును, ఇట్టి దురనుష్ఠేయములగు సాహసకార్యములచేయుటచే లోకులకంటెను అధికుడై యుండు రుద్రుడును, అతని కంటెను అధికమైన జ్ఞాన శక్తులుగల చతుర్ముఖబ్రహ్మయు, దేవలోకాధిపతియగు దేవేంద్రుడును దేవరవారిని సేవించి, ఆనందమును అనుభవింపదగిన పుణ్యకార్యముల ననుష్ఠింపక పోయినను, ఆ అనుభవములేక ఒకక్షణమైనను జీవింపజాలము—అని ప్రత్యేకప్రత్యేకముగ చెప్పుకొనుచు, మత్స్యములవంటి నేత్రములుగల

(భాగ్యవతులైన) వారి భార్యలతోగూడి పరివృతులై, తిరుమలకు ఆశ పడివచ్చుచున్నారు. అట్లే, నేనును నిన్ను ఎల్లప్పుడును సేవించి ఆనంద మునను భవించునట్లు నా వద్దకు వేంచేయవలయును. (ఇట్లు ఆళ్వార్లు ప్రార్థింపగ వెంటనే సర్వేశ్వరుడు వేంచేయకుండుటను పరికించి, ఆళ్వార్లు చెప్పుచున్నారు) నిన్ను ఎల్లప్పుడును సేవించుటకు అనువగునట్లు వేంచేయ కున్నావు. శ్రీ గజేంద్రాళ్వానులను సంరక్షింప వేంచేసినట్లైనను, నిన్ను సేవింపకున్న పిచ్చిపట్టి, మైమరచి, కష్టపడుచుండు నావద్దకు ఒకసారి యైనను కృపతో వేంచేయవలయును.

వి. వి :— రక్షకలను కనికరముగలుగుటకై తమకుటుంబములతోడవచ్చి శరణు జొచ్చుట లోకమునవాడుక ; అటులనే దేవతలు తమ భార్యాదులతోవచ్చి తిరు వేంగడముడైయాన్ల తిరువడిగళ్ళలో పడుచున్నారని భావము.

(<sup></sup>) అవ :— పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున వేంచేసి యుండు మా స్వామీ! నిన్ను విడిచి త్రుటికాలమైనను జీవితమును భరింపజాలను. దయయుంచి నీ తిరువడిగళ్ళలో దాసుని వేంటనే చేర్చు కొనుము—అని ఆళ్వార్లుప్రార్థించుచున్నారు.

వన్దాయ్పోలే వారాదాయ్ వారాదాయ్ పోల్ వరువానే,
శెన్దామరై క్కణ్ శెజ్గనివాయ్ నాల్తో ళముదే ఎనదుయిరే,
శిన్దా మణిగళ్ పగరల్లైప్పగల్ శెయ్ తిరువేజ్గడత్తానే,
అన్దో! అడియేన్ ఉనపాదమ్ అగలగిల్లేన్ ఇత్తె యుమే. ౯

టీక :— వన్దాయ్పోలే = వచ్చినవానివలె (యుండి) వారాదాయ్ - (నిన్ను ఆశ్రయింపనివారలకు) దగ్గఱకురానివానివలె నుండువాడా! వారాదాయ్పోల్ = దగ్గఱకురానివానివలె (ఉండి) వరువానే (ఆశ్రయించిన వారల) దగ్గఱకువచ్చువాడా! శెన్దామరై క్కణ్ = శెన్దామరవంటి నేత్రములను, శెంకనివాయ్ = ఎఱ్ఱనిదొండపండు వంటి మోవి, నాన్గుతోళ్ = (దివ్యాయుధములు ధరించిన, చతుర్విధ పురుషార్థముల నొసంగు) నాల్గుభుజములు మొదలగు దివ్యావయవములు గలిగిన, అముదే = అమృత స్వరూపుడా! ఎనదు ఉయిరే = నాప్రాణస్వరూపుడా! చిన్తామణిగళ్ = చిన్తా

మణులపలెనుండు రత్నములయొక్క, పగర్ = కాంతి, అల్లై = రాత్రిని, పగల్ శెయ్ = పగలుచేయుచున్న, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలపతీ! అన్దో = అయ్యో, అడియేన్ = దాసుడనగు నేను, ఉనపాదమ్ = దేవవారి తిరువడిగళ్ళను, ఇమైప్పోదుమ్ = క్షణకాలముగూడ, అగలగిల్లేన్ = విడచిపెట్టజాలను.

తా॥ నిన్ను ఆశ్రయించనివారలకు దగ్గఱకువచ్చినట్లు తోచెదవు; కాని, వారలకు సులభుడవుకావు; నిన్ను ఆశ్రయించిన వారలు "తమవే ఉపాయములేమిని దలంచి, ఇతడు మనకు దుర్లభుడు" అని తలంచి నప్పటికిని వారలకు మిక్కిలి సులభుడవగుచున్నావు. శెందామరలవంటి దివ్యనేత్రములను, ఎఱ్ఱనిదొండపండువంటి మోవిని, నాల్గుభుజములను గలిగినవాడును, అమృతమువలె పరమమధురమై మిక్కిలి భోగ్యమైన వాడును నైయుండువాడా! నీ సౌందర్యాతిశయమును ప్రదర్శించి, నిన్నే నాకు ధారకముగను, పోషకముగను భోగ్యముగను చేసివైచితివి. చిన్తామణివలె అడిగినవారలకు అడిగిన వరములనిచ్చు రత్నములు తమ సూర్యకిరణములవంటి కాంతులచే రాత్రిని గూడ పగలుచేయుచుండు శ్రీ వేంకటాచలమున దాసునికై వేంచేసియున్నావు. నాచే నొకత్రుటికాల మైనను నీ తిరువడిగళ్ళను వదలియుండుటకు శక్యముగాదు. కాబట్టి, కృపతో నన్ను నీ తిరువడిగళ్ళలో చేర్చుకొనవలయును.

వి. వి:— ధారకము, పోషకము, భోగ్యము. దేహమున ప్రాణములుండునట్లు చేయునది — ధారకము; అన్నము మొదలగునవి. జలము మొదలగునవి పోషకములు, శరీరమునకు పుష్టినిగలుగ చేయునవి; సుఖమునుగలుగజేయునవి భోగ్యములు; తాంబూలము మొదలగునవి ఆళ్వారులకు ఇవి యన్నియును సర్వేశ్వరుడే. "ఉణ్ణుంశోఱుం పరుగుంనీర్ తిన్నుంవెత్తిలైయుం ఎల్లాంకణ్ణన్" అని ఆళ్వారులానతిచ్చియున్నారు.

(10) అవ:— "ఏదైనను ఒక ఉపాయమును మీరు అనుష్ఠింపవలయును" అని సర్వేశ్వరుడు చెప్పినట్లుభావించి, ఈ పాశురమున ఉపాయములన్నిటిలోను ఉత్తమోత్తమోపాయమగు ప్రపత్తి నొనరించు చున్నారు.

*అగలగిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మఙ్గైయుఱై మార్బా,
నిగరిల్ పుగళాయ్ ఉలగమ్ మూన్ఱుడైయాయ్ ఎన్నైయాళ్వానే,
నిగరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేంగడత్తానే,
పుగలొన్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే. ౧౦

టీక :— ఇఱైయుమ్ = త్రుటికాలమైనను, అగలగిల్లేన్ = ఎడబాసియుండజాలను, ఎన్ఱు = అని మనవిచేసికొనుచు, అలర్ మేల్ = తామరపుష్పముపై నివసించుచున్న, మఙ్గై = నిత్యయౌవనవతియగు శ్రీ లక్ష్మీదేవి (పెరియపిరాట్టి), ఉఱై = నిత్యవాసము చేయుచున్న, మార్బా = దివ్యవక్షఃస్థలముతో విరాజిల్లు స్వామీ ! నిగర్ ఇల్ పుగళాయ్ = సాటిలేని కీర్తిగలవాడా!, మూన్ఱు ఉలగమ్ ఉడైయాయ్ = మూడులోకములకును స్వామియైనవాడా ! ఎన్నై = నీచాతినీచుడనగు నన్నుగూడ, ఆళ్వానే = (అంతరంగకైంకర్యములలో అన్వయింపజేసి, నన్ను దాసునిగాజేసికొని) కాపాడినవాడా ! నిగర్ ఇల్ = సాటిలేని అమరర్ = (నీకు అంతరంగ కైంకర్యములుచేయు) నిత్యసూరులును, మునిక్కణంగళ్ = (నీ గుణములను అనుభవించుచు, ధ్యానమున నిమగ్నులైనట్టి) నిత్యసూరుల సమూహములును, విరుమ్బుమ్ = పరమకుతూహలముతోడవచ్చి ఆశ్రయించుచున్న, తిరువేంగడత్తానే = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ ! ఉన్ అడిక్కీళ్ = దేవరవారి పాదారవిందములక్రింద, పుగల్ ఒన్ఱు ఇల్లా అడియేన్ = వేరు ఆశ్రయము ఏదియును లేని దాసుడనగు నేను, అమర్న్దు = అమరి (ప్రయోజనాంతరపరులై నిన్ను ఆశ్రయించువారలవలెగాక, నిన్నే ప్రయోజనముగ భావించి, దృఢాధ్యవసాయముతోనుండి), పుగున్దేన్ = ప్రవేశించితిని, (నా రక్షణభారమును దేవరవారి పాదారవిందములు స్వీకరించునట్లు సుదృఢముగ అధ్యవసించుచున్నాను).

తా॥ తామరపుష్పముపై దాని సౌగంధ్యసౌకుమార్యములు ఒక రూపమును స్వీకరించి, వేంచేసియున్నట్లు నిరవధికసౌందర్యరాశియై, నిత్యయౌవనవతియై, పరమభోగ్యురాలై యుండు పెరియపిరాట్టియారులు, నీతో ఎడతెగని సంబంధము గలిగియున్నప్పటికిని "ఒక త్రుటికాలమైనను సంహింపజాలను" అని మనవిజేసికొనుచు, ఎల్లప్పుడును నిత్యవాసము చేయుచుండు దివ్యవక్షఃస్థలముగలవాడా! అంతములేని కారుణ్యావాత్సల్యాదిగుణములకు సముద్రుడవైనవాడా! ముల్లోకములకును స్వామివై వానిని రక్షింపదగిన బాధ్యతగలవాడా! నీచాతినీచుడనగు నన్ను గూడ

దేవరవారి అంతరంగకైంకర్యములను చేయునట్లు అనుగ్రహించి, నీ సౌశీల్య మను కల్యాణగుణమును ప్రదర్శించితివి. నిరంతరము నీకైంకర్యముల ననుష్ఠించుచుండు వారలును, నీకల్యాణగుణముల నిరంతము అనుసంధించు వారలును నైయుండి, రెండు తెగలుగనుండు నిత్యసూరుల నివహములచే మిక్కిలి ఆశతో నెల్లప్పుడును సేవింపబడుచున్న శ్రీ వేంకటాచలమున అందఱికిని పరమసులభుఁడవై వేంచేసియుండు నా స్వామీ! దాసునకు నీవు తప్ప వేఱుగతిలేదు. అందుచే పిరాట్టిని పురుషకారముగ చేసికొని, ఆమెతో గూడియుండు నీ యొక్క పాదారవిందములనే ఉపాయముగ అధ్యవసించి నారక్షణభారమునంతయును ప్రయోజనాంతర నిరపేక్షుడనై నీ పాదారవిందములలో సమర్పించితిని. కాబట్టి, నా సకలప్రతిబంధకములును తత్క్షణమే నశించి, దేవరవారికి సర్వదేశసర్వకాల సర్వావస్థల యందును, సర్వవిధకైంకర్యములును చేయునట్లు అనుగ్రహింపుము.

వి. వి:— (1) "పుగళ్ళాయ్" అనుచోట పుగళ్ - అనుపదమునకు కీర్తి అని పదార్థమైనను, ఇచ్చట ఆ కీర్తిని కలుగచేయు కల్యాణగుణగణములు - అని అర్థము. సర్వేశ్వరుని జ్ఞానశక్తులు, అనుగ్రహించుటకును, నిగ్రహించుటకును సాధారణములై యుండును. కనుక, అనుగ్రహమునే ప్రార్థించు నిచ్చోట వానికి ప్రసక్తి లేదు. ఇక పోగా అనుగ్రహమునకు మాత్రము కారణములగు - కారుణ్యము, వాత్సల్యము మొదలగునవి ప్రతిపాద్యములు (2) "ఉలగమ్మూన్ఱు ఉడైయాయ్" అనుదానిచే స్వామిత్వమను గుణమును "ఎన్నై ఆళ్వానే" అనుదానిచే సౌలభ్యమను గుణమును, "తిరువేంగడత్తానే" అను దానిచే సౌలభ్యమను గుణమును ప్రతిపాదింపబడుచున్నవి. ఈ మూడు గుణములును, వాత్సల్యముకూడా, ప్రపత్తి చేయునప్పుడు అనుసంధింపదగినవి. (3) ఈ గుణములు ప్రకాశించుటకు శ్రీవైకుంఠమున ప్రసక్తి లేదు. ఈ భూలోకముననే ఇవి ప్రకాశించును. చీకటి ఇంటిలోనే గద దీపము ప్రకాశించును. కనుక, అట్టి గుణములను సేవించుటకు ఆశపడి, నిత్యసూరులు తిరుమలకు విచ్చేయుచున్నారు. - అని "పిరుమ్బువర్" అనుపదము వలన సిద్ధించుచున్నది. (4) పిరాట్టి పురుషకారముగను, ఉపాయముగను అగుచున్నది. ఆమెకు రెండు ఆకారములును ఉన్నవి. ఈ ఉత్కర్షను ప్రదర్శించుటకై మొదటి పాదమున—ఎల్లప్పుడును సర్వేశ్వరునితో అనన్యురాలై ఉన్నది—అని చెప్పబడినది. ద్వయమును వంశరత్నమందును, శరణాగతిగద్యమునను, ప్రతిపాదింపబడినట్లు ఈ

పాశురమునను ఎల్లప్పుడును సర్వేశ్వరుని దివ్యవక్షఃస్థలమున నిత్యవాసము చేయుచున్న దని చెప్పుటచే ఈశ్వరునకు అపృథక్సిద్ధనుగు విశేషణమై యున్నదని చెప్పబడుచున్నది. (5) ఈ పాశురము ద్వయమును మంత్రరత్నమందలి అర్థమును చెప్పుచున్నది. అదెట్లనగ— "అగలకిల్లేన్" అను దానిచే శ్రీమత్పదార్థము, స్వామిత్వము మొదలగు వాలుగుగుణములను చెప్పుటచే నారాయణపదార్థము, "ఉన్నడిక్కీழ்" అనుదానిచె చరణపదార్థమును "పుగుందేన్" అనుదానిచే శరణపదార్థమును, "పుగழ் ఒన్రిల్లా" అనుదానిచె ప్రపద్యే—అనుదాని అర్థమును చెప్పబడుచున్నవి. ఇటులనే ఉత్తరఖండార్థము, పదార్థముగ తోచకున్నను, భావార్థములో చేరియున్నదని తెలిసికొనవలెను. (6) పురుషకారమనగ—రక్ష్యరక్షకుల సిద్ధతికిని, వారివారి వైముఖ్యముల పోగొట్టి ఒకటిగ చేర్చుట ఈ గుణము—పెరియపిరాట్టియారలయందు అతిశయించియున్నది.

(11) అవ :— నిగమనమున ఈ తిరువాయ్‌మొழிని అభ్యసించిన వారలకు ఫలమును చెప్పుచున్నారు.

*అడిక్కీழ் అమర్‌న్దుపుగున్దు అడియీర్ వాழ்మినెన్రెన్రరుళ్ కొడుక్కుమ్,
పడిక్కేழ்ఇల్లా ప్పెరుమానై ప్పழనక్కురుగూర్ చ్చడగోపన్,
ముడిప్పాన్ శొన్న ఆయిరత్తు తిరువేంగడత్తుక్కివై పత్తుమ్,
పిడిత్తార్ పిడిత్తార్ వీర్‌ఱిరున్దు పెరియ వానుళ్ నిలావువరే. ౧౧

టీక :— అడియీర్ = నా కైంకర్యము చేయుటలో అశగలిగినవారలారా! అడిక్కీழ் = నా యొక్క పాదముల క్రింద, అమర్‌న్దు = అమరియుండి, పుగున్దు = (బాగుగ ప్రవేశించి, స్థిరమైనమనస్సును గలిగి) వాழ்మిన్ = ఉజ్జీవింపుడు, ఎన్రెన్రు = ఇట్లని, చెప్పుచు, అరుళ్ కొడుక్కుమ్‌బడి = కృపచేయునట్లు, కేழ் ఇల్లా = సాటిలేని, పెరుమానై = స్వామినిగూర్చి, పழనక్కురుకూర్ శడగోపన్ = మంచి పొలములచే చుట్టబడియుండు కురుకాపురిలో వేంచేసియుండు శ్రీనమ్మాళ్వార్లు, ముడిప్పాన్ = ముగించునట్లు, (అనగ, అతనిని పొంది కృతార్థులుకావలయునని) శొన్న = పాడించిన, ఆయిరత్తు = వెయ్యిపాశురములలో, తిరువేంగడత్తుక్కు = శ్రీవేంకటాచలపు వైభవమును అభివర్ణించు, ఇవైపత్తుమ్ = ఈ పది పాశురములును పిడిత్తార్ = ఆశ్రయించినవారలు, అనుసంధించువారలు, పెరియవానుళ్ = అనంతమగు వైభవముగల వైకుంఠమహానగరమున, వీర్‌ఱిరున్దు = వైభవోపేతులై యుండి, నిలావువర్ = (పునరావృత్తిలేక) స్థిరముగ అచ్చటనే సుఖముల ననుభవింతురు.

తా॥ సర్వేశ్వరుడు, "నాకు కైంకర్యములు చేయవలయునని ఆశపడు మనుజులారా! ప్రయోజనాంతర నిరపేక్షులై, నాపాదముల వద్ద, వానినే ధ్యానించు సుదృఢమైన మనస్సుగలవారలై ఉజ్జీవింపుడు" అని ప్రత్యేకముగ నొక్కొక్కరికిని ఉపదేశించుచున్నారు. ఆశ్రితుల ననుగ్రహించుటలో నతనికి సమానులైనవారు ఎవ్వరును లేరు. అందఱి కంటెను గొప్పవాడై యున్నాడు. ఇట్టి పరమోదారుడగు సర్వేశ్వరుని ఆశ్రయించి, తాము కృతార్థులు కావలయునని శ్రీ నమ్మాళ్వార్లు శ్రీ వేంకటాచలముయొక్క వైభవమును వర్ణించిచెప్పిన ఈ పదిపాశురములను మిక్కిలి ప్రీతితో నెవరు అనుసంధింతురో—అట్టివారిని ఆశ్రయించిన వారలు గూడ అనన్తానందస్వరూపమగు శ్రీ వైకుంఠమునకు విచ్చేసి, సర్వేశ్వరుని దివ్య కైంకర్యమను సామ్రాజ్యమునుపొంది, పునరావృత్తిలేక నిరవధికమగు ఆనందమును అనుభవింతురు.

శ్రీ ఆళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

---

## ఈ తిరువాయ్‌మొళికి శ్రీ వేదాంతదేశికులవారు ప్రసాదించిన

### ద్రమిడోపనిషత్తాత్పర్యరత్నావళి శ్లోకము

ఆపత్సంరక్షణా దస్త్యుపకరణతయా మేఘసామ్యాదిభూమ్నా
స్వానాం విశ్వాసదానాత్ సురగణ భజనాత్ దివ్యదేశోపసత్త్యా।
ప్రాప్యప్రాప్యత్వయోగాత్ స్వజనవిజనయోః సత్ప్రపత్తవ్యభావాత్
ఊచే నాథమ్ శరణ్యమ్ శ్రుతిశతవిదితమ్ వేంకటేశం శఠారిః. ౬౫

టీక:—(1) ఆపత్సంరక్షణాత్ - ఆపత్కాల (ప్రళయకాల) మందు రక్షించుట వలనను, (2) అస్త్యుపకరణతయా = సుదర్శనమును ఆయుధముగ గలవాడగుట చేతను, (3, 4) మేఘసామ్యాదిభూమ్నా = మేఘముతో సమానమైన కాంతిగలవాడగుట మొదలగు మహిమచేతను, (5) స్వానామ్ = తన భక్తులకు, విశ్వాసదానాత్ = తన యందు నమ్మకము కలుగచేయుటవలనను, (6,7) సురగణభజనాత్ = నిత్యసూరి లసమూహాములు

ఆశ్రయించుటవలనను, (8) దివ్యదేశోపసత్త్యా = దివ్యదేశమందు సన్నిహితుడగుటచేతను, (9) స్వజనవిజనయోః = (తనయొక్క) భక్తజనమునకును, అభక్తజనమునకును, ప్రాప్యాప్రాప్యత్వయోగాత్ = ప్రాప్యుడగుటవలనను, అప్రాప్యుడగుటవలనను, (10) సత్ప్రపత్త్యభావాత్ = సత్పురుషులచే ప్రపత్తిచేయదగినవాడగుటవలనను, శ్రుతిశతవిదితమ్ = అనేక శ్రుతులలో ప్రసిద్ధుడయిన, నాథమ్ = స్వామియగు, వేంకటేశమ్ = శ్రీనివాసుని, శఠారిః = నమ్మాళ్వార్లు, శరణ్యమ్ = రక్షకునిగ, ఊచే = చెప్పిరి.

తా॥ "ఉలగముణ్డపెరువాయా" అన్న తిరువాయ్‌మొழிలో శ్రీ నమ్మాళ్వార్లు—సర్వేశ్వరుడు ఆపద్రక్షకుడు, శత్రువులను నిరసించెడి సుదర్శనచక్రమును ఆయుధముగగలవాడు, నీలమేఘమువంటి దివ్యదేహముగలవాడు, నిరతిశయమగు కీర్తిమంతుడు, సుగ్రీవాదిభక్తులకు తనయందు విశ్వాసమును కలుగచేయువాడు, నిత్యసూరులచే నెల్లప్పుడును సేవింపబడువాడు, మనకు సన్నిహితమైన శ్రీ వేంకటాద్రిని వాసస్థానముగ గలవాడు, ఆశ్రితులకు సన్నిహితుడు, అనాశ్రితులకు దూరస్థుడు, సత్పురుషులచే ప్రపత్తిచేయదగిన శ్రియఃపతి — ఇన్నిగుణములుగలవాడై, సకలవేదప్రసిద్ధుడై శ్రీవేంకటాద్రియందు వేంచేసియున్నాడు. కాబట్టి, ఆయీ శ్రీవేంకటాచలపతియే సర్వలోకశరణ్యుడు — అని ప్రసాదించిరి.

శ్రీ వేదాంత దేశికుల తిరువడిగళ్ళే శరణము.

---

## ఈ తిరువాయ్‌మొழிకి శ్రీవాదికేసరి శ్రీ అழగియమణవాళజీయర్లవారు ప్రసాదించిన ద్రమిడోపనిషత్సంగతి

ఆర్తేః తథాగతతయా మునిరబ్జవాసా
మాశ్రిత్య సంఘటనకర్మణి జాగరూకామ్ ।
ఆవేద్య చాధిదశమం స్వమకించనత్వమ్
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపేదే ॥

టీక :— అధిదశమమ్ = ఈ పదియవ తిరువాయ్‌మొழிలో, మునిః = నమ్మాళ్వార్లు, ఆర్తేః = దుఃఖముయొక్క, తథాగతతయా = అటువంటి (వాఙ్మనసాగోచరమైన) అవస్థగలిగియుండుటచేత, సంఘటనకర్మణి = (సర్వేశ్వరునితో జీవుని) చేర్చెడి వ్యాపారమునందు (పురుషకారమునందు), జాగరూకామ్ = జాగ్రత్తగలిగియున్న, అబ్జవాసామ్ =

కమలవాసినియైన శ్రీదేవిని. ఆశ్రిత్య = (పురుషకారముగ) ఆశ్రయించి, స్వామ్ = తమదైన, అకించనత్వమ్ = అకించిన్యమును, ఆవేద్య = విన్నవించి, శ్రీ వేంకటేశచరణౌ = శ్రీతిరువేంగడముడయానుల తిరువడిగళ్ళను, శరణమ్ = ఉపాయముగ, ప్రపేదే=పొందిరి.

తా॥ "ఉలగముండ పెరువాయా" అన్న తిరువాయ్మొళిలో శ్రీ నమ్మాళ్వార్లు, భగవద్విశ్లేషముచే దమకు కలిగిన అపారమగు దుఃఖమునకు ఓర్వజాలక, పిరాట్టిని పురుషకారముచేసికొని తమయొక్క దుఃఖములను, సాధనాంతరములేకుండుటను విన్నవించి, తమ అభీష్టసిద్ధి కొఱకై శ్రియఃపతియగు ఆ తిరువేంగడముడయానుల శ్రీ పాదములనే ఉపాయముగ నమ్మి ప్రపత్తిచేసిరి.

ఈ తిరువాయ్మొళికి శ్రీ మణవాళమహామునులు ప్రసాదించిన తిరువాయ్మొళినూత్తన్దాది

ఉలగుయ్యమాల్ నిన్ఱ ఉయర్ వేంగడత్తే
అలర్మగళై మున్నిట్టు అవన్ఱన్ — మలరడియే
వన్ శరణాయ్చ్చేర్న్ద మగిళ్మాఱన్ తాళిణైయే
ఉన్ శరణాయ్ నెంజమే యుళ్. ౬౦

టీక :— ఉలగు = లోకములు, ఉయ్య = ఉజ్జీవించునట్లు, మాల్ = శ్రియఃపతియగు సర్వేశ్వరుడు, నిన్ఱ = వేంచేసియున్న, ఉయర్ = ఉన్నతమైన, వేంగడత్తు = శ్రీ వేంకటాద్రి యందు, అలర్ మగళై = పుష్పవాసినియైన శ్రీపిరాట్టిని, మున్నిట్టు = పురస్కరించుకొని, అవన్ = ఆ శ్రీనివాసునియొక్క, మలర్ అడియే = పుష్పములవంటి ఆ శ్రీ పాదములనే, వన్ శరణాయ్ = దృఢమైన ఉపాయముగ, శేర్న్ద = పొందిన, మగిళ్ = దివ్య కల్యాణగుణ పరిపూర్ణులగు, మాఱన్ = శ్రీనమ్మాళ్వారులయొక్క, తాళ్ ఇణైయే = శ్రీపాదద్వంద్వములనే, నెంజమే = ఓ మనసా, ఉన్ శరణాయ్ = నీకురక్షకముగ, ఉళ్ = అనుసంధింపుము.

తా॥ ఓ మనసా! సకలలోకోజ్జీవనార్థమై, తిరుమలలో వేంచేసియున్న తిరువేంగడముడయానుల తిరువడిగళ్ళను, శ్రీ పిరాట్టిని పురుషకారముగ జేసికొని శరణుజొచ్చిన, శ్రీ నమ్మాళ్వార్లయొక్క శ్రీపాదములే నీకు ఉజ్జీవనహేతువని నమ్ముము.

శ్రీరస్తు

శ్రీమతే శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీమతే శఠగోపమునయే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువిరుత్తములోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

అవ:— శ్రీమన్నారాయణుడు తన నిర్హేతుక కృపాకటాక్షమును సాంసారిక యాతనా నిమగ్నులగు శ్రీ నమ్మాళ్వార్లపై ప్రసరింపజేసెను. దానిచే వీరు సర్వేశ్వరుని స్వరూప రూపగుణ విగ్రహ విభూతులను, విరోధిస్వరూపమును, త్యాజ్యోపాదేయ విభాగములను బాగుగ నెఱుంగ గలిగిరి. అంత సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును మీపాదార విన్దములయందు సర్వవిధ కైంకర్యముల జేయుటకు అనుకూలమగునట్లు, తత్ప్రతిబంధకముల నన్నిటిని పోగొట్టవలయునని ఈ తిరువిరుత్త ప్రబంధ మున భగవంతుని ప్రార్థించుచున్నారు.

(8) అవ:— భగవదలాభదశయందు ఆళ్వార్లకు, కొంత ఊరడింపును గలుగజేయు భాగవతులు, భగవంతుని సేవింప గుతూహలము గలవారలై తిరుమలై మొదలగు దివ్యదేశములకు వేంచేయవలయునని తలంచినవారలై, ఆళ్వార్లను నియమన మడిగిరి. అంత ఆళ్వార్లు, వారి విశ్లేషమును ఓర్వజాలక, అందుపై భగవద్విశ్లేషవ్యథయు నధికము కాగ, నాయకీభావమును పొందినవారై, ఆమె మాటగ విజ్ఞాపనము జేయుచున్నారు.

కాణ్ గిన్ఱనగళుమ్ కేట్కిన్ఱనగళుమ్ కాణిల్ ఇన్నాళ్,
పాణ్ కున్ఱ నాడర్ పయిల్ గిన్ఱన ఇదెల్లామ్ అఱిన్దోమే,
మాణ్ కున్ఱ మేన్ది తణ్ మామలై వేఙ్గడత్తు ఉమ్బర్ నమ్బుమ్,
శేణ్ కున్ఱమ్ శెన్ఱు పొరుళ్ పడైప్పాన్ కఱ్ఱ తిణ్ణనవే. ౮

టీక :—ఇన్నాళ్=ఇప్పుడు, కాణ్గిన్ఱనగళుమ్=చూచుచున్నదియు, కేట్కిన్ఱనగళుమ్ = వినుచున్నదియు, కాణిల్ = యోచించిచూచినయెడల, పాణ్ = ఆహ్లాదయుముగనున్నది, కున్ఱ నాడర్ = శ్రీ వేంకటాచలమునందు నివసించువారలు, పయిల్ గిన్ఱన= బహువిధములుగ అభినయించి చెప్పుచురు; ఇదెల్లామ్ = ఇది అంతయు, మాణ్ =మంచి, కున్ఱమ్ = గోవర్ధనగిరిని, ఏన్ది = గొడుగుగా నెత్తిపట్టుకొనిన శ్రీకృష్ణస్వామియొక్క, తణ్ =చల్లని, మామలై =గొప్పపర్వతమైన, వేంగడత్తు=వేంకటాచలమునందలి, ఉమ్బర్ నమ్బుమ్=నిత్యసూరులు ఆశపడెడి, శేణ్ కున్ఱమ్=ఎత్తైనశిఖరము, శెన్ఱు=సమీపించి, పొరుళ్ =నిత్యవస్తువైన శ్రీనివాసుని, పడైప్పాన్ =పొందుటకు, కఱ్ఱ = నేర్చుకొనిన, తిణ్ణనవు=గట్టితనమని, అఱిన్దోమ్ = మేమెఱుగుదుము.

తా॥ భగవద్విశ్లేషముచే శ్రమపడుచున్న ఆళ్వార్లను విడనాడి వెళ్లుటకు భాగవతులకు మనసురాకున్నను తిరుమలై మొదలగు దివ్యదేశములయందు వేంచేసియుండు పెరుమాళ్లను సేవించుటకు వెళ్లిరావలయునని ఆశగలవారలై, ఆళ్వార్ల నియమనమును తీసికొనుటకై మెల్లగ, ప్రస్తాపించిరి. అంతట ఆళ్వార్లు, భగవద్విశ్లేషముతోకూడ భాగవత విశ్లేషముకూడ ప్రాప్తమగునేమోయని భయపడి, వారిని నిష్ఠూరములాడు చున్నారు. ఆహా! ఎప్పుడులేని నైచ్యము నవలంబించి, ఎంతయో వినయముగ బలుకుచున్నారే! దీనిని పరిశీలింప నాకు సహృదయముగ తోచుటలేదు. మీరును నన్ను విడచి విరహాగ్నియందు ఒంటరిగ పడద్రోసి, వెళ్లవలయునని ప్రయత్నించుచున్నట్లున్నది. మీ ప్రయత్నము చూడ గోవులను సంరక్షించుటకు గోవర్ధనమును గొడుగుగనెత్తిన శ్రీకృష్ణుడు నిత్యసూరులచేత సేవింపబడుచు వేంచేసియుండు వేంకటాచలమునకు వేంచేయ నొనర్చు గట్టితనముగనున్నది. అయ్యో! మీరు

వెళ్లదలచెదు వేంకటాచలమెంత కఠినముగనున్నదో, మీ మనస్సును అంత కఠినముగనున్నదే!

వి. వి:— (1) ఈ పాశురము - నాయకి తన సఖినిచూచి చెప్పినట్లును, నాయకునే చూచి అన్యాపదేశముగ చెప్పినట్లును, లేక నాయకీభావమును గుర్తెఱింగిన ప్రాణసఖి నాయకునిజూచి చెప్పినట్లును, సమన్వయము చేయవచ్చును.

(2) ఆళ్వార్లను విడిచి యాత్రకు వెళ్ళవలయునని నిశ్చయించిన భాగవతులు, ఆళ్వార్ల యనుమతిని వడయుటకై వారివద్దకువచ్చి పదే పదే నమస్కరించి వినయవినమితగాత్రులై కొన్నిమాటలను విన్నవించగా, ఆళ్వారులు వీరి యతివినయమునకు కారణమును గనుగొన్నవారలై, "తిరువేంగడపర్వత శిఖరమున నెలకొనియుండు పద్మావతీజానిని సేవింపవలయునను మీ తెలంపేయిది" అని నేను గుర్తెఱింగితిని - అని ఆనతిచ్చుచున్నారు.

(10) అవ:— ఉద్యానవనమున చెలికత్తెలతో విహరించుచున్న శ్రీ శఠగోపనాయికను ఎదుర్కొనిన సర్వేశ్వరుడు ఆళ్వార్ల విశ్లేషము వలన తనకు గలిగిన బాధను చెప్పుకొనుచున్నాడు.

మాయోన్ వడ తిరువేఙ్గడ నాడ వల్లిక్కొడిగాళ్,
నోయో ఉరైక్కిలుమ్ కేట్కిన్ఱిలీర్ ఉరైయీర్ నుమదు,
వాయో అదువన్ఱి వల్వినైయేనుమ్ కిళియుమెళ్గుమ్,
ఆయో అడుమ్ తొణ్డైయో అఱైయో ఇదఱివరిదే. ౧౦

టీక:— మాయోన్ = ఆశ్చర్యగుణచేష్టితుడైన సర్వేశ్వరుని, వడతిరువేంగడ నాడ = ఉత్తరదిక్కునకు తిలకమైయున్న శ్రీ వేంకటాచలమున నివసించునుండు, వల్లికొడికాళ్ = స్త్రీలతలారా! నోయ్ = నాబాధను, ఉరైక్కిలుమ్ = చెప్పినను, కేట్కిన్ఱిలీర్ = వినరైతిరి; ఉరైయీర్ = ఏలనో చెప్పుడు; నుమదు = మీ యొక్క, వాయో = నోరా! అదువన్ఱి = అదియును గాక, వల్వినైయేనుమ్ = మిక్కిలి పాపిష్టుడనగు నేనును, కిళియుమ్ = మీ చిలుకయు, ఎళ్గుమ్ = దీనులమగునట్లు, ఆయ్ ఓ = బాధించునట్టి, అయ్యో! అను మీ కంఠస్వరమా? తొండైయో = దొండపండువంటి మీయధరమా? అడుమ్ = నన్నిట్లు బాధపెట్టునది, ఇదఱివరిదే = ఇది యని తెలిసికొనుట దుర్లభముగనున్నది, అఱైయో = మీరు చెప్పగలిగినచో చెప్పుడు.

తా॥ సర్వేశ్వరునకు భోగస్థానమై, ద్రవిడదేశమునకు తిలకస్థానీయమైయుండు శ్రీవేంకటాచలమున నివసించు శ్రీవైష్ణవ శిఖామణులను చేర్చుకొని నన్నిట్లేల బాధపెట్టెదవో చెప్పుము. నాబాధ నీకు తెలియకున్నను, నేను చెప్పినను నీవు వినకయున్నావు. నామనస్సును ఎంత ఈడ్చిపట్టినను నిలువకయున్నది. నేనెంతపాపము చేసితినోగద! ఇట్లు నన్ను బాధపెట్టునది మీ ముఖసౌందర్యమా? మీ స్వరమాధుర్యమా? మీ యధరశోభయా? తెలిసికొన సాధ్యముగాకున్నది. దయచేసి చెప్పుడు—అని ఆళ్వార్లను సర్వేశ్వరుడు అడుగుచున్నాడు.

(15) అవ:— ఆళ్వార్ల జ్ఞానవైలక్షణ్యములందు అత్యంత ప్రవణులై, వీరి జ్ఞానవైశద్యమును శ్లాఘించుచుండ, అన్యపరులై యుండువారినిగూర్చి భాగవతులు సాధించినదానిని, ఏనుగును వెదుకవచ్చి, నేత్రసౌందర్యమును శ్లాఘించువానివలెనున్న, సర్వేశ్వరునిగూర్చి శఠగోపనాయిక చెలికత్తె భావగర్భితముగ పలుకుచున్నది.

కయలో నుమకణ్గళ్ ఎన్ఱు కళిఱు వినవినిన్ఱీర్,
అయలోరఱియిలుమ్ ఈదెన్న వార్త్తై? కడల్ కవర్న్ద,
పుయలో డువాழ்ఙ్గొణ్డల్ వణ్ణన్ పునవేఙ్గడత్తెమ్మోడుమ్,
పయలోవిలీర్ కొల్లై కాక్కిన్ఱ నాళుమ్ పలపలవే. ౧౫

టీక:—కళిఱు=ఏనుగును, వినవి=వెదుకవచ్చి, నుమ=మీయొక్క, కణ్గళ్=నేత్రములు, కయలో=మత్స్యములో? ఎన్ఱు=అని శ్లాఘించి, నిన్ఱీర్=నిలిచియున్నారు. అయలోర్=ఇతరులు, అఱియిలుమ్=తెలిసికొన్నను, ఈదెన్న వార్త్తై=ఇదియేమి మాటయని చెప్పుదురు; కడల్=మహాసముద్రమును, కవర్న్ద=కబళీకరించి, పుయలోడు=చినుకులతోగూడ, ఉలామ్=యథేష్టముగ సంచరించుచున్న, కొణ్డల్=కాళమేఘములవలె మనోజ్ఞమైన, వణ్ణన్=దేహకాంతిగల శ్రియఃపతియొక్క, పునమ్=ఉద్యానవనములచే నిండిన, వేంగడత్తు=శ్రీవేంకటాద్రియందు, కొల్లై=దొడ్డిని, కాక్కిన్ఱ=కాచియుండిన, నాళుమ్=దినములును, పలపల=అనేకములుగనున్నవి; ఎమ్మోడు=మాతో, పయలోవిలీర్=సంబంధములేదు.

తా॥ అయ్యా! మీరు వెదకవచ్చిన ఏనుగు మీకు కనబడని యెడల, మీరు వచ్చినత్రోవనే తిరిగి వెళ్లవలెనుగాని, మా సఖీమణి యగు శ్రీ శఠగోపనాయికయొక్క నేత్రసౌందర్యమును వర్ణింప మీకేమి పని? దీని నెవరైనను విన్నయెడల నేమనెదరు? ఇట్లు చెప్పుట కొంచెమైనను సబబుగలేదు. సప్తసముద్రములను నిరవశేషముగ పీల్చిన కాళమేఘములవలె, నల్లని దివ్యమంగళ విగ్రహముగల శ్రీ వేంకటేశుడు విహరించెడి ఉద్యానవనములతో నొప్పుచున్న తిరుమలయందు మీ పెరటి దోవను కాచుకొనియున్న దినము లనేకములు గలవు. మాతో మీకేమియు సంబంధములేదు. మీరు మాతోనుండుట యుక్తము కాదు. ఇక మీరు దయచేయవచ్చును—అని సర్వేశ్వరునిగూర్చి ఆళ్వారుల చెలికత్తె పలుకుచున్నది.

వి వి:—తమిళ్ లక్షణకారులు, దీనిని "వేళ్లమ్ వినాదల్" అని చెప్పెదరు. అనగా— నాయకుడు, నాయకిని ఆమె చెలికత్తెను చూచి, వ్యాజార్థమై తాను అడవికి వచ్చినట్లును, ఒక ఏనుగు ఇటు పరిగెత్తి వచ్చినటులను, చెప్పుచు, ఆ వ్యాజమున "ఇటు ఒక మత్తగజము పరుగెత్తి వచ్చెనా?" అని వారలతో ప్రసంగించుట దీనినే "కళిఱు వినాదల్" అనియును చెప్పెదరు. ఇంకను "కలైమగళ్ వినాదల్" "వళ్తి వినాదల్" "పతివినాదల్" మొదలగు నవియును ప్రసిద్ధిజెందియున్నవి.

(31) అవ:— భగవద్విషయమునందు నిమగ్నమైన ఆళ్వార్ల తిరువుళ్ళమును మరలింప, సర్వశక్తుడగు సర్వేశ్వరునికే అలవిగాకయుండగా, తిర్యక్కులమగు మావలననేమి శక్యముకాగలదు? అని హంసలు నివృత్తములాయెను. అంత ఆళ్వారులు తిరుమలవైపుకు వెళ్లుచున్న మేఘములజూచి వానిని దూతలనుగా పంపుచున్నారు.

ఇశైమిన్గళ్ తూదెన్ఱు ఇశైత్తాల్ ఇశైయిలమ్ ఎన్తలైమేల్,
అశైమిన్గళ్ శెన్ఱాల్ అశైయుఙ్గొలామ్? అమ్బొన్ మామణిగళ్,
తిశైమిన్ మిళిరుమ్ తిరువేఙ్గడత్తువన్ తాళ్శిమయ,
మిశైమిన్ మిళిరియ పోవాన్ వళిక్కొణ్డ మేగఙ్గళే. ౩౧

టీక :— అమ్‌బొన్ = శ్లాఘ్యమైనబంగారుయొక్కయు, మామణిగళ్ = శ్రేష్ఠములైన మణులయొక్కయు, మిన్ = కాంతి, తిశై = దిక్కులయందు, మిళిరుమ్ = ప్రకాశించుచున్న, తిరువేంగడత్తు = తిరుమలయందు, వన్ = బలిష్ఠములైన, తాళ్ = చరియలుగల, శిమయమిశై = శిఖరములనుగూర్చి, పోవాన్ = పోవుటకు, పుఱప్పట్టీర్కాళ్ = బయలుదేరిన, మిన్ = మెఱుపులను, మిళిరియ = ప్రకాశింపజేయుచున్న, మేగంగళ్ = ఓ మేఘములారా ! తూతు = దూతవార్తలను, ఇశైయుంగళ్ ఎన్ఱు = చెప్పుడని, ఇశైత్తాల్ = చెప్పినను, ఇశైయిలమ్ = ఒప్పలేదు, ఎన్ తలై మేల్ = నాతలమీద, అశైయుంగళ్ = సంచరింపుడు, ఎన్ఱాల్ = అనిప్రార్థించిన, అశైయుంగొలామ్ = అట్లుచేయుదురా ?

తా॥ ఓ మేఘములారా! మీరు తిరుమలకుబోవుచున్నారే! నామాటయొకటి, స్వర్ణరత్నఖచితమై, అష్టదిక్కులందును దేదీప్యమానముగ వెలుగుచున్న శిఖరములుగల శ్రీవేంకటాచలమునందు వేంచేసియున్న శ్రీ వేంకటేశునితో విన్నవింపుడు. మిమ్ములను దూతలనుగా వరించుచున్నాను. ఏల సమ్మతింపకయున్నారు? మీపాదములపై బడియెదను. దయచేసి నాదురవస్థను నా నాథునకు తెలుపుడు—అని ఆళ్వార్లు మేఘ సందేశమును పంపుచున్నారు.

వి. వి:— ప్రీతిగల్గిన భాగవతులు, ఆళ్వార్ల భగవత్పరమైన ప్రావణ్యమును గుర్తెఱింగి మిన్నకుండగ - తిరుమలకు విచ్చేయు భాగవతులనుజూచి వారు తమకు పురుషకారమును చేయుదురని భావించి, వారి శ్రీ పాదములను తమ తలపై నుంచుకొనుటయే పరమపురుషార్థము - అని నిశ్చయించి ఇటుల ప్రార్థించుచున్నారు.

(50) అవ:— భగవదలాభముచే గల్గిన ఆళ్వార్ల ఆర్తిని దేశాంతరమందుండెడి భాగవతులు విని, వీరిని సమీపించి వీరికి ఆప్యాయమును కలుగజేయుటకై "నాయిక బాధపడుచుండును శీఘ్రముగ రథమును నడుపుము" అని నాయకుడు తన సారథిని త్వరపఱచుచు వేంచేయుచున్నాడు. మీరు వ్యసనపడవలదు—అని ఆ నాయకుని వాక్యములను అనువదించుచున్నారు.

ఒణ్ణుదల్ మామై యొళిపయ వామై విరైన్దునన్దేర్,
నణ్ణుదల్ వేణ్డుమ్ వలవ! కడాగిన్ఱు తేన్నవిన్ఱ,
విణ్ముదల్ నాయగన్ నీళ్ముడి వెణ్ముత్త వాశిగై త్తాయ్,
మణ్ముదల్ శేర్వుత్తు అరువిశెయ్యానిఱ్కుమ్ మామలైక్కే ౫౦

టీక :— వలవ ! = సమర్థుడైన సారథీ !, ఒణ్ణుదల్ = సుందరమైన నొసలు గలనాయకియొక్క, మామైఒళి = శరీరకాంతి, పయవామై = వైవర్ణ్యము చెందకుండునట్లు, తేన్ = తేనెయును, నవిన్ఱ = చెప్పబడిన, విణ్ముదల్ నాయకన్ = పరమపదనాథుని, నీళ్ = దీర్ఘమైన, ముడి = కిరీటమందున్న, వెణ్ = తెల్లనైన, ముత్తమ్ = ముత్యములయొక్క, వాశిగై త్తాయ్ = మాలవలె, మణ్ముదల్ = పర్వతమూలభాగమును, శేర్వుఱ్ఱు = చేరెడి, అరువి = కొండవాగును, శెయ్యానిఱ్కుమ్ = ప్రవహింపజేయుచున్న, మామలైక్కే = గొప్పపర్వతమైన శ్రీ వేంకటాచలమునకే, విరైన్దు = శీఘ్రముగ, నమ్ తేర్ = మనరథమును, కడాగిన్ఱు = నడిపించుచు, నణ్ణుదల్ వేణ్డుమ్ = సమీపింపవలయును.

తా॥ ఓ సారథీ! నేను శఠగోపనాయికను ఎడబాసి చిరకాలమాయెను. ఆమె నొసటియందము నన్ను వివర్ణునిగ జేయుచుండునట్లు, నా విరహమువలన ఆమెకును వైవర్ణ్యము కలుగును. అట్లు సంభవింపక ముందే, తేనెవలె పరమభోగ్యుడై పరమపదనాథుడై యున్న సర్వేశ్వరుని కిరీటమందుండెడి తెల్లని ఆణిముత్యముల మాలలవలె, స్వచ్ఛమైన కొండకాలువలతో శోభాయమానమైయున్న శ్రీ వేంకటాచలముయొక్క మూలభాగమున ఆమెయుండెడి దివ్యదేశమునకు మనరథమును అతిశీఘ్రముగ నడిపింపవలయును.

వి వి:— సర్వేశ్వరుని, వాని భక్తులను విశ్లేషించు పాపమును పోగొట్టి ఆళ్వారులను సాంత్వన పఱచవలయునని ఉపోద్ఘాతించిన భాగవతులు, తమ మనస్సుల త్వరపెట్టుచు, ఆళ్వార్లసన్నిధికి వచ్చి చేరుచున్నారు - అని స్వాపదేశము.

(6¹) అవ :—ఈ శఠగోపనాయిక, తన యౌవనదశయందు సర్వోత్తముడైన నాయకుని తిరునామములను కీర్తించుచున్నదనుట, ఒక

ఆశ్చర్యకరమగు విషయముకాదు. ఇది ఈమెకు బాల్యమునుండియు స్వభావసిద్ధమగు విషయమే — అని ఆమెతల్లిగారు ఆనతిచ్చుచున్నారు.

ములైయో ముழుముఱ్ఱుమ్ పోన్దిల మొయ్ప్పూ ఙ్కుழల్ కుఱియ,
కలైయో అరైయిల్లై నావో కుழఱుమ్ కడల్ మణ్ణెల్లామ్,
విలైయో వెనమిళిరుమ్ కణ్ ఇవళ్ పరమే? పెరుమాన్,
మలైయో తిరువేఙ్గడమెన్ఱు కఱ్కిన్ఱ వాశగమే. ౬౦

టీక :— ములైయో = స్తనములో, ముழుముఱ్ఱుమ్ = బాగుగను పూర్ణముగను, పోన్దిల = వృద్ధిజెందలేదు ; మొయ్పూమ్=దట్టములై పుష్పముల పరిమళముగల, కుழల్ = కేశపాశము, కుఱియ = చిన్నదియేయైయున్నది. (ముడిచి కొప్పుగ ముడుచుటకు చాలినంతగ లేదు.) కలైయో = వస్త్రమో, అరైయిల్లై = కటియందులేదు ; నావో = నాలుకయో, కుழఱుమ్=స్ఫుటముగ నుచ్చరించుటకు వనువుగ లేదు; కడల్ = నాలుగు సముద్రములచే చుట్టబడిన, మణ్ = భూమియు, ఎల్లామ్ = తక్కిన లోకములు అన్నియును, విలైయో = దీనికి వెలయగునా ? ఎన = అనునట్లు, కణ్ = నేత్రములు, మిళిరుమ్ = (హావభావములతో గూడి) ప్రకాశించుచున్నవి ; పెరుమాన్ = సర్వేశ్వరుని యొక్క, మలైయో = పర్వతము, తిరువేఙ్గడమ్ = శ్రీ వేంకటాచలము, ఎన్ఱు = అని, కఱ్కిన్ఱ = అభ్యసించుచున్న, వాశగమ్ = మాటయే, ఇవళ్ పరమే = ఈ బాలికకు భరమాయెనే ! (వ్యథగల్గించునదాయెనే !)

తా॥ నాయకుడు చూచి మోహింపదగిన యౌవనావిర్భావమునకు సూచకములగు స్తనములు ఉదయింపలేదు. నాయకుడు తన చేతులార పుష్పములను ముడిచి కొప్పువేయుటకు తగిన కేశపాశమును ఏర్పడలేదు. వస్త్రము ధరించుటకును ఎరుగదు. తల్లిదండ్రులు నేర్పించిన మాటలనుగూడ స్ఫుటముగ నుచ్చరించుటకు చేతనగుటలేదు. ఈవిధమైన బాల్యావస్థయందే సకలలోకములను ఈ నేత్రములకు వెలయగునా యనునట్లు, హావభావములతోగూడిన కటాక్షములను ప్రసరింపజేయుచు, సర్వేశ్వరుడు నిత్యవాసముజేయుచున్న వేంకటాచలమునే నునుసిగ్గుతో అనుసంధించుచున్నది. ఇట్లుండగ, పతిసంయోగయోగ్య

మైన యౌవనమందెల్లప్పుడును వాని తిరునామమునే ఉచ్చరించు చుండుట, ఒక ఆశ్చర్యకరమగు విషయము కాదు.

వి. వి:— స్వాపదేశమున - "ములై (స్తనము)" అనగా భక్తి, "పూఙ్గుழల్ (రమణీయకుంతలములు)" అనగా ప్రణామము, "కలై (చీరె)" అనగా ప్రవృత్తి. నావోకుழుమ్ - నామసంకీర్తనము లేదు "శికణ్ మిళురుమ్" ధ్యానములేదు - అని అర్థము.

(67) అవ:— ఈ శఠగోపనాయకి నేత్రసౌందర్యమును నాయకుడు అభివర్ణించుచున్నాడు.

> కావియుమ్ నీలముమ్ వేలుమ్ కయలుమ్ పలపలవెన్రు,
> ఆవియిన్ తన్మై అళవల్ల పారిప్పు అశురరైచ్చెత్ర,
> మావియుమ్ పుళ్ వల్ల మాదవన్ గోవిన్దన్ వేఙ్గడమ్ శేర్,
> తూవియుమ్ పేడైయన్నాళ్ కణ్గళాయ తుణైమలరే. ౬౭

టీక :— అశురరై = రాక్షసులను, శెత్ర = సంహరించినవాడును, మావియుమ్ = గొప్ప ఆశ్చర్యకరమగు మహిమగల, పుళ్ = గరుత్మంతుని, వల్ల = వాహనము చేసికొనిన సమర్థుడును, మాదవన్ = శ్రియఃపతియును నైన, గోవిందన్ = శ్రీకృష్ణస్వామి యొక్క, వేఙ్గడమ్ = వేంకటాద్రియందు, శేర్ = అమరియుండెడి, అమ్‌తూవి = అందమైన రెక్కలుగల, పేడైయన్నాళ్ = ఆడుహంసయువలె మనోజ్ఞురాలైన నాయకియొక్క, కణ్గళాయ = నేత్రములనెడి, తుణైమలర్ = పరస్పర సదృశములైన పుష్పములయొక్క, పారిప్పు = వ్యాపించుట, కావియుమ్ = చెంగలువపుష్పములను, నీలముమ్ = నల్లకలువ పువ్వులను, వేలుమ్ = ఈటెను, కయలుమ్ = మత్స్యములను, పలపల = ఇంకను అనేక వస్తువులను, వెన్రు = జయించునది; (దానికి), ఆవియిన్ = నాప్రాణములయొక్క, తన్మై = స్థైర్యము, అళవుఅల్ల = ఒకలెక్కలోనిదికాదు.

తా॥ మహామహిమ గలిగి, పక్షులకు రాజైన గరుత్మంతునెక్కి, ఆశ్రితవిరోధులెల్లరును నశించునట్లు విహరించెడి, శ్రియఃపతియగు గోవిందుడు ఎల్లరకును సేవ సాధింపవలెననెడి పరమకృపచే సర్వ సులభుడై వేంచేసియుండెడి, వేంకటాద్రియందు వేడుకగ సంచరించెడి ఆడు హంసవలె, అత్యాకర్షకమైన నాయికయొక్క పరస్పర సదృశములై

వికసించిన పుష్పములవలెనున్న నేత్రములు — కనుగొనలయందలి ఎఱ్ఱదనముచే ఎఱ్ఱకలువలను, కనుపాపల నల్లదనముచే నల్లకలువలను, వాడియగు తన చూపులచే వాడియైన ఈటెను, ఆకారసౌందర్యముచే మత్స్యములను, మఱియు నితరగుణములచే లేడికన్నులు మొదలగు అనేకవస్తువులను జయించినవి. అట్టివానికి నా ప్రాణములు ఒక లెక్కయా ?

వి. వి :— (1) మంగళ దేవతాలంకృత దివ్యమంగళ విగ్రహుడగు తిరువేంగడముడయానుల వాసస్థానమగు తిరువేంగడమున మిక్కిలి ప్రావణ్యముగలిగిన ఆళ్వారులు, ఆ భగవానునికి నన్ను వశపఱచుకొనుట ఒక వైభవమా ? అని అనుసంధించుచున్నారు.
(2) "వేంగడంశేర్ తూవియమ్పేడై యన్నాళ్" అనుటచే ఆకారత్రయ సంపన్నయగు శ్రీ మహాలక్ష్మీసామ్యము ఆళ్వారులకున్నదని తెలియుచున్నది.

(81) అవ :— ప్రాణనాథుని విరహమును తాళజాలక శ్రీశఠగోపనాయిక మూర్ఛనొందెను ఈ స్థితిని చూచి సహింపజాలని ఈమె తల్లి మొదలగువారు ఎఱుకలసానిని పిలిపించి అదిచెప్పెడి చికిత్సను చేయుదమని యత్నింపగా — చిన్ననాటినుండియు ఈమె స్వరూపస్వభావములను గుర్తెఱింగిన చెలికత్తె కోపగించుకొని చెప్పుచున్నది.

ఉఱుగిన్ఱ కన్మజ్గళ్ మేలాన ఓర్ప్పిలరాయ్ ఇవళై,
ప్పెఱుగిన్ఱ తాయార్ మెయ్ న్నొన్దుపెఱార్ కొల్ ?
తుఱైయ్ కుఱ్ఱల్ వాయ్,
త్తుఱుగిన్ఱిలర్ తొల్లై వేఙ్గడ మాట్టవుమ్ శూడ్ ప్పిలర్,
ఇఱుగిన్దాల్ ఇవళాగమ్ మెల్లావి యెరికొళ్ళవే. ౮౧

టీక :— మెల్ = మృదువైన, ఆవి = ప్రాణమును, ఎఱి-విహార్ని, కొళ్ళ= కబళీకరింపగ, ఇవళ్ = ఈ శఠగోపనాయిక యొక్క, ఆగమ్ = శరీరము, ఇఱుగిన్దు= శిథిలమైపోవుచున్నవి ; ఓర్ప్పిలరాయ్ = విచారింపక, ఉఱుగిన్ఱ = చేసెడి, కన్మజ్గళ్ = (ఎరుకలసాని మొదలగువారు చెప్పెడి) కార్యములు, మేలన = అసలు తత్త్వమును తెలిసికొనలేక పైపైజరుపబడుచున్నవి ; తుఱైయ్ = తిరుత్తుఱైయిని, (తులసీదళమును, కుఱ్ఱల్ వాయ్ = కొప్పునందు, తుఱుగిన్ఱిలర్ = తురుమరైరి, తొల్లై = అనాది

యైన, వేఙ్గడమ్=శ్రీ వేంకటాచలమునకు, ఆట్పడుమ్=తీసికొని వెళ్ళుటకు, శూழ்గిన్ఱిలర్= ఉపాయమును వెదుకరైరి; ఆల్ = అయ్యో!; ఇవళై = ఈమెను, వెఱుగిన్ఱ = కన్నటువంటి, తాయార్ = తల్లి, మెయ్‌నొన్దు=కష్టపడి, పెఱార్ కొల్ =కనలేదేమో!

తా॥ ఈ శఠగోపనాయకి, మృదువైన ప్రాణములను విరహాగ్ని నలుప్రక్కలను చుట్టుకొని దహించుటచే, వానికాశ్రయమగు శరీరము శిథిలమై క్రిందపడుచున్నది. ఈ బాధకు సంబంధించిన నిదానమును తెలిసికొనలేక, వానికి విరుద్ధములైన కార్యములను చేయుచున్నారే! ఇదియేమి అన్యాయము! అనన్యార్హయగు ఈవిడస్వరూప మెక్కడ? ఈ దేవతాంతరపరులైన ఎఱుకలసానులును, వారిచికిత్సలును ఎక్కడ? ఆహా! వీరలు కొన ఊపిరినిగూడ పోగొట్ట యత్నించుచున్నారు. ఈవిడ తల్లియే వీనినన్నింటిని చేయించుచున్నదే! ఈమె కష్టపడి ఈమెను కనలేదేమో? ఆమె కష్టపడి కనియున్న ఇట్టి కార్యములకు ఒడిగట్టునా? ఈ పాడుపనులుచేసి, మొదటికే మోసమును తీసికొని రాకుడు. ఈమె ఎల్లప్పుడును ఆశపడు పెరుమాళ్ళ తిరుత్తుழாయిని తెచ్చి, ఈమెకొప్పులో శోంచెదము ముడువుడు; లేక, ఈమె ఆశపడెడు తిరువేంగడమునకు తీసికొనిపోయి, అక్కడ ఈమెను పడవేయుడు. అట్లుచేయుక, ఇదియేమి అన్యాయము!

వి. వి:— (1) "ఉఱుగిన్ఱ కన్మంగళ్," మొదలగువ నిచే రక్షించువారల కును, చూచువారలకును ఉపాయమగునట్టుల భగవద్విషయమైన నవగాహనము సూచింపబడుచున్నది.

(2) సర్వేశ్వరుని దివ్యతులసీదామముల ననుభవించుటయు, అతడు నెలకొని యుండు దివ్యదేశములలో నివసించుటయు, వాని తిరునామముల సంకీర్తనము చేయుట యును ఆళ్వారుల విరహవ్యథకు పరిహారములు. వానిని చెయ్యకుండుటచే వీరికి మనోవ్యథ మిక్కుటమగుచున్నది — అని అన్తరార్థము.

శ్రీ నమ్మాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

శ్రీరస్తు
శ్రీమతే శఠగోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరువన్దాదిలోని

# మంగళాశాసన పాశురములు

## అవతరిణిక

ఆళ్వార్లు, తిరువిరుత్తమున, తమ జ్ఞానదృష్టికి గోచరుడైన సర్వేశ్వరునిజూచి, "దేవరవారి ననుభవించుటకు ప్రతిబంధకమైన దేహసంబంధమును సవాసనముగ పోగొట్టవలయును - అని ప్రార్థించిరి. సర్వేశ్వరుడు, వారి ప్రార్థనను వెంటనే పూర్తిచేయక, వీరిద్వారా లోకములకు మహోపకారముగ కొన్ని దివ్యప్రబంధముల ప్రసాదించెదము—అని, వీరి నీ ప్రకృతిమణ్డలముననే యుంచుటకై తన దివ్యకల్యాణ గుణముల సాక్షాత్కరింపజేసెను. ఆళ్వార్లు వానిని సాక్షాత్కరించి పరమానందమును పొందిరి తిరువాశిరియ ప్రబంధమున. అట్లు అనుభవించిన అనుభవామృతము లోపల నిమడక పైకి పొంగి పొరలి ప్రవహించుచున్న క్రమమును ఈ ప్రబంధమున నభివర్ణించుచున్నారు.

ఇందు తిరువేంగడముడైయాన్ల విషయముగ నొక పాశురము మాత్రమే అమరియున్నది.

(68) అవ:— క్రింది మూడుపాశురములందును ఆళ్వార్లు తమ తిరువుళ్లమునకు హితములు ఉపదేశించిరి. అందులకు అది సమ్మతించి నందున గలుగు ఫలమును ఈ పాశురమున సెలవిచ్చుచున్నారు.

కల్లుమ్ కనైకడలుమ్ వైగున్ద వానాడుమ్,
పుల్లెన్ఱొళిన్దనకొల్ ? ఏపావమ్ — వెల్ల,
నెడియాన్ నిఱమ్కరియాన్ ఉళ్పుగున్దు నీజ్గాన్,
అడియేనదు ఉళ్ళత్తగమ్. ६८.

టీక :— వెల్ల నెడియాన్ = మహోన్నతుడును, నిఱమ్‌కరియాన్ = నీలమేఘనిభ శరీరుడునునగు శ్రీకణ్ణపిరానులు, ఉళ్ పుగున్దు = లోపల ప్రవేశించి, అడియేనదు = దాసుని యొక్క, ఉళ్ళత్తగమ్ = హృదయమను గృహమును విడిచి, నీజ్గాన్ = విడచివెళ్ళుట లేదు ; (కనుక), కల్లుమ్ = శిలామయమైన శ్రీవేంకటాద్రియును, కనైకడలుమ్ = జలమయమై, మహాఘోషముతో నిండియుండు క్షీరసముద్రమును, వైగున్దమ్ = జ్యోతిర్మయమైన శ్రీవైకుంఠమును, వాన్ నాడుమ్ = పరమపదమును, పుల్లెన్రు = తృణప్రాయములని, ఒழిన్దనపోలుమ్ = విడువబడినవేమో ? ఏ పావమ్ = అయ్యోపాపము !

తా॥ మహోన్నతుడును, నీలమేఘనిభమంజుల విగ్రహుడును నగు శ్రీకృష్ణస్వామి నా మనస్సున ప్రవేశించి, వానిని త్రుటికాలమైనను విడువలేకయున్నాడు. దీనిని చూడగ, శిలామయమైన శ్రీవేంకటాద్రియు, జల(డ)మయమైన క్షీరసముద్రమును, జ్యోతిర్మయమైన పరమపదమును, అతనికి తృణప్రాయములుగ తోచినట్లున్నవి.

వి. వి :— (1) భక్తులహృదయములయందు సమయమునుచూచి ప్రవేశించుటకే దివ్యదేశములలో భగవంతుడు నివసించుచున్నాడు— అను శ్రీవచనభూషణ గ్రంథమునకు నీ పాశురమే మూలమని తోచుచున్నది.

(2) ఈ పాశురమును రాత్రి పఠించునప్పుడు పలుసారులు అనుసంధింప వలయునని — పెద్దలు వక్కాణింతురు.

(3) "కల్లుమ్" అను పదము పర్వతమును చెప్పుచున్నదై, ఇచ్చట మహిమాతిశయముచే తిరువేంగడమును బోధించుచున్నది.

(4) పుల్ - అనగా అల్పమైనది అని అర్థము.

(5) "పుక్కడలిల్", "కడవరై వాయ్" - అను పెరియాళ్వార్ల రెండు పాశురములను నిచ్చట ననుసంధింపదగినవి.

శ్రీ నమ్మాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

శ్రీరస్తు
శ్రీమతే శఠగోపాయనమః
శ్రీమతే రామానుజాయనమః

## శ్రీ నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువాయ్మొళిలోని

# మంగళాశాసన పాశురములు

(1-వ పది, 8-వ తిరువాయ్మొళి 3-వ పాశురమ్)

### అవతరణిక

(3) అవ:—శ్రీ వేంకటాచలపతియే సంసారులకును, నిత్యసూరులకును, సంరక్షకుడై యున్నాడు — అని ఆనతిచ్చుచున్నారు.

కణ్ణావాన్ ఎన్ఱుమ్, మణ్ణోర్ విణ్ణోర్కు,
తణ్ణార్ వేఙ్గడ, విణ్ణోర్ వెఱ్పనే. ౧—౮—3.

టీక :— మణ్ణోర్ = ఈ భూలోకమున నివసించు సంసారులకును, విణ్ణోర్కు = పరమపదమున నివసించుచున్న నిత్యసూరులకును, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడును, కణ్ ఆవాన్ = కండ్లవలె సంరక్షకుడై యుండు సర్వేశ్వరుడు, తణ్ ఆర్ = సుభగశీతలమైయున్న, వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలమును, విణ్ణోర్ వెఱ్పన్ = నిత్యసూరులకును ఆశపడదగిన పర్వతరాజమున నివసించువాడు.

తా॥ ఈ భూలోకమునందలి సంసారులకును, వైకుంఠమునందున్న నిత్యసూరులకును ఒకేవిధముగ నేత్రస్థానీయుడై యుండు సర్వేశ్వరుడు, నిత్యసూరులచేత మిక్కిలి ఆశతోడవచ్చి సేవింపబడుచున్న శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నాడు.

వి. వి:— (1) మనుజులకు మంచిచెడ్డలను చూపించి, మంచిమార్గమున ప్రవర్తించుటకు ప్రధానకారణమై, సంరక్షకమైయున్నది కన్ను. అట్లే పరమాత్ముడును ఉన్నందున, ఇచ్చట "కణ్ణావాన్" అని నిర్దేశించిరి.

(2) రక్ష్యాపేక్షకుడైయుండు సర్వేశ్వరుని తాపము, రక్షకాపేక్షకుడైయుండు చేతనుని తాపము సవాసనముగ తీరునటుల సుభగశీతలముగ నీ పర్వతమున్నదని "తణ్ణార్ వేంగడమ్" అనుటచే సూచింపబడుచున్నది.

(2-వ పది, 6-వ తిరు. 9-వ పాశురము)

(9) అవ:— నన్ను విడచి, నీవు వెళ్లదలచినను వేరుచోటు నీకు లేదు — అని సర్వేశ్వరునితో నాழ్వార్లు చెప్పుచున్నారు.

ఎన్దాయ్ తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్ ఇలఙ్గై శెత్తాయ్ మరామరమ్,
పైన్దాళేழுరువ ఒరువాళి కోత్త విల్లా,
కొన్దార్ తణ్ణన్దుழాయినాయ్ అముదే ఉన్నై ఎన్నుళ్ళే కుழைత్త ఎమ్
మైన్దా, వానేఱే ఇని ఎఙ్గు పోగిన్ఱదే. ౨-౬-౯.

టీక :— తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్ = చల్లని శ్రీవేంకటాచలమున వేంచేసియున్నవాడా! ఇలఙ్గై శెత్తాయ్ = లంకాపురిని నశింపజేసినవాడా! మరామరమ్ పైన్దాళ్ ఏழுమ్ = మద్దిచెట్లయొక్క క్రిందిభాగముల నేడింటి యందును, ఉరువ = లోపల చొచ్చుకొని వెళ్లునట్లు, ఒరు వాళి = ఒక బాణమును, కోత్త విల్లా! = సంధించినట్టి ధనుస్సు గలవాడా!, కొన్దు అర్ = అరలనోనిండి, తణ్ అమ్ = శీతలమై సుందరమైన, తుழாయినాయ్ — దివ్యతుళసీదామములను ధరించినవాడా! వాన్ ఏఱే = పరమపదమునందున్న నిత్యసూరులకు అధిపతియైనవాడా! అముదే = అమృతమువలె మధురమైనవాడా! ఎన్దాయ్ = నీ ఆశ్చర్యగుణచేష్టితములను, (ఇట్లు నేను అనుభవించునట్లు అనుగ్రహించిన) నా స్వామీ! ఉన్నై = దేవ వారిని, ఎన్నుళ్ కుழைత్త = నన్ను విడచి వేఱుగనుండ లేనట్లు, నాతో అపృథక్సిద్ధముగనున్న, ఎన్ మైన్దా = నా యువకుడా!, ఇని ఎఙ్గు పోగిన్ఱదు = ఇటుపై ఎక్కడికి పోగలవు?

తా॥ పరమభోగ్యమగు తిరుమలలో నీవు వేంచేసియుండుటయు, శ్రీరామచంద్రమూర్తియై యవతరించి లంకను నాశనము చేసినదియు, సుగ్రీవునకు నమ్మిక గల్గుటకై సప్తసాలములను భంజించినదియు, దివ్య తుళసీదామముల ధరించుటచే గలిగిన సౌందర్యమును, పరమపదమున నిత్యసూరులతో వేంచేసియుండు నీ ఠీవిని, వీనినెల్లను పరమకృపతో నాకు చూపి, నిన్ను నేను అమృతమువలె అనుభవించునట్లు చేసితిరి. ఇంతియేగాక, నన్ను విడచి, ఉండలేనట్లు, నిన్ను నాతోగూడ ఒకటిగ చేర్చితిరి. దీనిచే మీకు క్రొత్తగ యౌవనము కల్గియున్నది. ఇట్లుండగ మీరు

నన్ను విడచి వెళ్లుటకు వేరుచోటుగలదా? పోయెద ననినమాత్రము మీరు పోగలరా?

(2-వ పది, 6-వ తిరు. 10-వ పాశురము)

(10) అవ:— తమను ఎడబాయవలదని సర్వేశ్వరుని ప్రార్థించి, నేనును నిన్ను విడవజాలనని చెప్పుచున్నారు.

పోగిన్ఱ కాలఙ్గళ్ పోయకాలఙ్గళ్ పోగుకాలఙ్గళ్ తాయ్‌తన్దైయుయి,
రాగిన్ఱాయ్ ఉన్నైనాన్ అడైన్దేన్ విడువేనో,
పాగిన్ఱ తొల్ పుగழ் మూవులగుక్కుమ్ నాదనే పరమా తణ్ వేఙ్గడమ్,
మేగిన్ఱాయ్ తణ్ తుழாయ్ విరై నాఱు కణ్ణియనే. ౨—౬—౧౦.

టీక :— పాగిన్ఱ = ఎల్లచోటులను ప్రసిద్ధమైన, తొల్ పుగழ் = అనాదియగు మంచిగుణములచే గలిగిన కీర్తిగలవాడవై, మూవులగుక్కుమ్ = ములోకములకును, (త్రివిధ చేతనములకును, త్రివిధఅచేతనములకును), నాదనే = స్వామియైనవాడా! పరమా = నీకన్న అధికుడెవ్వడును లేనట్టివాడా!, తణ్ వేఙ్గడమ్ = సంసారతాపములన్నిటిని పోకార్చు చల్లని శ్రీవేఙ్కటాచలమున, మేగిన్ఱాయ్ = పరమప్రీతితో వేంచేసియున్న వాడా!, తణ్ తుழாయ్ = అందమై, చల్లనిదై యుండు తుళసియొక్క, విరై = సువాసనలచే, నాఱు = పరిమళించుచున్న, కణ్ణియనే = దివ్యమాలలను ధరించినవాడా! పోగిన్ఱ కాలఙ్గళ్ = జరుగుచున్న కాలములయందును, పోయకాలఙ్గళ్ = జరిగినకాలములయందును, పోగుకాలఙ్గళ్ = రాబోవు కాలములయందును, తాయ్‌తన్దైయుయిరాగిన్ఱాయ్ = తల్లివలెను, తండ్రివలెను హితమును చేయువాడా! ఉన్నైనాన్ అడైన్దేన్ = నిన్ను నేను పొందితిని, విడువేనో = ఇక విడుతునా?

తా॥ బిడ్డలకు తల్లిదండ్రులుచేయు మేలులను, ఒకడు తనకు తాను చేసికొను మేలును, అన్ని కాలములయందును నాకు చేయునట్టి స్వభావముగలవాడా! స్వభావసిద్ధములై నిత్యములై యుండు అనంత కల్యాణగుణములచే పూర్ణుడవై యున్నవాడా! బద్ధులు, ముక్తులు, నిత్యులు — అని మూడు విధములుగనుండు చేతనులకును, శుద్ధసత్త్వము, మిశ్రసత్త్వము, సత్త్వశూన్యము — అని మూడు విధములుగనుండు అచేతన

ములకును స్వామియైనవాడా! నిస్సమాభ్యధికుడవై యుండువాడా! పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండి, నాబోటివానికిని పరమ సులభుడవై యున్నవాడా! దివ్యతుళసీదామముల ధరించి, రసికాగ్రేసరుడవై యుండు స్వామీ! ఇంత కాలమునకు నిన్ను నేను పొందితిని. ఇక నిన్ను నేను విడువగలనా? ఎప్పటికిని విడువను.

(2-వ పది, 7-వ తిరు. 11-వ పాశురము)

(11) అవ:—సర్వేశ్వరుడు మనలను వదలజాలడు - అని తమ మనస్సునుగూర్చి చెప్పుచున్నారు.

> పఱ్పనాబఙ్ ఉయర్వ్ఱ వ్రయరుమ్ పెరున్దిఱలోన్,
> ఎఱ్పరన్ ఎన్నైయాక్కిక్కొణ్డు ఎనక్కేతన్నైత్తన్ద
> కఱ్పగమ్, ఎన్ అముదమ్ కార్ ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్
> వెఱ్పఙ్, విశుమ్బోర్ పిరాఙ్ ఎన్దై దామోదరనే. ౨-౭-౧౧.

టీక:— పఱ్పనాబన్ = సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మకు ఉత్పత్తిస్థానమైన పద్మమును నాభియందు గలవాడును, ఉయర్వ్ఱ ఉయరుమ్ = తన కంటెను వేరొక ఉన్నతమైన వస్తువులేనట్లు ఎత్తుగవ్యాపించియున్న, పెరుమ్ తిఱలోన్ = గొప్ప తేజస్సు గలవాడును, ఎన్నై = అసత్కల్పుడనగునన్ను, ఆక్కిక్కొణ్డు = ఒకవస్తువునుగజేసి, తనవస్తువునుగజేసికొని, ఎనక్కే = నాకొక్కనికే అనుభవయోగ్యమగునట్లు, తన్నైతన్ద = తనను స్వాధీనము జేసిన, కఱ్పగమ్ = కల్పకవృక్షమువంటివాడును, ఎన్ అముదమ్ = నాకు అమృతమువలె, పరమభోగ్యుడైయున్నవాడును, కార్ ముగిల్ పోలుమ్ = వర్షాకాలమునందలి మేఘమువలె, మహౌదార్యముగల, వేఙ్గడనల్ వెఱ్పన్ = శ్రీవేంకటాచలమను పరమరమణీయమగు పర్వతమున వేంచేసియున్నవాడును, విశుమ్బోర్ = నిత్యసూరులకును, పిరాన్ = మహోపకారకుడై స్వామియైనవాడును, ఎన్దై = నా స్వామియును, (ఐన), దామోదరన్ = తల్లియగు యశోదాదేవిచే కట్టబడిన త్రాటిని ఉదరమున ధరించి ప్రకాశించువాడును నైన సర్వేశ్వరుడు, ఏఱ్పలన్ = నాయందే మిక్కిలి ఆశ గలిగినవాడైయున్నాడు.

తా॥ తన నాభికమలమ్మున, సృష్టికర్తయగు చతుర్ముఖునకు ఉత్పత్తిస్థానమైన దివ్యకమలమును గలిగియుండుటచే, నవితత సౌందర్యముగల

వాడును, అంతములేని తేజోమయములగు దివ్యకల్యాణ గుణములతో గూడియున్నవాడును, అపదార్థమగు నన్నుగూడ అనుగ్రహించి, ఒక వస్తువుగ చేసి, తనను తప్ప ఇతర విషయములకై ఆశపడకుండునట్లు నన్ను చేసి, నాకు అమృతమువలె పరమభోగ్యుడై యుండువాడును, నేనొక్కడనే అనుభవించునట్లు తనను నాకునమర్పించిన కల్పవృక్షమైనవాడును, మహౌదార్య గుణగణములు గలవాడును, పరమ రమణీయమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నవాడును, నిత్యసూరులకును, నాకును స్వామియైనవాడును, తన తల్లియగు యశోదాదేవిచే ఱోటికి కట్టబడి, పరమ సులభుడై యుండునట్లు ఆశ్రితుల కెల్లఱకును, పరమ సులభుడై యున్నవాడును నగు సర్వేశ్వరుడు, నాయందు మితిలేని ఆశగలవాడై యున్నాడు. కాబట్టి మనలను ఆతడు విడువజాలడు.

(3-వ పది, 5-వ తిరు. 8-వ పాశురము)

(8) అవ:— సర్వేశ్వరుని అనుభవించుచు పరమానందరస నిమగ్నులగు వారల శ్లాఘించుచున్నారు.

> వార్ పునల్ అన్దణరువి వడతిరు వేజ్గడత్తెన్దై,
> పేర్ పల శొల్లిప్పిదత్తి ప్పిత్తరెన్రేపిఱర్ కూఱ,
> ఊర్ పల పుక్కుమ్ పుగాదుమ్ ఉలోగర్ శిరిక్కనిన్ఱాడి,
> ఆర్వమ్ పెరుగి కుని ప్పార్ అమరర్ తొழுప్పడువారే. 3-5-8.

టీక :— వార్ పునల్ = ప్రవహించుచున్న జలములుగల, అమ్ తణ్ = సుందరములై శీతలములైనుండు, అరువి = కొండవాగులను గలిగిన, వడతిరువేజ్గడత్తు ఎన్దై = ఉత్తరదిక్కునకు తిలకస్థానీయమైయున్న శ్రీవేంకటాచలమున వేంచేసియుండు స్వామి యొక్క, పేర్ పల = పలువిధములగు తిరునామములను, శొల్లి = కీర్తించి, పిదత్తి = పలవించి, పిఱర్ = ఇతరులు, పిత్తరెన్రేకూఱ = (వీరిని) పిచ్చివారని చెప్పునట్లు, పల ఊర్ = అనేక గ్రామములకు, పుక్కుమ్ పుగాదుమ్ = పోయియును, పోకయును, ఉలోకర్ = లోకులు, శిరిక్క = నవ్వునట్లు, నిన్ఱాడి = సర్వేశ్వరునియందలి భక్తి రసము మిక్కుటముగాగ నిలచుచు ఆడుచు, ఆర్వమ్ పెరుకి = ఆశ అధికమై, కునిప్పార్ =

నర్తనము చేయువారు, అమరర్ = నిత్యసూరులచే, తొழప్పడువార్ = సేవింపబడు దురు (వారిచే స్తోత్రముచేయబడుదురని భావము.)

తా॥ మిక్కిలి రమణీయమై, సుభగశీతలమై, భోగ్యముగనుండు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండి నన్ను దాసునిగజేసికొనిన స్వామి యొక్క పలు తిరునామములను ముందువెనుకలుగ చెప్పి, ఇతరులు వీరలను పిచ్చివారని చెప్పునట్లును, లోకులు వీరలను పరిహాసించునట్లును, ఇతరులు ఉన్నను లక్ష్యపెట్టక, అన్నిచోట్లను ఒకేవిధముగ భగవంతుని యందు లీనమనస్కులగుటచే పరవశులై, ఆడుచు, పాడుచు, నర్తనము చేయుచుండువారు, నిత్యసూరులచే శ్లాఘింపబడుదురు.

(3-వ పది, 9-వ తిరు. 1-వ పాశురము)

(1) అవ :–భగవంతు డనుగ్రహించిన కరణత్రయమును అప్రాప్త విషయములయందు ఉపయోగపఱచి, శ్రమపడుచున్న సంసారిచేతనుల దుఃఖములజూచి సహింపజాలక, భగవంతుని విషయమందే మీ కరణ త్రయము నుపయోగింపుడని ఉపదేశించుచున్నారు.

శొన్నాల్ విరోదమిదు ఆగిలుమ్ శొల్లువన్ కేణ్మినో,
ఎన్నావిల్ ఇన్కవి యానొరువర్క్కుమ్ కొడుక్కిలేన్,
తెన్నా దెనావెన్ఱు వణ్డుమురల్ తిరువేఙ్గడత్తు,
ఎన్నానై ఎన్నప్పన్ ఎమ్పెరుమా నుళనాగవే. 3–౯–౧.

టీక :— శొన్నాల్ = (మనుష్యులను పాడకూడదు అని) చెప్పినచో, అదు= ఇట్లు చెప్పుట యనునది, విరోదం=విరోధమగును ; ఆగిలుమ్=అయినప్పటికిని, శొల్లువన్= చెప్పెదను, కేణ్మినో = వినుడు ; తెన్నా తెనావెన్ఱు = (పూదేనెలపానముచేసి, సంతోషాతిశయముచే) తెన నన నా అని, వణ్డు=తుమ్మెదలు, మురల్=శబ్దించుచున్నటువంటి, తిరువేఙ్గడత్తు = తిరుమలలో వేంచేసియున్నట్టివాడును, ఎన్ ఆనై = మత్తగజమువలె తోచువాడును, ఎన్నప్పన్ = నాతండ్రివలె హితమునుచేయువాడును నగు, ఎమ్పెరుమాన్ = నా స్వామి, ఉళనాగ = నా పాశురములకు విషయమైయుండగ, ఎన్నావిల్ = నాజిహ్వాగ్రమునందున్న, ఇన్కవి=మధురముగపాడు కవిత్వమును, నాన్ = నేను, ఒరువర్క్కుమ్= వేరుఎవరికిని, కొడుక్కిలేన్ = ఇవ్వజాలకున్నాను.

తా॥ ప్రియమైన సంసారులారా! మనుష్యమాత్రులను స్వల్ప ప్రయోజనములకై అభివర్ణించుచున్నారు. ఆ దురభ్యాసమును బోగొట్టు కొనుటకై యొక ఉపాయమును చెప్పుదును. అది మీ యభిప్రాయము నకు విరుద్ధముగ నుండును. అయినను, హితబుద్ధితో జెప్పుచున్నాను. శ్రద్ధగా వినుడు.

పూదేనెల బాగుగ గ్రోవి తుమ్మెదలు "తెన్నా తెన్నా" అని పాడుచున్నవి. అట్టి పరమభోగ్యమైన తిరువేంగడపర్వతమునందు నిత్య వాసము చేయుచున్న నా స్వామి సర్వేశ్వరుడు ఈ కవిత్వమునందు పరిమళించుచుండగ నతనికి ననన్యార్హ శేషభూతుడ నగు నేను నా కవిత్వము నితరులకు నంకితమొనర్పజాలను.

(4-వ పది, 5-వ తిరు. 11-వ పాశురము)

(11) అవ:— తిరువేంగడ ముడయానులనుగూర్చి, తాము ఆన తిచ్చిన తిరువాయ్‌మొழி దివ్యప్రబంధములోని ఈ తిరువాయ్‌మొழிని అభ్యసించిన వారలకు ఫలమును చెప్పుచున్నారు.

మారిమాఱాదతణ్ణమ్మలై, వేఙ్గడత్తణ్ణలై,
వారిమాఱాదపైమ్బూమ్బొழிల్ శూழ் కురుగూర్ నగర్,
కారిమాఱన్‌శడగోపన్ శొల్లాయిరత్తు ఇప్పత్తాల్,
వేరిమాఱాదపూమేలిరుప్పాళ్ వినై తీర్కుమే. ౪—౫—౧౧.

టీక:— మారిమాఱాద=ఎడతెగక యెల్లప్పుడును వర్షము వర్షించుచున్న, తణ్=సకలతాపములనుపోగొట్టునట్లు చల్లనైయున్న, అమ్=అందమైన, వేఙ్గడత్తుమలై=తిరువేంగడమను పర్వతమునవాసంచేసి యున్నట్టి, అణ్ణలై=స్వామినిగూర్చి; వారిమాఱాద=జలము మారిపోనట్టి, పైమ్బూమ్బొழிల్=పచ్చపూదోటలతో, శూழ்=చుట్టబడియున్న, కురుగూర్‌నగర్=కురుకూరను తిరునగరిలో వాసంచేసి యున్న, కారిమాఱన్‌శడగోపన్='కారి' అనువారి కుమారులై 'మాఱన్' అను పేరుగల శఠగోపదివ్యసూరీశ్వరులచే, శొల్=పాడింపబడిన, ఆయిరత్తు=వెయ్యిపాటలలో, ఇప్పత్తాల్=ఈ పదిపాశురములను, (ఎల్లప్పుడును అనుసంధించుటచే), వేరిమాఱాద=మంచివాసనగల మారకుండునట్టి,

పూ మేల్ ఇరుప్పాళ్ = తామరపుష్పమునందు నిత్యవాసము చేయుచున్న శ్రీమహాలక్ష్మీ దేవి, విసై =(సర్వేశ్వరుని అనుభవములను విరోధులగు) పాపములను, తీర్కుమ్=తీర్చును.

తా॥ తిరువేంగడముడయానులను గూర్చి శ్రీ నమ్మాళ్వార్లు సాదించిన వెయ్యిపాశురములలో చేరిన ఈ పదిపాశురములను ఎల్లప్పుడును అనుసంధించువారలను, ఎంబెరుమానులను సేవించుటకు ప్రతిబంధకములగు పాపములనన్నింటిని పరిహరించి, తామరపుష్పమున నిత్యవాసము చేయుచున్న పెరియ పిరాట్టియారులు సంరక్షింతురు.

వి వి:— (1) పెద్ద జడివాన కార్చుచున్న మాన్పుటుల, సంసారతాపముల నీ తిరువేంగడము తీర్చును - అని భావము.

(2) పిరాట్టి ఎంబెరుమానులయొక్క వాత్సల్యమును గుణమును ఉద్బోధించునదగుటచే సర్వేశ్వరుని వాత్సల్యమును అభివర్ణించు ఈ తిరువాయ్‌మొழிని అనుసంధించువారలను రక్షించుభారము ఆమెపైనున్నది - అనిభావము.

(6-వ పది, 6-వ తిరు. 11-వ పాశురము)

(11) అవ:— తిరువేంగడ ముడయానులనుగూర్చి అనుగ్రహించిన దివ్యప్రబంధమునందలి ఈ తిరువాయ్‌మొழிని అభ్యసించినవారికి ఫలమును చెప్పుచున్నారు.

కట్టుఎழிల్ శోలై నల్ వేఙ్గడవాణనై,
కట్టుఎழிల్ తెన్ కురుగూర్ చ్చడగోపన్ శొల్,
కట్టుఎழிలాయిరత్తు ఇప్పత్తుమ్‌వల్లవర్,
కట్టుఎழிల్ వానవర్ భోగముణ్బారే. ౬ ౬—౧౧.

టీక:— కట్టుఎழிల్ = పూర్ణములై, ప్రకాశించుచున్నటువంటి, శోలై = ఉద్యానవనములతో నిండియుండు, నల్ = మంచి, (తనకును, తన భక్తులకును పరమభోగ్యమైయుండు) వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలమునకు, వాణనై = స్వామియైన వానిని గూర్చి, కట్టుఎழிల్ = జగత్తంతయు సర్వేశ్వరుని సొత్తుఅనిస్మరింపజేయును సౌందర్యముగల, తెన్ = సుందరమైన, కురుగూర్ = తిరునగరియందు వేంచేసియున్న, శఠగోపన్ = శ్రీనమ్మాళ్వార్లు, శొల్ = ప్రసాదించిన, ఆయిరత్తు = వెయ్యిపాశురములలో, కట్టుఎழிల్ = ఆదినుండిఅంతమువఱకు సుందరమైన, ఇప్పత్తుమ్ = ఈ పదిపాశురములను,

కల్లార్ = అభ్యసించువారలు, కట్టుచ్చెళిల్ = సంపూర్ణమై ప్రకాశించుచున్న, వానవర్ = నిత్యసూరులయొక్క, భోగమ్ = భోగములను, ఉణ్బార్ = అనుభవింతురు

తా॥ సర్వసమృద్ధములై, కన్నులపండువుగ ప్రకాశించుచున్న పూదోటలతో నిండియున్నదియు, తనకును తన భక్తులకును, పరమ భోగ్యమైయుండు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచున్న శ్రియఃపతినిగూర్చి భగవత్కైంకర్యలక్ష్మిచే శోభిల్లుచుండు రమణీయమైన తిరునగరి దివ్యక్షేత్రమున నెలకొనియుండు శ్రీ నమ్మాళ్వార్లు పాడించిన తిరువాయ్మొళి దివ్యప్రబంధమునందలి పరమరమ్యమైన ఈ పది పాశురములను అభ్యసించువారలు పరమపదమునకు విచ్చేసి నిత్యసూరులు అనుభవించు భోగములను అనుభవింపగలరు.

(6-వ పది, 9-వ తిరు, 5-వ పాశురము)

(5) అవ :- ముక్తులు ఏతెంచి, అనుభవించునట్టుల శ్రీవైకుంఠమున నే నుండవలదా ? దానిని వదలి, ఇతరస్థలములకు వచ్చుటకెట్లు సరిపడును ? అని భగవంతుడానతిచ్చినట్లు భావించి, అందులకు ప్రత్యుత్తరము నొసంగుచున్నారు.

విణ్మీదిరుప్పాయ్ మలైమేల్ నిఱ్పాయ్ కడల్ శేర్ప్పాయ్,
మణ్మిసైయుళల్ వాయ్ ఇవత్తుళెజ్గుమ్ మఱైన్దుఱై వాయ్,
ఎణ్మీదియన్ఱ పుఱవణ్డత్తాయ్ ఎనదావి,
ఉణ్మీదాడి ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో. ౬-౯-౫.

టీక :— విణ్మీదు ఇరుప్పాయ్ = శుద్ధసత్త్వమయమగు శ్రీ వైకుంఠలోకమున నాగపర్యంకముపై విజయముచేసియుండు ఓ స్వామీ ! మలైమేల్ నిఱ్పాయ్ = శీతల రమణీయమగు శ్రీ వేంకటాచలమున నిలచియుండువాడా ! కడల్ శేర్ప్పాయ్ = క్షీర సముద్రమున పవ్వళించియుండువాడా ! మణ్ మీసై ఉళల్ వాయ్ = (సకలమనుజ నయనవిషయగోచరుడవై రామకృష్ణాదిరూపములతో అవతరించి) భూమిపై తిరిగిన వాడా ! ఇవత్తుళ్ = (జంగమములై స్థావరములైయుండు) ఈ వస్తువులన్నిటియందును, ఎజ్గుమ్ = ఎల్ల ప్రదేశములయందును, మఱైన్దు = (ఎవరును నిన్ను) తెలిసికొనలేకుండు

నట్లు వ్యాపించియుండి, ఉఱైవాయ్ = నివసించువాడా! ఎన్ మీదు ఇయన్ఱ = నాకుపైనుండు, పుఱ అణ్డత్తాయ్ = ఈ అణ్డములకు వెలుపలనుండు బ్రహ్మాండముల యందును నివసించువాడా! ఎనదు ఆవియుళ్ = నా స్వరూపమునందును, మీదు = అధికముగ, ఆడి = వసించి, ఉరు = నీ సుందరతమమైన దివ్యమంగళవిగ్రహమున్ కాట్టాదే = ప్రదర్శింపక, ఒళిప్పాయో = దాచియుంచెదవా!

తా॥ నీవు శ్రీవైకుంఠమును వదలి, వేరు స్థలములకే వేంచేసి నది లేదా? పరమపదవాసులగు నిత్యసూరులును, భూలోకమున నున్న సంసారి చేతనులును సేవించుట కనువగునట్లు శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నావుగద! అందఱును నీ సౌందర్యమునుజూచి అనుభవించి ఆనందించునట్లు, శ్రీ చక్రవర్తి తిరుమగనారులుగను, శ్రీ వసుదేవ నందనులుగను భూమియందు అవతరించి, పాదచారివై తిరిగితివి గద! ఈ బ్రహ్మాండమునందలి సమస్తవస్తువులయందును, లోపలను వెలుపలను వ్యాపించియున్నవాడవై, అసంఖ్యాకములగు ఇతర బ్రహ్మాండముల యందును, అందుండు వస్తువులచే దెలిసికొనుట కశక్యుడవై, వానికి ధారకుడవై, ఆత్మస్వరూపుడవై యున్నావు గద! ఇంతమాత్రమేనా? నాస్వరూపమునందును నివసించుచున్నావు. ఇట్లు సమీపమున నీవు వేంచేసియున్నప్పటికిని నిన్ను నేను సేవింపలేకున్నాను. నా కండ్లకు కనుపడకుండునట్లు దాగి యున్నావు. ఇది నీకు తగునా?

(8-వ పది, — 2-వ తిరు, — 1-వ పాశురము)

(1) అవ:— అమ్మా! నీవు ఆశపడు నదేది? ఎందులకై నీకు దుఃఖముగల్గినది? సంకోచింపక మాతో చెప్పుము. మా సాధ్యమైన ప్రతిక్రియను వెంటనే తప్పక చేసెదము. మా మాట నమ్ముము. నీ హృదయతుల్యులమగు మావద్ద దాపరిక మేల?" అని చెలికత్తె లడుగగ శ్రీ శఠగోపనాయకి బదులు చెప్పుచున్నది.

*నజ్గళ్ వరివళై యాయజ్గాళో,
నమ్ముడై యేదలర్ మున్పునాణి,
నుజ్గట్కుయానొన్తురైక్కుమ్మాత్ఱమ్,
నోక్కుగిన్త్రేన్ ఎజ్గుమ్కాణమాట్టేన్,
శజ్గమ్శరిన్దన శాయిళన్దేన్,
తడముళై పొన్నిఅమాయ్ త్తళర్న్దేన్,
వెజ్గణ్ పఱవైయిన్ పాగన్ ఎజ్గోన్,
వేజ్గడవాణనై వేణ్డిచ్చెన్త్రే. 3—౨—౧.

టీక :— నజ్గళ్ = మాయొక్క, వరివళై = గీరలుగలిగియున్న గాజులనుధరించియున్న, ఓ ఆయజ్గాళ్ = ఓ చెలికత్తెలారా !, నమ్ముడై = మనయొక్క, ఏదలర్ మున్పు = శత్రువులయెదుట, నాణి = లజ్జపడి, నుజ్గట్కు = మీకు, ఉరైక్కుమ్ = చెప్పదగిన, మాత్ఱమ్ ఒన్ఱు = ఒకమాటను, యాన్ = నేను, నోక్కుగిన్త్రేన్ = యోచించుచున్నాను, ఎజ్గుమ్ = ఎవ్విధముగను, కాణమాట్టేన్ = చూడజాలకున్నాను, వెమ్కణ్ = క్రూరమైన దృష్టిగల నేత్రములను గలిగియుండు, పఱవైయిన్ పాగన్ = గరుడపక్షిని నడిపించునటువంటి, వేజ్గడవాణనై = శ్రీవేంకటాచలపతిని, వేణ్డి = ఆశపడి, శెన్తు = వెళ్ళి, (పొంది), శజ్గమ్ = గాజులు, శెరిన్దన = చేతులనుండి జారిపోయినవి, శాయ్ = దేహశోభను, ఇళన్దేన్ = పోగొట్టుకొంటిని, తడముళై = విశాలములైన స్తనములు, పొన్నిఅమాయ్ = వైవర్ణ్యమును పొందినవై, తళర్న్దేన్ = సొక్కిసోలిపోయితిని.

తా॥ నా ప్రాణసఖులారా! నేను పరితపించుచుండగ, వలయాద్యాభరణములధరించి, మిక్కిలి సంతోషముతో నుండు యువతులారా! నా నాయకునివద్దకు వెళ్ళుటకై బయలుదేరినను శత్రువుల వలె ఆపిన మీ ముందు సిగ్గుతో ప్రత్యుత్తరము చెప్పలేకయున్నాను. ఐనను, ఎట్టి మాటలతో మీకు బదులు చెప్పవలయునా-అని యోచించి చూచుచున్నాను. నా పరితాపభారముచే నట్టిమాటలు నాకు స్ఫురించుట లేదు. ఈ విషయమును నా నోటినుండి నేనే చెప్పవలయునా ? నా శరీరమును చూచిన మీకు తెలియుటలేదా ? ప్రతికూలురపై క్రూర

దృష్టిని ప్రసరింపజేయు గరుడునిపై నెక్కి వచ్చువాడును, అందఱును తనను వచ్చి సేవించునట్లు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండువాడును నగు నా స్వామిని ఒక క్షణమైనను విడచియుండజాలను. వాని చూడ లేనందున నాకు మిక్కుటమగు వ్యసనము గల్గుచున్నది. చేతులలోనుండు గాజులు జారిపోవుచున్నవి. నా దేహకాంతి తగ్గిపోయినది. నా స్తనముల శోభ సన్నగిల్లెను. నా శరీరముకూడ శిథిలమైపోయెను.

(9-వ పది, — 3 తిరు, — 8-వ పాశురము)

(8) అవ:— ఎంబెరుమానులను సేవించుటకు మీ మనస్సు శ్రీ వైకుంఠమునకు వెళ్ళవలయునా? అతడు మిక్కిలి సమీపమున శ్రీ వేంకటాచలమున వేంచేసి యుండలేదా? అనిన ప్రత్యుత్తర మొసగు చున్నారు.

ఇన్ఱిప్పోగ ఇరువినైయుమ్ కెడుత్తు
ఒన్ఱియాక్కై పుగామై ఉయ్యక్కొళ్వాన్,
నిన్ఱవేఙ్గడమ్ నీళ్ నిలత్తుళ్ళదు,
శెన్ఱుతేవర్‌గళ్ కైతొழுవార్‌గళే.

టీక:— ఇరువినైయుమ్ = పుణ్యము, పాపము అను రెండువిధములైన కర్మములను, ఇన్ఱిప్పోగ = లేకపోవుటకు, కెడుత్తు = నశింపజేసి, ఒన్ఱి = (ఇది వేరు ఆది వేరు-అని విభజించుటకు శక్యము గాకుండునట్లు) ఒకటియై, ఆక్కై పుగామై = మరల ఈ శరీరమున ప్రవేశింపకుండునట్లు, ఉయ్యక్కొళ్వాన్ = ఉజ్జీవింపజేయవలయును అని ఆశపడుచుండు సర్వేశ్వరుడు, నిన్ఱ = వేంచేసియున్నటువంటి దివ్య క్షేత్రమైన, వేఙ్గడమ్ = శ్రీ వేంకటాచలము, నీళ్ నిలత్తిల్ = శ్లాఘ్యమైన భూలోకమున, ఉళ్ళదు = ఉన్నది, శెన్ఱు = అచ్చటికి వెళ్ళి, కైతొழுవార్‌గళ్ = కైంకర్యముల చేయువారలు, దేవర్‌గళ్ = నిత్యసూరులు.

తా॥ తన నాశ్రయించిన వారలయొక్క పుణ్యపాపములను-రెండు విధములైన కర్మములును నిశ్శేషములై, మరల శరీరమునందు ప్రవేశించి, దేహము వేరు, ఆత్మ వేరు-అని ప్రత్యేకముగ విభజించుటకు శక్యము

కాకుండునట్లు, నువ్వులయందు నూనెవలెను, కట్టెలయందు నిప్పువలెను, అంతర్హితుడై యుండక, ఎల్లరును ఉజ్జీవింపవలెనని సర్వేశ్వరుడు ఆశపడి, ఎప్పుడు వారలు తనను ఆశ్రయించెదరు? అని ప్రతీక్షించుచుండెడు స్థలమైన శ్రీ వేంకటాచలమను నది శ్లాఘ్యమై ఈ భూమియందే యున్నది. ఆమాట నిజమే; కాని నాకు దానివలన నేమి ప్రయోజనము? అచ్చటికివెళ్ళి అతనికి కైంకర్యముచేయ దగినవారలు నిత్యసూరులుగద! అచ్చటికి నేను పోదగుదునా?

(10-వ పది, - 5-వ తిరు, - 6-వ పాశురము)

(6) అవ:— ఎంబెరుమానులను సేవించినగద వారి తిరువడి గళ్ళలో కైంకర్యము చేయగల్గుట? అనిన, ఆనతిచ్చుచున్నారు.

మేయాన్ వేఙ్గడమ్, కాయా మలర్ వణ్ణన్,
పేయార్ములై యుణ్ణ, వాయాన్ మాదవనే. 10-7-8

టీక:- కాయామలర్ వణ్ణన్ = నల్ల అగిసిపూవుల గుత్తితో సమానమైన దేహ కాంతి గలవాడును, మాదవన్ = శ్రీ మహాలక్ష్మీదేవికి నాథుడును, పేయార్ = పూతన యను రక్కసియొక్క, ములైయుణ్ణవాయాన్ = స్తన్యమును గ్రోలిన వదనారవిందము గలిగిన శ్రీ కృష్ణుడు, వేఙ్గడమ్ = శ్రీ వేంకటాచలమున, మేయాన్ = పరమ ప్రీతితో వేంచేసియున్నాడు.

తా॥ నల్ల అగిసిపూల గుత్తివలె నిగనిగలాడుచుండు పరమ రమణీయమైన శరీరముగలవాడును, సమస్తలోకములకు తల్లియగు శ్రీ మహాలక్ష్మీదేవికి ప్రాణనాథుడును, పూతనయను రక్కసియొక్క విష మిశ్రమైన స్తన్యమును గ్రోలినవాడును నగు శ్రీ కృష్ణుడే - శ్రీ వేంకటా చలమున నెల్లప్రాణులును తన దివ్యపాదారవిందముల నాశ్రయించి, తరింతురుగాక యను పరమౌదార్యముతో నందఱును తమ తమ కండ్లతో చూచి ఆనందింపదగినట్లు పరమసులభుడై వేంచేసియున్నాడు. కాబట్టి, అతని దివ్యపాదారవిందములలో మనసుదీర కైంకర్యములను చేయవచ్చును.

(10-వ పది — 7-వ తిరు — 8-వ పాశురము)

(8) అవ:— ఆళ్వార్లు తమకు గలిగిన మహాభాగ్యమును అభివర్ణించుచున్నారు.

*తిరుమాలిరుఞ్జోలై మలై యే తిరుప్పాఱ్కడలే ఎన్ తలై యే,
తిరుమాల్ వైగున్దమే తణ్ తిరువేఙ్గడమే ఎనదుడలే,
అరుమామాయత్తు ఎనదుయిరే మనమే వాక్కే కరుమమే,
ఒరుమానొడియుమ్ పిరియాన్ ఎన్ఊళిముదల్వనొరువనే. ౧౦-౭-౮.

టీక:— తిరుమాలిరుమ్ శోలైమలైయే = తిరుమాలిరుమ్ శోలైయను పర్వతశ్రేష్ఠమును, తిరుప్పాఱ్కడలే = శ్రీ క్షీరసముద్రమును, ఎన్ తలైయే = నాశిరస్సు (వీని నన్నింటిని), తిరుమాల్ = శ్రియఃపతి వేంచేసియుండెడు, వైగున్దమే = శ్రీవైకుంఠమే, తణ్ = చల్లనైన, తిరువేఙ్కడమే = శ్రీ వేంకటాచలమే, ఎనదు ఉడలే = నాశరీరమే, వీని నన్నింటిని, అరు = అమూల్యమైన, మా = విశాలమైన, మాయత్తు = ప్రకృతిని, ఎనదు ఉయిరే = నా ఆత్మస్వరూపమే, మనమే = నా మనస్సే, వాక్కే = నా పలుకే, కరుమమే = నా పనులే (వీని నన్నింటిని వదలి), ఒరుమానొడియుమ్ = ఒక్క త్రుటికాలమైనను, పిరియాన్ = ఎడబాయడు; ఎన్ ఊళిముదల్వాన్ = నాస్వామియై ఈ సృష్టికి కారణమైనవాడును, ఒరువన్ = అద్వితీయుడునై యుండువాడు.

తా॥ నన్ను పొందుటకై, అండముల సృజించు బ్రహ్మ మొదలగు వారలను సృజించిన సర్వేశ్వరుడు, తిరుమాలిరుమ్ శోలై దివ్యక్షేత్రమును, క్షీరసముద్రమును విడిచియుండనట్లు, నా తలనుగూడ ఒక క్షణముగూడ విడుచుటలేదు. తాను శ్రీ మహాలక్ష్మితో వేంచేసియుండు వైకుంఠమును, సంసారతాపముల నన్నింటిని పోగొట్టు పరమ రమణీయమైన శ్రీ వేంకటాచలమును విడువనట్లు నా శరీరమునుగూడ ఒక త్రుటికాలమైనను విడువకయున్నాడు. సర్వేశ్వరుని అనుగ్రహము లేకున్న త్యజించుటకు శక్యముగానట్టి విశాలమైన ప్రకృతిసాగరమున బడి కొట్టుకొనుచున్న నా ఆత్మస్వరూపమును, మనస్సును, వాక్కును, కర్మములను ఒక్క క్షణమైనను విడువకయున్నాడు. ఆహా! నాయందు అతనికి ఎంత ఆశయోగద! ఇట్టి సమృద్ధిని ఎచ్చటనైనను చూడగల్గుదుమా!

శ్రీ నమ్మాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

శ్రీ రస్తు

శ్రీమతే భట్టనాధాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ పెరియాళ్వార్లు ప్రసాదించిన తిరుమొళి దివ్యప్రబంధములోని

# మంగళాశాసన పాశురములు

## అవతరణిక

అవః— శ్రీ పెరియాళ్వారులు పాండ్యదేశమున శ్రీ విల్లిపుత్తూర్ (శ్రీ ధన్వినవ్యపురము) అను దివ్యదేశమున శ్రీమన్నారాయణుని రథాంశజులై, మిథునమాసమున స్వాతీనక్షత్రమున పురశ్చూడుల దివ్యవంశమున నవతరించిరి. "బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః" అనునట్లు బాల్యము నుండియు భగవదేకప్రవణులై, వాని కంతరంగకైంకర్యమగు పుష్పమాలాసమర్పణకైంకర్యమును నిర్వహించుచుండిరి. భగవన్నియమనమున పాండ్యరాజసదస్సునకు విచ్చేసి భగవదావిష్టులై, గురుముఖముగ నభ్యసింపకున్నను, శ్రుతిస్మృత్యాదుల నుపన్యసించి, పరతత్త్వమును నిర్ణయించి, విద్యాశుల్కమును గ్రహించి, విశేషముగ పాండ్యరాజుచే సత్కృతులై, ఏనుగుపై నెక్కి ఉత్సవముగ వేంచేయుచుండిరి. తన భక్తుని యీ వైభవమును చూచి సంతసించుటకై, శ్రీమన్నారాయణుడు, గరుడవాహనారూఢుడై, శ్రీ భూ నీళాది పరిజనములతో గూడుకొన్నవాడై, ఉత్సవము జరుగుచుండుచోటికి విచ్చేసెను. వారిని సేవించినంతనే, ఆళ్వార్లు, వారియందలి భక్తిప్రకర్షమున తన్మయులై, సర్వమును విస్మరించి, అట్టి అప్రాకృత దివ్యమంగళవస్తువీ భూమండలమునకు విచ్చేసినదే? ఏమి అవద్యము వాటిల్లునో, అని భయశంకితులై భగవంతుని రక్షకై మంగళాశాసనమును గావించిరి. అందుచేతనే వీరికి పెరియాళ్వారులని ప్రసిద్ధిగలిగినది.

ఈ యాళ్వార్లు, భగవంతునియందలి నిష్కపటమగు నిస్సీమ ప్రేమాతిశయము ఉత్కటము కాగా, శ్రీ యశోదాభావనా భావితులై, ఆమె, శ్రీ కృష్ణుని బాల్య క్రీడారసముల ననుభవించినట్లు, వీరును, అనుభవించి ధన్యులైరి.

( 1-పత్తు, – 5-వ తిరుమొళి )

అందు నీయైదవ తిరుమొళిలో శ్రీ కృష్ణునికి శైశవమతిక్రమించి బాల్యమారంభించినట్లు భావించి, ఆ భావనాప్రకర్షముచే ముగ్ధులై, ఆ ముద్దుబిడ్డడు నడవలో దోగాడుచు ఆడుకొనుచున్నట్లును, చందమామను పిలిచినట్లును, దానిని చూచి శ్రీ యశోదాదేవి అతనిని సంతోషపెట్టుటకై చందమామను రమ్మని పిలచిన ప్రకారముల ఆళ్వారులు తామును భావనాప్రకర్షముచే ననుభవించుచు, ఆ యనుభవప్రకారముల నభివర్ణించుచు ఆనందించుచున్నారు.

అందు ౧ పత్తు, ౫ తిరుమొళి, 3 పాశురమున తిరువేంగడ ముడైయాన్లను కీర్తించియున్నారు.

(3) అవ:– ఆశ్చర్యగుణచేష్టితుడును, శ్రీ వేంకటాచలమున నిత్యనివాసము చేయుచున్నవాడునునైన మా చిన్నికృష్ణుడు, నిన్ను తన చిన్ని చేతుల నాడించుచు పిలుచుచున్నాడు. అతనిచేతులు నొవ్వకముందే ఓ చందమామా! నీవు సత్వరమే రావే-అని ఆళ్వారులు చందమామను పిలుచుచున్నారు.

శుడ్రుమ్ ఒళివట్టమ్ శూழ్న్దు శోది పరన్దు ఎజ్ఞుమ్,
ఎత్తనై శెయ్యినుమ్ ఎన్మగన్ ముగమ్నేరొవ్వాయ్,
విత్తగన్ వేజ్గడ వాణన్ ఉన్నై విళిక్కిన్ఱ,
కైత్తలమ్ నోవామే అమ్బులీ! కడిదోడివా. ౧–౫–3

టీక:— ఒళి = ప్రకాశముగల, వట్టమ్ = మండలమైనది, శుఱ్ఱుమ్ = నలు ప్రక్కలను, శూழ్న్దు = క్రమ్మకొనినదై, ఎఙ్గుమ్ = అన్నిదిక్కులయందును, శోది = తేజస్సుచే, పరన్దు = వ్యాపించి, ఎత్తనై శెయ్యిలుమ్ = ఎంతచేసినను, ఎన్ మగన్ = నా కుమారుని, ముగమ్ = సుందరమైన ముఖమునకు, నేరొవ్వాయ్ = ఏవిధమునను ఈడు గాజాలవు, విత్తగన్ = ఆశ్చర్యగుణచేష్టితుడును, వేఙ్గడవాణన్ = శ్రీ వేంకటాచలమున నివసించువాడును, ఉన్నై = నిన్ను, విళిక్కిన్ఱ = పిలుచుచున్న, కైత్తలమ్ = శ్రీ హస్తతలము, నోవామే = నొవ్వకుండునట్లు, అమ్బులీ = ఓ చంద్రుడా! కడిదు = శీఘ్రముగ, ఓడివా = పరుగెత్తి రమ్ము.

తా॥ ఓ చంద్రుడా! మిక్కిలిప్రకాశముగల నీబింబము అక్షయమై, నలుప్రక్కలును నిండినదై, అకలంకమై, అన్నిచోట్లను తేజస్సుచే వ్యాప్తమై, ఎన్ని యుపాయముల చేసినను, నా కుమారుని ముద్దు మోమునకు దీటు గాజాలదు. సౌందర్యగుణచేష్టితములచే విస్మయ నీయుడై, దుర్మానులైన నీబోటివారల ననాదరించి దివ్యమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు నా ముద్దుబిడ్డడే తనదు చిన్నిచేతుల పైకెత్తి, నిన్ను పిలుచుచున్నాడు. అతని చేతులు నొవ్వకుండునట్లు వేవేగ బయలుదేరి రమ్ము.

( 1-వ పడి, 9-వ తిరుమొழி, 8-వ పాట్టు )

(8) అవ:— అభిషేకసమయమునందలి సౌందర్యము ప్రకాశింపగ వేంచేయవలయును - అని ప్రార్థించుచున్నారు.

ఎన్నిదు మాయమ్ ఎన్నప్పన్ అఱిన్దిలన్,
మున్నైయ వణ్ణమే కొణ్డు అళవాయెన్న,
మున్ను నముశియై వానిల్ శుழற్றియ,
మిన్నుముడియనే! అచ్చో వచ్చో
వేఙ్గడవాణనే! అచ్చోవచ్చో. ౧—౯—౮.

టీక :— (సర్వేశ్వరుడు తన శ్రీహస్తమున మహాబలిదానోదకము పడినంతనే శ్రీపాదములను పెంచి, ముల్లోకములను గొలువ నారంభించిరి. దానిని చూచి,) ఎన్ = ఇదియేమి, మాయమ్ = ఆశ్చర్యకరమగుపని ; ఇదు = దీనిని, ఎన్ = నాయొక్క, అప్పన్ = తండ్రియగువాడు, అఱిన్దిలన్ = తెలిసికొనలేదు, (కాబట్టి,) మున్నైయ = ముందున్నట్టి, వణ్ణమేకొణ్డు = మూర్తినే స్వీకరించి, అళవాయెన్న = కొలువవలయును అనిచెప్ప, మన్నుమ్ = తాను పట్టినపట్టు వదలకయున్నట్టి, నముశియై = నముచిని, వానిల్ = ఆకాశమున, శుழற்றియ=గిరగిరత్రిప్పివిడచిపెట్టిన, మిన్నుమ్=ప్రకాశించు చున్నట్టి, ముడియనే = తిరువభిషేకముగలవాడా ! అచ్చో అచ్చో = శీఘ్రమేపరుగెత్తి వచ్చి, నన్ను కౌగిలించుకొనుము ; వేఙ్గడవాణనే = శ్రీవేంకటాచలమునకు అధిపతివై యుండు స్వామీ ! అచ్చో అచ్చో = శీఘ్రమేపరుగిడివచ్చి నన్ను కౌగిలించుకొనుము.

తా॥ శ్రీవామనావతారుడగు సర్వేశ్వరుడు తన హస్తమున బలి చక్రవర్తిదానోదకము పడగనే, తన తిరుమేనిని, తిరువడిగళ్ళను భూమ్యా కాశములవరకు పెంచి, తానడిగినట్లు మూడడుగులను కొలువ నారంభిం చెను. దీనిని చూచి సహింపలేనివాడై, మహాబలిపుత్రుడగు నముచి, పరుగెత్తుకొనివచ్చి, "ఇదియేమి అన్యాయము ?" అని సర్వేశ్వరుని తిరువడిగళ్ళను పట్టుకొనెను ; అంత సర్వేశ్వరుడు, "నీ వెందులకై అడ్డగిం చెదవు ; నీ తండ్రి దానమిచ్చినట్లు మూడడుగులను నేను కొలుచుకొన వలదా ?" అని ప్రశ్నించెను. అందులకు నముచి, "నీవు చేయునది వంచనగద ! ఋజుప్రకృతియగు నా తండ్రి నీ మోసమును గుర్తెఱుంగలేక దానమిచ్చెను. ఈవంచనను వదలి నీవు దానముస్వీకరించునప్పుడున్న రూపమునే స్వీకరించి, నీవు యథేష్టముగ కొలుచుకొనుము." అని పట్టు పట్టెను. ఎన్ని విధములుగ చెప్పినను, తన హఠవాదమును వదలక, సర్వే శ్వరుని తిరువుళ్ళమును తెలిసికొనజాలక, శ్రీవారి శ్రీపాదస్పర్శముచే సకల జీవరాసుల సంరక్షించు మహాకార్యమును అడ్డుకొని, మహాపచార మొనరించెను. ఆ అసహ్యాపచారమును సహింపజాలక, సర్వేశ్వరుడతనిని గగనతలమున గిరగిరత్రిప్పి క్రిందపడవైచెను. అందుచే భగవంతుని సర్వ శేషిత్వ సామ్రాజ్యమునందలి పట్టాభిషేకము ప్రకాశించెను. అట్టి ఆశ్రిత

వాత్సల్యమును ఖ్యాపనముచేయుచు శ్రీవేంకటాచలమున వేంచేసియున్న సర్వేశ్వరుని శీఘ్రముమేవచ్చి తనను కౌగిలించుకొమ్మని, శ్రీయశోదపిరాట్టిగ తనను భావించి ఆళ్వార్లు ప్రార్థించుచున్నారు.

వి. వి :— (1) "అచ్చో ఆచ్చో" అను దానికి కౌగిలించుకొనుము - అని అర్థము. ఆదరాతిశయమును ద్విరుక్తి సూచించుచున్నది.

(2) వాని కౌగిలించుకొన నపేక్షించుటయు, ఆయాశ్లేష సౌఖ్యము ననుభవించుటయును శ్రీయశోదాదేవికిని వీరికినుండు సామ్యము.

(2-వ పది, 6-వ తిరుమొழி, 9-వ పాశురము)

(9) అవ :— శ్రీయశోదపిరాట్టి శ్రీకృష్ణునకు వేడుకలజూపించి, తలనుదువ్వి పూల ముడుచుటకై ప్రయత్నించెను. అప్పుడు శ్రీకృష్ణుడు "పశువులను తోలుకొనివెళ్ళుటకు ఒక చిన్నకఱ్ఱను సంపాదించి యిచ్చిన గాని నేను పూలుముడుచుకొనను" అని మారాముపెట్టెను. అతనిని బుజ్జగించుటకై "ఓ కాకీ! మా చిన్నికృష్ణమ్మకు ఒక మంచి బచ్చెన కఱ్ఱను తెచ్చియిమ్మ" అని పలువిధములుగ చెప్పుచు, అతనిని సంతోషింపజేసి పూలుముడిచెను. ఆ విధముల నన్నింటిని శ్రీపెరియాళ్వార్లు భావించుచు, ఆయశోదపిరాట్టివలె తామును, అతనిని బుజ్జగించుచు, ఆమె యనుభవించిన శ్రీకృష్ణుని బాల్యక్రీడారసమును అనుభవించుచున్నారు.

తెన్నిలజ్జై మన్నన్ శిరమ్ తోళ్ తుణిశెయ్దు,
మిన్నిలజ్గుపూణ్ విబీడణ నమ్బిక్కు,
ఎన్నిలజ్గు నామత్తళవుమ్ అరశెన్ఱ,
మిన్నలజ్గారఱ్కు ఓర్ కోల్ కొణ్డువా
వేజ్గడవాణఱ్కు ఓర్ కోల్ కొణ్డువా. ౨—౬—౯.

టీక :— అక్కా-అక్కాయ్ = ఓ మంచి కాకాయీ! తెన్నిలజై = గిరిదుర్గము, జలదుర్గము, వనదుర్గము - అను మూడు విధములగు దుర్గములచే చుట్టుబడినదై, సూర్య రశ్మియు చొరకుండునట్టి మహావైభవోపేతమగు లంకాపట్టమునకు, మన్నన్ = అధిపతి యైన రావణునియొక్క, శిరమ్ = పదితలలను, తోళ్ = ఇరువదిభుజములను, తుణి శెయ్దు = ఛేదించి, మిన్నిలఙ్గు = ప్రకాశించుచున్నటువంటి, పూణ్ = ఆభరణములను ధరించినవాడై, నమ్బి = పరిపూర్ణమనోరథుడైన, విభీషణనుక్కు = శ్రీవిభీషణాళ్వానులకు ఇలఙ్గు = ఉజ్వలమైయున్న, ఎన్నామత్తళవుమ్ = నాపేరు ఈ లోకమున ఉన్నంత వఱకును, అరశు = నీవు రాజ్యమును పరిపాలింతువుగాక!, ఎన్ను = అని అనుగ్రహించిన, మిన్ ఇలఙ్గు = మెఱపుతీగవలె దేదీవ్యమానమైయున్న, ఆరమెక్కు = నవరత్నహారములు ధరించిన నాముద్దుబిడ్డనికి, ఓర్ కోల్ కొణ్డువా = ఒక మంచి బచ్చెకట్టను తీసికొనిరా! వేఙ్గడమ్ వాణర్క్కు = శ్రీవేంకటాచలమునకు స్వామియైన నాముద్దుపట్టికి, ఓర్ కోల్ కొణ్డువా = ఒక అందమైన చిన్నికట్టను తీసికొనిరా!

తా॥ ఓ మంచి కాకాయీ! నీవు వెంటనే పరుగెత్తివెళ్ళి మా చిన్నికృష్ణున్నకు ముద్దుగనుండు ఒక చిన్నికట్టను తీసికొనిరా! దుర్గత్రయ ముచే చుట్టబడి దుర్ధర్షమై యుండు లంకాపట్టణమునకు అధిపతియై, దుర్జయుడై, లోకకంటకుడై యుండిన రావణాసురుని పదితలలను, ఇరువది బాహువులను ఛేదించి, ఉజ్జ్వలములై యున్న ఆభరణములధరించి పూర్ణమనోరథులై యున్న శ్రీవిభీషణాళ్వానులను, “నా పేరు ఈ లోక ములందుండువరకును నీవు సుఖముగరాజ్యముచేయుదువు గాక” అని ఆశీర్వదించి, అతనికి రాజ్యమొసంగి, అతనిచే సమర్పింపబడిన నవరత్న హారమును ధరించి, దేదీప్యమానుడై యున్న నా ముద్దుపట్టికి ఒక చిన్ని కట్టను తీసికొనిరా! శ్రీవేంకటాచలమున వేంచేసియున్న నా స్వామికి ఒక మంచి చక్కని చేతికట్టను, ఏరి కోరి తీసికొనిరా!

వి. వి :— దుష్టులనిరసించి, శిష్టులగాపాడునట్టి మా కణ్ణపిరాన్లకు, అందమైన యొక కట్టను తీసికొనిరా అట్లు తీసికొనిరాసిచో, నిన్ను గూడవందించును — అని అన్తరార్థము.

(2-వ పది, 7-వ తిరుమొழி, 3-వ పాశురము)

(3) అవ :— శ్రీయశోదాదేవి శ్రీకృష్ణుని పద్మపుమాన్పి, మల్లె, ముల్ల — మొదలగు మంచిమంచి సుగంధములు, రమ్యములునగు పుష్పములను తెచ్చి మాలగగట్టి నీ కురులలో ముడిచెదను — అని పుష్పములన్నీ వేరు వేరుగ నభివర్ణించుచు, అతని ననువర్తించి, శ్రీకృష్ణునకు పూలనలంకరించెను. అట్టి ప్రకారమును తద్భావభావితులై శ్రీ ఆழ్వార్లు అనుసంధించుచున్నారు.

మచ్చొడు మాళిగై యేఱి మాదర్గళ్ తమ్మిడమ్ పుక్కు—
క్కచ్చొడు పట్టైక్కిழిత్తు కామ్బు తుగిలవై కీఱి,
నిచ్చలుమ్ తీమైగళ్ శెయ్వాయ్ నీళ్ తిరువేఙ్గడత్తు ఎన్దాయ్,
పచ్చైత్తమనగత్తోడు పాదిరి ప్పూచ్చూట్టవారాయ్. —2—7—3.

టీక :— మచ్చొడు = ఇండ్ల మధ్యప్రదేశములను, మాళిగై = మేడమిద్దెలను, ఏఱి = ఎక్కి, మాదర్గళ్ తమ్మిడమ్ = గొల్ల పడుచులుండుచోట్లకు, పుక్కు = ప్రవేశించి, కచ్చొడు = వారి రవికెలను, పట్టై = ఆ రవికెలపై ధరింపబడు పట్టులను, కిழిత్తు = చించి వైచుటమాత్రమే గాక, కామ్బుతుగిలవై = అమూల్యములై మంచిమంచి అంచులతో కూడుకొనియుండు చీరలను కూడ, కీఱి = చించివైచి, నిచ్చలుమ్ = ఎల్లప్పుడును, తీమైగళ్ = చెడుగులను, శెయ్వాయ్ = చేయువాడవై, నీళ్ = పరమాకాశ మువరకు వ్యాపించి మహోన్నతమైయున్న, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్న, ఎన్దాయ్ = నా స్వామియైనవాడా! పచ్చై = పచ్చనివర్ణముగలదై, దివ్యపరిమళములతో గూడుకొనియుండు, దమనకత్తోడు = దవనముతోగూడిన, పాదిరిప్పూ = పాదిరిపుష్పమును శూట్ట = ముడచుకొనుటకు, వారాయ్ = దయచేయుమా !.

తా॥ ఓ చిన్నికృష్ణా! నీవు మితిమించిన చిలిపిచేష్టలుచేయుచున్నావు. నీవు ఊరిలోనివారి యిండ్లమధ్యప్రదేశములకువెళ్లి, పైమిద్దెలపై కెక్కి, గొల్లపడుచులుండు అంతఃపురములకువెళ్ళి, వారి రవికలను, రవికలపై శృంగారమునకై ధరించు సరిగపట్టలను, చించివైచుటతో తృప్తినొందక మంచిమంచి అంచులతో గూడి అమూల్యములగువారి చీరలను

స్సైతము చించివైచి, వారలను పరిహసించుచు, ఏడ్పించుచు, ఎప్పుడు చూచినను చెడుగులనే చేయుచున్నావు — అని ఈ ఊరిలోనివారందఱును వచ్చి పితురులు చెప్పుచున్నారు. నీవు ఆ వైపున కేవెళ్ళకుము. మహోన్నతములగు దివ్యశిఖరములతో గూడి విరాజిల్లు శ్రీవేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! వేగ దయచేసిరమ్ము; నీకు మంచి సువాసన గలిగి పచ్చగానుండు దమనకముతో గూడ పాదిరిపుష్పములను సమర్పించెదను. నా యందు దయయుంచి వెంటనేరమ్ము.

వి. వి :— మచ్చు - మధ్యప్రదేశము, మాళిగై - పై ప్రదేశము, కచ్చు - రవిక 'కంచుక' మను సంస్కృతపదభవమైయుండును. పట్టు - పట్టుపావడ, కామ్బుతుగిల్ - అంచులతో నలరారు చీర. నిచ్చల్ - 'నిత్య' మను సంస్కృతపదమునకు వికృతి. దమనకమ్ - దమనమునకు సంస్కృతపదము

(2-వ పది, 9-వ తిరుమొழி, 6-వ పాశురము)

(6) అవ :— గోపికలు కొందఱువచ్చి "మీ పిల్లవాడు మా యింట మితిమీరిన తుంటరిపనులచేయుచున్నాడు. నీవు వానిని పిలుచుకొని వెళ్ళుము, అమ్మా" అని శ్రీయశోదాదేవివద్దకు వచ్చి పిర్యాదు చేయగా, ఆమె తన ముద్దుకృష్ణుని పిలచుచున్నట్లు, శ్రీ ఆళ్వార్లు తద్భావితులై పిలుచుచున్నారు.

పోదర్ కణ్డాయ్ ఇజ్గేపోదర్ కణ్డాయ్,
పోదరేనెన్నాదేపోదర్ కణ్డాయ్,
ఏదేనుమ్ శొల్లి అశలగత్తార్,
ఏదేనుమ్ పేశనాన్ కేట్కమాట్టేన్,
కోదుకులముడై కుట్టనేయో,
కున్రెడుత్తాయ్ కుడమాడు కూత్తా,
వేదప్పొరుళే ఎన్ వేజ్గడవా,
విత్తగనే ఇజ్గేపోదరాయే. —వి—గ—ా.

టీక :— కోతుకులముడై = అందరును శ్లాఘింపదగిన మహిమగల, కుట్టనే = ముద్దుకృష్ణా ! (గోవులను, గోపాలురను రక్షించుటకై) కన్ఱు = గోవర్ధనపర్వతమును, ఎడుత్తాయ్ = గొడుగువలె ఎత్తినవాడా ! కుడమాడు = కుంభనృత్యమొనర్చిన, కూత్తా = నర్తకశిఖామణీ ! వేదప్పొరుళే = నిఖిల వేదములకును పరమార్థమైనవాడా ! ఉభయ విభూతియందున్న వారలకును సేవసాధింపుచు వారల గాపాడుటకై శ్రీవేంకటాచలమున నెలకొనియున్నవాడా ! విత్తగనే = ఆశ్చర్యకర దివ్యమంగళగుణవిభూతి విగ్రహచేష్టితుడా ! ఇఙ్గే = ఇచ్చటికి (నావద్దకు) పోదరాక్కణ్డాయ్ పోదరాక్కణ్డాయ్ = శీఘ్రముగ పరుగెత్తిరమ్ము, పరుగెత్తిరమ్ము, పోదరేన్ ఎన్నాదే = "నేనురానుపో" అని అనక, పోదరాక్కణ్డాయ్ = వెంటనే దయచేయుమా ! (నన్నిట్లు నిర్బంధించి పిలచుట ఎందులకమ్మా ! అని అందువేని) అశలగత్తార్ = పొరుగింటివారలు, ఏదేనుమ్ = నీ విషయమై ఏవైన తప్పులను, శొల్ల = వారలలో వారు చెప్పుకొనుచు, ఏదేనుమ్ = నా చెవులతో వినజాలని దోషములను, పేశ = చెప్పినచో; నాన్ = నేను, కేట్కమాట్టేన్ = విని సహింపజాలను, (అందుచే) ఇఙ్గేపోదరాయ్ = వారిని దగ్గరకు రాక, నావద్దకు రమ్ము.

తా॥ ఓ నా చిట్టితండ్రీ ! నీ వెచ్చటికిని పోవలదు. కాలము మంచిది కాదు. పోగూడనిచోట్లకు వెళ్ళిన వినగూడని అపవాదములు వచ్చును. పరమ శ్లాఘనీయమగు మహావైభవము గలవాడా ! గోవర్ధనపర్వతమునెత్తి గోగోపకులముల సంరక్షించిన నా చిన్నితండ్రీ ! కుంభనృత్యమొనరించిన మహానటశిఖామణీ ! నాదు వేంకటాచలస్వామీ ! అత్యాశ్చర్యకరములగు దివ్యకల్యాణగుణ విగ్రహవిభూతులను గలవాడా ! వేవేగ ఇచ్చటికిరమ్ము ! దయచేసి ఇచ్చటికిరమ్ము. 'నేను రాను పో' అని అడ్డుచెప్పక నా మాట విని వెంటనేరమ్ము, నాదుతండ్రివి గదా ! పొరుగింటివారలువచ్చి నిన్ను గూర్చి అనరాని వినరాని చాడీలుచెప్పిన, నేనువిని సహింపజాలను. కాబట్టి వెంటనేరమ్ము ! నా చిట్టితండ్రీ !.

వి వి:— (1) కోతుకులముడైయ - అంటె కుతూహలమునకును ఆస్పదమై, అందరును నపేక్షింపదగిన ఉత్కర్షముగలది - అని అర్థము.

(2) కుడమాడుకూత్త-కుంభనర్తనము. గొల్లలకు సంపదమితమైనచో, వారు ఆ యానందపారవశ్యమున, తలపై కడవలను వరుసగనుంచుకొని, రెండు భుజములపై రెండు కడవలను, రెండు చేతులలో రెండు కడవలను, ఆకాశమునకు నెగురవైచుచు ఆడుదురు. దీనికే కుంభనర్తనమని పేరు.

(3-వ పది, 3-వ తిరుమొழி, 4-వ పాశురము)

( ) అవ :— శ్రీకృష్ణుడు అడవికి వెళ్ళి పశువులను మేపుకొనివచ్చి తిరిగి యింటికివచ్చి నప్పుడు అలసటచే వాడియుండు అతని కోమల శరీరమును చూచి తాళజాలక శ్రీయశోదాదేవి శ్రమపడినట్లు, ఆళ్వార్లు తాము తద్భావభావితులై, ప్రశిథిలాన్తఃకరణులై ఆనతిచ్చుచున్నారు.

కడియార్ పొழிలణి వేఙ్గడవా కరుప్పోరేఱే, నీయుగక్కుమ్
కుడైయుమ్ శెరుప్పుమ్ కుழలుమ్ తరువిక్క క్కొళ్ళాదే పోనాయ్మాలే
కడియవెఙ్గానిడై క్కన్ఱిన్పిన్ బోల శిఱుక్కుట్టచ్చెఙ్గమల,
అడియుమ్ వెదుమ్బి ఉన్ కణ్గళ్ శివన్దాయ్ అశైన్దిట్టాయ్ నీయెమ్బిరాన్.

టీక :— కడిఆర్ = పరిమళభరితములగు, పొழிల్ = దివ్యోద్యానములచే పరివృతమై, అణి = మనోజ్ఞమైయుండు, వేఙ్గడవా = శ్రీవేంకటాచలమున నిత్యవాసము చేయుచుండువాడా! కరు = నల్లనివర్ణముకలిగి, పోర్ = బలిసియుండి, ఏఱే = తన ఇష్టమువచ్చినట్లు తిరుగుచుండు వృషభమువలె సంచరించువాడా! నీ ఉగక్కుమ్ = నీవు ప్రీతి చేయునట్టి, కుడైయుమ్ = ఎండవానలనుండి కాపాడు గొడుగును శెరుప్పు = ముళ్లు మొదలగునవి గుచ్చుకొననీయక సంరక్షించు పాదరక్షలను, కుழలుమ్ = దూడలు పశువులును మేయురమనట్లు ఊదుటకు పిల్లనగ్రోలిని, తరువిక్క = తెప్పించియుంచియుండగ, కొళ్ళాదే = వానిని స్వీకరింపక, మాల్ = దూడలను మేపుటయందలిఆశచే, పోనాయ్ = దూడలవెంట అడవికిపోయినవాడా! కడియవెమ్ = మిక్కిలిగహనమై తీక్ష్ణమై, కానిడై = కాననమున, కన్ఱిన్ పిన్ = దూడలువెళ్ళిన అన్నిచోటులకును, పోన = వెంబడించి వెళ్ళిన, శిఱుక్కుట్టన్ = చిన్నిబాలుడవగు నీయొక్క, శెఙ్గమలమ్ = ఎఱ్ఱదామరవంటి, అడియుమ్ = తిరువడిగళ్లును, వెతుమ్బి = బొబ్బలుపోయి, ఉన్ = నీయొక్క, కణ్గళ్ = దివ్యనేత్రములును, శివన్దాయ్ = ఎఱ్ఱబాఱి, అశైన్దిట్టాయ్ = సొలసిపోయితివి, నీ = నీవు, ఎమ్బిరాన్ = నాముద్దుపట్టివిగదా!

తా॥ నా ముద్దులతండ్రీ! పరిమళభరితము లగు దివ్యోద్యానములచే పరివృతమై, మనోజ్ఞమగు శ్రీవేంకటాచలమున నిత్యవాసము చేయుచుండువాడా! నల్లనివర్ణముగలిగి మిక్కిలి బలసియుండి యథేచ్ఛవిహారియగు

వృషభమువలె సంచరించువాడా! నీవు ఆశపడునట్టి మంచి గొడుగును, చెప్పులను, పిల్లనగ్రోవిని తెప్పించి యుంచితిని. వానిని స్వీకరింపకయే దూడలమేపుట యందలి వ్యామోహముచే, వానిని వెన్నంటి గహన కాననములకు జనుదెంచితివి. ఆ కారడవిలో దూడలతో గూడ తిరిగినందున నీకమనీయ కోమల దివ్యవదనారవిన్దము వాడిపోయినది. పాదారవిన్దములు కందిపోయినవి. దివ్యనేత్రాంబుజములు ఎఱ్ఱబాఱినవి. చాల అలసి పోయితివి. అయ్యో! దీనిని చూచి నేనెట్లు సహింపజాలుదును.

వి. వి:— శెంగమలవడి - అనుటచే తిరువడిగళ్ళ ప్రాశస్త్యము చెప్పబడు చున్నది

(5-వ పది, 4-వ తిరుమొழி, 1-వ పాశురము)

(1) అవ :— సర్వేశ్వరుడు పర, వ్యూహ, విభవ, అన్తర్యామి, అర్చావతారములుగ వేంచేసియుండుట—చేతనులను సన్మార్గమున ప్రవర్తింప చేయుటకును, సన్మార్గవర్తనుల స్వీకరించి వారలవలన కైంకర్యముల పొందుటకునునై యున్నది అందుచే శ్రియఃపతి శ్రీపెరియాழ்వార్లను కటాక్షించి, వారిపై వ్యాముగ్ధుడై యనుభవించుటయను ఎరువునువైచి, ఆచార్యోపదేశమను నీరును ప్రవహింపజేసి, సత్సంగమను విత్తులనాటి, ఆழ்వార్ల హృదయమను దివ్యక్షేత్రమున, పరభక్తి, పరజ్ఞాన, పరమ భక్తులను సస్యముల నభివృద్ధమొనరించెను. అంత, పరమవిలక్షణులై యుండు వీరలజూచి, వీరలయందు నిరవధికప్రేమముగలవాడగుటచే వీరి కే యవద్యములు వాటిల్లునోయని, సర్వేశ్వరుడు సంభ్రమపడెను. ఆ సంభ్రమమును ఆழ்వారులుచూచి, "ఏల మీకిట్టి సంభ్రమము? దాసునకు కావలసిన వానినన్నిటిని అనుగ్రహించితిరే! నాకిక ఏమియును కొదువలేదు" అని తిరువేంగడముడైయాన్లతో మనవిచేయుచున్నారు.

శెన్ని యోங்గు తణ్ తిరువేఙ్గడముడైయాయ్ ఉలగు,
తన్నై వాழ்విన్ఱనమ్బీ దామోదరా శదిరా,
ఎన్నైయుమ్ ఎన్నుడై మెయ్యైయుమ్
ఉన్ శక్కరప్పొఱియొన్ఱిక్కొణ్డు,
నిన్నరుళే పురిన్దిరున్దేన్ ఇనియెన్ తిరుక్కుఱిప్పే. ౫–౪–౧

టీక :— ఓఙ్గు = ఆకాశమునంటునట్లు పెరిగి మహోన్నతములైయుండు, శెన్ని = శిఖరములను, తణ్ = సంసారతాపతప్తుల ఆర్తిని శమింపజేయునట్లు సుభగశీతలమైన, తిరువేంగడమ్ = శ్రీవేంకటాచలమును, ఉడైయాయ్ = నిత్యవాసస్థానముగ జేసికొనిన వాడవై, ఉలగుతన్నై = లోకములను, వాழ்విన్ఱ = ఉజ్జీవింపజేయుచున్న, నమ్బీ = నిఖిలకల్యాణగుణగణపరిపూర్ణుడవై యుండు స్వామీ!, దామోదరా = శ్రీయశోదాదేవిచే కట్టబడినవాడవై, శదిరా = ఆశ్రితులబంధముల జూచి సంహింపజాలని పరమదయా రసమునుగలవాడా! ఎన్నైయుమ్ = నన్నును, ఎన్ ఉడై మెయ్యైయుమ్ = నా సంబంధమైన శరీరమును, ఉన్ = దేవరవారియొక్క, శక్కరప్పొఱి = శ్రీ సుదర్శనచక్రాగ్నిచే, ఒన్ఱిక్కొణ్డు = అంకితము చేసికొని, నిన్ = దేవరవారియొక్క, అరుళే = కృపనే, పురిన్దిరున్దేన్ = ఆశపడియున్నాను. ఇని = ఇట్లైనపిదపగూడ, తిరుక్కుఱిప్పు = దేవరవారి తిరువుళ్ళమునకు ఆయాసము, ఎన్ = ఎందులకు? దానిని ప్రసాదింపవలయును.

తా॥ ఆకసమునంటి మహోన్నతములై యుండు శిఖరములచే శోభాయమానమై సుభగశీతలరమణీయమైయుండు శ్రీవేంకటాచలమున నిత్యవాసము చేయుచున్నవాడవై నిఖిలలోకములను గాపాడుచున్న నిత్య కల్యాణగుణగణపరిపూర్ణా! నీ సౌలభ్యమును ప్రకటించుటకై గొల్లభామ యగు శ్రీయశోదాదేవిచే త్రాటిచే రోటికి గట్టబతివి. పరంధామా! ఆశ్రితుల కష్టమునుజూచి సహింపజాలని పరమదయామయా! నన్నును నాశరీరమును, నీదు దివ్యాయుధమగు శ్రీసుదర్శనచక్రముచే తప్తాంకనమును జేసికొని, దేవరవారి దివ్యకృపనే గోరుచు నుజ్జీవించియున్నాను.

ఇట్లైనపిదపగూడ దేవరవారి తిరువుళ్ళమునకు దాసునిగుఱించిన ఆ యాస మెందులకు? ఎందులకై మీరింత సంభ్రమము పడుచున్నారో, దాని కారణమును కొంచెము సెలవియ్యగలందులకై ప్రార్థించుచున్నాను.

వి. వి:—(1) శెన్నియోఙ్గు - ఉదయగిరిలో సూర్యుడుదయించినచో నందఱికిని ప్రకాశించునటుల, తిరువేంగడపర్వతశిఖరముననున్నచో, ఉభయవిభూతులయందును ప్రకాశించును - అని భావము

(2) తణ్ - రక్షకునికి రక్ష్యముబొందని తాపము, రక్ష్యమునకు రక్షకునిబొందని తాపము తీర్చునది.

(3) నమ్బి - వాత్సల్యము - స్వామిత్వము — సౌశీల్యము — సౌలభ్యములు... మొదలగు కల్యాణగుణపూర్తిని దెలుపుచున్నది.

(4) శదిర్ - ఆశ్రితులదోషముల జూడని చాతుర్యము.

(5) ఆత్మకు చక్రాంకనమునుజేయుట యనగా — అనన్యార్హ శేషత్వజ్ఞానము గలుగుట. దానిని ప్రకాశింపజేయుటకై బాహ్యముగ భుజములపై చక్రాంకనముచేసికొనుట.

(6) ఇరున్దేన్ — ఉపాయాన్తర — ఉపేయాన్తరముల నివృత్తి, విరోధి నివృత్తిగలిగి, అపేక్షితము సిద్ధించెనని, ఇక ఆవేగపడుట ఎందులకు? అని పరమ తాత్పర్యము.

శ్రీ పెరియాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము

---

శ్రీరస్తు

శ్రీమత్యై గోదాదేవ్యై నమః

# శ్రీ ఆండాళ్ ప్రసాదించిన నాచ్చియార్ తిరుమొళి

# మంగళాశాసన పాశురములు

(8-వ తిరుమొళి – విణ్ణీలమేలాప్పు)

## అవతరణిక

శ్రీ శూడిక్కొడుత్తనాచ్చియార్లు, క్రింది తిరుమొళిలో తిరుచ్చెజ్గా ళ్వానుల (శ్రీపాంచజన్యశంఖము) తో సల్లాపమొనరించుచు కాలయాపన చేసిరి. ఈమె ఎన్నివిధముల ప్రార్థించినను ప్రత్యుత్తరములేకపోయెను. అందుపై, భగవద్విశ్లేషముచే గలిగిన విరహతాపమునకు తాళజాలక పరితపించుచుండెను. అది వర్షాకాలమగుటచే ఉఱుముచు, మెఱుముచు మేఘములు ఆకసమున సంచరించుచుండెను. వానిని చూచినంతనే విరహము మిక్కుటమయ్యెను. అందుచే నీలమేఘనిభుడును, తన స్వామియునునగు శ్రీవేంకటాచలపతికి తన దశను ఎఱిగించి, వారిని శీఘ్రముగ విచ్చేయునట్లు చేసి, తనను సంరక్షింపమని మొఱలిడుచు, ఆ మేఘములను దూతలనుగ బంపుచున్నారు.

(1) అవ :—వర్షాభిముఖములగు నీలమేఘములు ఆకసమంతయును వ్యాపించి, సంచరింపుచుండగ, శ్రీనాచ్చియార్లు, వానిని జూచి "మేఘములారా! మా తిరువేంగడముడయానులు మీతో గూడ వచ్చినారా? వారిజాడ మీకేమైనను తెలియునా?" అని మిక్కిలి దీనముగ ప్రశ్నించిరి. అందులకు అవి ఏమియును ప్రత్యుత్తరమొసంగకయుండ, ఆవ్యసనము భరింపజాలక ధారలుధారలుగ కన్నీరు ప్రవహింప, "ఓ మేఘములారా! ఇట్లు నన్ను పరితపింపజేయుట ఒక గొప్పతనమా? మీారే ఆనతిండు" అని మేఘములను ప్రశ్నించుచున్నారు.

* విణ్ణీల మేలాప్పు విరిత్తాఱ్పోల్ మేగజ్గాళ్,
తెణ్ణీర్ పాయ్ వేజ్గడత్తుఎన్ తిరుమాలుమ్ పోన్దానే,
కణ్ణీర్గళ్ ములైక్కువట్టిల్ తుళిశోరచ్చోర్వేనై,
పెణ్ణీర్మై యీడళిక్కుమ్ ఇదుతమక్కు ఓర్ పెరుమైయే. ౧

టీక :— విణ్ = ఆకసమంతయును, నీలమ్ మేలాప్పు విరిత్తాఱ్పోల్ = నల్లనిచాందినీ గుడ్డ గట్టినట్లు వ్యాపించియున్న, మేగజ్గాళ్ = మేఘములారా ! తెళ్ నీర్ పాయుమ్ = పరిశుద్ధములైనతీర్థములు ప్రవహించు స్థలమైనట్టి, వేంగడత్తు = శ్రీవేంకటాచలమున వేంచేసియున్న, ఎన్ తిరుమాలుమ్ = నా శ్రియఃపతియును, పోన్దానో = మీతోగూడ వేంచేసిరా ? (వర్ణసామ్యమున్నందున మిత్రులగుటచే మీతోగూడ వచ్చెనేమో యని అభిప్రాయము) ములైక్కువట్టిల్ = కుచములపై, కణ్ నీర్గళ్ = కన్నీళ్లు, తుళిశోర = ప్రవహించునట్లు, శోర్వేనై = దుఃఖించుచున్న నాయొక్క, పెణ్ నీర్మై = స్త్రీస్వభావమును, ఈడు అళిక్కుమ్ ఇదు = బాధించుచుండుట యనునిది, తమక్కు = వారికి, ఓర్ పెరుమైయో = ఒక గొప్పదనమా ?

తా॥ ఆకసమంతయును నీలవితానమువలె వ్యాపించియుండు ఓ మేఘములారా ! ఎచ్చట జూచినను స్వచ్ఛములగు పుణ్యతీర్థములతో నిండియుండు శ్రీవేంకటాచలమున నెలకొనియుండు మా స్వామియగు శ్రియఃపతి, సమానవర్ణులగు మీతోడ విచ్చేసిరా ? కన్నీరు స్తనములపై ప్రవహింప దుఃఖించుచున్న ఈ యబలను బాధించుట పాడియా ? ఇది అతనికి గొప్పతనమా ?

వి. వి :— "తెళ్ నీర్ పాయ్" అనుటచే అతడు నివసించుచోట ఎల్లెడలను కరుణారసము ప్రవహించుచుండును. అట్టి కరుణాకరుడగు ఆ స్వామికి అతని విశ్లేషమునే సహింపజాలక దుఃఖించుచున్న ఈ అబలను ఉపేక్షించుట, శ్రమపరచుటయును తగినదా ? అను విశేషార్థము సూచింపబడుచున్నది.

(2) అవ :— ఓ కాళమేఘములారా! మీారీరోజు నాకై క్రొత్తగా మీాయౌదార్యమును పరిచయముచేయవలయునా? ఔదార్యమే గదా మీా స్వరూపము; అనర్ఘములగు ముత్తెములను, స్వర్ణమును, ఎవరును అపేక్షింపనప్పటికిని వర్షించుటగదా మీా స్వభావము; ఇట్టి స్వభావముగల మీారలు మీా పాదములపై బడి ప్రార్థించుచుండగ, నాకై యొక నోటి మాటనుగూడ చెప్పగూడదా? తిరువేంగడముడైయాన్ల వృత్తాన్తము మీాకు తెలియదా! కామాగ్ని, లోనప్రవేశించి దహించుచున్నది. రాత్రులందు నడుర్ఘూమున మలయానిలము దానికి సహాయపడుచున్నది. తాళజాలకయున్నాను. అని మేఘములను జూచి శ్రీగోదాదేవి మొఱలిడుచున్నది

మాముత్తనిదిశోరియుమ్ మాముగిల్గాళ్, వేఙ్గడత్తు,
చ్చామత్తిన్ నిఱఙ్గొణ్డ తాడాళన్ వార్త్తైయెన్నే,
కామత్తీయుళ్ పుగున్దు కదువప్పట్టు, ఇడైకఙ్గుల్
ఏమత్తోర్ తెన్దలుక్కు ఇఙ్గిలక్కాయ్ నానిరుప్పేనే. ౨

టీక :— మా ముత్తం నిదిశోరియుమ్ = శ్రేష్ఠములగు ముత్తెములను, స్వర్ణమును, అభివర్షించునట్టి, మాముగిల్ కాళ్ = కాలమేఘములారా! వేంగడత్తు=తిరువేంగడమున వేంచేసియున్నట్టి, శామత్తిన్ నిఱంకొణ్డ = నీలవర్ణముగల, తాడాళన్ = మా స్వామి యొక్క, వార్త్తైఎన్నే = సమాచారమేదియైనను ఉన్నదా? కామత్తీ = కామాగ్ని, ఉళ్ పుగున్దు=లోనప్రవేశించి, కదువపట్టు = దహింపగా, దానిచే బాధపడి, కంగుల్ = రాత్రియందు, ఇడైఏమత్తు = నడుర్ఘూమున, ఓర్ తెన్దలుక్కు = ఒక దక్షిణపుదిక్కు నుండివచ్చు మలయానిలమునకు, నాన్ = నేను, ఇలక్కుఆయ్ = విషయమై, ఇంగు = ఇచ్చట, ఇరుప్పేనో = ఉండగలనా (ఇది తగినపనియా?)

తా॥ ఓ వర్షుకవలాహకములారా! ఎవరును అపేక్షింపకయున్నను, అనర్ఘములగు ముత్తెములను, స్వర్ణమును, అభివర్షించు పరమోదార స్వరూపులు గదా మీారలు; అబలనగునేను కామాగ్నిచే దహింపబడు

చున్నాను. రాత్రులందు సదా ఝూమున మందమారుతము నావిరహాగ్నికి తోడగుచున్నది. తాళజాలకన్నాను. శ్రీవేంకటాచలమున వేంచేసి యుండు పరమకరుణాకరుడగు నీలవర్ణుని సమాచారము మీకు తెలియదా? మీ పాదములపై బడి ప్రార్థించుచుండు నాకై ఒకమాట మాట్లాడ గూడదా? అని మిక్కిలి దీనముగ శ్రీగోదాదేవి వేడుకొనుచున్నది.

(3) అవ :— ఓ కృపాస్వరూపములగు మేఘములారా! నానాథుని ఎడబాసి పరితపించుచుండుటచే నాశరీరము కృశించుచున్నది. కాంతియు వర్ణమును మాఱియున్నవి. అయ్యో! సుభగశీతలములగు సెలయేళ్ళతో నిండియుండు శ్రీవేంకటాచలమున వేంచేసియుండు నానాథుని కల్యాణగుణ గణముల ననుసంధించుకొనుచు జీవించియుండగలనా? అని శ్రీగోదాదేవి విలపించుచున్నది.

ఒళివణ్ణమ్ వళై శిన్దై ఉఱక్కత్తోడు ఇవై యెల్లామ్,
ఎళిమైయాల్ ఇట్టెన్నై యీడழియ ప్పోయినవాల్,
కుళిరరువి వేఙ్గడత్తెన్ గోవిన్దన్ గుణమ్ పాడి,
అళియత్త మేగఙ్గాళ్ ఆవికాత్తిరుప్పేనే. 3

టీక :— అణియత్త మేఘంగాళ్ = కృపారసమును భివర్షించు మేఘములారా! ఒళి = దేహకాంతియు, వణ్ణమ్ = వర్ణమును, వళై = వలయములును (గాజులును) చిన్దై = మనస్సును, ఉఱక్కత్తోడు = నిద్రతోగూడ, ఇవై యెల్లామ్ = ఇవియన్నియును, ఎళిమైయాల్ = నాధైర్యమే కారణముగా, ఎన్నై ఇట్టు = నన్ను ఉపేక్షించివిడచి, ఈడழియ = నా ప్రావణ్యము నశించునట్లు, పోయిన = విడిచిపోయినవి; ఆల్ = అయ్యో, కుళిర్ అరువి = చల్లని సెలయేళ్ళతో నిండియున్న, వేంగడత్తు = తిరువేంగడమున వేంచేసియున్న, ఎన్ గోవిందన్ = నాస్వామియైన కణ్ణపిరానులయొక్క, గుణమ్ = తిరుకల్యాణ గుణములను, పాడి = నోరారపాడుకొనుచు, (అపాటయేధారకముగ), ఆవి = ప్రాణములను, కాత్తిరుప్పేనే = కాపాడుకొనియుండుటకు నాచే సాధ్యపడునా ?.

తా॥ నా ప్రాణనాథు నెడబాసిన దుఃఖముచే శరీరశోభ తగ్గి, వర్ణము మారి, చేతిగాజులు వదులై, మనస్సు శిథిలమై, నిద్రలేకున్నది. ఇట్లు నాధైర్యముచెడి శ్రమపడుచుండుటను, ఏమని వివరింపగలను? విశ్లేష సమయమున నాయకునియొక్క తిరుకల్యాణగుణములను గీర్తించుచు ప్రాణములను నిలుపుకొనుద మనుకొన్నను, మనస్సు కలతజెందియున్న ఈ సమయమున అది నాకు సాధ్యమా ? అని శ్రీ ఆండాళమ్మవారు విలపించుచున్నది.

(4) అవ :— విద్యుల్లతలతో గూడుకొనియుండు ఓ మేఘము లారా ! నూతనముగ అభివృద్ధమగుచుండు నా కుచములయందాసపడి నన్ను గాఢాలింగనముచేసి కొనుగాక—అని ఎల్లప్పుడును ఆశపడుచున్నాను. ఈ విషయమును శ్రీవేంకటాచలమున వేంచేసియున్న నా స్వామియగు శ్రియఃపతికి విన్నవింపుడు—అని శ్రీగోదాదేవి మేఘములను ప్రార్థించు చున్నది.

మిన్నాగత్తెழுగిన్ఱ మేగజ్గాళ్, వేఙ్గడత్తు,
త్తన్నాగ త్తిరుమఙ్గై తఙ్గియశీర్ మార్వఱ్కు,
ఎన్నాగత్తిళజ్కొఙ్గై విరుమ్బిత్తామ్ నాళ్ తోఱుమ్,
పొన్నాగమ్ పుల్గుదఱ్కు ఎన్ పురివుడైమై శెప్పుమినే. ౪

టీక :— ఆగత్తుమిన్ ఎழுగిన్ఱ = శరీరమందే ప్రకాశించుచున్న మెరుపుతీగెలు గల, మేగజ్గాళ్ = మేఘములారా, ఎన్ ఆగత్తు = నా ఉరమున ఉద్భవించియున్న, ఇళమ్ కొఙ్గై = నూత్నములగు కుచములను, తామ్విరుమ్బి = ఆ సర్వేశ్వరుడు ఆశపడి, పొన్ ఆగమ్ = శ్లాఘ్యమైన తమ దివ్యవక్షఃస్థలముతో, పుల్గుదఱ్కు = గాఢాలింగనము చేసికొనవలయునని, నాళ్ దోఱుమ్ = ఎల్లప్పుడును, ఎన్ పురివుడమై = నాకు ఆశ యుండు క్రమమును, వేంగడత్తు = తిరుమలలో, తన్ ఆగమ్ = తన తిరుమేనిలో, తిరుమంగై తంగియశీర్మార్వఱ్కు = శ్రీలక్ష్మీదేవి వేంచేసియుండునట్టి భాగ్యముగల దివ్యవక్షఃస్థలముగల మా స్వామికి, శెప్పుమిన్ = దయచేసిచెప్పుండి.

తా॥ ఎల్లప్పుడును విద్యుల్లతలతో గూడి పరమసుఖముల ననుభవించు మేఘములారా! నా యురమున నూతనముగ ఉద్భవించియున్న స్తనములపై ఆశపడి, నా నాథుడు, తను, సుందరమును, విశాలమును నై యుండు దివ్యవక్షఃస్థలముతో గాఢాలింగనమొనరించు గాక—అని నిత్యమును ఉవ్విళ్లూరుచుండు నా కుతూహలమును, తన వక్షఃస్థలమునం దుండు శ్రీ మహాలక్ష్మితో తిరుమలలో విహరించుచుండు నా ప్రాణ నాథునకు కృపతో మనవిజేయుడు—అని మేఘములను శ్రీ ఆండాళమ్మ గారు ప్రార్థించుచున్నది.

వి. వి :— అగత్తుమిన్ను మ్మిన్న-విద్యుల్లతలను వదలి ఒక క్షణమైనను సహింప జాలక ఎల్లప్పుడును నీ శరీరమందే ఉంచుకొని రమించుచుండు నీకు నా పరిస్థితిని జూచి కనికరముగలుగ వలదా? అను అభిప్రాయము సూచింపబడుచున్నది. (2) తన్ ఆగమ్ తిరుమంగై తంగియ శీర్ మార్బనుక్కు – ఒక్క త్రుటి కాలమైనను మిమ్ము వదలి జీవింప జాలను—అని శపథముజేయుచున్న శ్రీమహాలక్ష్మిని ఎల్లప్పుడును మీ దివ్యవక్షఃస్థలముతో గాఢాలింగనము చేసికొని రమింపజేయుచున్న దేవరవారికి, అట్లే బాధపడుచున్న నన్ను ఉపేక్షించుట పాడియా? అను విశేషార్థము సూచింపబడుచున్నది.

(5) అవ :— ఓ మేఘములారా! తమ తీక్ష్ణములగు నఖాగ్రములచే హిరణ్యకశిపుని ఱొమ్మును జీల్చి లోకములను గాపాడిన నా స్వామికి, నా దురవస్థను దెలుపుడు — అని శ్రీ ఆండాళమ్మగారు మేఘములను ప్రార్థించుచున్నారు.

వాన్ కొణ్డు కిళర్ న్దెழுన్ద మాముగిల్ గాళ్, వేఙ్గడత్తు,
తేన్ కొణ్డమలర్ శిదఱ త్తిరణ్డేఱి ప్పొழிవీర్ గాళ్,
ఊన్ కొణ్డ వళ్ళుగిరాల్ ఇరణియనై ఉడలిడన్దాన్,
తాన్ కొణ్డ శరివళై గళ్ తరుమాగిల్ శాற்றుమినే. ౫

టీక :— వేంగడత్తు = శ్రీవేంకటాచలమున, తేన్ కొణ్డమలర్ శిదఱ = మకరంద నిర్భరములగు పుష్పముల వెదజల్లునట్లు, తిరణ్డుఏఱి = సమూహములు సమూహములుగ ఆకాశమున వ్యాపించి. పాయ్ న్దిడీర్ గాళ్ = వర్షించుచున్నట్టియును, వాన్ కొండు కిళర్ న్దుఎళున్ద = ఆకాశమును కబళీకారము చేయుచు, మహోన్నతములై వ్యాపించి యున్న, మా ముగిల్ గాళ్ = కాలమేఘములారా! ఊన్ కొండ వళ్ ఉగిరాల్ = సుదృఢములై, సుతీక్ష్ణములగు నఖములచే, ఇరణియనై = హిరణ్యాసురుని, ఉడల్ ఇడన్దాన్ తాన్ = శరీరమును చీల్చివైచిన సర్వేశ్వరుడు, కొణ్డ = నా వద్ద అపహరించుకొని పోయిన, శరివళైగళ్ = చేతిగాజులను, తరుమ్ ఆగిల్ = త్రిప్పిఇచ్చునేని, శాఱ్ఱుమిన్ = నా అవస్థను వానికి దెలుపుడు

తా॥ ఆకసమంతయును గుంపులుగుంపులుగ చేరి యుండు ఓ మేఘములారా! తిరుమలలో తేనెలతోనిండియుండు పుష్పముల వెదజల్లునట్లు మీరలు వర్షించుచున్నారు. అత్యౌదార్యముగల మీరు, తన తీక్ష్ణనఖాగ్రములచే హిరణ్యకశిపుని వక్షఃస్థలమును జీల్చి, లోకముల గాపాడిన పరమకరుణాకరుడగు నా స్వామివారివద్ద నా దురవస్థను దెలిపి, తన విరహతాపముచే గలిగిన కార్శ్యమువల్ల జారిపోవుచుండగ తీసివైచిన చేతిగాజులను నా చేతిలో మరల ధరించునటుల చేయునట్లనుగ్రహింపమని మనవిజేయుడు—అని మేఘముల శ్రీగోదాదేవిగారు ప్రార్థించుచున్నారు.

వి. వి :— తాన్ కొణ్డశరివళైగళ్ - సర్వేశ్వరుడు శ్రీ ఆండాళమ్మగారి చేతి గాజులను అపహరించుటఎట్లు? మరల వానిని త్రిప్పి యిచ్చుట యననేమి? అనినచో; సర్వేశ్వరుడు త్వరగవచ్చి ఈమెతో గూడనందున ఈమెకు విరహతాపము మితిమీరినది అందుచే కార్శ్యము గలిగినది. ఆ కృశత్వముచే గాజుల నపహరించుటకు కారణమాయెను. ఈమెయవిని, వెంటనేవచ్చి, ఈమెతోజేరి గాజులధరింపజేసెనేని, ఆసంతోషము వలన దేహము స్థూలముకాగ, ఆ గాజులు జారనేరవు. ఇదియే ఇచ్చటి భావార్థము.

(6) అవ :— మేఘములారా! మహాబలినుండి భూమినిస్వాధీనము జేసికొనిన శ్రీత్రివిక్రమావతారుడగు నాస్వామితో నాయవస్థను దెలుపుడు— అని మేఘములను ప్రార్థించుచున్నారు.

శలఙ్గొణ్డు కిళర్న్దెఴున్ద తణ్ ముగిల్ గాళ్, మావలియై
నిలఙ్గొణ్డాన్ వేఙ్గడత్తే నిరన్దేఱి పొఴివీర్ గాళ్,
ఉలఙ్గుణ్డ విళఙ్కనిపోల్ ఉళ్ మెలియ ప్పుగున్దు, ఎన్నై,
నలఙ్గొణ్డనారణఱ్కు ఎన్ నడలై నోయ్ శెప్పుమినే. ౬

టీక :— శలన్ కొణ్డు = సముద్రజలమును పీల్చుకొని, కిళర్ న్దెఴున్ద = ఆకాశమునకు ఎగిరి ప్రకాశించుచున్న, తణ్ ముగిల్ గాళ్ = చల్లని మేఘములారా! మావలియై = మహాబలిచక్రవర్తినుండి, నిలమ్ కొణ్డాన్ = భూమిని స్వీకరించిన వామనావతారుడగు సర్వేశ్వరుడు వేంచేసియున్నట్టి, వేంగడత్తు = శ్రీవేంకటాచలమున, నిరన్దు = వ్యాపించి, ఏఱి = శిఖరములపైకెక్కి, పొఴివీర్ గాళ్ = వర్షించుచున్న మేఘములారా! ఉలఙ్గుణ్డ = పెద్దదోమలచే తినబడిన, విళఙ్కని పోల్ = వెలగపండువలె, ఉళ్ మెలియ = అంతరంగము పీడింపబడునట్లు, పుగున్దు = నా మనస్సున ప్రవేశించి, ఎన్నై = నాయొక్క, నలమ్ కొణ్డ = వివేకమును అపహరించిన, నారణఱ్కు = నారాయణునికి, ఎన్ నడలై నోయ్ = నా కష్టవ్యాధిని, శెప్పుమిన్ = దయచేసి తెలియజేయుడు.

తా॥ మేఘములారా ! మీ యొక్క శరీరకాంతియు, శీతలస్వభావము—అన్నియును భోగ్యముగనే యున్నవి. కాని, ప్రయోజనాంతరపరులైన దేవతలకై తనను భిక్షువుగ జేసికొని శ్రమపడిన సర్వేశ్వరుడు వేంచేసియుండు తిరువేంగడమున వసించు భాగ్యముగల మీరలు, అనన్యప్రయోజనురాలై యున్న నాదు కార్యముల నెరవేర్చవలదా? అని శ్రీ గోదాదేవి చెప్పగ, మేము నీకు చేయవలసిన కార్యమేమని అవి ప్రశ్నింపగ, దోమలు వెలగపండులో ప్రవేశించి, అందలిరసమునంతయును ననుభవించునట్లు నా హృదయమున ప్రవేశించి, నాదు సర్వస్వమును అపహరించిన నా నాథునకు, నా దురవస్థను దెలుపుడు—అని ప్రార్థించుచున్నారు.

(7) అవ:—అమృతమథనముజేసిన శ్రీమన్నారాయణుఁడు వేంచేసి యుండు తిరుమలలో నివసింప భాగ్యముగలిగిన మేఘములారా! ఆ పుండరీకాక్షుని శ్రీపాదములసన్నిధిలో, 'ఒక్కరోజైనను నన్ను తనదు కౌగిలిలో చేర్చుకొని తన సంశ్లేషసౌఖ్యమును నాకు కృపజేయవలయును' అని మనవిచేయుఁడు—అని శ్రీగోదాదేవి మేఘములను వేడుకొనుచున్నది.

శఙ్గమాకడల్ కడైన్దాన్ తన్ ముగిల్గాళ్, వేఙ్గడత్తు,
చ్చెఙ్గణ్మాల్ శేవడిక్కీழ் అడివీழ్చ్చి విణ్ణప్పమ్,
కొఙ్గైమేల్ కుఙ్గుమత్తిన్ కుழம்బழియ ప్పుగున్దు, ఒరునాళ్,
తఙ్గుమేల్ ఎన్నావి తఙ్గుమెన్ను ఉరైయీరే 7

టీక:— శంగమ్ = శంఖములనుగలిగియున్నదియు, మా = గొప్పదియునునగు, కడల్ = సముద్రమును, కడైన్దాన్ = మథింపకృపజేసిన సర్వేశ్వరుడు వేంచేసియుండు' వేంగడత్తు = శ్రీవేంకటాచలమున సంచరించుచున్న, తణ్ ముగిల్గాళ్ = చల్లని మేఘములారా! శెంగణ్ మాల్ = రక్తతామరసపుష్పములవంటి దివ్యనేత్రములతో విరాజిల్లు శ్రియఃపతియొక్క, శేవడిక్కీழ் = ఎఱ్ఱని తిరువడిగళ్ళవద్ద, అడివీழ்చ్చి = దాసురాలి యొక్క, విణ్ణప్పమ్ = విజ్ఞాపనము (ఏమనగా) కొంగైమేల్ = నాకుచములపై, (అంటి యున్న) కుంకుమత్తిన్ కుழம்బు = కుంకుమముయొక్క పంకము, అழியు = బాగుగా చెరిగిపోవునట్లు ఒరునాళ్ = ఒకరోజైనను, పుగున్దు తంగుం ఏల్ = ఆనాథుడువచ్చి సంశ్లేషించునేని, (అప్పటికి) ఎన్ ఆవి = నా ప్రాణము, తంగుమెన్ను = నిలుచునని ఉరైయీర్ = ఈ నా విజ్ఞాపనమును అతని సన్నిధిలో మనవిచేయుడు.

తా॥ శంఖములతో నిండిన మహాసముద్రమును మథించి, అమృతము నొసగి దేవతల గాపాడిన శ్రియఃపతియొక్క క్రీడాచలమగు శ్రీవేంకటాచలమున నివసించు భాగ్యముగల చల్లని మేఘములారా! ఆ పుండరీకాక్షుని దివ్యపాదారవిన్దముల సన్నిధిలో దాసురాలి విజ్ఞాపనమేమనగా—

“ నా కుచమండలముపై నలదికొనియుండు కుంకుమపంకమంతయును చెరిగిపోవునట్లు ఒక్కసారియైనను నాతో సంశ్లేషించిననేగాని, నా ప్రాణములు నిలువవు ”— అని ఈ నా వేడికోలును నా నాథునిసన్నిధిలో విన్నవింపుడు.

(8) అవ :— వర్షాకాలమున తిరుమలలో వచ్చి నిలచియున్న మేఘములారా ! యుద్ధమున శత్రువుల వధించి జయమునుగొన్న శ్రీరామచంద్రమూర్తి తిరునామములను సంకీర్తనజేయుచు వర్షాకాలమునందు జిల్లేడుపండుటాకులవలె జీర్ణించి క్రింద పడసిద్ధముగానున్నాను. నేను జీవించియుండు లోపలనే నా విషయమై ఒక్కమాటను వారివద్ద విన్నవింపరా ? అని, శ్రీ ఆండాళమ్మగారు మేఘములను ప్రశ్నించుచున్నారు.

కార్ కాలత్తెழுగిన్ఱ కార్ ముగిల్ గాళ్, వేఙ్గడత్తు,
పోర్ కాలత్తెழுన్దరుళి ప్పొరుదవనార్ పేర్ శొల్లి,
నీర్ కాలత్తు ఎరుక్కినమ్ పழுవిలై పోల్ వీழ్ వేనై,
వార్ కాలత్తు ఒరునాళ్ తమ్ వాశగమ్ తన్దరుళారే. ౮

టీక :— కార్ కాలత్తు = వర్షాకాలమున, వేంగడత్తు = శ్రీ వేంకటాచలమున, ఎழுగిన్ఱ = సేవసాదించుచున్నట్టి, కార్ ముగిల్ = కాళ మేఘములారా ! పోర్ కాలత్తు = యుద్ధసమయమున, ఎழுన్దరుళి = (యుద్ధభూమిలో) వేంచేసియుండి, పొరుదవనార్ = యుద్ధమునుచేసి జయమునుగొన్న శ్రీరామచంద్రమూర్తియొక్క, పేర్ = తిరునామములను, శొల్లి = సంకీర్తనముచేసి, నీర్ కాలత్తు = వర్షాకాలమున, ఎరుక్కిల్ అం పழு ఇలై పోల్ = జిల్లేడుపండుటాకులవలె, వీழ் వేనై = జీర్ణించి క్రిందపడిపోవుటకు సిద్ధముగనున్నాను. వార్ కాలత్తు ఒరు నాళ్ = నేను జీవించియుండు లోపల ఒకరోజైనను, తమ్ వాచగం = తమ నోటిమాటను, తన్దరుళారే = చెప్పి, వారి నిటుపంపునట్లు అనుగ్రహింపరా ?

తా॥ వర్షాకాలమున శ్రీవేంకటాచలమున సేవసాదించుచుండు మేఘములారా! ఆ నా నాథుడు రాకున్నను, వాని తిరునామముల సంకీర్తనము చేసికొనుచు, కొంత యాశ్వాసము జెందుదమని యెంచి, ఆశ్రిత సంరక్షణబద్ధకంకణుండై, వారి విరోధులను నిరసించుటలో మహోత్సాహముగల శ్రీచక్రవర్తి తిరుమగనార్లయొక్క తిరునామములను సంకీర్తన జేయుటకారంభించితిని; కాని, అదియే కారణముగ, వెంటనే శైథిల్యము గలిగినది, వర్షాకాలమున జిల్లేడు పండుటాకులు జీర్ణించి క్రిందపడునట్లు, నా యంగకములన్నియును చచ్చుబడి వెంటనే క్రిందపడి పోవునట్టి దశను పొందియున్నాను. ఇట్టి దశసంప్రాప్తమైనను గూడ ఆ సర్వేశ్వరుడు నన్ను అనుగ్రహించుటకు తలపెట్టలేదు. నా జీవితకాలమంతయును, ఇట్లు దుఃఖమయముగనే గడచిపోగలదు ? కాన, దయయుంచి ఒక రోజైనను వారితో నొక నోటిమాటయైనను చెప్పి వారిని పంపరా? అని అతిదీనముగ విలపించుచున్నది.

(9) అవ :— శ్రీ వేంకటాచలమున నిత్యవాసము జేయుచుండు కాలమేఘములారా! శ్రీ శేషశాయియగు నా నాథునిమాట ఇట్లు అసత్యమైనదే ? “ఆ సర్వేశ్వరుడు ఆశ్రితసంరక్షణైకదీక్షితుడయ్యు, తన స్వభావమును మఱచి, తన్నాశ్రయించిన ఒక అబలను చంపివైచెను” అను మాటను లోకులు నమ్ముదురా ? అని శ్రీగోదాదేవి మేఘములను ప్రశ్నించుచున్నది.

మదయానై పోలెழுన్ద మాముగిల్గాళ్, వేంగడత్తై
ప్పదియాగ వాழ்విర్గాళ్ పామ్బణైయార్క్కు వార్త్తై ఎన్నే,
కదియెన్ఱుమ్ తానావాన్ కరుదాదు, ఓర్ పెణ్కొడియై,
వదైశెయ్దా నెన్నుమ్శొల్ వైయగత్తార్ మదియారే.

టీక :— వేంగడత్తై = శ్రీ వేంకటాచలమును, పదిఆగ = నివాసస్థానముగా చేసికొని. వాళ్గిన్ఱార్ గాళ్ = ఉజ్జీవించుచు, మదమ్యానై పోల్ ఎళున్ద = మత్తగజముల వలె మహోన్నతములైయున్న, మా ముగిల్ గాళ్ = గొప్ప మేఘములారా! పామ్బు అణై యాన్ = శేషశాయియైన నా నాథునియొక్క, వార్త్తై = మాట, ఎన్నే = ఇట్లు అబద్ధమైనదే !, తాన్ = ఆ సర్వేశ్వరుండే, ఎన్నుమ్ = ఎల్లప్పటికిని, గతిఆవాన్ = (ఆశ్రితులకు) సంరక్షకుడైయుండియు, కదవాదు = ఆతని స్వభావమును స్మరింపక, ఓర్ పెణ్ కొడియై = ఒక అబలను, వదై శెయ్దాన్ = వధించెను, ఎన్నుమ్ శొల్ = అను మాటను, వైయగత్తార్ = ఈ భూమిలో నివసించు జనులు, మదియారే = సరకుచేయరుగదా ?.

తా॥ శ్రీవేంకటాచలమునే నిత్యవాసస్థానముగా చేసికొని ఎల్లప్పుడును ఆ తిరువేంగడముడై యాన్లను సేవించుచు, ఆ సేవాభాగ్యముచే మత్తగజములవలె బలసియున్న కాలమేఘములారా! "జగత్తుల సంరక్షించుటకై క్షీరసముద్రమున శేషశాయియై యున్నాడను" అని బీరములు పలికిన ఆ సర్వేశ్వరునిమాట ఇట్లు అబద్ధమైనదే ? "ఆ శ్రీమన్నారాయణుడే తన ఆశ్రితసంరక్షణ స్వభావమును మఱచి అబలనగు నన్ను సంహరించెను" అను మాటను ఈ పాడులోకము నమ్మునా ?.

(10) అవ :— ఈ కడపటి పాశురమున, శ్రీ ఆండాళమ్మవారు, శ్రీ వేంకటాచలాధిపతి విశ్లేషమును తాళజాలక మేఘసందేశమును పంపిన వృత్తాన్తమును అభివర్ణించునట్టి ఈ తిరుమొళిని అభ్యసించిన వారలకు ఫలమును ఆనతిచ్చుచున్నారు.

* నాగత్తిన్ అణైయానై నన్నుదలాళ్ నయన్దుఱై శెయ్,
మేగత్తై వేఙ్గడక్కోన్ విడుతూదిల్ విణ్ణప్పమ్,
పోగత్తిల్ వళువాద పుదువైయర్కోన్ కోదై తమిళ్,
ఆగత్తువైత్తుఱైప్పారవర్ అడియారాగువరే. ౧౦

టీక ;— నల్ నుదలాళ్ = పరమలక్షణమైన తిరుముఖమండలముతో నొప్పారునదియు, భోగత్తిల్ వழுవాద = భగవదనుభవమున నొకకొంతయును లేని, పుదువైయర్ కోన్ = శ్రీవిల్లిపుత్తూరు జనులకు స్వామియైన శ్రీ పెరియాళ్వార్లయొక్క, తిరుమగళాయిన, కోదై = శ్రీగోదాదేవి, నాగత్తిణై అణైయాన్ = తిరువనన్తాళ్వాన్ను పడకగా జేసికొనియున్న (నిఖిల జగద్రక్షణ జాగరూకమగు యోగనిద్ర ననుభవించుచున్న) వేంగడత్తానై = తిరువేంగడముడైయాన్ను, నయన్దు = ఆశపడి, ఉరైశెయ్ = ప్రసాదించిన, మేఘత్తై విడుతూదిల్ = మేఘములను దూతలనుగా పంపు, విణ్ణప్పన్ = విజ్ఞాపనరూపమగు, తమిழ் = ఈ ద్రావిడపాశురములను, అగత్తువైత్తు = హృదయపూర్వముగ, ఉరైప్పార్ అవర్ = అనుసంధించువారలు అడియన్ ఆగువర్ = సర్వేశ్వరునకు అన్తరంగకైంకర్యమును చేయువారలగుదురు.

తా॥ పరమభోగ్యమైన తిరుముఖమండలము గలిగినదియు, నిరన్తర భగవదనుభవపరులగు శ్రీ పెరియాళ్వార్లకు ననుంగు కూతురునునగు శ్రీగోదాదేవి, అనంతశయనుడగు శ్రీ తిరువేంగడముడైయాన్ను సంశ్లేషింపవలయునని మిక్కిలి యాశలూరి, మేఘసందేశమును పంపుచు నానతిచ్చిన ఈ తిరుమొழி పదిపాశురములను భక్తితో ననుసంధించువారలు భగవన్తునకు అంతరంగకైంకర్యములచేయుచు భక్తాగ్రేసరులై, అమందానందముల ననుభవింతురు.

శ్రీఆండాళ్ అమ్మవారి తిరువడిగళ్లే శరణము.



శ్రీరస్తు

శ్రీమత్యై గోదాదేవ్యై నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ ఆండాళ్ ప్రసాదించిన నాచ్చియార్ తిరుమొழிలోని

# మంగళాశాసన పాశురములు

## (తనిపాశురములు)

## అవతరణిక

శ్రీ శూడికొడుత్త నాచ్చియార్లు కణ్ణపిరానులను వివాహముచేసి కొనుటకై మార్గశీర్షమాసమున 30 దినములును నోమునోచిరి. కాని ఈమె కోరినట్లు అతడు వచ్చి, ఈమెతోడ సంశ్లేషమును అనుభవింప కుండెను. ఆ విశ్లేషదుఃఖమును భరింపజాలక, "నిన్నును, నీ తమ్ముని గూడ నెల్లప్పుడును సేవింతును. నన్ను కణ్ణపిరానులతో ఎట్లైనను చేర్చుము" అని మన్మథుని పాదములపై బడి, ఈ తిరుమొழிలో ప్రార్థించు చున్నది.

(1-వ తిరుమొழி, 1-వ పాట్టు)

(1) అవ :— అందు మొదటిపాశురమున, మన్మథుని, తన కార్యమును, పూర్తిచేయునట్లు ఆరాధింపలయునని భావించి, అతడేతెంచుస్థలములను, వీధులను అలంకరించి, అతనిని, అతని తమ్ముని నమస్కరించెదనని ప్రార్థించుచున్నది.

* తైయొరు తిజ్గళుమ్ తరై విళక్కి,
   త్తణ్ మణ్డలమిట్టు మాశినున్నాళ్,
ఐయనుణ్ మణల్కొణ్డు తెరువణిన్దు,
   అழగిను క్కలజ్గరిత్తు అనజ్గదేవా !,

ఉయ్యవుమాఙ్గొలో వెన్ఱుశొల్లి,
ఉన్నైయుమ్ ఉమ్బియైయుమ్ తొళుదేన్,
వెయ్యదోర్ తళలుమిళ్ శక్కరక్కై,
వేఙ్గడవఱ్కు ఎన్నై విదిక్కిఱ్ఱియే. ౧-౧.

టీక :— అనంగదేవా ! = ఓ కామదేవా !, తైయొరు తింగళుమ్ = తైమాసమంతయును, తరై = నీవు వేంచేయుస్థలములనన్నిటిని విళక్కి = శుభ్రపఱచి, తణ్ మండలమ్ = (మండలపూజలను) మనోజ్ఞమైన మండలముల, ఇట్టు = కల్పించి, మాశిమున్నాళ్ = మాశిమాసము మొదటి పక్షమున, ఐయనుణ్ మణల్ కొణ్డు = మనోహరమైన సన్నని ఇసుకను తెచ్చి, తెరు = (నీవు వేంచేయు) వీధులను, అళగినుక్కు = అందముగనుండుటకై, అణిన్దు అలంకరిత్తు = బాగుగ నలంకరించి, ఉయ్యవుమ్ ఆమ్ కొలో ఎన్ఱు = (కామదేవుని సేవించిన మనము) ఉజ్జీవింపవచ్చునేమో ? అని, శొల్లి = అన్యవసించి, ఉన్నైయుమ్ = మన్మథుడవగు నిన్నును, ఉమ్బియైయుమ్ = నీ తమ్ముడైన (జాంబవతీ పుత్రుడగు) * సాంబునిగూడ, తొళుదేన్ = నమస్కరించుచున్నాను, వెయ్యదు = ప్రతికూలుర విషయమున ఉగ్రమైనదియు, తళల్ = అగ్నికణములను, ఉమిళ్ = క్రక్కుచున్నటువంటి, ఓర్ శక్కరమ్ = అసదృశమైన చక్రాయుధమును, కై = హస్తమునందు ధరించియున్న, వేఙ్గడవఱ్కు = తిరువేంగడముడయానులకు, ఎన్నై = నామురాలిని, విదిక్కిఱ్ఱియే = కైంకర్యము చేయునట్లు కల్పించుమా !.

తా॥ ఓ కామదేవుఁడా ! తైమాసమున ముప్పది దినములును నీవు వేంచేయదగిన స్థలములనన్నిటిని బాగుగ చిమ్మి, నీళ్ళుజల్లి, ముగ్గులుపెట్టి అలంకరించితిని. మండలపూజకై మనోజ్ఞములగు మండలముల నేర్పఱచితిని. మాసిమాసమున మొదటి పక్షమంతయును, నీవు వేంచేయదగినట్టి వీధులను, తళతళలాడుచు సుందరమైన సన్నని ఇసుకను జల్లి అలంకరింపజేసితిని. ఉజ్జీవించుట కనుకూలమగునని, నిన్ను, నీ తమ్ముని గూడ సేవించు

* "కామన్ తమ్బి శామన్" అని ఈ సందర్భమున శ్రీ పెరియవాచ్చాన్ పిళ్లైగారు సాధించియున్నారు. రుక్మిణీ పుత్రుడగు ప్రద్యుమ్నుడు మన్మథాంశజుడగుటచే, నతని సవతి తల్లి జాంబవతీదేవి కుమారుడగు సాంబుడే మన్మథుని తమ్ముడగు "శాము"డై యుండవచ్చును.

చున్నాను. ఆశ్రితుల విరోధులపై నిప్పులు గ్రక్కుచు జాజ్వల్యమానమై యున్న, అద్వితీయమగు చక్రాయుధమును చేత ధరించి, కల్యాణాద్భుత గాత్రుడై సేవసాదించుచుండు ఆ తిరువేంగడముడయానులకే, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వవిధకైంకర్యములను చేయుదగినట్లు దాసురాలి ననుగ్రహింపుము.

వి. వి :— ప్రపన్నజనశిఖామణియగు శ్రీపెరియాళ్వార్ల తిరుకుమార్తెయును, స్వయముగ భగవదేకప్రవణయునునగు శ్రీ ఆండాళమ్మవారు ఇట్లు దేవతాన్తరభజనము చేయవచ్చునా ? అని యనిన ; ప్రాప్యత్వరాతిరేకమున మదికలంగి, ఎట్లైనను, వెంటనే భగవంతుని పొందవలయునని తహతహలాడుచు, నీచములనొకటిగా జేర్చి కామదేవుని ఆశ్రయించుచున్నారు. కనుక, అనుపపన్నమెయ్యాదియును లేదు.

(1-వ తిరుమొళి, 3-వ పాశురము)

(౩) అవ :— మన్మథుడు రజోగుణప్రచురుడగుటచే నతనికి మద కరములగు పుష్పములనే సమర్పింపవలసియుండును అనిభావించి, ఉమ్మెత్త పూవులను, మోదుగపూవులను సమర్పించుచు, తనను తిరువేంగడముడ యానులకు దాసురాలినిగ చేయవలయునని ప్రార్థించుచున్నారు.

మత్తనన్నఱుమలర్ మురుక్క మలర్ కొణ్డు,
ముప్పోదుమ్ ఉన్నడివణఙ్గి,
తత్తువ మిలియెన్ను నెఞ్జెరిన్దు,
వాశగత్తళిత్తు ఉన్నై వైదిడామే,
కొత్తలర్ పూఙ్గణై తొడుత్తుక్కొణ్డు,
కోవిన్ద నెన్బదోర్ పేరెళుది,
విత్తగన్ వేఙ్గడవాణనెన్నుమ్,
విళక్కినిల్ పుగవెన్నై విదిక్కిర్ఱియే. ౧—౩.

టీక :— (ఓ కామదేవా!) నల్ నఱుమత్తమలర్ = మంచి పరిమళముగల ఉమ్మెత్త పూవులను, మురుక్కమలర్ = మోదుగపూవులను, కొణ్డు = తీసికొనివచ్చి, ముప్పోదుమ్ = మూడుకాలముల యందును, ఉన్ అడివణఙ్గి = నీ పాదారవిందముల పూజించి, నమస్కరించి, తత్తువమ్ ఇలియెన్ఱు = ఇతడు అసత్యమైన దైవము అని. నెఞ్జు ఎరిన్దు = మనస్సు మిక్కిలి ఆవేదనజెంది, వాచగత్తు = నీ గౌరవమును, అழిత్తు = నశింపజేసి, ఉన్నై వైదిడామే = నిన్ను నిందింపకుండునట్లు, కొత్తు అలర్ పూ = గుత్తులు గుత్తులుగ వికసించియున్న పుష్పములను, కణై = బాణములను, తొడుత్తుక్కొణ్డు = ధనుస్సున సంధించి, కోవిన్దన్ ఎన్బదు = గోవిందుడనెడి, ఓర్ పేర్ = ఒక నామధేయమును, ఎழுది = (హృదయమున) వ్రాసికొని, విత్తగన్ = ఆశ్చర్యగుణచేష్టితుడైన, వేఙ్గడమ్ వాణన్ ఎన్నుమ్ = తిరువేంగడముడయానులనెడు, విళక్కినిల్ = దీపమున. పుగ = (నేను) ప్రవేశించునట్లు, ఎన్నై = దాసురాలిని, విదిక్కిఱ్ఱియే = అనుగ్రహింపవలయును.

తా॥ ఓ కామదేవా! మంచిమంచి సువాసనలుగల ఉమ్మెత్త పూవులను, మోదుగపూవులను గొనివచ్చి, నీ పాదారవిందముల పూజించుచున్నాను. ఇందులకు ఫలముగ, నామనోరథముల నన్నింటిని ఈడేర్పవేని, "ఇతడు నిజమైన దేవుడు కాడు; అసత్యమైన దైవతము." అని ప్రకటించుచు, కడుపు మండి, నీ గౌరవమును నశింపజేసి, నిన్ను నిందలపాలుజేసెదను. అట్టి పరిభవము నీకు జరుగకుండునట్లు వెంటనే అనుగ్రహింపుము. గుత్తులుగుత్తులుగ వికసించియున్న పుష్పములనెడు బాణముల నీ ధనుస్సున సంధించి, వానిచే నా మనస్సున గోవిందుడని యెడు నామధేయమును వ్రాసి, ఆశ్చర్యగుణచేష్టితుడగు ఆ తిరువేంగడ ముడయాను లను ఒక దివ్యతేజఃపుంజమున నేను ప్రవేశించునట్లు నన్ను అనుగ్రహింపుమా!.

వి. వి :— ఇదియొక పరమరసావహమగు పాశురము. దీనికి ననేక ప్రకారములుగ వ్యంగ్యార్థములు నభివర్ణింపబడుచున్నవి :—

నీకు నుత్కృప్రసాదము గలుగునట్టుల, నీకు ప్రీతిజనకములగు పుష్పములగొనివచ్చి ముప్పొద్దులును నీ పాదారవిందముల పూజించెదను. నీవు మాత్రము, దయచేసి, నీ బాణముచే నా మనస్సులో గోవింద నామమును వ్రాసి, వానితో నన్ను చేర్పవలయును- అని యొక అర్థము.

లేక, నీ ధనుస్సున పుష్పబాణముల సంధించినను ఉదాసీనము జేసియుండు నతనిపై ప్రయోగింపుము. అప్పటికిని అతడాభిముఖ్యమును చూపనిచో, నతని గోవింద నామమును పలుచోట్ల వ్రాసి, "గోవిందుడను గొప్ప బిరుదమును ధరించియున్న ఈ పెద్ద మనిషి, తదేక ప్రపన్నయగు నొక యబలను ఇట్లనాదరించియున్నాడు". అని యందఱి కిని తెలియునటుల జేయుము. అప్పటికైనను దోవకువచ్చునేమో చూతము — అను వ్యంగ్యార్థపరంపర తోచుచున్నది.

ఇచ్చట పరమకారుణికులగు శ్రీ పెరియవాచ్చాన్ బిళ్ళైగారు అతిరమణీయముగ రెండువిధములగు యోజనలను అనుగ్రహించియున్నారు – "మకరందస్యంది ప్రసూనముల నీ ధనుస్సున సంధించి సముదగ్రంభీరుడగు నతని గోవిందనామమును బాణమున, లేక, హృదయమున వ్రాసికొని" అని.

ఇచ్చట మొదటి పక్షమున — గోవిందనామమును బాణమున వ్రాసి, ఆ బాణమును వానిపై ప్రయోగించి, ఈ నామమే, గోదయొక్క హృదయమున నెల్లప్పుడును ప్రతిధ్వనించుచున్నది. అని యతనికి దెలియపఱచి, అతనికి నాపై కరుణగలుగునటుల జేసి, నన్నతనితో జేర్చుము — అని భావము.

లేక, నీ బాణమున నతని గోవిందనామమును వ్రాసి, నాపై దానిని ప్రయోగించి, అతనియందే నా మనస్సు సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును లగ్నమగునటులజేసి, అతని యర్థాంగినిగా దాసురాలిని చేయుము. శ్రీరామనామాంకితమగు నంగుళీయకమును శ్రీహనుమంతుడు శ్రీసీతాదేవికి ఇచ్చినటులను, సదాచార్యుడు శిష్యునకు చక్రాంకనమును ప్రసాదించి దాస్యనామమును ఉంచునటులను, నీవు తన్నామాంకితమగు బాణమును నాపై ప్రయోగించి నన్నతనికే అనన్యార్హశేషభూతురాలినిగా జేయుము. శ్రీసీతాదేవి, రామనామాంకితమగు అంగుళీయకమును జూచి యానందించినటులను, అతని విరహమును ధరించినటులను, నేనుగూడ కొంత యాప్యాయతజెందెదను — అని భావము.

రెండవపక్షమున – నీ మనస్సులో నతని గోవిందనామమును వ్రాసికొని అతనితో నన్ను జేర్పసంకల్పించుకొని, జేర్పుము. నీ మనస్సున నతని నామమును ధరించితివేని, దాని ప్రభావముచే నీకును నాయందు దయగలుగును; లేక, నీకును నావ్యథ అప్పుడు తెలియును – అని భావము. ఇట్లు రసమునను భవింపనారంభించిన దీనికి అంతమేలేదు.

(4-వ తిరుమొழி, 2-వ పాశురము)

(2) అవ :— సర్వేశ్వరుడు నాతో సంశ్లేషింపవలయుననియే తిరువేంగడము, తిరుక్కణ్ణపురము— మొదలగు దివ్యతిరుపతులలో వచ్చి వేంచేసియున్నాడు. తనవలె, నాకును అంత ఆతురతయున్నదో లేదోయని సందేహించుచు, తామసించుచున్నట్లున్నది. ఆ స్వామి నా అసహ్యావేదనను వెంటనే తెలిసికొని, సత్వరమే ఏతెంచి, నన్ను గాఢాలింగనముచేసికొను నట్లు, దైవము అను కూలించుగాక—అని ఉవ్విళ్ళూరుచున్నారు.

* కాట్టిల్ వేఙ్గడమ్ కణ్ణపురనగర్,
వాట్టమిన్ఱి మగిழ்న్దుఱై వామనన్,
ఓట్టరావన్దు ఎన్కైప్పఱ్ఱి, తన్నొడుమ్
కూట్టుమాగిల్ నీ కూడిడు కూడలే. ౪—౨.

టీక :— కూడలే = సంధానము గలుగజేయు దైవమా !, కాట్టిల్ వేఙ్గడమ్ = కాననమునందున్న తిరువేంగడపర్వతమునందును, నగర్ కణ్ణపురమ్ = నగరముగనుండు తిరుకణ్ణపురమునను, వాట్టమ్ఇన్ఱి = మనస్సులో కొరతలేక, మగిழ்న్దు = మనసార సంతోషించి, ఉఱై = నిత్యవాసముచేయుచున్న, వామనన్ = వామనావతారముచేసిన సర్వేశ్వరుడు, ఓట్టరావన్దు = పరుగెత్తుకొనివచ్చి, ఎన్ కైపఱ్ఱి = నా పాణినిగ్రహించి, తన్నొడుమ్ = తనతో, కూట్టుమ్ ఆగిల్ = (చేర్చి) కౌగలించుకొనెనేని, నీకూడిడు = నీవు కూడవలయును,

తా. ఓ సంధానదైవతమా ! నాతో సంశ్లేషింపవలయునని—ఆశ పడి, అరణ్యప్రచురమైన తిరువేంగడమునను మహానగరమైన తిరుకణ్ణ పురమునను మనసారప్రేమించివచ్చి, విడిసియున్నాడు. తన నాశ్రయించిన దేవతల శ్రమములజూచి ఓర్వజాలక, వామనుడై మహాబలిని నిరసించి, వారి కష్టములను పోగొట్టిన ఆ దయామయుడగు సర్వేశ్వరుడు నా పరి తాపమును గుర్తెఱింగి, సత్వరమే పరుగెత్తివచ్చి, తనదు శ్రీహస్తముతో నాహస్తమును పరిగ్రహించి, నన్ను తనకౌగిటికి చేర్చుకొనునట్లు అనుగ్ర హింపుము.

వి. వి :— నాట్టిప్పడై — నిత్యముక్తానుభావ్యమైయుండు పరమపదవాసమును వదలి హేయులగు సంసారుల నడుమవచ్చి చేరితివే - అను వ్యాసుల భావము లేక - అని అర్థము

(5-వ తిరుమొழி. 2-వ పాశురము)

(2) అవ :— ఎంబెరుమానులు (సర్వేశ్వరుడు తనను) బాధించుచున్న క్రమములను కోకిలతో చెప్పికొనుచు, వాని సాహాయ్యమును కోరుచున్నారు.

వెళ్ళై విళిశంగు ఇడక్కైయిల్ కొండ
విమలన్ ఎనక్కు ఉరుకాట్టాన్,
ఉళ్ళమ్ పుగున్దు ఎన్నై నైవిత్తు
నాళుమ్ ఉయిర్ పెయ్‌దు కూత్తాట్టుక్కాణుమ్,
కళ్ళవిழ் శెణ్బగ ప్పూమలర్ కోది
క్కళిత్తిశై పాడుమ్ కుయిలే,
మెళ్ళ విరున్దు మిழற్ఱి మిழற్ఱాదుఎన్
వేజ్గడవన్ వరక్కూవాయ్. 5—2.

టీక :— కళ్ అవిழ் = తేనెలు కారుచున్న, శెణ్బగమ్ పూ = సంపంగిపూవుల యందు, మలర్ కోది = సారమైన అంశములను అనుభవించి, కళిత్తు = దానిచే మదించి, ఇశై పాడుమ్ = ఆనందపారవశ్యమున మధురముగ పాడుచున్న, కుయిలే = కోకిలమా !, వెళ్ళై విళి శంగు = తెల్లనిదై (కైంకర్యరుచిగలవారిని) పిలుచునట్టి (శ్రీపాంచజన్యమను శంఖమును, ఇడక్కైయిల్ కొండు = ఎడమచేతిలో ధరించియున్న, విమలన్ = వినిర్మలుడైన పరమపురుషుడు, ఉరు = తన దివ్యమంగళవిగ్రహమును, ఎనక్కు = దాసురాలికి, కాట్టాన్ = సేవసాదింపవను చున్నాడు. (అదిగాను గాక). ఉళ్ళమ్ = నా హృదయమున, పుగున్దు = ప్రవేశించి, ఎన్నై = నన్ను, నైవిత్తు = బాధించి, (అంతటితో నేను నశించిపోవునట్లైన, ఇంకను నన్ను హింసించుటకు అవకాశముండదు గాన, నన్ను నశింపకుండునట్లుచేసి,) నాళుమ్ = ఎల్లప్పుడును, ఉయిర్ పెయ్‌దు = ప్రాణములను పీడించుచు, కూత్తాట్టుక్కాణుమ్ = (నేను బాధపడుచుండ) తాను వేడుకచూచుచు నిలిచియున్నాడు.

(ఇప్పుడు నీవు చేయవలసినదేమనగా,) ఇరున్దు = నా సమీపమున నిలిచియుండి, మెళ్ళ విழற్ఱిప్పాదు = నీ మృదుమధురములగు పలుకుల పలుకుచు, విలాసచేష్టితములచేయక, ఎన్ వేఙ్గడన్ = నాకై తిరువేంగడమున నిలిచియున్న ఎంబెరుమానులు, వర = ఇచ్చటికి వేంచేయునట్లు, కూవాయ్ = పిలువవలయును.

తా. మకరందనిర్భరములగు చంపకపుష్పములయందలి పరమ భోగ్యములగు మకరందముల పానముజేసి, మదించి, సంతోషాతిరేకమున మృదుమధురముగ పాటలుపాడుచుండు కోకిలములారా! మిక్కిలి స్వేచ్ఛ మైనదై, కైంకర్య రుచిగలవారల నాహ్వానించుచున్నట్టి శ్రీపాంచజన్య మను దివ్యశంఖమును తన ఎడమచేతిలోధరించియున్న పరమపవిత్రుడగు పురుషోత్తముడు తనదు దివ్యమంగళవిగ్రహమును దాసురాలికి సేవసాదింప నని పట్టుబట్టియున్నాడు. అదియునుగాక, నాకు తెలియకయే నాహృద యమున ప్రవేశించి నన్ను వేధించుచున్నాడు. మరియు, నా ప్రాణములను, ఎల్లప్పుడును, బలిమినిపట్టి పీడించుచు నేను మిక్కిలి బాధపడుచుండ, వేడుకగ చూచుచున్నాడు. నేను బాధను తాళజాలకయున్నాను. కాబట్టి, నాయందనుగ్రహముంచి, ఓ కోకిలములారా! నాదగ్గరకువచ్చి, విరహతాపమును అధికము చేయు మీ విలాస చేష్టితములనన్నిటిని చాలించి, నా స్వామియగు తిరువేంగడముడయానులను వేవేగ, ఏతెంచు నట్లు ఆహ్వానింపుడు.

(10-వ తిరుమొழி, 5-వ పాశురము)

(5) అవ :— శ్రీనాచ్చియార్లు విరహావస్థననుభవించు చున్నారు. ఎటుజూచినను వికసించిన పుష్పములు గోచరింపగ, వానిని జూచి సహింప జాలనివారై, కన్నులమూసికొనిరి. కాని, చూతాంకురాస్వాదకషాయ కంఠములగు కోకిలముల మధురారావములు వినిపించెను. అంత నోర్వ లేనివారై, ఆ కోకిలములను జూచి, 'దయచేసి మీ పాటల నిలుపుడు' అని ప్రార్థించుచున్నారు.

పాడుమ్ కుయిల్‌గాళ్ ఈదువెన్న పాడల్, నల్ వేఙ్గడ

నాడర్ నమక్కొరునాళ్ తువ్వు తన్దాల్ వన్దుపాడుమిన్,

ఆడుమ్ కరుళక్కొడియుడైయార్ వన్దు అరుళ్ శెయ్‌దు,

కూడువరాయిల్ కూవి నుమ్ పాట్టుక్కళ్ కేట్టుమే. ౧౦—౫.

టీక :— పాడుమ్ = మరించి పాటలుపాడుచున్న, కుయిల్‌గాళ్ = కోకిలము లారా!, ఈదు = కర్ణకఠోరమైన ఈ ఘోషము, ఎన్న పాడల్ = ఏమిపాట నల్ వేఙ్గడమ్ నాడన్ = విలక్షణమైన శ్రీ వేంకటాచలమున నివసించుచున్న సర్వేశ్వరుడు, నమక్కు = నా విషయమున, ఒరువాళ్వు = ఒక ఉజ్జీవనకరమగుపనిని, తన్దాల్ = చేసె నేని, వన్దుపాడుమిన్ = (అప్పుడు) మీరలిచ్చటికివచ్చి యథేష్టముగ పాడుడు, ఆడుమ్ = ఆనందముచే నర్తనము చేయుచున్న, కరుళన్ = శ్రీ గరుత్మంతుని, కొడియుడై యార్ = టెక్కెముగ గలిగియున్న ఆ పురుషోత్తముడు, అరుళ్ శెయ్‌దు = కృపజేసి, వన్దుకూడువర్ ఆయిడిల్ = నా వద్దకువచ్చి, నాతో సంశ్లేషించునేని, కూవి = (అప్పుడు మిమ్ముల) పిలిపించి, నుమ్‌పాట్టుక్కళ్ = మీ పాటలను, కేట్టుమే = వినెదను.

తా॥ ఒడలు తెలియక పాటలు పాడుచున్న ఓ కోకిలములారా! కర్ణకఠోరమగు ఈ అఱుపులు పాటలా? దయచేసి, చాలింపుడు. తల వేదనగనున్నది. పరమరమణీయమైన శ్రీవేంకటాచలమున వేంచేసియుండు మాస్వామి, నన్ను ఉజ్జీవింపజేయునేని, అప్పుడు మీరలువచ్చి, యథేష్ట ముగపాడుడు. సంతోషాతిరేకముచే నెల్లప్పుడును నర్తనముచేయుచున్న శ్రీగరుత్మంతుని టెక్కెముగగల్గిన ఆకమనీయమూర్తి, నన్ను కరుణించి, నాతోడవచ్చి, సంశ్లేషించునేని, తత్క్షణమే, నేనేమిమ్ముల పిలపించి, మీ పాటల వినుచు, ఆనందించెదను. దయచేసి ఇప్పటికి చాలింపుడు.

వి:— ఈ దెన్నపాడల్ — ఈ కాలమున నా పాడుట. ఈ పాటలా పాడుట? ఇసుకపక్కలను దావాగ్ని ప్రజ్వలించుచుండ, మధ్యాహ్నమునండే చందనమును పూసికొనిన వారలవలె, ఇట్టి సమయమున నా గానామృతమును నేను పానముజేయ గలను? అని భావము సూచింపబడుచున్నది.

(10-వ తిరుమొழி, 8-వ పాశురము)

(8) అవ :— గగనమండలమున వ్యాపించియున్న మేఘములజూచి, విరహము అగ్గలముకాగా, తాళజాలనివారై, వానితో మొరలిడు చున్నారు

> మழைయే మழைయే మణ్ పుఱమ్ పూశి ఉళ్ళాయ్ నిన్ఱ,
> మెழுగూఱ్ఱినాప్పోల్ ఊఱ్ఱునల్ వేఙ్గడత్తుళ్ నిన్ఱ,
> అழగప్పిరానార్ దమ్మై ఎన్నెఞ్జత్తగప్పడ,
> త్తழுవినిన్ఱు ఎన్నై త్తదెత్తుక్కొణ్డు ఊఱ్ఱవుమ్ వల్లైయే. ౧౦—౮.

టీక :— మழைయే మழைయే = ఓ మేఘములారా !, పుఱమ్ = పైభాగమున, మణ్ పూశి = మట్టినిపూసి, ఉళ్ళాయ్‌నిన్ఱ = లోపలిభాగమునందున్న, మెழுగుఊఱ్ఱి నాప్పోల్ = మైనమును కరిగించి, బయటికి పోసినట్లు, ఊఱ్ఱువన్=నన్ను కౌగిలించు కొని, నా అంతస్సారమైన ఆత్మను కరిగించి, బయటపోసినవారైన, నల్ వేఙ్గడత్తుళ్ = పరమభోగ్యమైన శ్రీవేంకటాచలమున, నిన్ఱ =నిలిచియున్న, అழగప్పిరానార్ తమ్మై= ఆ సుందరజామాతను, ఎన్ నెఞ్జత్తు = నా మనస్సులో, అగప్పడ=సేవసాధించునట్లుచేసి, ఎన్నై = నన్ను, తదైత్తుక్కొణ్డు = వానితో కూడ గాఢముగజేర్చి, (అటుతర్వాత,) ఊఱ్ఱవున్ వల్లయే = వర్షించుట గద సామర్థ్యము.

తా॥ ఆకాశప్రదేశమునంతటిని వ్యాపించి, వర్షించుట కభిముఖములగు నో మేఘములారా ! కొంచెమాగుడు. విరహబాధచే విశ్లథయై యున్న నన్ను ఇంకను బాధపెట్టకుడు. పైభాగమున మృత్తికతో లేపనముచేసి, లోపలనున్న మైనమును కరగించి, పారపోయునట్లు, తిరువేంగడముడయానులు, నన్ను కౌగిలించుకొని, అంతస్సారమైన నా ఆత్మవస్తువును కరగించి, పారబోసియున్నాడు. అట్టి ఆశ్చర్యగుణచేష్టితుడగు నా సర్వేశ్వరుని నా మనస్సులో తోచినట్లు గాఢాలింగనముచేసికొని, తన్మయతను పొంది, అతనితో నొకటిగచేరునట్లు అనుగ్రహింపుడు. అటు పిమ్మట, మీ యిచ్ఛవచ్చినట్లు వర్షింపుడు. ఇదిగద గొప్పవారల సామర్థ్యము.

వి. వి:— (1) మఱ్ఱైయే మఱ్ఱైయే - అను ద్విరుక్తికి, మేఘము లెంతదూరము జనినను, వాని చెవిలో నీ శబ్దము పడునటుల బిగ్గఱగా పిలుచుచున్నదని భావము.

(2) మణ్ పుఱమ్ పూశి — తామ్రవిగ్రహములు, కంచుపాత్రలు — మొదలగు వానిని చేయువారలు మొట్టమొదట వాని ఆకారమునకు సరిగ మైనముతో జేసికొని, దానిపై మట్టినిపూసి, ఒకచోట బెజ్జము వేసి, లోపలనుండు మైనమును కాచి తీసివైచి, ఆద్వారమున లోహమును కఱగించి పోసెదరు. అటులనే, తిరువేంగడముడయానులును, పైన సంశ్లేషించి, లోపలనుండు నా జవసత్త్వములు కఱగి పోవునటుల జేయ సమర్థుడై యున్నాడు. "ఉఱమ్బితే అణైత్తు అగవాయ్కుడిపోమ్బుడి ప్పణ్ణమవరాయత్తు" అని శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై సరసోక్తి

శ్రీ ఆండాళ్ తిరువడిగళ్ శరణము.

శ్రీరస్తు
శ్రీమతే కులశేఖరయోగినే నమః

# శ్రీ కులశేఖరాళ్వార్లు ప్రసాదించిన పెరుమాళ్ తిరుమొழிలోని

# మంగళాశాసన పాశురములు

(4-వ తిరుమొழி)

## అవతరిణిక

శ్రీ కులశేఖరప్పెరుమాళ్లు క్రింది మూడు తిరుమొழிలలోను శ్రీ రంగమునను, శ్రీరంగనాథుని యందును తమకుండు మితిలేని అభినివేశమును ప్రకటించిరి. ఈ తిరుమొழிయందు శ్రీవేంకటాచలమున తమకుండు ఆదరాతిశయమును ప్రకటించుచున్నవారలై, తిరుమలలో నేదేని యొక ప్రాణిగ జన్మించుటకు తామాశపడి ప్రార్థించుచున్నారు.

(1) అవ :– అందు మొదటిపాశురమున, తిరువేంగడమున నివసించుభాగ్యము కలిగెనేని వివేకశూన్యమగు తిర్యగ్ జాతిలో జన్మించుటయు దాసునకు పరమోపాదేయము. అట్టి భాగ్యములేని ఈ మానుషజన్మము నాకెప్పటికిని వలదు–అని అనుచున్నారు.

* ఊనేఱు శెల్వత్తు ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్,
ఆనేఱేழ் వెన్ఱాన్ అడిమైత్తిఱమల్లాల్,
కూనేఱు శంగ మిడత్తాన్ తన్ వేఙ్గడత్తు,
కోనేరివాழுమ్ కురుగాయ్ ప్పిఱప్పేనే. ౧

టీక :— యాన్ = (అతను నాకు శేషియని గుర్తించిన) నేను, ఆన్ ఏఱు ఏழ் వెన్ఱాన్ = (శ్రీనప్పిన్నపిరాట్టిని (నీళాదేవిని) వివాహము చేసికొనుటకై) ఏడు వృషభములను జయించిన మా స్వామికి, అడిమైత్తిఱమ్ అల్లాల్ = కైంకర్యము చేయుటనే నేను ప్రార్థించెదనుగాని, ఊన్ ఏఱు శెల్వత్తు = (రోజుకురోజు) మాంసములు వృద్ధి జెందుటయను అనిత్యమైన భాగ్యముగలిగిన, ఉడల్ పిఱవి = ఈ మానుషదేహముతో

జన్మించుటను, వేణ్డేన్ = అపేక్షించను, (ఇక దేనిని కోరెదననగ,) కూన్ ఏఱు శెఙ్గన్ = శేషత్వమును సూచించుటకై శ్రీపాంచజన్యమును, ఇడత్తాన్ తన్ = ఎడమ చేతిలో ధరించియున్న సర్వేశ్వరునియొక్క, వేంగడత్తు = శ్రీవేంకటాద్రిలో, కోనేరి = శ్రీస్వామి పుష్కరిణి యందు, వాழுమ్ = జీవించుచున్నటువంటి, కురుగు ఆయ్ పిఱప్పేన్ = కొంగగనైనను జన్మింపగలను.

తా॥ మదించి, లోకములనెల్ల హింసించుచుండు నేడు వృషభములను మర్దించి, శ్రీ నీళాసుందరిని వివాహమాడిన, ఆశ్రితపక్షపాతియగు సర్వేశ్వరుని కైంకర్యమునే నేనెల్లప్పుడును అపేక్షింతును. అట్టి భాగ్యము లేని సిరిసంపదలతో దులదూగు మానుషజన్మమును గూడ నేను ఆశపడను. శ్రీ పాంచజన్యమను దివ్యశంఖమును తన ఎడమచేతిలో ధరించియుండు శ్రీ మన్నారాయణుని శ్రీవేంకటాచలమునందలి శ్రీస్వామిపుష్కరిణిలో నివసించు భాగ్యముగల పక్షిగనైనను జన్మింప ఆశపడెదను.

వి. వి :— (1) "ఆన్ ఏఱుఏழு వెన్ఱాన్" — అనుదానిచే దుష్టశిక్షణము, శిష్టరక్షణము, సమాశ్రితపక్షపాతిత్వము అనుగుణములు తెలియుచున్నవి.

(2) "కూన్ ఏఱు శెఙ్గన్" — అనుదానిచే ప్రణవాకారమగు పాంచజన్యముచే తన శ్రీపాదముల నాశ్రయించుటకు దగిన విజ్ఞానవివేకములను ఆ సర్వేశ్వరుడే ఒసంగునని తెలియుచున్నది.

(3) భగవత్సంబంధములేని మానుషజన్మముకంటెను, ఆ సంబంధముగల పక్షిజన్మమైనను చాల శ్రేష్ఠమని ఈ పాశురముయొక్క సారాంశము.

(2) అవ :— ఈ లోకమునందలి భోగములకంటె స్థిరములై నిరవధికములై యుండు భోగములు గదా స్వర్గాదిభోగములు; అవి లభించినచో నేమి చేయుదురు? అనిన, ఆ భోగములైనను, క్రిందచెప్పిన భూలోకభోగములైనను సరే, అవియన్నియును నాకు వలదని చెప్పుచున్నారు.

ఆనాద శెల్వత్తు అరమ్బైయర్గళ్ తఱ్ చూழ,
వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్,
తేనార్ పూఞ్జోలై త్తిరువేంగడ చ్చునైయిల్,
మీనాయ్ ప్పిఱక్కుమ్ విదియుడైయే నావేనే. ౨

టీక :— అనాద = నశింపని, శెల్వత్తు=(యౌవనమును) సంపత్తునుగలిగినట్టి, అర మ్బైయర్ గళ్ = రంభ మొదలగు అప్సరసలు, తన్ = తనను, శూழ = చుట్టియుండగ, వాన్ ఆళున్ శెల్వముమ్ = స్వర్గమునను భవించు నైశ్వర్యమును, మణ్ణరశుమ్ = భూలోక మును పరిపాలించుటయను ఐశ్వర్యమునుగూడ, యాన్ వేణ్డేన్ = అనాయాసముగ లభించినను నేను ఇచ్ఛయింపను, తేన్ ఆర్ = తేనెలతో నిండి వికసించియున్న, పూమ్ శోలై = పుష్పములతో విరాజిల్లు తోటలతో నిండియుండు, తిరువేంగడమ్=శ్రీవేంకటా చలమున నున్నట్టి, శునైయిల్ = దొనలలో, మీనాయ్ పిఱక్కుమ్ = ఒక మత్స్యముగ నైనను పుట్టుబకై, ఇది=భాగ్యమును, ఉడయేన్ ఆవేనే=కలిగినవాడనుగనగుదునా ?.

తా॥ నిత్యయౌవనవతులగు రంభ మొదలగు దివ్యాప్సరసలును అడుగులకు మడుగులొత్తుచుండ స్వర్గసుఖములననుభవించుటయను మహా దైశ్వర్యమును గాని, ఈ లోకమునందలి సామ్రాజ్యసుఖములను గాని నే నొల్లను. మకరందనిర్భరములై, బాగుగ వికసించినట్టి, నానావిధములగు పుష్పజాతములతో మిక్కిలి మనోజ్ఞములైన పూదోటలతో నిండియుండు శ్రీవేంకటాచలమున నెలకొనియుండు దొనలలో నివసించు భాగ్యముగల ఒక మత్స్యముగనైనను జన్మించు భాగ్యము నాకు కలుగుగాక !

(3) అవ :— భగవంతునికి నంతరంగ కైంకర్యముచేయుటకు నను వగునేని క్రింది పాశురములలో నిరసించిన మనుష్యజన్మమైనను నాకు గలుగుగాక — అని చెప్పుచున్నారు.

పిన్నిట్టశడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,
తున్నిట్టు ప్పుగలరియ వైగున్ద నీళ్ వాశల్,
మిన్ వట్టచ్చుడరాழி వేఙ్గడక్కోన్ తానుమిழுమ్,
పొన్ వట్టిల్ పిడిత్తు ఉడనే పుగప్పెఱువే నావేనే. 4

టీక :— పిన్నిట్టశడైయానుమ్ = పెనవేసికొనియున్న జటాజూటము (జడలు) గలిగిన శివుడును, పిరమనుమ్ = చతుర్ముఖబ్రహ్మయు, ఇన్దిరనుమ్ = దేవేంద్రుడును, (నేనుముందువెళ్ళవలయును, నేనుముందువెళ్ళవలయును అను ఇచ్ఛచేత) తున్నిట్టు = ఒకరి నొకరుద్రోసికొని, పుగల్ అరియ = లోపల ప్రవేశించుటకు సాధ్యపడకుండునట్టి,

వైకున్దమ్ = భూలోక వైకుంఠమగు తిరుమలయందున్న, నీళ్ వాశల్ = (దివ్యసన్నిధి యొక్క) మహోన్నతమైన ద్వారమున, మిన్ వట్టన్ = మెరుపులను వంచినట్లున్న, శుడర్ ఆళి = జ్యోతిర్మయమై జ్వలించుచున్న చక్రాయుధమును ధరించియున్న, వేంగడక్కోన్ తాన్ = తిరువేంగడముడయానులు, ఉమిళ్ = ఉమ్మివేయుచున్న, పొన్ వట్టిల్ = బంగారుగిన్నెను, పిడిత్తు = చేతిలో పట్టుకొని, ఉడనేపుగప్పెఱువేనావేనే = అంతరంగ పరిజనములతో గూడి నేనును, లోపల ప్రవేశించునట్టి భాగ్యమును పొందగలుగుదునా ?.

తా॥ దివ్యవైభవోపేతమగు భూలోకవైకుంఠమైన శ్రీవేంకటాచలమునందలి దివ్యసన్నిధివాకిట జటాధారియగు పరమేశ్వరుడును, సత్యలోకాధిపతియగు చతుర్ముఖబ్రహ్మయు, దేవలోకాధిపతియగు ఇంద్రుడును, అహమహమికగ నొకరినొకరు త్రోసికొనుచు లోపల ప్రవేశింపలేక, ద్వారముననే కాచియుండవలసినట్లుండగ, విద్యుచ్చక్రమువలె మెరయుచున్న చక్రాయుధమును ధరించియున్నట్టి తిరువేంగడముడయానులు తాంబులాదులను ఉమ్మివేయు బంగారుగిన్నె (పతద్గ్రహము)ను ధరించి, అంతరంగ పరిజనములతో గూడ నిరాతంకముగ లోపల ప్రవేశించి, కైంకర్యముల జేయగల్గు భాగ్యము నాకు కల్గునా ?

వి. వి : — దేవాధిదేవులగు బ్రహ్మరుద్రేంద్రాదులును శ్రీవారిని సందర్శించవలెనన్న వేచియుండవలసియున్నదనియు, స్వామివారి అంతరంగ పరిజనులకు మాత్రము ఎల్లప్పుడును, ఏ అడ్డమును లేక, దేవాలయమును ప్రవేశించుటకు అవకాశభాగ్యమున్నదనియును సూచింపబడుచున్నది. శ్రీవారి కైంకర్యము బహుపుణ్యార్జితముగద !.

(4) అవ : — మనుష్యశరీరము ఐహికభోగముల కలుగజేయుటకు గూడ అనుకూలమైయున్నది. కనుక, ఆ జన్మమే వలదు. తిరువేంగడముడయానుల కటాక్షమునకు పాత్రమగునట్లు తిరుమలలో నుద్భవించియున్న ఒక చెట్టుగానైనను, గుట్టగానైనను అగుదును గాక అని ప్రార్థించుచున్నారు.

ఒణ్ పవళ వేలై యులవుతణ్ పాఱ్కడలుళ్,
కణ్ తుయిలుమ్ మాయోన్ కழలిణై గళ్ కాణ్బదఱ్కు,
పణ్ పగరుమ్ వణ్డినజ్గళ్ పణ్ పాడుమ్ వేజ్గడత్తు,
శెణ్బగమాయ్ నిఱ్కుమ్ తిరువుడై యే నావేనే. ౪

టీక :— ఒణ్ పవళమ్ = మెరయుచున్న పగడతీగెలను, వేలై ఉలవు = గట్టుకు చేర్చుచున్న (అలలతో) నిండియున్న, తణ్ పాఱ్కడలుళ్ = సుభగశీతలమైన క్షీర సముద్రమున, కణ్ తుయిలుమ్ = (నిఖిలజగద్రక్షణచింత యను) యోగనిద్రను అనుభవించు చున్న, మాయోన్ = ఆశ్చర్యగుణ చేష్టితుడగు సర్వేశ్వరుడైన తిరువేంగడముడయానుల యొక్క, కழల్ ఇణైగళ్ = పాదారవిందముల జంటను, కాణ్బదఱ్కు = సేవించుటకై, పణ్ పగరుమ్ = మధురముగ ఝుంకారము చేయుచున్న, వణ్డుఇనంగళ్ = తుమ్మెదల గుంపులు, పణ్ పాడుమ్ = మధుర గానములజేయుచున్న, వేంగడత్తు = తిరుమలలో, శెణ్బగమ్ ఆయ్ నిఱ్కుమ్ = చంపకవృక్షమై నిలచుటకు దగిన, తిరువుడైయే నావేనే= భాగ్యసంపద గలిగినవాడనుగనగుదును గాక !

తా॥ అలలతాకిడిచే కాంతి యుక్తములగు ! పగడపు తీగలను గట్టుకు చేర్చుచు, సుభగశీతలమైయున్న పాలసముద్రమున యోగనిద్రజెందుచున్న తిరువేంగడముడయానుల దివ్యపాదారవిందద్వంద్వమును సేవించుటకు దగినట్లు, మధురమధురముగ గానములజేయు తుమ్మెదల గుంపులతో శోభిల్లు చున్న తిరువేంగడమున ఒక చంపకవృక్షమై పుట్టుటకు దగిన భాగ్యము గలవాడనగుదును గాక !.

వి వి :— క్షీరసముద్రమునందు వేంచేసియున్న శ్రీమన్నారాయణుని వ్యూహావతారమే విభవావతారములకు మూలకందమైనట్లు, అర్చావతారమునకును మూలకందమై యున్నదనియు, అచ్చట వేంచేసియుండు సర్వేశ్వరుడును, శ్రీ వేంకటాచలముననున్న వాడును ఒక్కడే యనియును తెలయుచున్నది.

(౫) అవ :— చంపకము మంచిపరిమళముగలిగినదగుటచే దానిని అందఱును సేవింతురు. అదియును ప్రయోజనాంతరమునకు అనుకూలమగుననిభావించి, అట్టి విశేషములెవ్వియునులేని ఒక పొదగనైనను ఉందును అని చెప్పుచున్నారు.

కమ్బమదయానై క్కழுత్తగత్తిన్ మేలిరున్దు,
ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్,
ఎమ్బెరుమాన్ ఈశన్ ఎழிల్ వేఙ్గడమలై మేల్,
తమ్బగమాయ్ నిఱ్కుమ్ తవముడైయే నావేనే. ౫

టీక :— కమ్బన్ = (తనను చూచినవారల కెల్లఱకును భయముచే) ఒణుకును గలుగ చేయుచున్న, మదయానై = మదించిన ఏనుగుయొక్క, కழுత్తు అత్తిన్ మేల్ ఇరున్దు = మెడపై (రాజాధిరాజు అను వైభవమును సూచించునట్లు) ఠీవిగగూర్చొని, ఇన్బు అమరున్ = నానావిధములైన భోగభాగ్యములనుపొంది, సుఖముననుభవింపదగినట్టి, శెల్వముమ్ = ఐశ్వర్యమును, అరశుమ్ = (దానికి కారణమగు) ఈ రాజస్యతను, యాన్ వేణ్డేన్ = భగవచ్ఛేషత్వజ్ఞానముగల నేను ఇచ్ఛగింపను, ఎమ్బెరుమాన్ = నాకు నుపకారకుడై, ఈశన్ = అందఱికిని స్వామియునైన, భగవంతునియొక్క, ఎழிల్ వేంగడ మలై మేల్ = సుందరతమమైన శ్రీ వేంకటాచలమున, తమ్బగమ్ ఆయ్ నిఱ్కుమ్ = పొదయై యుండుటకు దగిన, తవమ్ = తపస్సుచేయుగలుగు భాగ్యమును, ఉడైయేన్ ఆవేనే = కల వాడనగుదును గాక !.

తా॥ 'సర్వేశ్వరునకు దాసుడను' అను వివేకము నాకు సిద్ధించినది. కాబట్టి, చూపరులకు భయముగలుగజేయు మదపుటేనుగుపై నెక్కి, 'నేను రాజాధిరాజును' అని గర్వించుటకు నాస్పదమగు నైశ్వర్యమును గాని, సార్వభౌమత్వమునుగాని, నేను ఇచ్ఛగింపను. సర్వజగత్స్వామియై, నాకు మహోపకారకుడగు, శ్రీ వేంకటాచలపతి వేంచేసి యుండు, పరమ రమణీయమగు దివ్యపర్వతమున నొక గుట్టగనైనను పుట్టునట్టి భాగ్యముగల వాడనగుదును గాక. అట్లయిన నేను ధన్యుడనగుదునని భావము.

వి వి :— భగవత్సంబంధమునకు ప్రతిబంధకములగు భోగభాగ్యములన్నియు ను వ్యర్థములు ; భగవత్సంబంధమొక్కటియే తరణోపాయము — అని సూచింపబడు చున్నది.

(6) అవ :— క్రింది పాశురములో అనుసంధించినట్లు చేపగజన్మించినను, పొదగజన్మించినను, అవి అనిత్యములగుటచే, ఒకప్పుడు పుట్టి, ఒకప్పుడు నశించిపోవును. అప్పుడు భగవత్సంబంధమునకు సానుకూల్యముండదు. కాబట్టి, ఎల్లప్పుడును స్థిరముగనుండు తిరుమలలోనే యొక భాగముగ అగుదునుగాక, అని అపేక్షించుచున్నారు.

మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనగైయుమ్,
అన్నవర్ దమ్ పాడలోడుమ్ ఆడలవై ఆదరియేన్,
తెన్నవెన వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్ వేఙ్గడత్తుళ్,
అన్ననైయ పొఱ్కుడవామ్ అరుందవత్తే నావేనే. ౬

టీక :— మిన్ అన్నైయ = మెరుపుతీగవలె, నుణ్ ఇడైయార్ = సూక్ష్మమైన నడుము గలిగిన, ఉరుప్పశియుమ్ = ఊర్వశియును, మేనగైయుమ్ = మేనకయును, అన్నవర్ దమ్ = వీరలవంటి సౌందర్యముగల స్త్రీలయొక్క, పాడలోడుమ్ = పాటలతో గూడుకొనిన, ఆడల్ అవై = ఆనృత్యములను, ఆదరియేన్ = నేను ఆశపడను; వణ్డు ఇనఙ్గళ్ = తుమ్మెదలసమూహములు, తెన్న ఎన పణ్ పాడుమ్ = తెననతోమ్ అని ఆరంభించి మధురముగ పాడుచున్న, వేఙ్గడత్తుళ్ = శ్రీవేంకటాచలమున. అన్నైయ = అటువంటి (రమణీయమైన) పొన్ కుడము ఆమ్ = బంగారుమయమైన శిఖరముగ అగుటకు తగిన, అరుమ్ తవత్తన్ ఆవేనే = దుర్లభమైనతపస్సుగలవాడనగుదును గాక!

తా॥ మెరుపుతీగవలె సన్నని నడుముగల కృశోదరులగు ఊర్వశి మేనక మొదలగువారివలె మిక్కిలి అందగత్తెలగు నారీమణుల సంగీతముతో గూడిన నృత్యము మొదలగు వానిని నేను ఆశపడను. మకరందరసాస్వాద మధురములగు దివ్యఝుంకారములజేయుచున్న తుమ్మెదలతో శోభిల్లుచుండు తిరుమలలో పరమపావనమైన సువర్ణశిఖరముగ నుండు భాగ్యము నాకు గలుగుగాక!.

వి వి :— భగవంతుని చరణారవిందముల స్పర్శచే పరమపావనమగు పర్వతశిఖరమే పరమోపాదేయమైనది క్షణభంగురములగు నైహికభోగములన్నియును వ్యర్థములు అని సూచింపబడుచున్నది.

(7) అవ :_ తిరుమలలో నొక శిఖరముగనున్నచో ఎక్కగలిగిన సామర్థ్యముగలవారలు అనుభవింపదగియు, అశక్తులకు దుర్లభముగను ఉండను. కనుక, అట్లుండక, పరమభాగవతోత్తములందఱికిని, అనుభవ యోగ్యమైయుండునట్లు, తిరుమలలో నొక నడబావిగ నుందునుగాక అని చెప్పుచున్నారు.

వానాళుమ్ మామదిపోల్ వెణ్కుడైక్కీళ్, మన్నవర్దమ్,
కోనాగి వీత్తిరున్దు కొణ్డాడుమ్ శెల్వఱియేన్,
తేనార్పూఞ్జోలై త్తిరువేజ్గడమలై మేల్,
కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయే నావేనే. ౭

టీక :— వాన్ ఆళుమ్ = ఆకాశమునంతయును తనకు విహారస్థానముగ జేసికొని ప్రకాశించుచున్న, మా మదిపోల్ = సంపూర్ణ చంద్రునివలెనున్న, వెణ్ కుడై క్కీళ్ = శ్వేతచ్ఛత్రముక్రింద, మన్నవర్దమ్ కోమానాగి వీత్తిరున్దు = రాజాధిరాజై మహా విభవములతో సంపన్నుడై యుండి, కొండాడుమ్ = జనులందఱును కొనియాడునట్లు, శెల్వ = శ్రీసంపదలతో దులదూగుటను, అఱియేన్ = (దానిని ఒక గొప్పగ) మనస్సులో నైనను తలంచను, తేనార్ పూ = తేనెలతోనిండి వికసించియున్న పుష్పములతో శోభాయమానములై యుండు, శోలై తిరువేంగడమ్ మలై మేల్ = ఉద్యానవనములతో విరాజమానమైయున్న శ్రీవేంకటాచలముపైనుండు, కాన్ ఆఱు ఆయ్ = ఆ అడవియేఱై పాయుమ్ = పారునట్టి, కరుత్తు = భాగ్యమును, ఉడయేన్ ఆవేనే = గలవాడ నగుదును గాక !

తా॥ ఆకాశమందంతటను సంచరించు పూర్ణ చంద్రునివలె శోభాయమానమైన శ్వేతచ్ఛత్రపునీడలో ఠీవిగ పేరోలగముననుండుటకు నాస్పదమైన ఐశ్వర్యమును నేను కోరను. తేనెలతోనిండి, వికసించియున్న పూవులతో నిండియుండు ఉద్యానవనములతో విరాజిల్లు తిరుమలపై ప్రవహించుచున్న ఒక అడవిఏఱుగనైనను నుండుభాగ్యము నాకు గలుగు గాక !.

(8) అవ :—అడవిపైత్రై యుండినచో, అది కొన్నిసమయములందు ఎండిపోవును. అప్పుడు భగవత్సంబంధమునకు అనుకూల్యములేక పోవును. కనుక అదియును వలదు. ఇక, తిరువేంగడముడయానులను సేవింప నేతెంచుచున్న శ్రీభాగవతుల శ్రీపాదధూళిపడునట్లు ఒక బాటగనైనను గాక యని ఆశపడుచున్నారు.

పిఱై యేఱు శడై యానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,
ముఱై యాయ పెరువేళ్వి క్కుఱై ముడిప్పాన్ మఱైయానాన్,
వెఱియార్ తణ్ శోలై త్తిరువేఙ్గడమలై మేల్,
నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలై యుడై యేనావేనే. 8

టీక :— పిఱైఏఱు=బాలచంద్రుడు అధిష్ఠించియున్న, శడైయానుమ్=జటలు గలిగిన పరమశివుడును, పిరమనుమ్ = చతుర్ముఖబ్రహ్మయు, ఇన్దిరనుమ్=దేవేంద్రుడును, ముఱైఆయ = తమ తమ అధికారానుగుణముగ జేయుచున్నట్టి, పెరువేళ్వి = శ్లాఘ్యమైన యాగములకు ఫలమును, కుఱైముడిప్పాన్ = వారివారికొఱతలను దీర్చి, వారివారి అపేక్షితముల నిచ్చువాడును, మఱైయానాన్ = వేదములయందు పరాత్పరుడని వర్ణింపబడుచున్న సర్వేశ్వరుడు వేంచేసియుండు, వెఱిఆర్ తణ్ శోలై = పరిమళములు అతిశయింప, చల్లనివై యుండు దివ్యారామములతో గూడుకొనియున్న, తిరువేంగడమలై మేల్ = శ్రీ వేంకటాచలమున, ఎల్లప్పుడును (శ్రీవైష్ణవుల పాదరేణువులు పడునట్లు) నెఱిఆయ్ కిడక్కుమ్ = మార్గముగనుండుటకు, నిలైఉడైయేన్ ఆవేనే = అభినివేశముగల వాడనగుదును గాక !.

తా॥ బాలచంద్రుని వెన్నెలలచే విరాజిల్లుచున్న జటాజూటమును ధరించి, సకలలోకవంద్యుడై యుండు మహేశ్వరుడును, అతనికిని జనకుడై పరమవైభవోపేతుడగు చతుర్ముఖబ్రహ్మయు, దేవలోకాధిపతియగు మహేంద్రుడును, తమతమ యోగ్యతల ననుసరించి, అనుష్ఠించు యజ్ఞయాగములకు ఫలములనిచ్చి, వారి యపేక్షితములనన్నింటిని పూర్తిజేయునట్టి వాడును, వేదప్రతిపాద్యవైభవుడును నగు సర్వేశ్వరునియొక్క సుగంధ

పుష్పరమణీయములగు దివ్యారామములతో విరాజిల్లుచుండు శ్రీవేంకటాచలమున శ్రీవైష్ణవుల పాదధూళిచే పరమపావనమగు నొక మార్గముగనైనను నుండగలుగుదునా ? అని యాశపడుచున్నారు.

( ) అవ :— భక్తులు సంచరింపనప్పుడు మార్గమై యుండుట నిష్ప్రయోజనమగుననియు, అంతకంటెను, పెరుమాళ్ళకటాక్షము నేరుగ ప్రసరించునట్టిదియు, ఎల్లప్పుడును భక్తుల పాదస్పర్శముచే బవిత్రమైనట్టిదియునగు గడపగ నుండుటమేలనియు నట్లు అపేక్షించుచున్నారు.

* శెడియాయ వల్వినైగళ్ తీర్కుమ్ తిరుమాలే,
నెడియానే వేఙ్గడవా నిన్ కోయిలిన్ వాశల్,
అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దియఙ్గుమ్,
పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే.

టీక :— శెడిఆయ = వృక్షములవలె నభివృద్ధములైయుండు, వల్వినైగళ్ = క్రూరములైన కర్మములను (సంసారసంబంధమును,) తీర్కుమ్=పోగొట్టునటువంటి, తిరుమాలే=పరమకరుణాకరుడవగు నో శ్రియఃపతీ ! నెడియానే=సర్వాధికా ! వేంగడవా = తిరుమలలో వేంచేసియున్న స్వామీ ! నిన్ కోయిలిన్ వాశల్ = దేవరవారి దివ్యసన్నిధి వాకిట, అడియారుమ్ = భాగవతులును, వానవరుమ్ = దేవతలును, అరమ్బైయరుమ్ = రంభమొదలగు నప్సరఃస్త్రీలును, కిడన్దు ఇయఙ్గుమ్ = ఎడతెగక సంచరించుచుండు, పడియాయ్ కిడన్దు = గడపగనుండి, ఉన్ పవళవాయ్ = పగడమువలె మనోజ్ఞమైన దేవరవారి అధరోష్ఠమును, కాణ్బేనే = సందర్శించుభాగ్యము గలవాడనగుదును గాక !

తా మహావృక్షములవలె నభివృద్ధిజెందియుండు నా క్రూరకర్మములనన్నిటిని పోగొట్టి, నన్ను గాపాడిన ఓ శ్రియఃపతీ ! సర్వలోకాధికా ! శ్రీవేంకటాచలపతీ ! నాకు దీనిని మాత్రము అనుగ్రహింపుము ! ఎల్లప్పుడును ఎడతెగక నీ భక్తులు సంచరించు నీ దేవాలయపు ద్వారమునందలి గడపగనుండు భాగ్యమును నాకు అనుగ్రహింపుము. అట్లయినచో నెల్లప్పుడును పరమమనోహరమగు నీ దివ్యాధరమును సందర్శించు భాగ్యము నాకు గలుగును. అట్లు కృపజేయుమూ—అని ప్రార్థించుచున్నారు

వి. వి :— ఈ పాశురము పరమభోగ్యమైనది కావున యీ పాశురమూలననే, పెరుమాళ్ళ సన్నిధి వాకిలిగడపకు "కులశేఖరప్పడి" అను ప్రసిద్ధిగలిగినది

(10) అవ :— క్రింది పాశురములో గడపగనుండవలెనని అపేక్షించుట పెరుమాళ్ళమోవిని సందర్శించు భాగ్యముగలుగుననియే. అది సంప్రాప్తము కానప్పుడు అదియును వలదు. నీ దివ్యావయవ సౌందర్యమును సేవింప భాగ్యముగలుగునట్టి ఏ వస్తువుగనైనను నుండునట్లు నన్ను అనుగ్రహింపుము—అని ప్రార్థించుచున్నారు.

ఉమ్బరులగాణ్డు ఒరుకుడైక్కీழ் ఉరుప్పశిదన్,
అమ్బొఱ్కలై యల్గుల్ పెఱ్ఱాలుమ్ ఆదరియేన్,
శెమ్బవళ వాయాన్ తిరువేఙ్గడమెన్నుమ్,
ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏదేను మావేనే. ౧౦

టీక :— ఉమ్బర్ ఉలగు = స్వర్లోకములనన్నిటిని, ఒరుకుడైక్కీழ் = తన ఏకచ్ఛత్రాధిపత్యములోనికి తెచ్చుకొని, ఆణ్డు = పాలించి, ఉరుప్పశిదన్ = ఊర్వశి యొక్క, అమ్ = సుందరమైన, పొన్ కలై = బంగారుఒడ్డాణమును ధరించిన, అల్గుల్ = నితంబప్రదేశము, పెఱ్ఱాలుమ్ = లభించినప్పటికిని, ఆదరియేన్ = నేను ఇచ్ఛగింపను, శెమ్బవళవాయన్ = ఎఱ్ఱనిపగడమువంటి మోవిగలిగిన, ఎమ్బెరుమాన్ = మా స్వామి యొక్క, తిరువేంగడమ్ ఎన్నుమ్ = తిరువేంగడమను పేరుగలిగిన, పొన్మలైయిల్ = శ్లాఘ్యమైన పర్వతముపై, ఏదేనుమ్ ఆవేనే = ఏదైనను ఒక పదార్థముగనుండు భాగ్యము గలవాడనగుదును గాక !.

తా॥ సకల లోకములను ఏకచ్ఛత్రాధిపత్యముతో శాసించుచు, ఊర్వశి మొదలగు సుందరీమణుల దివ్యనితంబస్థలి ననుభవించునట్టి భోగభాగ్యములనైనను నేను ఆశపడను. ఎఱ్ఱనిపగడమువలె మనోజ్ఞమైయుండు వాతెఱగలిగి, అందఱిని మోహింపజేయు శ్రీ వేంకటాచలపతియొక్క తిరువేంగడమను రమణీయమగు పర్వతముపై, ఏదో యొక వస్తువుగనుండు భాగ్యము నాకు కలుగుగాక !

వి. వి :— (1) భగవంతుని అప్రాకృత దివ్యావయవ సౌందర్యములను అనుభవింప వలయునే గాని, క్షణభంగురములై, కృత్రిమములగు రమణీయుల సౌందర్యాదులు వివేకులకు అపేక్షింపదగినవి కావు — అని సూచింపబడుచున్నది.

(2) పరమపావనమును, పరమభోగ్యమునైన శ్రీ వేంకటాచలమునందు నిఖిల పదార్థములును నిక్కముగా భాగ్యోత్తరములు వానిలో హెచ్చుతగ్గులు లేవు. కనుకనే, పెద్దలు క్రిమికీటాది జన్మలు కూడ వాంఛించిరి "రథ్యాశునా మన్యతమో భవేయమ్" "కీటజన్మమే" అని శ్రీ యామునాచార్యుల వారును, "వీథీశోధక కింకరాన్" అని శ్రీ వేదాన్తదేశికులును ఆనతిచ్చియున్నారు. కాబట్టి, శ్రీ వేంకటాచలముననున్న తృణాదులు గూడ శిరసా ధార్యములు—అను పరమార్థము కూడ సూచింపబడుచున్నది.

(11) అవ :— ఈ తిరుమొళిని అభ్యసించిన వారలకు ఫలమును చెప్పుచున్నారు.

* మన్నియతణ్ శారల్ వడవేఙ్గడత్తాన్ తన్,
పొన్నియలుమ్ శేవడిగళ్ కాణ్బాన్ పురిన్దిఱైఞ్జి,
కొన్నవిలుమ్ కూర్వేల్ కులశేకరన్ శొన్న,
పన్నియనూల్ తమిళ్ వల్లార్ పాఙ్గాయ పత్తర్గళే. ౧౧

టీక :— కొల్ నవిలుమ్ = శత్రువులను నిరసించుటయే స్వభావముగాగల, కూర్ వేల్ = వాడియైన వేలాయుధమును (ఈటె) నుగలిగిన, కులశేఖరన్ = శ్రీ కులశేఖరాళ్వారులు, మన్నియ తణ్ శారల్ = స్థిరములై సుభగశీతలములైయుండు చరియలచే శోభాయమానమైయున్న. వడవేంగడత్తాన్ తన్ = ఉత్తరదిక్కునందున్న తిరువేంగడమను తిరుమలలో వేంచేసియున్న పెరుమాళ్ళయొక్క, పొన్ ఇయలుమ్ శేవడిగళ్ = సువర్ణమువలె శ్లాఘ్యములై ఎఱ్ఱనైయుండు శ్రీపాదములను, కాణ్బాన్ = సేవించుటకు, పురిన్దు = ఆశపడి, ఇఱైఞ్జి = పణమిల్లి, శొన్న = ఆనతిచ్చిన, పన్నియనూల్ తమిళ్ = లక్షణగ్రంథములలో జెప్పబడిన సకల లక్షణములతో గూడుకొనియుండు ఈ తమిళ్ పాశురములను, వల్లార్ = అభ్యసించినవారలు, పాంగు ఆయ పత్తర్గళ్ = (సర్వేశ్వరుని తిరువుళ్ళమునకు) ఇష్టతములైన భక్తులుగనుందురు.

తా॥ శత్రువుల నిశ్శేషముగ సంహరించునట్టి తీక్ష్ణమైన వేలాయుధము ను ధరించి విరాజిల్లుచున్న శ్రీ కులశేఖర ప్పెరుమాళ్ళు, సుభగశీతలము లగు చరియలతో నొప్పారు శ్రీవేంకటాచలమున వేంచేసియుండు శ్రీ స్వామివారి శ్లాఘ్యములగు తిరువడిత్తామరలను సేవింపవలయునను ఆశతో ప్రసాదించిన, సకలలక్షణసంపన్నములగు నీ ద్రావిడ పాశురములను ఎవరు అభ్యసించెదరో, వారలు, ఆ భగవంతునకు ఇష్టతములగు పరమ భక్తాగ్రేసరులై, అతని నిత్యనిరవధిక కైంకర్యసామ్రాజ్యమును బొంది యుజ్జీవించి, పరమానందతరంగితస్వాంతులగుదురు.

శ్రీ కులశేఖర ప్పెరుమాళ్ళ తిరువడిగళ్ళే శరణము.



శ్రీరస్తు

శ్రీమతే మునివాహనయోగినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తిరుప్పాణాళ్వార్లు ప్రసాదించిన అమలనాదిపిరాన్‌లోని

# మంగళాశాసన పాశురములు

## (తనిపాశురములు)

## అవతరణిక

తిరుచ్చిరాప్పళ్ళి నగరమునకు సమీపముననున్న తిరు ఉఱైయూర్ అను గ్రామమున, కలియుగమునందు 342 వదగు దుర్మతినామ సంవత్సరమున కార్తికమాసమున కృష్ణపక్షద్వితీయా బుధవారముతో కూడిన రోహిణీ నక్షత్రమున శ్రీవత్సాంశజులై ఎఱ్ఱవరిపొలమున అయోనిజులై శ్రీతిరుప్పాణాళ్వార్లు అవతరించిరి. ఒక హరిదాసుడు కోటిసూర్యప్రతీకాశముగ ప్రకాశించు నబ్బాలకుని గాంచి, బిడ్డలులేని వాడగుటచే, పరమప్రీతితో నెత్తికొని, పెంచి, పెద్దజేసెను.

వీరు, భగవంతుని నిర్హేతుకజాయమాన కటాక్షవిశేషమున సత్వగుణప్రచురులై, బాల్యమునుండియే మోక్షార్థులై, అంతిమకులమున పెరుగుటచే, అవర్ణమునకు తగిన నైచ్యము ననుసంధించుచు, కావేరి, కొల్లిడములనాధ్యయుండు ప్రదేశమును త్రొక్కక, దూరముననే నిలచి, శ్రీరంగనాథుడు పవ్వళించియుండు దిక్కునకు నభిముఖులై, నారదమహాముని వలె, ఎల్లప్పుడును చేతిలో వీణనుధరించి, అఴగియ మణవాళన్ల యొక్క దివ్యకీర్తిని నిరంతరము పాడుకొనుచు అనవరతము నా పెరుమాళ్లనే ధ్యానించుచుండిరి.

వీరు పాడించిన అమలనాదిపిరాన్ అను దివ్యప్రబంధమునందు — శ్రీ వేంకటాచలపతిని, శ్రీ రంగనాథులను, ఐక్యభావనతో ననుసంధించి, పాదాది కేశపర్యంతము భగవద్దివ్యమంగళవిగ్రహమును అత్యాశ్చర్యకర మగు క్రమమున నభివర్ణించియున్నారు.

ఇందు, మొదటి పాశురమునను మూడవ పాశురమునను. తిరువేంగడముడయానులను కీర్తించియున్నారు.

(1) అవ :— అందీ పాశురమున, పెరియపెరుమాళ్ళ తిరువడిగళ్ళ సౌందర్యము తనపై పడి, తమను దాసునిగ చేసికొనినదని అభివర్ణించుచున్నారు.

* అమల నాదిపిరాన్ అడియార్కు ఎన్నై, ఆట్పడుత్త,
విమలన్ విణ్ణవర్కోన్ విరై యార్ పొழిల్ వేఙ్గడవన్,
నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్ మది శరఙ్గత్తమ్మాన్ తిరు
క్కమలపాదమ్ వన్దు ఎన్కణ్ణినుళ్ళన వొక్కిన్ఱదే. ౧

టీక :— అమలన్ = పరిశుద్ధుడును, ఆదిపిరాన్ = జగత్కారణభూతుడైన స్వామియును, అడియార్కు = తన భక్తులకు, ఎన్నై = నన్ను, ఆట్పడుత్త = దాసునిగ జేసిన, విమలన్ = ఔదార్య-ఔజ్జ్వల్యా-కల్యాణగుణయుక్తుడును, విణ్ణవర్ కోన్ = నిత్యసూరులకు నాయకుడై, విరై యార్ పొழిల్ = పరిమళభరితములగు దివ్యారామములతో శోభాయమానమైయుండు, వేఙ్గడవన్ = శ్రీ వేంకటాచలమున నిత్యవాసము చేయువాడును, నిమలన్ = (నేను కోరకుండినను నాకు నుపకరించుటచే గలిగిన) ఔజ్జ్వల్యముతో గూడుకొన్నవాడును, నిన్మలన్ = (తన దాసులకు నన్ను దాసునిగ జేయుటచే గలిగిన) ఔజ్జ్వల్యము గలవాడును, నీదివానవన్ = నీతిని తప్పనివాడై, నిత్యవిభూతియందు నిత్యవాసము చేయువాడును, నీళ్ మదిళ్ = మహోన్నతములగు ప్రాకారములతో బరివృతమైన, అరంగత్తు = శ్రీరంగదివ్యక్షేత్రమునకు, అమ్మాన్ = స్వామియునైన అళగియ మణవాళనులయొక్క, తిరుక్కమలపాదమ్ = పెరియ పిరాట్టియారులును, ఎక్కడ కందిపోవునో యని భయశంకితయై, సంవాహనము చేయుచుండు) పరమకోమలమైన ఎఱ్ఱతామరలవంటి శ్రీపాదములు, వన్దు = వచ్చి, ఎన్ కణ్ణిన్ ఉళ్ళే = నా నేత్రములయందు, ఉళ్ళన = నిత్యవాసము చేయుచున్నవి, ఒక్కిన్ఱదే = దాసునికిని, నా స్వామికిని-ఇద్దఱికిని ప్రయోజనము సిద్ధించినది.

తా॥ అఖిలహేయప్రత్యనీకుడై, జగజ్జన్మాదికారణభూతుడై, సర్వప్రపంచమునకును మహోపకారకుడై, "నాకు నేనే స్వామిని, నేను ఇతరులకు దాసుడనుగాను" అను నాభావములను మార్చి, తనకును, తన భక్తులకును నన్ను దాసునిగజేసి వైచిన పరిశుద్ధ స్వభావుడును, నిత్యసూరులకు స్వామియై యుండియు, భూలోకమునందలి ప్రాణులనెల్ల తనకు దాసులనుగ జేసికొనుటకై దివ్యపరిమళములతో నిండి కన్నుల పండువయై యుండు దివ్యోద్యానములచే బరివృతములగు శ్రీవేంకటాచలమున విజయముచేసియున్నవాడును, నేను అపేక్షింపకున్నను, నాకు మహోపకార మొనరించి, మహోజ్జ్వలుడైనవాడును, తన దాసులకు దాసునిగ నన్ను ఒనర్చుటచే గలిగిన నిరతిశయప్రీతియుక్తుడును, స్వస్వామిభావము మారక యుండి, నిత్యవిభూతియందు నిత్యవాసముచేయువాడును, మహోన్నతములగు సప్తప్రాకారములతో బరివేష్టితమగు శ్రీరంగదివ్యక్షేత్రమున శేషశయనమున పవ్వళించియుండువాడును, సర్వస్వామియునునైన నా పరమశేషియొక్క, పరమసుకుమారములై, మిక్కిలి మనోజ్ఞములగు శ్రీమత్పాదారవిందములు స్వయముగనే వచ్చేసి, నీచాతినీచుడనగు నాదు కన్నులతోడ నెడతెగని సంబంధమును కల్పించుకొని, నిత్యవాసముచేయుచున్నవి. ఆహా ! ఇదియేమి ఆశ్చర్యము.

వి. వి :— (1) దీనిలో, అమలన్, విమలన్, నిమలన్, నిన్మలన్ – అని నాలుగు పదములకును అర్థము ఒక్కటియే; కాని భావము వేరు. పరమ నీచులగుతాము సన్నిధిలో ప్రవేశించుటచే భగవంతునికి గొప్ప అపచారము సంభవించును—అని భయకంపితులై, ఆశంకను ఆతడు దీర్చెనని దెలుపుటకై "అమలన్" అని ప్రయోగించిరి. తమ నైచ్యమును సరకుజేయక, తమను భాగవతులకు దాసునిగజేసి, అందుచే మురియుచుండు సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహశోభాతిశయమును జూచి, "విమలన్" అను చున్నారు భాగవతులకు సర్వసులభుడైయుండుటను ప్రకాశింపజేయు శీలమునుజూచి 'నిమలన్' అని కీర్తించుచున్నారు. స్వాశ్రితుల దోషములనెంచుటయను దుర్గుణములేనివాడని తెలియజేయుటకై "నిన్మలన్" అని వర్ణించుచున్నారు.

(2) ఆది - జగత్కారణభూతుడు ; లేక, స్పృహణీయుడు - అని అర్థము.

(3) ఎన్నై - అతినికృష్టుడనగు దాసుని.

(4) "అరంగత్తమ్మాన్" అనుటచే శేషిత్వము, "కమలపాదమ్" అనుటచే భోగ్యత్వము, "వన్దు" అనుటచే నుపాయత్వము గీర్తింపబడినవి.

(5) శ్రీ రంగనాథులను అనుభవింప సమకట్టిన ఈయాళ్వార్లు, తిరువేంగడముడైయాన్లవద్దను పోనేల ? అని యందురేని, శ్రీ పిళ్ళైతిరునఱైయూర్ అరయర్ స్వామి వారిట్లు ఆనతిచ్చియున్నారు. "ఏటిలో దిగబడిపోవువాడు, ఒక కాలినిగట్టుపైన నూనిన బైటికి తప్పించుకొని రావచ్చునేమో? అని అట్లు ప్రయత్నించునటుల, ఆళ్వార్లు గూడ, శ్రీ అళగియమణవాళన్ల (సుందరజామాతృ) చరణు ఉల్లోకసౌందర్యాదులలో మునిగిపోవుచున్నవారుగాన, తిరుమలలో నొకకాలూనిరి ; మఱియు, పరమపదము నుండి వేంచేయునపుడు శ్రీమధురాపురమున విడిసి, తదుపరి శ్రీగోకులమునకు విచ్చేసినట్లు, శ్రీవైకుంఠమునుండి యేతెంచునపుడు పెరుమాళ్ళు తిరుమలలో గొంతకాలము విడిసి శ్రీరంగమునకు వేంచేసిరి కాబట్టి, ఆయుదంతమును దెలుపుటకై ఆళ్వార్లు ఇట్లు అభివర్ణించిరి - అని.

(6) ఒక్కిన్రదు - దశాపరిణామములేక అట్లేయున్నదని భావము. లేక, ఉభయులకును ప్రయోజనము సిద్ధించునటులనున్నది — శేషికి శీలసిద్ధియు, శేషభూతునికి స్వరూపసిద్ధియును ఫలము - అని భావము.

(3) అవ :— తిరునాభికమలమువఱకును వ్యాపించియున్న దివ్య పీతాంబరముయొక్క సౌందర్యము నన్ను వ్యాముగ్ధు నొనరించి, తనకు దాసునిగ చేసికొనినది — అని అభివర్ణించుచున్నారు.

* మన్దిపాయ్ వడవేఙ్గడమామలై వానవర్గళ్,
శన్దిశెయ్యనిన్రాన్ అరఙ్గత్తరవిన్ణైయాన్,
అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ అదన్మేలయనై ప్పడైత్తదోరెళిల్,
ఉన్దిమేలదన్రో అడియేనుళ్ళత్తిన్నుయిరే. 3

టీక :— మంది = మగకోతులు, పాయ్ = ఒక కొమ్మనుండి ఇంకొక కొమ్మకు దుముకుచు క్రీడించుచున్న, వడ = ఉత్తరపు దిక్కునందున్న, వేజ్గడమామలై = తిరువేంగడమను మహోన్నతమగు పర్వతముపై, వానవర్ గళ్ = నిత్యసూరులు సందిశెయ్య = పుష్పఫలాద్యుపకరణములను గొనివచ్చి, ఆరాధించుటకు తగినట్లు నిన్రాన్ = మనోజ్ఞమూర్తియై నిలచియున్నవాడును, అర్జత్తు = శ్రీరంగమున, అరవిన్ అణైయాన్ = తిరువనన్తాళ్వానులపై పవ్వళించియున్నవాడును నైన పురుషోత్తమునియొక్క, అన్దిపోల్ నిఱత్తు = ఎఱ్ఱని ఆకసమువంటి రంగుగల్గిన, ఆడైయుమ్ = దివ్యపీతాంబరమును, అదన్ మేల్ = దానిపైభాగమున శోభిల్లుచుండు, అయనై ప్పడైత్తదు = చతుర్ముఖబ్రహ్మకు నుత్పత్తిస్థానమైన, ఓర్ ఎழிల్ = అసదృశమైన సౌందర్యముతో గూడియుండు, ఉన్ది మేల్ = శ్రీనాభికమలముపై, అదువన్ఱో = ఆశగలిగినగద, అడియేన్ = దాసునియొక్క, ఉళ్ళత్తు = మనస్సునందున్న, ఇన్ ఉయిర్ = మధురమైన జీవాత్మ ఉజ్జీవించుచున్నది.

తా॥ మొగకోతులు ఒక కొమ్మనుండి మరియొక కొమ్మకు దుముకుచు నెగురుచు క్రీడించుచుండుటచే జూపరులకు కనులపండువై యుండి, అరవభాషకు నుత్తరపుటెల్లయైయుండునట్టి మహోన్నత శిఖరములచే నలరారుచుండు శ్రీవేంకటాచలమున, నిత్యసూరులు పుష్పఫలాదులగొనివచ్చి యారాధింపదగినట్లు వేంచేసియున్నవాడును, దివ్యపరిమళభరితములగు దివ్యోద్యానములచే జుట్టబడియుండు శ్రీరంగ దివ్యనగరమున నాగపర్యంకముపై పవ్వళించియుండువాడును నగు అழகియమణవాళన్నయొక్క, సుందరారుణాకాశ సన్నిభమై, మిక్కిలి మనోజ్ఞమైయుండు దివ్యపీతాంబరముపైనను, దానిపై విరాజిల్లుచుండు చతుర్ముఖబ్రహ్మకు నుత్పత్తిస్థానమైయుండు నసదృశ దివ్యరమణీయ నాభికమలముపైనను నా మనస్సులోనున్న పరమజీవుడు ఆశగొని అందే లగ్నమైయున్నాడు. ఆహా! ఇది ఏమి ఆశ్చర్యము ?.

వి. వి :— (1) "మన్దిపాయ్" ఒక దానిని మఱియొకటి పట్టుకొని మాలారూపముగ నిలచుచున్నవి. తిరుచ్చిహ్న పుశబ్దము వినగనే పరుగెత్తిపోవుచున్నవి_అనియు భావము. చపలచిత్తులై ఒక దానిని వదలి మఱియొక దానిని నలంబించు సంసారి చేతనులకుపలక్షణముగ నిచ్చట నీ వానరములు కీర్తింపబడినవి.

(2) శన్దిశెయ్య - ఆరాధించుటకై, ఇదియెట్లు పొసగును ? అనిన ; "శన్ది" అనగా సంధ్యాకాలమున జేయుపని-అనిసిద్ధించి, దానిచే భగవదాజ్ఞచే జేయబడు భగవత్కైంకర్యము-అని సిద్ధించుచున్నది. ఇచ్చట భగవంతుని సౌలభ్యాది దివ్యకల్యాణ గుణగణముల నిత్యసూరులనుభవించి, దానిచే గలిగిన భక్త్యతిశయముచే, తదనుభవ పరీవాహరూపమగు పుష్పములచే నతని సారాధించుచున్నారు-అని అన్తరార్థము.

(3) "అన్దిపోల్ నిఱన్" అనుదానికి భక్తుల అజ్ఞానాంధకారమును బాపజాలు, సుజ్ఞానసూర్యోదయమునకు పూర్వసంధ్యవలెను, వారల తాపత్రయశాన్తికై పశ్చిమసంధ్య వలెను ప్రకాశించుచున్న - అని మునివాహనభోగమున శ్రీవేదాన్తదేశికుల వారానతిచ్చియున్నారు.

శ్రీ తిరుప్పాణాళ్వార్ల తిరువడిగళే శరణము.



శ్రీరస్తు
శ్రీమతే పరకాలమహాయోగినే నమః

# శ్రీ తిరుమంగై యాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరుమొழிలోని

# మంగళాశాసన పాశురములు

(1-వ పది, 8-వ తిరుమొழி — కొజ్గలర్న్ద)

## అవతరిణిక

క్రింది తిరుమొழிలో శిజ్గవేళ్ కున్ఱమున సర్వేశ్వరుని సేవసాదింప మని బహుభంగుల ప్రార్థించిరి. వారినిజూచి ఎంబెరుమానులు "నేను సుభగశీతలమగు శ్రీవేంకటాచలమున నెల్లప్రాణులకును పరమసులభుడనుగ సేవసాదించుచున్నాను. అచ్చటికివచ్చి నాకు కైంకర్యమునుజేసి, ఆనందిం పుడు" అని ఆళ్వార్లకు సెలవీయగ, ఈ తిరుమొழிలోను, దీనికిపై మూడుతిరుమొழிలలోను మొత్తము 40-పాశురములలో శ్రీవేంకటాచల పతి వైభవమును అనుసంధించుచున్నారు.

(1) అవ :— అందు నీ పాశురమున, "శ్రీకృష్ణస్వామియై యవత రించి క్షీరాబ్ధిలో యోగనిద్రననుభవించు శ్రీమన్నారాయణుడే శ్రీవేంకటా చలమున వేంచేసియున్నాడు. అందుచే బరమపవిత్రమగు నా తిరువేంగడ మునే ఎల్లప్పుడును అనుసంధించుచుందుము" అని తమ మనస్సును నుద్బోధించుచున్నారు.

* కొజ్గలర్న్ద మలర్కుఱున్దమ్ ఒశిత్తకోవలన్ ఎమ్బిరాన్,
శజ్గుతజ్గు తడజ్గడల్ తుయిల్ కొణ్డ తామరై క్కణ్ణినన్,
పొజ్గుపుళ్ళినై వాయ్పిళన్ద పురాణర్ తమ్మిడమ్, పొజ్గునీర్
శెజ్గయల్ తిళైక్కుమ్ శునై త్తిరువేజ్గడమ్ అడై నెఞ్జమే. ౧

టీ :— కొఙ్గలర్న్ద = పరిమళము వీచుచున్న, మలర్ = పుష్పములతో నిండియున్న, కురున్దమ్ = కురున్దవృక్షమును, ఒశిత్త = నశింపజేసిన, గోపాలన్ = గోపాలకృష్ణుడై, ఎమ్బిరాన్ = మాకు స్వామియై, శఙ్గుతఙ్గుతడకడల్ = శంఖములతో నిండియుండు పెద్దసముద్రమున, తుయిల్ కొణ్డ = యోగనిద్రను అనుభవించుచున్న, తామరైకణ్ణినన్ = పుండరీకాక్షుడై, పొంగుపుళ్ళినై వాయ్పిళన్ద = మదాంధుడైవచ్చియున్న బకాసురుని నోటిని చీల్చివైచిన, పురాణర్ తమ్ ఇడమ్ = పురాణపురుషుడగు శ్రీమన్నారాయణుడు వేంచేసియున్న దివ్యక్షేత్రమై, పొంగునీర్ = ఊటనీటి ప్రవాహములు గలిగినదై, శెమ్కయల్ తిళైక్కుమ్ = ఎఱ్ఱని మత్స్యములుబలిసి ఉజ్జీవించి విహరించుచున్నటువంటి, శునై = దొనలు గలిగియుండు, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, నెఞ్జమే = నా మనస్సా, అడై = పొందియుండుమా !.

తా॥ పరిమళభరితములగు కుసుమములతో గూడుకొనియున్న కురున్దవృక్షములను నశింపజేసి, మనకుస్వామియైన శ్రీకృష్ణస్వామిగ నవతరించియు, శంఖములతో నిండియుండు క్షీరాబ్ధిలో పవళించియున్న పుండరీకాక్షుడై యుండియు, గర్వితుడై వచ్చియున్న బకాసురుని నోటినిచీల్చి చెండాడిన నా పురాణపురుషుడగు శ్రీమన్నారాయణుడే ప్రీతిమీఱ వేంచేసి యుండునదియు, ఊటనీరుగలినవై, ఎఱ్ఱనిమత్స్యములు విహరించుటకనువై యుండు దొనలతో విరాజిల్లుచుండెడియునైన శ్రీ వేంకటాచలమునే ఎల్లప్పుడును ఓ మనసా! నీవు ఆశ్రయింపుము.

వి. వి :— క్షీరాబ్ధిశాయియును, శ్రీకృష్ణుడును, శ్రీవేంకటాచలపతియును-పురాణపురుషుడగు శ్రీమన్నారాయణుడే-అని ఈ పాశురమున తెలియజేయుచున్నారు.

(2) అవ :— పూతన విషమిశ్ర స్తన్యమును దాని ప్రాణములతో గూడ గ్రోలిన శ్రీ కృష్ణస్వామి దినదినప్రవర్ధమానుడై వేంచేసియుండు శ్రీవేంకటాచలమునే ఎల్లప్పుడును అనుసంధింపుమా! అని తమ మనస్సును ప్రబోధించుచున్నారు.

* పళ్ళియావదు పాఱ్కడలరఙ్గమ్, ఇరఙ్గవన్ పేయ్ములై,
పిళ్ళైయాయ్ ఉయిరుణ్డ ఎన్దైపిరానవన్ పెరుగుమిడమ్,
వెళ్ళియాన్ కరియాన్ మణినిఱవణ్ణ నెన్ఱెణ్ణి, నాళ్తొఱుమ్
తెళ్ళియార్ వణఙ్గుమ్ మలై తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. ౨

టీక :— వన్ పేయ్ = కఠినచిత్తురాలైన పూతనయను రక్కసి, ఇఱఙ్గ = అఱచునట్లు, ములై = దాని స్తనములను, పిళ్ళైఆయ్ = చిన్నబిడ్డడైయుండు నప్పుడే, ఉయిర్ = దాని ప్రాణములతో కూడ, ఉణ్డ = పాలుద్రావి, ఎన్దైపిరాన్ = మనస్వామియైన శ్రీకృష్ణభగవానుడు, పళ్ళియావదు = పవ్వళించుచోటైనది, పాఱ్కడల్ = క్షీరాబ్ధియు; అరఙ్గమ్ = శ్రీరంగమును; అవన్ = ఆ పెరుమాళ్ళు, పెరుగుమ్ ఇడమ్ = పెరుగునట్టి స్థలము, తెళ్ళియార్ = నిర్మలమగు జ్ఞానముగలిగినవారు, వెళ్ళియాన్ = (కృతయుగమున) తెల్లని వర్ణముగలవాడై, కరియాన్ = (కలియుగమున) నీలవర్ణుడై, మణినిఱమ్ వణ్ణన్ = (ద్వాపరయుగమున) పచ్చని వర్ణముగలవాడై యున్నాడు, ఎన్ఱు = అని, ఎణ్ణి = ధ్యానించి, నాళ్ దొఱుమ్ = ఎల్లప్పుడును వణఙ్గుమ్ = నమస్కరించునట్టి, తిరువేంగడమలై = తిరుమలయే; దానిని, నెఞ్జమ్ = ఓ మనసా !, అడై = ఆశ్రయించుము.

తా॥ పరమక్రూరుడగు కంసునిచేబంపబడిన పూతనయొక్క విషమిశ్రితమగు స్తన్యమునుగ్రోలి, దాని ప్రాణములను సయితము అపహరించిన శ్రీకృష్ణభగవానుడు నిద్రించుచోటు — పాలసముద్రము; పరమభోగ్యమైన శ్రీరంగము. పెరుగునట్టిచోటు—కృతయుగమున శ్వేతవర్ణముగలవాడై, కలియుగమున నీలవర్ణముగలవాడై, ద్వాపరమున శ్యామవర్ణముగలవాడై సర్వేశ్వరుడు నున్నాడని ధ్యానించునట్టి పరిశుద్ధజ్ఞానులగు పరమయోగులు నెల్లప్పుడును ప్రణమిల్లుచుండు, తిరుమలయే—అని ఓ మనసా ! ఎల్లప్పుడును ధ్యానింపుము.

వి. వి :— వ్యూహావతారమే విభవావతారములకు మూలకందము; ఆ విభవావతారమే అర్చావతారమునకు మూలకందము. కనుక, క్షీరాబ్ధిశాయియగువాడును, శ్రీకృష్ణుడై అవతరించినవాడును, శ్రీవేంకటాచలమున వేంచేసియున్నవాడును ఒక్కడే—అని ఈ పాశురమున సూచించుచున్నారు.

(3) అవ :— యమళార్జున వృక్షముల భంజించి, గోగోపకులముల రక్షించుటకై గోవర్ధనపర్వతము నెత్తిన శ్రీకృష్ణస్వామి, సుదర్శచక్రమును ధరించి, నిత్యసూరులుగూడవచ్చి సేవించునట్లు శ్రీవేంకటాచలమున విజయముచేసియున్నారు. కాబట్టి, ఆ తిరువేంగడమునే ఎల్లప్పుడును ధ్యానించుచు కృతార్థతనొందుము—అని లమ మనస్సును ప్రబోధించుచున్నారు.

నిన్ఱమామరుదు ఇఱ్ఱువీళ్ల నడన్దనిన్మలన్ నేమియాన్,
ఎన్ఱుమ్ వానవర్ కై తొళుమ్ ఇణై త్తామరై యడి యెమ్బిరాన్,
కన్ఱి మారిపొళిన్దిడ కడిది ఆనిరై క్కు ఇడర్ నీక్కువాన్,
శెన్ఱు కున్ఱమెడుత్తవన్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే 3

టీక :—నిన్ఱ = పెంలింపశక్యముగానట్లు మున్నుడనుక పెరిగియున్న, మామరుదు = పెద్ద మద్దిచెట్లు రెండును, ఇఱ్ఱువీళ్ల = విరిగిక్రిందపడునట్లు, నడన్ద = నడచిన, నిన్మలన్ = నిర్మలుడును, నేమియాన్ = శ్రీసుదర్శనచక్రమును ధరించినవాడును, ఎన్ఱుమ్ = ఎల్లప్పుడును, వానవర్ = నిత్యసూరులు, కైతొళుమ్ = సేవించుచున్నట్టి, తామరై అడిఇణై = తామరపుష్పములవంటి శ్రీపాదముల యుగళమును గలిగిన, ఎమ్బిరాన్ = మా స్వామియైయున్న, కన్ఱి = (ఇన్ద్రుడు) కోపముగొని, మారి = వర్షమును పొళిన్దిడ = వర్షింపగ, కడిదు = వెంటనే, ఆనిరైక్కు = పశువులకు, ఇడర్ = కష్టములు, నీంగువాన్ = పోగొట్టుటకై, శెన్ఱు = వెళ్ళి, కున్ఱమ్ = గోవర్ధనపర్వతమును, ఎడుత్తవన్ = గొడుగా నెత్తి పట్టుకొనిన సర్వేశ్వరుడు వేంచేసియుండు, తిరువేంగడమే = శ్రీవేంకటాచలమునే, నెంజమే = ఓ మనసా! అడై = ఆశ్రయింపుము.

తా॥ రూఢమూలములై యుండు రెండు పెద్ద మద్దిచెట్లును విరిగి పడునట్లు, తల్లి తనను రోటికి కట్టగా, ఆ రోటితోగూడ, వాని మధ్యన దూరి, వేగముగ నడిచినవాడును, శ్రీ సుదర్శనచక్రమును తన శ్రీహస్తమున ధరించినవాడును, ఎల్లప్పుడును నిత్యసూరులు సేవించునట్టి తిరువడి త్తామరలుగల స్వామియును, ఇంద్రుడు కోపించి రాళ్ళవాన గురిపింప, వేంటనే పశువుల ఆపదతీర్చుటకై, గోవర్ధనపర్వతమును గొడుగుగా నెత్తి పట్టుకొనిన శ్రీకృష్ణస్వామి వేంచేసియుండు తిరువేంగడమునే, నా మంచి మనసా! ఎల్లప్పుడును ఆశ్రయింపుము.

(4) అవ :— పృథాసూనులకై భారతయుద్ధమును జరిపి జయమును గొన్నవాడును, రాసక్రీడ ననుభవించిన స్వామియునైన శ్రీకృష్ణస్వామి పరమసులభుడై వేంచేసియుండు పరమభోగ్యమైన తిరువేంగడమునే రక్షకమని ఆశ్రయింపుము — అని తమ మనస్సును ప్రబోధించుచున్నారు.

పార్ త్తర్కాయ్ అన్ఱుపారదమ్ కై శెయ్దిట్టు వెన్ఱ పరఞ్జుడర్,
కోత్తుఅజ్గు ఆయర్ దమ్ పాడియిల్ కురవై పిణైన్ద ఎమ్ కోవలన్,
ఏత్తువార్ తమ్మనత్తుళ్ళాన్, ఇడవెన్దై మేవియ ఎమ్బిరాన్,
తీర్ త్తనీర్ త్తడఞ్జోలై శూழ் తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. ౪

టీక :— అన్ఱు = పూర్వకాలమున, పార్ త్తర్కు ఆయ్ = పాండవులకై, పారతమ్ = భారతయుద్ధమున, కై శెయ్దిట్టు = చేయిచేసికొని, వెన్ఱ = జయశ్రీ పొందిన, పరంజుడర్ = పరంజ్యోతిస్స్వరూపుడును, అజ్గు ఆయర్ తమ్ పాడియిల్ = అచ్చట గొల్లపల్లెలో, కురవై కోత్తు పిణైన్ద = రాసక్రీడను అనుభవింపజేసిన, ఎమ్ కోవలన్ = మన గోపాలుడును, ఏత్తువార్ తమ్ = తను స్తుతించువారలయొక్క, మనత్తు = మనస్సున, ఉళ్ళాన్ = వసించువాడును, ఇడవెన్దై = "తిరువిడవెన్దై" అను దివ్యదేశమున, మేవియ = అమరియున్న, ఎమ్బిరాన్ = మా స్వామి వేంచేసియున్న, తీర్ త్తమ్ నీర్ = పుణ్యతీర్థముల చేతను, తడశోలై = విశాలములగు నుద్యానవనములచేతను, శూழ் = చుట్టబడియున్న, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, నెంజమే = ఓ మనసా ! అడై = ఆశ్రయింపుము.

తా॥ పాండవులకై భారతయుద్ధమును నడిపి జయమునుపొందినవాడును, ఇట్లు సమాశ్రితుల కార్యములపూర్తి చేయుటచే గలిగిన యానందముచే పూరించిన శరీరముగలవాడును, తనను స్తుతించువారి మనస్సును విడిచిపెట్టలేక అచ్చటనే నిత్యవాసముచేయువాడును, "తిరువిడవెన్దై" అను దివ్యదేశమున పరమసులభుడై వేంచేసియుండువాడునునగు సర్వేశ్వరుడు, పరమప్రీతితో నివసించునట్టిదై, అసంఖ్యాకములగు పుణ్యతీర్థముల చేతను రమ్యములగు నుద్యానవనములతోడను శోభిల్లుచుండు శ్రీ వేంకటాచలమునే ఎల్లప్పుడును శరణువేడుమని తమ మనస్సును ప్రబోధించు నాచున్నారు.

(5) అవ:—శ్రీవామనుడై య్యు, శ్రీదాశరథియైయ్యు, అవతరించిన వాడును, అష్టభుజక్షేత్రమునను, బదరికాశ్రమమునను, తిరుమాలిరుంశోలై తిరుమలయందును, పరమకృపతో వేంచేసియుండువాడును, శ్రీగజేన్ద్రుని సంరక్షించినవాడునునైన సర్వేశ్వరుడు విజయము చేసియుండు **తిరువేంగడమునే ఆశ్రయింపు**మని తమ మనస్సును ప్రబోధించుచున్నారు.

వణ్ కైయాన్ అవుణర్క్కు నాయగన్ వేళ్వియిల్ శెన్ఱు, మాణియాయ్,
మణ్ కైయాల్ ఇరన్దాన్ మరామరమేழுమ్ ఎయ్దవలత్తినాన్,
ఎణ్ కైయాన్ ఇమయత్తుళ్ళాన్ ఇరుఞ్జోలై మేవియ ఎమ్బిరాన్,
తిణ్ కైమ్మాత్తుయర్ తీర్త్తవన్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. 5

టీక :— వణ్ కైయాన్ =ఎల్లప్పుడును ఎడతెగక దానముచేయు హస్తములతో విరాజిల్లుచుండువాడును, అవుణర్క్కు = అసురులకు, నాయకన్ = స్వామియునైన మహాబలిచక్రవర్తియొక్క, వేళ్వియిల్ = యాగభూమికి, మాణియాయ్ = బ్రహ్మచారియై, శెన్ఱు = పోయి, కైయాల్ = తన శ్రీహస్తములచే, మణ్ = భూమిని, ఇరన్దాన్ = యాచించిన శ్రీవామనావతారుడును, మరామరమ్ ఏழுమ్ = ఏడుమద్దిచెట్లను, ఎయ్ద = పడగొట్టిన, వలత్తినాన్ = బలముగలవాడును, ఎణ్ కైయాన్ = ఎనిమిదిచేతులతో నష్టభుజక్షేత్రమున విలసిల్లినవాడును, ఇమయత్తు = హిమాలయమునన్న శ్రీబదరికాశ్రమమున, ఉళ్ళాన్ =వేంచేసియున్నవాడును, ఇరుమ్ శోలై = తిరుమాలిరుంశోలై దివ్యక్షేత్రమున, మేవియ = అమరియున్న, ఎమ్బిరాన్ = మా స్వామియును, తిణ్ కై మా = దృఢచిత్తముతో స్తుతించిన శ్రీగజేన్ద్రాళ్వానకు, తుయర్ = ఆపదను, తీర్త్తవన్ = పోగొట్టిన సర్వేశ్వరుడు పరమకృపతో నెలకొనియుండు, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, నెంజమే = ఓ మనసా !, అడై = ఆశ్రయింపుము.

తా॥ అడిగినవారలకు అడిగినట్లు ఎడతెగక దానముచేయుచుండిన అసురాధిపతియగు మహాబలిచక్రవర్తియాగభూమిలో, కపటవామనబ్రహ్మచారియై ప్రవేశించి, మూడడుగుల భూమిని యాచించి, త్రివిక్రమస్వరూపుడై, ముల్లోకములను గొలిచినవాడును, సుగ్రీవునకు నమ్మకము గలిగించుటకై సప్తసాలములను ఒకేబాణముతో భంజించిన మహాబలసంప

న్నడును. వేగవతీ నదీప్రవాహమును అరికట్టి, బ్రహ్మయొక్క యాగమును కాపాడుటకై, అష్టభుజములను స్వీకరించినవాడును, ఉత్తరదిక్కునందుండు హిమాలయపర్వతమున విరాజిల్లుచున్న శ్రీ బదరికాశ్రమమున వేంచేసియున్నవాడును, దక్షిణదిక్కునకు తిలకస్థానీయమైయుండు తిరుమాలిరుంశోలై దివ్యక్షేత్రమున నెలకొనియున్నవాడును, తనను మకరముపట్టి బాధింప, తన భగవదారాధనమునకు భంగమువాటిల్లునేయని మిగుల వాపోయిన శ్రీ గజేన్ద్రాళ్వానుల యాపదనుమాన్పి సంరక్షించిన పరమ కృపామూర్తియునునగు సర్వేశ్వరుడు విజయముచేసియుండు శ్రీ వేంకటాచలమునే, ఓ నామంచి మనసా! ఎల్లప్పుడును అనుసంధింపుము.

(6) అవ :— శ్రీవటపత్రశాయియును, చంద్రునిక్షయరోగమును మాన్పినవాడును, శ్రీనృసింహమూర్తియునునైన సర్వేశ్వరుడు వేంచేసియుండు తిరుమలయే నీకు పరమప్రాప్యమని నమ్మియుండుము — అని తమ మనస్సును ప్రబోధించుచున్నారు.

ఎణ్ తిశైగళు మేழுలగముమ్ వాజ్గి పొన్వయిత్తిల్ పెయ్దు,
పణ్డు ఓరాలిలై ప్పళ్ళికొణ్డవన్ పాల్మదిక్కు ఇడర్ తీర్త్తవన్,
ఒణ్ తిఱ లవుణనురత్తు ఉగిర్వైత్తవన్ ఒళ్ళెయిఱ్ఱొడు,
తిణ్ తిఱ లరియాయవన్ తిరువేజ్గడమ్ అడై నెజ్ఞమే. ౬

టీక :— పణ్డు = మునుపొకకాలమున, ఎణ్ తిశైగళుమ్ = ఎనిమిది దిక్కులను, ఏழ் ఉలగుమ్ = ఏడులోకములను, వాంగి = (ప్రళయకాలము నశింపజేయకుండునట్లు) ఎత్తుకొని, పొన్ వయిత్తిల్ = శ్లాఘ్యమగు (తన) ఉదరమున, పెయ్దు = ఉంచుకొని, ఓర్ = ఒక, ఆల్ ఇలై = మఱ్ఱియాకుపై, పళ్ళికొణ్డవన్ = పరుండియుండిన పరమాత్ముడును, పాల్ మదిక్కు = తెల్లనిచంద్రునికి, ఇడర్ = క్షయరోగముచేగలిగిన దుఃఖమును, తీర్త్తాన్ = పోగొట్టినవాడును, ఒళ్ ఎయిఱ్ఱొడు = ప్రకాశించుచున్న ఘోరదంతములతోగూడి, తిణ్ తిఱల్ = అక్షోభ్యమగు బలముగలిగిన, అరి = శ్రీ నరసింహమూర్తియై, ఆయవన్ = అవతరించినవాడై, ఒణ్ తిఱల్ = మహాబలశాలియగు,

అవుణన్ = హిరణ్యాసురుని యొక్క, ఉరత్తు = ఉరమున, ఉగిర్ = (చేతి) నఖములను, వైత్తవన్ = ఉంచి (దానిని చీల్చి) నవాడును నైన సర్వేశ్వరుడు విజయము చేసియుండు తిరువేంగడమ్ = శ్రీవేంకటాచలమును, నెంజమే = మనసా!, అడై = నీవు దయచేసి ఆశ్రయింపుము (అని ప్రతిమాలుకొనుచున్నారు).

తా॥ ప్రళయకాలమున నశింపకుండుటకై, లోకములనన్నిటిని తన దివ్యోదరమునను౦చుకొని, ఒక చిన్న మఱ్ఱియాకుపై జలార్ణవమున వేంచేసి యుండినవాడును, తెల్లనిచంద్రునకు సంభవించిన క్షయవ్యాధిని బోగొట్టి లోకములకు మహోపకారమును ఒనరించిన వాడును, జ్వలించుచున్న క్రోరపండ్లతో పరమభయంకరమైయుండు శ్రీనరసింహమూర్తియై దుర్జయుడగు హిరణ్యాసురుని విశాలవక్షఃస్థలమును తన తీక్ష్ణనఖాగ్రములచే చీల్చి చెండాడినవాడును నగు శ్రియఃపతి వేంచేసియుండు శ్రీ వేంకటాచలమును శరణుజొచ్చుము—అని తమ మనస్సును బ్రతిమాలుచున్నారు.

వి. వి :— తూర్పు పడమర, ఉత్తరము, దక్షిణము—అను నాలుగు దిక్కులును, ఆగ్నేయము, నైరృతము, వాయవ్యము, ఈశాన్యము—అను నాలుగు ఉపదిక్కులును చేరి, ఎనిమిదిదిక్కులు. మనసిద్ధాంతమున 'దిక్కు' అను పదార్థము వేరుగ నంగీకరించుట లేదు. అందుచే నా యా ప్రదేశముల యందున్న ఆయా పదార్థములని భావింపవలయును.

(7) అవ :— పంచభూతస్వరూపుడును, సహస్రనామప్రతిపాద్యుడునునగు శ్రియఃపతి వేంచేసియున్న పరమభోగ్యమగు శ్రీవేంకటాచలమునే ఆశ్రయింపుము—అని తమ మనస్సును బ్రతిమాలుచున్నారు.

పారుమ్ నీర్ ఎరి కాற்றினోడు ఆకాశము మివై యాయినాన్,
పేరుమ్ ఆయిరమ్పేశనిన్ఱ పిఱప్పిలి పెరుగుమిడమ్,
కారుమ్వార్ పని నీళ్ విశుమ్బిడై చ్చోరుమానుగిల్ తోయ్దర,
శేరుమ్వార్ పొழிల్ శూழ் ఎழிల్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. 8

టీక :— పారమ్ = భూమి, నీర్ = జలము, ఎరి = తేజస్సు, కాఱ్ఱినోడు = వాయువుతోఁగూడిన, ఆకాశముమ్ = ఆకాశమును ఇవై = అను పంచభూతముల స్వరూపుడుగ, ఆయినాన్ = ఉన్నవాడును, ఆయిరమ్ పేరుమ్ పేశనిన్ఱ = సహస్ర నామములచేతను ప్రతిపాదింపబడువాడును, పిఱప్పొఇలి = (కర్మనిబంధనమగు) పుట్టుక లేనివాడునునైన సర్వేశ్వరుడు, పెరుగుం ఇడమ్ = పెరుగుచున్న స్థానమైనదియును, నీళ్ విశుమ్బిడై = విశాలమైన ఆకాశమువఱకును వ్యాపించినదియును, కారుమ్‌వార్ = (అందుండి) వర్షోదకమును, పని = మంచుబిందువులను, శోరుమ్ = వర్షించుచున్నట్టిది యును, మాముగిల్ = పైనుండు కాళమేఘములు, తోయ్‌దర = వచ్చి వాలునట్లు, శేరుమ్ = తగిన, వాన్ = పైభాగమునకు నొదిగియున్నట్టియు, పొళిల్ శూళ్ = ఉద్యానవనములచే జుట్టబడినదియు, ఎళిల్ = సుందరతమంబైనట్టిదియునైన, తిరు వేంగడమ్ = శ్రీవేంకటాచలమును, నెంజే = ఓ మనసా !, అడై = ఆశ్రయింపుము.

తా॥ పృథివ్యప్తేజోవాయ్వాకాశములను పంచభూతముల స్వరూపుడై యున్నవాడును, సహస్రనామములచేతను ప్రతిపాదింపబడువాడును, కర్మనిబంధనమగు జన్మజరాదులులేనివాడునునైన శ్రీమన్నారాయణుడు, సకలజన మనోనయనగోచరుడై వెలుంగుచుండుట కనుకూలమైనదియు, మహోన్నతమగు ఆకాశమునుండి వర్షోదకమును, హిమబిందువులను తన శిఖరస్పర్శచే వర్షింపజేయుచున్నదియును, వర్షాకాలపు పెద్దపెద్దమేఘ బృందములువచ్చి నిలుచుటకుదగిన ఎత్తువెడల్పు గలదియును, పరిమళ భరితములగు దివ్యకుసుమములతో నొప్పారి మిక్కిలి మనోజ్ఞములగు దివ్యారామములతో చుట్టబడి యున్నదియును నగు సుందరతమమైన శ్రీవేంకటాచలమునే ముప్పొద్దులును సేవింపుము—అని తమహృదయమును మేల్కొలుపుచున్నారు.

(8) అవ :— పంచభూతస్వరూపుడును, నిత్యసూరినాయకుడును, పద్మనివాసినియగు శ్రీదేవికి ప్రాణనాథుడు నగు శ్రియఃపతి వేంచేసియుండు పరమభోగ్యమగు తిరువేంగడమును సత్వరమే ఆశ్రయింపుము—అని తమ మనస్సును వేడుకొనుచున్నారు.

అమ్బరమ్ అనల్ కాల్ నిలమ్ శలమాగినిన్ఱ అమరర్ కోన్,
వమ్బులా మలర్మేల్ మలిమడమఙ్గైదన్ కొఴునవన్,
కొమ్బనన్న ఇడై మడక్కుఱమాదర్ నీళిదణన్దొఱుమ్,
శెమ్బునమవై కావల్ గొళ్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. ౮

టీక :— అంబరమ్ = ఆకాశము, అనల్ = అగ్ని, కాల్ = వాయువు, నిలమ్ = భూమి, శలమ్ = జలము; ఆగినిన్ఱ = అను పంచభూతముల స్వరూపుడై వేంచేసియున్నవాడును, అమరర్ = నిత్యసూరులకు, కోన్ = నాయకుడును, వమ్బు = పరిమళము, ఉలామ్ = వీచుచున్న, మలర్ మేల్ = తామరపుష్పముపై, మలిమడ మంగైతన్ = అమరియున్న పెరియపిరాట్టియార్లకు, కొఴునన్ అవన్ = ప్రాణనాథుడైన మా స్వామి వేంచేసియున్నట్టిదియు, నీళ్ ఇదణమ్ దోఱుమ్ = ఎత్తైనమంచెలలో నన్నిటను, కొమ్బిన్ అన్న ఇడై = (వంజి-దుప్పి) కొమ్మతో సదృశమగు మధ్యభాగము (నడుము) గల, మడకుఱమాదర్ = ముగ్ధలగు బోయపిల్లలు, శెంపునమ్ అవై = ఎఱ్ఱని పొలములను, కావల్ గొళ్ = (ఎచ్చట) కావలిగాయుచున్నారో ?, (అట్టి) తిరు వేంగడమ్ = శ్రీ వేంకటాచలమును, నెంజమే = ఓ మనసా !, అడై = ఆశ్రయింపుమా !.

తా॥ పంచభూతస్వరూపుడును, నిత్యసూరులకును నాయకుడును, దివ్యపరిమళభరితమగు తామరపుష్పముపై నిత్యవాసము చేయుచున్న పెరియపిరాట్టియార్లకు నాథుడును నగు సర్వేశ్వరుడు వేంచేసియుండు నదియు, ఎత్తైనమంచెలపైనున్న, దుప్పికొమ్ములవలె సూక్ష్మమైన నడుముగల ముగ్ధలగు కిరాతకన్యకలు, పండినసస్యములచే నెఱ్ఱగనుండు పొలములను నెచ్చట కావలిగాయుచున్నారో; అట్టి పరమభోగ్యమగు శ్రీవేంకటాచల మును, ఓ నామంచి మనసా! నీవు సత్వరమే ఆశ్రయింపుమా !

(9) అవ :— ఈ తిరుమొழிలో, క్రింది పాశురము లన్నిటియం దును ఆழ்వార్లు తమ మనస్సును జూచి ప్రబోధించిరి ఈ పాశురమున తొలి రెండుపాదములచే నితరులకును, మలిరెండు పాదములచే తనకును ఉద్బోధనమును చేయుచున్నారు.

పేశుమిన్ తిరునామ మెట్టెழுత్తుమ్ శొల్లి నిన్ఱు, పిన్నరుమ్
పేశువార్ దమ్మై ఉయ్యవాఙ్గి ప్పిఱప్పఱుక్కుమ్ పిరానిడమ్,
వాశమామలర్ నాఱువార్ పొழிల్ శూழ்దరు ములగుక్కెల్లామ్,
తేశమాయ్ త్తిగழுమ్మలై త్తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే. ౯

టీక :— పేశుమ్ = అందఱి చేతను సులభముగ ననుసంధింపదగినదియును, ఇన్ = పరమభోగ్యమునైన, తిరు నామమ్ ఎట్టు ఎழுత్తుమ్ = తిరువష్టాక్షరీ మహామన్త్రమును, శొల్లి నిన్ఱు = అనుసంధించి, పిన్నరుమ్ = పైపైన, పేశు వార్ తమ్మై = (దానినే) అనుసంధించు వారలను, ఉయ్య వాంగి = ఉజ్జీవింపజేసి, పిఱప్పు = వారి పుట్టుకను (సంసారమును) అఱుక్కుమ్ = ఛేదించు, పిరాన్ = ఎమ్పెరుమాన్లు, ఇడమ్ = వేంచేసియుండు దివ్యస్థలమైనదియు, వాశమ్ = అధికమగు సువాసనలు గలిగి మామలర్ = దివ్యములగు పుష్పములచే, నాఱుమ్ = పరిమళించుచున్న, వార్ పొழிల్ = విశాలములైన పూదోటలచే, శూழ் తరుమ్ = చుట్టబడినదియు, ఉలగుక్కు ఎల్లామ్ = అన్ని లోకములకును, తేశమ్ ఆయ్ తిగழுమ్ = తిలకముపలె ప్రకాశించుచున్నదియునైన, తిరువేంగడమ్ మలై = శ్రీవేంకటాచలమునే, నెంజమే = ఓ మనసా!, అడై = ఆశ్రయింపుము.

తా॥ సకలప్రాణులచేతను సులభముగ ననుసంధింపదగినదియును, పరమభోగ్యమైనదియునైన, శ్రీ మదష్టాక్షరీమహామన్త్రమును, అనుసంధించి, పైపై దానినే సదా అనుసంధించువారల నుజ్జీవింపజేసి, వారి సంసారబంధమును త్రెంపివైచు సర్వేశ్వరుడు వేంచేసియుండునట్టిదియు, మిక్కిలి సువాసనలుగల దివ్యములగు మహాపుష్పములచే శోభాయమానమై, నిఖిలలోకములకును తిలకస్థానీయమైయున్న శ్రీ వేంకటాచలమునే ఓ మనసా! ఎల్లప్పుడును ఆశ్రయింపుము.

(10) అవ:— కడపట, దివ్యస్రవంతులచే నిండియుండు శ్రీవేంకటాచలమున వేంచేసియుండు శ్రియఃపతి నుద్దేశించి చెప్పిన ఈ తిరుమొழிని అభ్యసించిన వారలకు ఫలమును సెలవిచ్చుచున్నారు.

* శెజ్గయల్ తిళైక్కుమ్ శునై త్తిరువేజ్గడత్తుఱై శెల్వనై,
మజ్గైయర్ తలైవన్ కలికన్ఱి వణ్ తమిழ் శెఞ్జొల్ మాలైగళ్,
శజ్గైయిన్ఱిత్తరిత్తు ఉరైక్క వల్లార్గళ్ తఞ్జమదాగవే,
వజ్గమాకడల్ వైయమ్ కావలరాగి వానులగాళ్వరే. ౧౦

టీక :_ శెఙ్కయల్ = (శైశవముచే) ఎఱ్ఱగనుండు చేపలు, తిళైక్కుమ్ = త్రుళ్ళుచు ఆటలాడుకొనుచున్న, శునై = దొనలతో గూడి కనులపండువై యుండు, తిరువేంగడత్తు = తిరుమలయందు, ఉఱై = నిత్యవాసము చేయుచున్న, శెల్వనై = శ్రియఃపతిని గూర్చి, మంగయర్ తలైవన్ = తిరుమంగై దేశమందున్నవారలకు స్వామియైన, కలికన్ఱి = కలియన్ అను తిరునామముగలిగిన తిరుమంగైయాళ్వార్లు (సాదించిన), వణ్ తమిழ் = శ్లాఘ్యమైన అరవభాషలోనున్న, శెంశొల్ మాలైగళ్ = అనర్ఘమగు శ్రీసూక్తిమాలికలను, శంగై ఇన్ఱి = "ఇది ఫలమునిచ్చునో, లేదో" అను సంశయములేక, తరిత్తు = విశ్వాసముతో నభ్యసించి, ఉరైక్క = అనుసంధింపగ, వల్లార్గళ్ = సామర్థ్యముగలవారు, వంగమ్ మా కడల్ = పడవలతో నిండియుండు అపారమగు విశాలసముద్రముచే చుట్టబడిన, వైయమ్ = భూమండలమునందున్నవారలకు, తంజమ్ అదు అగవే = శరణ్యమైవారలకు రక్షకులై (ఇట్లు లీలావిభూతిలో సుఖములననుభవించిన తరువాత) వాన్ ఉలగు = పరమపదమును గూడ, ఆళ్వర్ = పరిపాలించు భాగ్యముగల వారలగుదురు.

తా॥ ఎఱ్ఱని చిన్న చేపలు త్రుళ్ళిపడుచు క్రీడించు దివ్యములగు పుణ్యతీర్థములతో నిండియుండు శ్రీవేంకటాచలమున పరమకృపతో నిత్యవాసము చేయుచుండు శ్రీనివాసుని గూర్చి శ్రీతిరుమంగైయాళ్వార్లు ప్రసాదించిన రమణీయములగు ద్రావిడపాశురములతో గూడిన, ఈ శ్రీసూక్తిరత్నమాలికను "ఇది మనకు ఫలము నిచ్చునా ? ఇవ్వదా ?" అను సందేహమును వదలి పరమవిశ్వాసముతో నభ్యసించి అనుసంధించువారలు, పడవలతో నిండియుండు పెద్దసముద్రముచే జుట్టబడిన భూమండలమునందలి భోగభాగ్యములనెల్ల ననుభవించి, తరువాత పరమపదమునకు గూడ విచ్చేసి, నిరవధికమగు నానందసామ్రాజ్యమును గూడ ననుభవించుచుందురు.

అడివరవు :— కొంగు, పళ్ళి, నిన్ఱ, పార్ త్తర్కు , వణ్ కైయాన్, ఎణ్ తిశైగళ్, పార్, అమ్బరమ్, పేశుమిన్, శెంగయల్, తాయ్.

శ్రీ తిరుమంగైయాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము.

శ్రీరస్తు

శ్రీమతే పరకాలాయ పరమయోగినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తిరుమంగై యాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరుమొళిలోని

# మంగళాశాసన పాశురములు

(1-వ పది, 9-వ తిరుమొళి)

## "తాయే తన్దై"

## అవతరణిక

క్రింది తిరుమొళిలో, ఒక్కొక్క పాశురమునను "తిరువేంగడముడైయాన్లను ఆశ్రయింపుమా!" అని తమ మనస్సునకు ఆళ్వార్లు ప్రబోధించిరి. అంత మనస్సు వీరికి అనుకూలమైనది. వీరును తమ మనస్సుతో గూడ తిరువేంగడముడైయాన్లను సందర్శింపవలయునని మిక్కిలి కుతూహలములతో తిరుమలకు విచ్చేసిరి. కాని, శ్రీమలైయప్పన్ స్వామివారు వీరికి ఆభిముఖ్యమును చూపకుండిరి. అందుపై భగవంతుడు ఔదాసీన్యమును పూనుటకు తమ పాపములే కారణమని నిశ్చయించి పెరియపిరాట్టియార్లను పురుషకారముగా జేసికొని తిరువేంగడముడైయాన్లనే శరణు వేడు చున్నారు.

(1) అవ :—అందు మొదటిపాశురమున, వెదుళ్ళతోను పూదోటల తోను మిక్కిలి మనోహరమైయుండు తిరువేంగడమునకు నధిపతియగు నో శ్రియఃపతీ! దేహబంధువులనందఱిని సవాసనముగ పరిత్యజించి, ఆత్మ బంధువగు నిన్ను శరణుజొచ్చియున్నాను. దాసుని పరమకృపతో పరి పాలింపవలయునని ప్రార్థించుచున్నారు.

* తాయే తన్దై యెన్ఱుమ్ తారమే కిళై మక్కళెన్ఱుమ్,
నోయే పట్టొழிన్దేన్ ఉన్నైక్కాణ్బదోర్ ఆశైయినాల్,
వేయేయ్ పూమ్బొழிల్ శూழ் విరై యార్ తిరువేఙ్గడవా,
నాయేన్ వన్దడైన్దేన్ నల్గి ఆళెన్నైక్కొణ్డరుళే. ౧

టీక :— వేయ్ఏయ్ = వెదురుపొదలచే నిబిడమైనదియును, పూమ్ పొழிల్ శూழ் = పూదోటలతో జుట్టబడియున్నదియు, (అందుచే) విరై ఆర్ = దివ్యపరిమళములచే భరితమైయున్న, తిరు వేంగడవా = శ్రీవేంకటాచలమున నిత్యసన్నిధిచేయుచున్న శ్రియఃపతివగు నో స్వామీ! తాయే ఎన్ఱుమ్ = తల్లియనియు, తన్దైయెన్ఱుమ్ = తండ్రియనియు, తారమే యెన్ఱుమ్ = భార్యయనియు, కిళైయే యెన్ఱుమ్ = బంధువులనియు, మక్కళే యెన్ఱుమ్ = పిల్లలనియును, ఇవి మొదలుగాగల ఆభాసబంధువులనే ఎల్లప్పుడును చెప్పికొనుచు, నోయేపట్టు = అనర్థపడి, ఒழிన్దేన్ = నశించిపోయితిని, నాయేన్ = కుక్కవలె మిగులనీచుడనగు దాసుడు, ఉన్నై = (ఆభాసబంధువులగు వారినందఱిని విడిచి ప్రాప్తబంధువగు) నిన్ను, కాణ్బదు ఓర్ ఆశైయినాల్ = సేవింపవలయునను ఒక పేరాశతో, వన్దు = నీ వద్దకువచ్చి, అడైన్దేన్ = శరణుజొచ్చితిని, ఎన్నై = శరణాగతుడనైన నన్ను, నల్గి = కృపజేసి, ఆళ్ కొండు అరుళ్ = దాసునిగాజేసికొని పరిపాలింపుము.

తా॥ ఎక్కడ జూచినను వెదురుపొదలు దట్టముగనుండుటచే మందమైనవియు, పూదోటలు జుట్టునునుండుటచే దివ్యపరిమళమిళితములునగు మంచిమారుతములు వీచుచుండుటచే బరమభోగ్యమైయుండు శ్రీ వేంకటాచలమున దివ్యభోగరసముల ననుభవించుచు మహావైభముతో నేంచేసియుండు మా స్వామీ! తల్లి, తండ్రి, భార్య, పిల్లలు, బంధువులునను ఆభాసబంధువులగు శరీరసంబంధులనే ఎల్లప్పుడును అభిమానించుచు కుక్కవలె తిరుగుచు మహానర్థపరంపరల ననుభవించితిని. ఇప్పుడు మీకటాక్షముచే బుద్ధివచ్చినది. ఆభాసబంధువులగు వారల సంబంధమును సహాసనముగ వదలి నిరుపాధిక సర్వవిధబంధువైన దేవరవారి శ్రీపాదమూలమునకువచ్చి శరణుజొచ్చితిని, దాసునిపై దయయుంచి తమ దాసానుదాసునిగ జేసికొని, నన్ను అనుగ్రహింపుడు.

(2) అవ :— దుర్విషయములను భోగ్యములని యెంచి మహా పాతకముల నొనరించియున్నాను. పశ్చాత్తప్తుడనై నిన్ను శరణుజొచ్చి యున్నాను. నన్ను పరిపాలింపుము—అని వేడుకొనుచున్నారు.

మానేయ్ కణ్మడవార్ మయక్కిల్ పట్టు, మానిలత్తు
నానే నానావిదనరగమ్బుగుమ్ పావమ్ శెయ్ దేన్,
తేనేయ్ పూమ్బొழிల్ శూழ் తిరువేఙ్గడమామలై, ఎన్
ఆనాయ్! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే ౨

టీక :— తేన్ ఏయ్ = తుమ్మెదలతో నిండియున్న, పూమ్ పొழிల్ శూழ் = పూదోటలతో జుట్టబడియున్న, తిరువేంగడంమామలై = శ్రీ వేంకటాచలమును సర్వత శ్రేష్ఠమున వేంచేసియున్నట్టి, ఎన్ ఆనాయ్ = మత్తగజమువంటి శ్రియఃపతీ! మా నిలత్తు = ఈ పెద్ద భూమండలమున, మాన్ ఏయ్ కణ్ = లేడికండ్లవంటి కన్నులుగల, మడవార్ = యువతులయొక్క, మయక్కిల్ = చూడ్కులమాయలో, పట్టు = తగుల్కొని, నానావిదనరగమ్ = నానావిధములగు నరకములలో, పుగుమ్ పావమ్ = ప్రవేశింప వలసినపాపములను, నానే = నేనొక్కడనే, శెయ్ దేన్ = చేసివైచితిని (అయినను ఇప్పుడు అనుతాపము కలిగినందున), వన్దు = నీ సన్నిధికివచ్చి, అడైన్దేన్ = శరణు జొచ్చితిని, అడియేనై = దాసుని, ఆళ్ కొండు అరుళ్ = పరిపాలింప కృపజేయుము.

తా॥ భోగ్యతాతిశయముచే మూగియున్న తుమ్మెదలతో శోభాయ మానమైయున్న పుష్పోద్యానములతో నిండియుండు శ్రీవేంకటాచలమున మత్తగజమువలె వేంచేసియున్న ఓ మాస్వామీ శ్రీనివాసా! ఈ భూమండల మునందలి మృగశాబాక్షులకటాక్షవిభ్రమములను మాయావాగురమున దగుల్కొని నానావిధ నరకములకు హేతువులగు అసంఖ్యాకములగు పాప ముల నేనొక్కడనే యొనరించితిని. ఇప్పుడు బుద్ధి వచ్చినది. నీ సన్నిధికివచ్చి నిన్ను శరణుజొచ్చియున్నాను. నన్ను దాసునిగాజేసికొని కటాక్షింపుము.

(3) అవ :—అవివేకముచే జేసిన జీవహింసాది దోషములను గూడ మన్నించి నన్ను కాపాడవలయునని శరణువేడుచున్నారు.

కొన్ఱేన్ పల్లుయిరై కుఱిక్కోళ్ ఒన్ఱిల్లామైయినాల్,
ఎన్ఱేను మిరన్దార్కు ఇనిదాగ ఉరైత్తఱియేన్,
కున్ఱేయ్ మేగ మదిర్ కుళిర్ మామలై వేఙ్గడవా,
అన్ఱే వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే. 3

టీక :— కున్ఱుఏయ్ = పర్వతమువలెనుండు, మేగమ్ = మేఘముల, అదిర్ = గర్జనములతో గూడుకొన్నదియును, కుళిర్ = చల్లనైనదియును, మా = శ్రేష్ఠమైన, మలై = పర్వతమును, వేంగడవా = శ్రీ వేంకటాచలమున నివసించు ఓ స్వామీ ! కుఱి కోళ్ = వివేకమనునది, ఒన్ఱు ఇల్లామైనాల్ = కొంచెమైనను లేనందువలన, పల్ ఉయిరై = అనేక ప్రాణులను, కొన్ఱేన్ = చంపివైచితిని, ఇరన్దార్కు=యాచించిన వారలకు, ఇనిదు ఆగ = మధురముగ, ఒన్ఱేనుమ్=ఒక రోజైనను. ఉరైత్తు అఱియేన్ = బదులు చెప్పినపాపమున పోలేదు, అన్ఱే = ఆక్షణముననే, వన్దు = నీ సన్నిధికివచ్చి, అడైన్దేన్ =చేరితిని, అడియేనై = దాసుని, ఆళ్ కొణ్డు అరుళ్ =నీ కింకరునిగా జేసికొని అనుగ్రహింపుము.

తా॥ మహోన్నతములై, మత్తగజములవలెనుండు కాళమేఘములు గర్జించుచు నెల్లప్పుడును వర్షించుచున్నందున సుభగశీతలమై యుండు శ్రీవేంకటాచలమున విజయముచేసియుండు మాస్వామీ ! యుక్తాయుక్త వివేకము కొంచెమైనను లేక, అయ్యో! అనేకులగు నమాయికప్రాణుల కనికరములేక హింసించితినే ! గంపెడాసతో నా వద్దకువచ్చి యాచించిన వారలను తరిమికొట్టితినే ! వారల యభీష్టములపూర్తి చేయలేకయున్నను, వారల కాప్యాయనముగలుగునట్లైనను మధురముగ మాటలాడి యెఱుగనే! అయ్యో మహాకష్టము ! ఇప్పుడు నీ అనుగ్రహమువల్ల బుద్ధివచ్చినది. పశ్చాత్తాపముచే కుమిలిపోవుచున్నాను. విలంబనమును సహింపజాలక వచ్చి నీ దివ్యపాదారవిన్దముల నాశ్రయించితిని. నన్ను దాసునిగా జేసికొని నాపాపముల నశింపజేసి పరిపాలింపుము. నీకు పుణ్యముండును.

వి. వి :— (1) "కుఱికొళ్" అనగా ఆస్తిక్యము, వివేకము, లేక పాపభీతి. దేహమునకంటె ఆత్మవస్తువుఅతిరిక్తముగనున్నదియు, పుణ్యాపాపములు, స్వర్గనరకములు నున్న వనియు, వేదశాస్త్రాదులు ప్రమాణములనియు నంగీకరించుటచే కలిగిన ఆస్తిక్యబుద్ధి-అని పర్యవసానము.

(2) "అన్ఱే" చంపినచేతిని గూడకడుగుకొనక రక్తసిక్తమగు హస్తముతోడనే వచ్చి శరణుజొచ్చితిని — అని స్వాపదేశము.

(4) అవ:— అసంఖ్యాకములగు హీనజన్మముల నెత్తితిని. ఒక చోటనైనను మంచి పనుల చేసి యెఱుంగను బహుయాతనల ననుభవించితిని. ఇక తాళజాలను. నన్ను కటాక్షింపుమా! అని ప్రతిమాలు కొనుచున్నారు.

కులన్దా నెత్తనై యుమ్ పిఱన్దేయిఱన్దెయ్ త్తొళిన్దేన్,
నలన్దానొన్ఱుమిలేన్ నలదోరఱమ్ శెయ్దుమిలేన్,
నిలమ్తోయ్ నీళ్ముగిల్ శేర్ నెఱియార్ తిరువేఙ్గడవా,
అలన్దేన్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే. ౪

టీక :— నిలమ్ = భూమిపై, తోయ్ = ఒఱచుకొనునట్లు, నీళ్ = పెద్దవైన, ముగిల్ = మేఘములు, శేర్ = సంచరించుచున్న, నెఱి = మార్గములతో, ఆర్ = పూర్ణమైయున్న, తిరువేంగడవా=శ్రీ వేంకటాచలమునకు అధిపతియైన స్వామీ! ఎత్తనై కులమ్ = అనులోమప్రతిలోమ రూపములగు అంఖ్యాకములైన వర్ణములయందు, పిఱన్దు = పుట్టి, ఇఱన్దు = గిట్టి, ఎయ్దుఒళిన్దేన్ = (యాతనలననుభవించి) అలసి సొలసి పోయితిని; నలమ్ఒన్ఱుమ్ ఇలేన్ = ఏ విధమైన పుణ్యాకార్యములను చేయనైతిని; నల్లదు ఓర్ అఱముమ్ = మంచి కార్యమునొకటియును, శెయ్దిలేన్ = చేసి యెఱుగను; అలన్దేన్ = పలువిధములగు కష్టములను అనుభవించితిని, (ఇక ననుభవింపశక్తిలేనివాడనై, వన్దు = నీ సన్నిధికివచ్చి, అడైన్దేన్ = అనన్యశరణ్యుడనై శరణుజొచ్చితిని; అడియేనై = దాసుని, ఆళ్కొణ్డరుళ్ = పరిపాలించి అనుగ్రహింపుము.

తా॥ భూనభోంతరాళములనన్నిటిని వ్యాపించి సంచరించుచున్న మేఘములచే నిబిడమైయుండు మార్గములతో శోభాయమానమైయుండు శ్రీ వేంకటాచలమున విహరించుచుండు నో పరంధామా! వివిధములైన

నీచాతినీచములగు జన్మములనెత్తి అనేకకష్టముల ననుభవించితిని. ఒక క్షణమునందైనను, ఏవిధములైన పుణ్యకార్యములను గూడ, చేయ తల పెట్టనైతిని. మంచికార్యము నొక్కదానినైనను చేయనైతిని. యాతనా పరంపరల ననుభవించి అలసి సొలసి పోయితిని. నీదివ్యపాదారవిందముల ననన్యగతికుడనై వచ్చి శరణుజొచ్చితిని. నన్ను దాసునిగా ననుగ్రహించి పరిపాలింపుము — ఓ దయామయా! శ్రీ కల్యాణకల్పద్రుమతల్లజమా!.

(౮) అవ :— అతిపాతక — ఉపపాతక — మహాపాతకములనన్నిటిని కొంచెమైనను చలింపక అతినిర్ఘృణుడనై యొనరించితిని. వానికి దగిన ఫలములను గూడ అనుభవించి వేసారితిని. అనన్యశరణ్యుడనై శరణు జొచ్చితిని. దయతో గాపాడుము — అని మొఱలిడుచున్నారు.

ఎప్పావమ్పలవుమ్ ఇవై యే శెయ్దు ఇళై త్తొழிన్దేన్,
తుప్పా! నిన్నడియే తొడర్న్దేత్తవుమ్ కిఱ్కిన్తిలేన్,
శెప్పార్ తిణ్వరై శూழ் తిరువేఙ్గడమామలై, ఎన్
అప్పా! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే. ౫

టీక :— శెప్పుఆర్ =ముక్తాదామము (ప్రాకారము) వలె నుండునట్టి, తిణ్ వరై = ఉన్నతములై, విశాలములైయున్న పర్వతపంక్తులచే, శూழ் = జుట్టబడియున్న, తిరు వేంగడమ్ మామలై = శ్రీ వేంకటాచలమను పర్వతరాజమున వేంచేసియుండునట్టి, ఎన్ అప్పా=నా తండ్రీ, తుప్పా=సర్వేశ్వరా !, ఎప్పావమ్ పలవుమ్ ఇవై యే=ఎన్ని విధములగు పాపములున్నవో, వానినన్నిటినిగూడ, శెయ్దు = చేసి, ఇళైత్తు ఒழிన్దేన్ = పలుదుఃఖముల ననుభవించి అలసి సొలసితిని, (అందుచే) నిన్ అడియే = నీ దివ్యపాదార విన్దములనే, తొడర్న్దు = అనుసరించి, ఏత్తవుమ్ = స్తుతింపనుగూడ, కిఱ్కిన్తిలేన్ = శక్తిలేనివాడనుగానున్నాను. వన్దు అడైన్దేన్ =అగతికుడనైవచ్చినిన్ను శరణుజొచ్చితిని. అడియేనై ఆళ్ కొండుఅరుళ్ =నన్నుదాసునిగాజేసికొని పరిపాలించి అనుగ్రహింపుము.

తా॥ చిత్రవిచిత్రములగు పర్వతపంక్తులను ముత్యాలహారములతో శోభాయమానమై యున్న శ్రీ వేంకటాచలమున నెలకొనియున్న పరమ దయాకరా! నా తండ్రీ! సర్వేశ్వరా! మహాపాతక, ఉపపాతక, అతి

పాతకములని అనేకవిధములుగ నసంఖ్యాకములైయుండు పాపముల నన్నిటిని కొంచెమైనను కించలేక అనుష్ఠించితిని. దాని ఫలితముగ ననేక దుఃఖపరంపరలలో జిక్కుకొని అలసిసొలసితిని. నీ దివ్యపాదారవింద ముల నాశ్రయించి స్తుతించుటకైనను శక్తిలేదు. కరుణాసముద్రా! అనన్యగతికుడనై వచ్చి ఆశ్రయించియుండు దాసుని అనుగ్రహించి పరిపాలింపుము.

వి. వి :— (1) తుప్పన్ — సూక్ష్మాతిసూక్ష్మములగు విషయములను గూడ గుఱైఱుంగగలిగిన శేముషీవిశేషభాసితుడు ; లేక, సంరక్షించుటకు దగిన శక్తియుక్తుడు.

(2) ఆభరణముల భద్రపఱుప నుపయోగింపు పెట్టెను "శెప్పు" అని పేరు. ఇచ్చట లక్షణావృత్తిచే "ప్రాకారము (ముత్యాలహారము)" అను అర్థము నిచ్చుచున్నది.

(6) అవ :— పాంచభౌతికమై వివిధములగు రణములతో గూడి యున్న నవద్వారపురమగు శరీరమున చిక్కుబడి బహుయాతనల ననుభ వించి అనన్యగతికుడనై నీ పాదారవిందముల శరణుజొచ్చితిని. నన్ను నీ దాసునిగజేసికొని పరిపాలింపుము — అని విలపించుచున్నారు.

మణ్ణాయ్ నీరెరికాల్ మఞ్జులావుమ్ ఆకాశముమాన్,
పుణ్ణారాకై క్కదన్నుళ్ పులమ్బి త్తళర్న్దు ఎయ్త్తొழிన్దేన్,
విణ్ణార్ నీళ్ శిగర విరైయార్ తిరువేఙ్గడవా,
అణ్ణా! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే. ౬

టీక :— విణ్ ఆర్ నీళ్ శిగరమ్ = ఆకాశమువఱకువ్యాపించియున్న మహో న్నతములైన శిఖరములుగలిగినటువంటిదిన్నీ, విరై ఆర్ = దివ్యపరిమళభరితమైనట్టి, తిరు వేంగడవా = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నట్టి, అణ్ణా = స్వామీ! మణ్, ఆయ్, నీర్, ఎరి, కాల్, మంజు ఉలావుమ్ = భూమియు, ఆకాశము, జలము, అగ్ని, వాయువు, మేఘములు — ఇవి అన్నియును సంచరించుచున్నట్టి, ఆకాశముమ్ ఆమ్= ఆకాశము అను పంచభూతములచే నేర్పడినదియు, పుణ్ ఆర్ = రణములతో నిండి యున్న, ఆక్కై క్కదన్నుళ్ = శరీరమున (చిక్కుకొని), పులమ్బి = వెక్కివెక్కి ఏడ్చి, తళర్న్దు = శరీరముకృశించి, ఎయ్దుఒழிన్దేన్ = మిక్కిలి కష్టపడితిని, వన్దు = (అట్టి దాసుడను) వచ్చి, అడైన్దేన్ = నీ పాదారవిన్దముల సన్నిధికిచేరితిని, అడియేనై = నన్ను, ఆళ్ కొండరుళ్ = దాసునిగా స్వీకరించి పరిపాలింపుము.

తా॥ ఆకాశమునంతయును వ్యాపించి మహోన్నతములై యుండు శిఖరములతో ప్రకాశించుచు, దివ్యపరిమళభరితములగు రమ్యోద్యాన ములచే నిండియుండు శ్రీవేంకటాచలమున వేంచేసియున్నట్టి మా స్వామీ! పంచభూతసంఘాతాత్మకమైయుండు శరీరపంజరమున చిక్కుకొని అనేక విధములగు నసహ్యయాతనల ననుభవించి, విసిగి వేసారితిని. కడపటికి నీ దివ్యపాదారవిందముల సన్నిధికి నేతెంచి శరణుజొచ్చితిని. నన్ను నిత్య కింకరునిగా ననుగ్రహించి పరిపాలింపుము.

(7) అవ:— బాల్యమునం దజ్ఞానముచేతను, యౌవనమున కామాంధుడనయ్యు, లెక్కకుమించిన పాపముల జేసితిని. ఇప్పుడు బుద్ధి వచ్చినది. నన్ను క్షమించి నీ దాసునిగా జేసికొని పరిపాలింపుము—అని ప్రతిమాలుచున్నారు.

తెరియేన్ పాలగనాయ్ ప్పలతీమైగళ్ శెయ్దుమిట్టేన్,
పెరియేనాయినపిన్ పిఱర్క్కే యుழైత్తేழైయానేన్,
కరిశేర్ప్పూమ్బొழిల్ శూழ் కనమామలై వేఙ్గడవా,
అరియే! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే. ౭

టీక :— కరిశేర్ = ఏనుగులు మిక్కుటముగ నివసించునట్టిదియు, పూమ్పొழிల్ శూழ் = సుందరములైన పూదోటలతో నిండియున్నదియు, కనమ్ మామలై = మిక్కిలి దృఢమైన పర్వతశ్రేష్ఠమగు, వేంగడవా = శ్రీ వేంకటాచలమున నివసించు పురుషోత్తమా! అరియే = హరీ!, పాలగన్ ఆయ్ = బాలుకుడనైయుండు నప్పుడు, తెరియేన్ = తెలివిలేనివాడనై, పల తీమైగళ్ = పలుపాపములను, శెయ్దుమ్ ఇట్టేన్ = చేసివైచితిని, పెరియేన్ ఆయినపిన్ = పెద్దవాడనయిన తరువాత, పిఱర్క్కే ఉழైత్తు = విషయాన్తర ప్రణవుడనై శ్రమపడి, ఏழైఆనేన్ = బీదనైతిని (సర్వవిధ ముల నశక్తుడనైతిని), (ఇక వేరుగతిలేనివాడనై) వన్దు = నీ దివ్యపాదారవిన్దముల సన్నిధికి వచ్చి, అడైన్దేన్ = శరణుజొచ్చితిని, అడియేనై = దాసుని, ఆళ్కొణ్డు అరుళ్ = సంరక్షించి అనుగ్రహింపవలయును.

తా॥ గజబృందములు నివసించునట్లు గహనారణ్యసీమలతోడను, దివ్యపరిమళభరితములగు పూఁదోటలతోడను నిండియుండి సుందరతమమై కనులపండువగొల్పు పర్వతశ్రేష్ఠమగు శ్రీ వేంకటాచలమున విజయముచేసియుండు సర్వేశ్వరా! హరీ! చిన్నతనమున తెలివిలేమిచేతను, యౌవనమున మదాంధతచేతను కొంచెమైనను యోచింపక నెన్నియో పాపములు చేసివైచితిని. అందులకు ఫలములగూడ బాగుగ ననుభవించితిని. బికారినై నిన్ను శరణుజొచ్చితిని. నన్ను దాసునిగాజేసికొని పరిపాలింపవలయునని ప్రార్థించుచున్నాను. దయామయా! దయజూడుమా.

(8) అవ:— అనేకములగు జన్మములు సంభవించునట్లు లెక్కకు మిాఱిన పాపములను చేసియున్నాడను ఈ జన్మమున నిన్ను సేవింపవలయునను ఆశ మిక్కుటమై నిన్ను వచ్చి శరణుజొచ్చితిని. నన్ను అనుగ్రహింపుము—అని ప్రార్థించుచున్నారు.

నోఱ్ఱేన్ పల్పిఱవి నున్నైక్కాణ్బదోరాశైయినాల్,
ఏఱ్ఱేన్ ఇప్పిఱప్పే ఇడరుఱ్ఱనన్ ఎమ్బెరుమాన్,
కోల్తేన్ పాయ్న్దొழுగుమ్ కుళిర్శోలై శూழ்న్ద వేఙ్గడవా,
ఆఱ్ఱేన్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే.

టీక :— కోల్ తేన్ = చెట్లకొమ్మలనుండి నిరర్గళముగా తేనెలుస్రవించుచున్న. కుళిర్నశోలై = తాపహారములగు చల్లని పూఁదోటలచే, శూழ்న్ద = చుట్టబడియున్నట్టి వంటి, వేంగడవా=శ్రీ వేంకటాచలమున విలసిల్లుచున్న, ఎమ్బెరుమాన్ =నా స్వామీ !, పల్ పిఱవి = అనేక జన్మములుగలుగునట్లు, నోఱ్ఱేన్ = నోముకొంటిని, ఉన్నై = దేవరవారిని కాణ్బదు = సేవింపవలయునను, ఓర్ ఆశైయినాల్ =ఒక ఆశాపాశముచే, ఇప్పిఱప్పే = ఈ జన్మమున దేవరవారికి ప్రతిపాత్రుడనుగా, ఏఱ్ఱేన్ = ఏర్పడితిని. ఇడర్ ఉఱ్ఱనన్ =(ఇంకను గలుగబోవు జన్మముల దలంచుకొని) దుఃఖించుచున్నాను. వన్దడైన్దేన్ =(ఇక జన్మములులేకుండుటకై) వచ్చి నిన్ను శరణుజొచ్చితిని, అడియేనై = దాసుని , ఆళ్ కొణ్డు అరుళ్ = పరిపాలింపుము.

తా॥ చెట్లకొమ్మలనుండి నిరంతరము నిరర్గళముగా గారుచున్న తేనియలతో నిండియుండి, పరమసుగంధరమణీయములగు పుష్పములతో శోభిల్లుచుండు, సుభగశీతలములగు దివ్యోద్యానములచే బరివృతమై, పరమభోగ్యమైయుండు శ్రీ వేంకటాచలమున విలసిల్లుచున్న మా స్వామి నాథా! అనేకములగు జన్మములు గలుగునట్టి నోములు నోచుకొంటిని. పలు బాధలు పడితిని. దేవరవారి నెటులనైనను సేవింపలయునను పేరాసతో నీ జన్మము నెత్తితిని. మఱల వేరుజన్మములు గలుగునేమో యని భయభ్రాంతుడనగుచున్నాను. నీ పాదపద్మముల శరణుజొచ్చియున్నాను. నన్ను దాసునిగా జేసికొని పరిపాలించి నన్ను అనుగ్రహింపుము.

(౨) అవ:— పాపిష్ఠుడనై, ఒక ఆశ్రయము లేనివాడనై, ఏవిధమైన ఉపాయము తెలియనివాడనై, నిన్ను శరణుజొచ్చితిని. పరమ కృపతో రక్షింపుము — అని ప్రార్థించుచున్నారు.

పఱ్ఱేల్ ఒన్ఱుమిలేన్ పావమే శెయ్దు పావియానేన్,
మఱ్ఱేల్ ఒన్ఱఱియేన్ మాయనే ఎఙ్గళ్ మాదవనే,
కల్ తేన్ పాయ్న్దొళుగుమ్ కమలచ్చునై వేఙ్గడవా,
అఱ్ఱేన్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే.

టీక :— మాయనే = ఆశ్చర్యకరములగు దివ్యకల్యాణగుణవిగ్రహచేష్టితముల గలవాడా! ఎఙ్గళ్ మాదవనే=మాకు జననియును, పురుషకారస్వరూపిణియునగు శ్రీదేవికి ప్రాణనాథుడవైనవాడా! కల్ తేన్ పాయ్న్దు ఒళుగుమ్ = కొండచరియలనుండి తేనెలు ధారలు ధారలుగ ప్రవహించుచుండునదియును, కమలమ్ శునై=వికసించినతామర పుష్పములతో శోభిల్లుచుండు కొండవారువులతో నిండియుండునదియునగునగు, వేంగడవా=శ్రీవేంకటాచలమున విజయము చేసియుండు సర్వేశ్వరా! పఱ్ఱు ఒన్ఱుమ్ ఇలేన్= ఒక విధమైన ఆధారమునులేనివాడనైయున్నాను, పావమే శెయ్దు = పాపములనే ఆర్జించి, పావి ఆనేన్=పాపిష్ఠుడనైతిని, మఱ్ఱు ఒన్ఱు=వేఱు ఉపాయము నెఱుగను, అఱ్ఱేన్ = నీకే దాసుడనని తీర్మానించితిని, వన్దు అడైన్దేన్ = వచ్చి నీ శ్రీపాదముల శరణుజొచ్చితిని, అడియేనై = దాసుని, ఆళ్ కొండు అరుళ్=అనుగ్రహింపవలయును

తా॥ అత్యాశ్చర్యకరములగు దివ్యకల్యాణగుణగణ విగ్రహచేష్టితములచే నెల్లఱను వశీకరించుకొను మా శ్రియఃపతీ! కొండచరియలనుండి తానుగా ప్రవహించు తేనెలప్రవాహములచేతను, వికసించిన తామర పుష్పములచే రమణీయములై యుండు దివ్యసరస్సులచేతను శోభాయమానమైయుండు శ్రీ వేంకటాచలమున నెల్లప్రాణుల సంరక్షించుటకై వేంచేసియుండు మా స్వామీ! అనన్యశరణ్యుడనై, అనన్యగతికుడనై, పాపిష్ఠుడనగు నేను నీ పాదమూలమున వచ్చి చేరితిని. నన్ను దాసానుదాసునిగా స్వీకరించి సంరక్షింపుము.

వి. వి:— పావమే శెయ్‌దు పావియా నేన్ - అను దానికి భావమేమనగా - సత్యభాషణము మొదలగు పుణ్యములనే చేసిన శ్రీ దశరథచక్రవర్తి, పుణ్యములకు గూడ పుణ్యమూర్తియగు శ్రీ రామచంద్రుని నెడబాసి దుఃఖమరణమునుపొందిరి. పాపులలో నగ్రేసరుడగు, శిశుపాలుడు ఉన్నవఱకును పాపములనే జేసి కడపట పరమప్రయోజనమగు పరమపదమును పొందెను. ఇట్లు గాక నేను పాపమేచేసి పాపినయితిని అనగా, శ్రీదశరథచక్రవర్తివలె పుణ్యమునార్జించి పాపిని గాలేదు; శిశుపాలునివలె పాపములనార్జించి పుణ్యశాలినిగా లేదు. ఇక, పాపమేచేసి పాపియేనైతిని - అని దీని పరమాభిప్రాయము.

(10) అవ:— నిగమనమున తిరువేంగడముడైయాన్నను గూర్చి తిరుమంగైయాళ్వారులు ప్రసాదించిన ఈ తిరుమొళినభ్యసించిన వారలకు ఫలము చెప్పబడుచున్నది.

* కణ్ణాయ్ ఏళులగుక్కు- ఉయిరాయ ఎమ్ కార్ వణ్ణనై
విణ్ణోర్ తామ్‌పరవుమ్ పొழிల్ వేఙ్గడవేదియనై,
తిణ్ణార్ మాడఙ్గళ్ శూழ் తిరుమఙ్గైయర్ కోన్ కలియన్,
పణ్ణార్ పాడల్ పత్తుమ్ పయిల్వార్కట్కు- ఇల్లై పావఙ్గళే. ౧౦

టీక:— ఏళ్ ఉలగుక్కు=ఏడులోకములకును, కణ్ ఆయ్=నేత్రములవంటివాడును, ఉయిర్ ఆయ=ప్రాణములవంటివాడును నగు, ఎమ్ కార్ వణ్ణనై — మాపై కరుణామృతమును వర్షించుచున్న శ్యామసుందరమగు మేఘమువంటి దివ్యమంగళవిగ్ర

హముతో విరాజిల్లుచున్న వాడును, విణ్ణోర్ = నిత్యసూరులును, శిరమ్ పరవుమ్=విచ్చేసి స్తోత్రము చేయుచుండు, పొழிల్ వేంగడమ్=పూదోటలతో జుట్టబడియున్న తిరుమలలో వేంచేసియున్న వాడును, వేదియనై = అఖిల వేదప్రతిపాద్యుడును నైయుండు పరాత్పరుని గూర్చి, తిణ్ ఆర్ = దృఢములై శ్లాఘ్యములగు, మాడఙ్గళ్ శూழ் = మేడలతో నిండి యుండు, తిరుమంగైయర్ కోన్ = తిరుమంగై యను దివ్యదేశమున నివసించువారలకు స్వామియైన, కలియన్ = తిరుమంగైయాழ்వారులు (సాదించిన) పణ్ ఆర్ = మధురమైన సంగీతముతో గూడుకొనియున్న, పాడల్ పత్తుమ్ = ఈ పదిపాశురములను, పయిల్ వార్కు = అభ్యసించువారలకు, పావంగళ్ = ప్రతిబంధకములగు పాపములన్నియును, ఇల్లై = తొలగిపోవును

తా ఎల్లలోకములకును, నేత్రమువలెను, ప్రాణమువలెను, పోషకుడును, ధారకుడును నగు వాడును, నిత్యసూరులును, ఎల్లప్పుడును నాశతోవచ్చి స్తోత్రము చేయుచుండు పూదోటలతో శోభిల్లుచుండునదియు నగు శ్రీవేంకటాచలమున నీలమేఘ నిభ శ్యామసుందరవిగ్రహుడై అందటి కిని కొంగుబంగారమై వేంచేసియుండు ఎమ్పెరుమాన్లను (సర్వేశ్వరుని) గూర్చి పరమశ్లాఘ్యములగు దివ్యసౌధములతో విరాజిల్లుచుండు 'తిరుమంగై' అను దివ్యనగరమున వేంచేసియుండిన శ్రీతిరుమంగైయాழ்వారులు సాదించిన పరమభోగ్యమగు ఈ తిరుమొழிని భక్తితో నభ్యసించిన వారల పాపములన్నియును పటాపంచలగును.

శ్రీ తిరుమంగైయాழ்వార్ల తిరువడిగళ్కే శరణము.



శ్రీరస్తు
శ్రీమతే పరకాలమహాయోగినే నమః

# శ్రీ తిరుమంగై యాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరుమొళిలోని

# మంగళాశాసన పాశురములు

(1-వ పది, 10-వ తిరుమొళి — " కణ్ణార్ కడల్ శూళ్ ")

## అవతరిణిక

క్రింది తిరుమొళిలో, తమ సంసారమునందలి జుగుప్సను నివేదించు కొనుచు తిరువేంగడముడైయాన్నను శరణుజొచ్చిరి. అహంకారమమ కారములు మొదలగు ప్రతిబంధకములు నివృత్తమైననే ప్రపత్తి కార్యకరమగునని భావించి, ఆ ప్రతిబంధకముల నివర్తింపజేసి కాపాడమని ఈ తిరుమొళిలో ప్రార్థించుచున్నారు.

(1) అవ :— లోకకంటకుడగు రావణుని సంహరించి లోకముల గాపాడి, సర్వసులభుడవై తిరుమలలో వేంచేసియున్న ఓ శ్రియఃపతీ ! నా ప్రతిబంధకముల నివర్తింపజేయుము—అని బ్రతిమాలుచున్నారు.

* కణ్ణార్ కడల్ శూళ్ ఇలజ్గైక్కు ఇఱైవన్ తన్,
తిణ్ణాగమ్బిళక్క చ్చరమ్ శెల ఉయ్త్తాయ్,
విణ్ణోర్ తొళుమ్ వేఙ్గడమామలై మేయ,
అణ్ణా ! అడియే నిడరై క్కళై యాయే. ౧

టీక :— కణ్ అర్ కడల్ శూళ్ =విశాలమైన సముద్రముచే జుట్టబడియుండు, ఇలఙ్గైక్కు = లంకాపురికి, ఇఱైవన్ తన్ = అధిపతియైన రావణునియొక్క, తిణ్ = దృఢమైన, అగమ్ = శరీరము, పిళక్క = తూట్లుపడునట్లు, శరమ్ = అంబులను, శెల ఉయ్త్తాయ్ = ప్రయోగించిన విలుకాడా ! విణ్ణోర్ = (దేవతలు) నిత్యసూరులు, తొళుమ్ = సేవించుచున్నటువంటి, వేంగడమ్ మామలై = శ్రీ వేంకటాచలమున, మేయ అణ్ణా = వేంచేసియున్నట్టి పరమపురుషా !, అడియేన్ = దాసుని, ఇడరై = ప్రతిబంధకములను, కళైయాయే = నిరసింపుము.

తా॥ జలదుర్గమగు లంకాపురిలోనుండి దుర్జేయుడై లోకముల హింసించుచున్న రావణాసురుని శరీరము తూట్లుబడునట్లు బాణముల ప్రయోగించి, అతనిని వధించి, లోకములగాపాడి, శ్రీ సీతాపిరాట్టితో గూడి, నిత్యసూర్యులచేతను, బ్రహ్మాదిదేవతలచేతను సేవింపబడుచున్న పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచున్న పురుషోత్తమా! దాసుని ప్రతిబంధకముల నన్నిటిని నిరసింపజేసి సంరక్షింపుము.

వి. వి :— పూర్వము శ్రీచక్రవర్తితిరుమగవార్లు (శ్రీరామచంద్రమూర్తి)గ నవతరించినవారే, ఈ కలియుగమున శ్రీవేంకటాచలపతియై యవతరించియున్నారు — అని ఇద్దరికిని అభేదము అభివర్ణింపబడినది.

(2) అవ :— లంకాపురియందలి రాక్షసుల నిశ్శేషమొనరించిన ఓ శ్రీరామచంద్రమూర్తీ! గరుడధ్వజా! శ్రీ వేంకటాచలపతీ! నన్ను గ్రహింపుము—అని ప్రార్థించుచున్నారు.

ఇలఙ్గై ప్పదిక్కు— అన్ఱు ఇఱైయాయ, అరక్కర్
కులమ్ కెట్టు అవర్ మాళ కొ్కొడిప్పుళ్ తిరిత్తాయ్,
విలఙ్గల్ కుడుమి తిరువేఙ్గడమ్ మేయ,
అలఙ్గల్ తుళబముడియాయ్! అరుళాయే. ౨

టీక :— అన్ఱు = ముందుకాలమున, ఇలఙ్గైపదిక్కు = లంకాపురికి, ఇఱైఆయ = రాజులైయుండిన, అరక్కరవర్ = రాక్షసులు, కులమ్ కెట్టుమాళ = నిర్వంశులైనశించునట్లు, కొడి = (తనకు) ధ్వజమైన, పుళ్ = శ్రీ గరుడాళ్వార్లను, తిరిత్తాయ్ = సంచరింపజేసినవాడా! విలఙ్గల్ కుడుమి = (పైన సంచరించుచుండు చంద్ర సూర్యులు) తొలగిపోవునట్లు (మహోన్నతములై పెరిగియున్న) శిఖరములుగలిగిన, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమున, మేయ = వేంచేసియున్నవాడును, తుళపమ్ అలంగల్ = తిరుత్తుళాయ్ (తులసి) మాలలను, ముడియాయ్ = శిఖయందలంకరించుకొనినవాడా! అరుళాయ్ = దాసునిపై కృపజూపుము.

తా॥ పూర్వకాలమున లంకాధిపతులగు రాక్షసులను నిర్మూలించుటకై, నీ ధ్వజమైన శ్రీ వైనతేయుని సంచరింపజేసిన స్వామీ! మహో

న్నతములగు దివ్యశిఖరములచే విరాజిల్లు శ్రీ వేంకటాచలమున వేంచేసి యున్నవాడవై, దివ్యతులసీదామములచే నలంకరించుకొనబడిన దివ్యకమనీయ శిఖగలవాడవై యుండు ఓ సర్వేశ్వరా! దాసుని యనుగ్రహింపుము.

వి. వి :—(1 రావణునికి పూర్వము లంకలో "మాలి" అను రాక్షసుడు కాపురముండెను. అతడు వరదాన ప్రభావములచే దుర్జయుడై గరుత్మంతునిసైతము తనగదతో మోది తరిమికొట్టెను. దానిని సహింపలేనివారై శ్రీమన్నారాయణుడు గరుడవాహనారూఢులై అచ్చటికి జముదెంచి, అతనిని తమ చక్రాయుధముచే సంహరించిరి – అను కథ ఉత్తరరామాయణముననున్నది.

(2) 'తుళబ్ మాళ' పండక్కమలు నూలకొక్కరుగ పలకెత్తిరి. అనేకులు మరణించిరి – అని భావము.

(3) అవ :— ప్రళయకాలమున నిఖిలప్రపంచములను ఉదరమునందుంచుకొని ఒక మఱ్ఱియాకుపై పవ్వళించియుండిన శ్రీవేంకటాచలపతీ! నన్ననుగ్రహింపుము—అని ప్రార్థించుచున్నారు.

> శీరార్ కడలుమ్ నిలనుమ్ ముఴుదుణ్డు,
> ఏరాల మిళన్దళిర్ మేల్ తుయిల్ ఎన్దాయ్,
> శీరార్ తిరువేఙ్గడ మామలై మేయ,
> ఆరావముదే! అడియేఱ్కు అరుళాయే. 3

టీక :— సీర్ ఆర్ = పరిశుద్ధమైన జలములతో నిండియుండు, కడలుమ్ = సముద్రమును, నిలనుమ్ = భూమిని, ముఴుదు = మిగిలిన అన్ని పదార్థములనుకూడ (ప్రళయము నశింపజేయకుండునట్లు,) ఉణ్డు=ఆరగించి, ఏర్ ఇళ ఆల త్తళిర్ మేల్ = సుందరమైన లేతమఱ్ఱియాకుపై, తుయిల్ = నిద్రించుచున్న, ఎన్దాయ్ = నా స్వామీ! శీర్ ఆర్ = మహావైభవములతో నిండియుండు, ఆరా అముదే = అపర్యాప్తామృతస్వరూపుడా! అడియేఱ్కు = దాసునిపై, అరుళాయ్ = అనుగ్రహముంచుమా!

తా॥ అపారజలపూర్ణమగు సముద్రమును, అంతులేని, మహాభూమండలమును, మిగిలిన సమస్తపదార్థములను ప్రళయాపదనుండి సంరక్షించుటకై నీ వదనపద్మమునందుంచుకొని, దివ్యకమనీయకోమల వటపత్రముపై పవళించి యోగనిద్రననుభవించిన మా స్వామీ! దివ్యవైభవములతో నిండియుండు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచుండు అపర్యాప్తామృత స్వరూపుడా! దాసునిపై అనుగ్రహముంచుమా.

(4) అవ :— నవనీతచోరుడవై, వామనుడవై, స్వాశ్రితుల సంరక్షించుటకై శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచున్న దేవాది దేవా ! నన్ననుగ్రహింపుమా—అని ప్రార్థించుచున్నారు.

ఉణ్డాయ్ ఉఱిమేల్ నఱునెయ్ అముదాగ,
కొణ్డాయ్ కుఱళాయ్ నిలమ్ ఈరడియాలే,
విణ్ తోయ్ శిగర త్తిరువేఙ్గడమ్మేయ,
అణ్డా ! అడియేనుక్కు అరుళ్ పురియాయే. ౪

టీక :— ఉఱిమేల్ = ఉట్లపైనుంచబడియుండు, నఱు నెయ్ = మంచి నేతిని, అముదు ఆగ = అమృతముగ భావించి, ఉణ్డాయ్ = ఆరగించితివి, కుఱళ్ ఆయ్ = వామనుడవై, నిలమ్ = భూమిని, ఈరడియాలే = రెండుపాదములచే, కొణ్డాయ్ = కొలిచితివి ; విణ్ తోయ్ శిఖరమ్ = పరమపదమువఱకును వ్యాపించి మహోన్నతములై యున్న శిఖరములతో గూడుకొని యుండు, తిరువేంగడమ్ మేయ = తిరుమలలో నిత్యవాసము చేయుచుండు అండా = దేవాది దేవా !, అడియేనుక్కు = దాసునిపై, అరుళ్ పురియాయ్ = కృపను నభివర్షింపవా !.

తా॥ గోకులమున గోపయువతులు ఉట్లపై భద్రపఱచిన మంచి నేయి మొదలగు కల్యముల, పరమసులభుడవై, వాని నమృతమువలె నెంచి ఆరగించితివి. త్రివిక్రమావతారుడవై పరాత్పరుడవై భూమినంతటిని రెండడుగులతో గొలిచితివి. ఈ పరత్వసౌలభ్యములు రెండును ఒక్క చోటనే సమావేశమగునట్లు, పరమపదమువఱకును వ్యాపించి మహోన్నతములై యుండు శిఖరములచే నొప్పారు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచున్నావు. నిత్యసూరులెల్లప్పుడును సర్వేశ్వరుని పరత్వగుణము ననుభవించు వారలగుటచే సౌలభ్యగుణముననుభవింప నాశపడి తిరుమలకు విచ్చేయుచున్నారు. మనుజులు సర్వేశ్వరుని సౌలభ్య గుణమును అనుభవించువారలగుటచే పరత్వమును సందర్శించుటకై తిరుమలకు విచ్చేయుచున్నారు. అట్టి పరమవిలక్షణమగు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముజేయుచున్న దేవాదిదేవా ! దాసునిపై నీ కృపాకటాక్షమును ప్రసరింపజేయుము.

వి. వి :— మొదటిపాదమున సౌలభ్యము రెండవపాదమున పరత్వము, మూడవ పాదమున పరత్వసౌలభ్యములు, నాలుగవపాదమున పూర్ణత్వము నభివర్ణింపబడినవి.

(5) అవ :— శ్రీ నరసింహమూర్తివై హిరణ్యకశిపును సంహరించిన శ్రీ వేంకటాచలపతీ ! దాసుని నీవుగానే స్వీకరించి అనుగ్రహింపవలయును—అని ప్రార్థించుచున్నారు.

తూణాయ్ అదనూడు అరియాయ్ వన్దుతోన్ఱి,
పేణా అవుణనుడలమ్ పిళన్దిట్టాయ్,
శేణార్ తిరువేఙ్గడమామలై మేయ,
కోణాగణైయాయ్! కుఱిక్కొళ్ ఎనై నీయే. 5

టీక :— తూణాయ్ అదనూడు=కేవలము స్తంభమైయుండు దారువునందు, అరి ఆయ్ = నరసింహమూర్తివై, వన్దుతోన్ఱి = అవతరించి, పేణా = (తనను) లక్ష్యము చేయని, అవుణన్ = హిరణ్యకశిపుని యొక్క, ఉడలమ్ = శరీరమును, పిళన్దిట్టాయ్ = చీల్చివైచినవాడా !, శేణ్ ఆర్ = మిక్కిలి ఉన్నతములైయుండు, తిరువేంగడమామలై మేయ=తిరువేంగడమను మహాపర్వతమున నిత్యవాసముజేయుచున్న, కోళ్ నాగ అణైయాయ్=దర్పముగలిగి పరమవిలక్షణుడైయుండు ఆదిశేషుని పడకగాగలిగియుండు సర్వేశ్వరా! ఎనై=దాసుని, నీయే=నీవుగానే, కుఱిక్కొళ్=అనుగ్రహింపవలయును.

తా॥ భక్తుల విరోధులయందు కోపము, భక్తులయందు వాత్సల్యమును ప్రకాశించునట్లు తిరుమలలో వేంచేసియున్నాడని అభివర్ణించుచున్నారు. కేవలమొక స్తంభమునుండి నరసింహమూర్తియై అవతరించి హిరణ్యకశిపుని శరీరమును చీల్చివైచి, ప్రహ్లాదునిపై ప్రసాదవర్షము నభివర్షించితివి గదా ! దాసునిపై గూడ అట్లే అనుగ్రహింపుము. మహోన్నతశిఖరములచే నొప్పారు శ్రీవేంకటాచలముననూ, మహాబలదర్పితుడగు శ్రీమదాదిశేషునిపైనను, నిత్యవాసము చేయుచుండు నో పరమాత్మా ! దాసునిపై స్వయముగనీవై నీకృపను ప్రసరింపజేయవలయును.

(6) అవ :— ఈ తిరుమొழிలో, క్రింది యైదు పాశురములయందును తమ ననుగ్రహింపవలయునని ప్రార్థించిరి ; ఇటుపై తాము ప్రార్థించినట్లు అతడు అనుగ్రహించెనని మోదమునొందినవారై అతనిని గీర్తించుచున్నారు. అందీ పాశురమున, ఆ తిరువేంగడముడైయాన్ తమను దాసునిగ జేసికొని తమ మనస్సున ప్రవేశించెనని వక్కాణించుచున్నారు.

మన్నా ఇమ్మనిశప్పిఱవియై నీక్కి,
తన్నాక్కి త్తన్ ఇన్నరుళ్ శెయ్యుమ్ తలైవన్,
మిన్నార్ ముగిల్ శేర్ తిరువేజ్గడమ్ మేయ,
ఎన్నానై ఎన్నప్పన్ ఎన్నెఞ్జి నుళానే. ౬

టీక :— మన్నా = స్థిరముకాని, ఇ మ్మనిశప్పిఱవియై = ఈ మనుష్యజన్మమును, నీక్కి = పోగొట్టి, తన్ ఆక్కి = తన దాసునిగజేసికొని, తన్ ఇన్ అరుళ్ శెయ్యుమ్ = తన పరమ కృపారసమును ప్రసరింపజేయుచున్న, తలైవన్ = స్వామియును, మిన్ ఆర్ ముగిల్ = మెఱుపుతీగలతో గూడి శోభాయమానములుగనుండు మేఘములు, శేర్ = వచ్చి చేరునట్టి, తిరువేంగడమ్ = శ్రీ వేంకటాచలమున, మేయ = వేంచేసియున్నట్టి ఎన్ ఆనై = నా మత్తగజము (వంటి), ఎన్ అప్పన్ = నా తండ్రి, ఎన్ నెంజిల్ = నా మనస్సున, ఉళానే = నివసించుచున్నాడు.

తా॥ నశ్వరమైన ఈ మానుషజన్మమును బోగొట్టి, తనకంతరంగ దాసునిగజేసికొని, తన నిర్హేతుక కృపారసమును నాపై ప్రవహింపజేసిన స్వామియు, మెఱుపుతీగెలతో సంపన్నములై దర్శనీయములై యుండు మేఘములు బృందములుగవచ్చి విడిసియున్న శ్రీవేంకటాచలమున వేంచేసి యున్న మత్తగజసన్నిభుడునగు నా తండ్రి నా మనస్సున ప్రవేశించి స్థిర నివాసము నేర్పఱచుకొని యున్నాడు.

వి. వి :— (1) "తన్నాక్కి" - తనవలె నన్నుకూడ జ్ఞానానందస్వరూపు నొనరించెను. లేక, తనకు దాసు నొనరించుకొనెను - అనియును అర్థము చెప్పుకొన వచ్చును.

(2) "మిన్నార్ ముగిల్ శేర్" ఇచ్చట పెరుమాళ్ళును, పిరాట్టియును చేరి యుండుట వ్యంగ్యము.

(7) అవ :— మదించి దుర్జయములై యుండు సప్తఋషభములను జయించి శ్రీ నప్పిన్నైపిరాట్టిని వివాహమాడిన నా స్వామి తిరువేంగడముడైయాన్లు నా మనస్సున స్థిరనివాసమేర్పఱచుకొనెను — అని అత్యన్త వ్యాముగ్ధులై ఆనతిచ్చుచున్నారు.

మానేయ్ మడనోక్కి తిఱత్తు ఎదిర్ వన్ద,
ఆనేழ్ విడై శెర్రు అణివరై త్తోళా!,
తేనే! తిరువేఙ్గడమామలై మేయ,
కోనే! ఎన్మనమ్ కుడికొణ్డిరున్దాయే. 7

టీక :— మాన్ ఏయ్ మడనోక్కి తిఱత్తు = లేడికండ్లవలె మనోజ్ఞములైన నేత్రములుగల శ్రీ నప్పిన్నైపిరాట్టి (నీళాసుందరి)ని వివాహమాడుటకై, ఎతిర్ వన్ద = మదగర్వముతో తనపైనబడిన, ఆన్ విడై ఏழ் = ఏడుఎద్దుల, శెర్రు = దర్పమడంచి జయించిన, అణివరై తోళా = సుందరములైన పర్వతములవలెనుండు మనోజ్ఞములగు భుజములగలవాడా! తిరువేంగడమ్ మామలై = శ్రీ వేంకటాచలమను గొప్పపర్వతముపై, మేయకోనే = విజయము చేసియున్న స్వామీ! ఎన్ మనమ్ = నా మనస్సును, కుడికొండు = వాసస్థానముగగొని, ఇరున్దాయ్ = వేంచేసియున్నావు.

తా॥ చకితహరిణాక్షియగు శ్రీనీళాసుందరిని వివాహమాడుటకై పణముగనుంచబడిన ఏడుమత్తవృషభముల దర్పమడంచి జయించిన మహాభుజపర్వతములతో నొప్పారు పురుషోత్తమా! తేనెవలె పరమభోగ్యమైనవాడా! దివ్యమగు శ్రీ వేంకటాచలమున నెలకొనియున్న మా స్వామీ! నా మనస్సును నిత్యవాసస్థానముగజేసికొని సుఖముగనున్నావే! ఆహా! ఏమి నీ సౌశీల్యము? ఏమి నా భాగ్యము?.

(8) అవ :— శ్రీనప్పిన్నైపిరాట్టితోగూడ నా మనస్సున సర్వేశ్వరుడు వచ్చి నిత్యవాసముచేయుచున్నందున, ఇక వాని తిరువడిగళ్ళలో కైంకర్యముతప్ప మఱియొక కార్యమును నేనెఱుంగను—అని ఆనతిచ్చుచున్నారు.

శేయన్ అణియన్ ఎనశిన్దైయుళ్ నిన్ఱ
మాయన్, మణివాళొళివెణ్ తరళజ్గళ్,
వేయ్ విణ్డుఉదిర్ వేజ్గడమామలై మేయ,
ఆయనడియల్లదు మఱ్ఱఱియేనే. ౮

టీక :— శేయన్ = (భక్తిలేనివారికి) దుర్లభుడును, అణియన్ = (భక్తులకు) పరమసులభుడును, ఎనచిన్తైయుళ్ = నా మనస్సున, నిన్ఱ మాయన్ = వచ్చి నిలచిన ఆశ్చర్యగుణచేష్టితుడును, వేయ్విండు = వెదుళ్ళుపగిలి, ఒళివెణ్ తరళంగళ్ = ప్రకాశించుచున్న తెల్లనిముత్యములను, వాళ్ మణి = కాంతిగలిగిన రత్నములను, ఉదిర్ = వెదజల్లు స్థానమైన, వేంగడమ్ మామలై మేయ=తిరుమలలో వేంచేసియున్నవాడునునైన, ఆయన్ = గోపాలుడగు శ్రీకృష్ణుని ; అడిఅల్లదు = తిరువడిగళ్ళనుతప్ప, మఱ్ఱు = వేఱుదేనినిగూడ, అఱియేన్ = తెలిసికొనజాలను.

తా॥ భక్తిలేనివారలకు దుర్లభుడును, భక్తిగలుగువారలకు పరమసులభుడును, నా హృదయమున ప్రవేశించి స్థిరనివాసము నేర్పఱచుకొనిన మహానుభావుడును, వెదుళ్ళుపగిలి అందుండిరాలుచున్న తెల్లని ఆణిముత్యములను, దేదీప్యమానములగు రత్నములను వెదజల్లు దివ్యక్షేత్రమైన శ్రీవేంకటాచలమున వేంచేసియున్నవాడునునగు శ్రీకృష్ణస్వామి దివ్యపాదారవిన్దములను దప్ప, వేఱు దేనినిగూడ నేనెఱుంగజాలకయున్నాను.

వి. వి :— వేయ్గళ్ - వెదుళ్ళు ; వాళ్ - కాంతి ; తరళజ్గళ్ - ముత్తెములు.

(9) అవ :— " నా మనస్సున ప్రవేశించి అమరియున్నావు. ఇటుపైనొక క్షణమైనను నిన్నువిడువజాలను " — అని సర్వేశ్వరునితో, ఆనందాతిరేకమున నుడువుచున్నారు.

వన్దాయ్ ఎన్మనమ్ పుగున్దాయ్ మన్నినిన్ఱాయ్,
నన్దాదకొళ్ళుడరే ఎజ్గళ్ నమ్బీ !,
శిన్దామణియే ! తిరువేజ్గడమ్మేయ
ఎన్దాయ్ ! ఇనియానున్నై ఎన్ఱుమ్ విడేనే. ౯

టీక :— నన్దావ=ఎప్పటికిని ఆరిపోని (సదాప్రజ్వలించు), శోధుమ్ శుడరే = దివ్యజ్యోతిస్స్వరూపుడా !, ఎజ్గళ్ నమ్బి = మా యభీష్టములు నెరవేర్చు పరిపూర్ణ స్వరూపా ! శిన్దామణియే=స్మరించినంతమాత్రముననే సర్వమనోరథములను పూర్తి చేయు చింతామణి స్వరూపా !, తిరువేంగడమ్ మేయ ఎన్దాయ్ = శ్రీవేంకటాచలమున వేంచేసి యుండు పరమపురుషా ! మా స్వామీ !, వన్దాయ్ = నావద్దకు చేతించితివి ; ఎన్ మనమ్ పుగున్దాయ్ = నా హృదయమున ప్రవేశించితివి ; మన్నినిన్ఱాయ్ = లోపలనే అమరియున్నావు ; ఇని = ఇటుపై, యాన్ = దాసుడనగు నేను, ఉన్నై = నిన్ను, ఎన్ఱుమ్ = ఎప్పటికిని, విడేన్ = విడువను.

తా॥ సదా జాజ్వల్యమానమగు దివ్యజ్యోతి స్స్వరూపా ! మా యభీష్టముల త్రుటికాలమున పూర్తి చేయు పరిపూర్ణ స్వరూపా ! చింతమణి వలె తలంచినంతమాత్రముననే ఎల్లకోర్కెలను నిండింపచేయు నో పరమోదారస్వరూపా ! పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున నిత్యవాసము చేయుచున్న మా స్వామీ ! నీ చాతినీచుడనగు నా వద్దకువచ్చి చేరితివి ; అంతమాత్రమేగాక దాసుని హృదయమున గాఢముగ ప్రవేశించితివి. దానిలోపలనే స్థిరనివాసమేర్పఱచుకొంటివి. ఆహా! ఏమి నీ దయావాత్సల్యములతీరు ? నే నికనిన్ను ఒక క్షణమైనను వదలను.

(10) అవ :— ఈ పది పాశురములను అభ్యసించిన వారలకు ఫలమును ఆనతిచ్చుచున్నారు.

* విల్లార్ మలి వేజ్గడమామలై మేయ,
మల్లార్ తిరళ్తోళ్ మణివణ్ణ నమ్మానై,
కల్లార్ తిరళ్తోళ్ కలియన్ శొన్నమాలై,
వల్లారవర్ వానవ రాగువర్ తామే. ౧౦

టీక :— విల్లార్ మలి=బోయవాండ్రు కుటుంబకుటుంబములుగ నివసించుచున్న, వేంగడమ్ మామలై=శ్రీవేంకటాచలమను ప్రకృష్టమగుపర్వతమున, మేయ=నిత్యవాసము జేయుచున్నవాడును, మల్ ఆర్ తిరళ్ తోళ్ = బలదర్పితములై పలకలు తేలి బలిసియుండు దివ్యభుజములు గలవాడును, మణివణ్ణన్ = ఇన్ద్రనీలమణులవలె మనోజ్ఞమైన

వర్ణముగలవాడునునైన, అమ్మానై = సర్వేశ్వరుని గూర్చి, కల్ ఆర్ తిరళ్ తోళ్ = పర్వతములవలె సుదృఢములై బలిష్ఠములైయుండు భుజములుగల, కలియన్ = తిరుమంగైయాళ్వార్లు, శొన్న = ప్రసాదించిన, మాలై = ఈ పాశురములమాలను, వల్లవర్ తామ్ = అభ్యసించినవారలు, వానవర్ ఆగువర్ = నిత్యసూరులగుదురు. అనగా- నిత్యసూరులవలె భగవంతుని సదా సాక్షాత్కరించుకొనుచు పరమానందము ననుభవింతురని భావము.

తా॥ భిల్లులు తమ కుటుంబములతో నిత్యవాసముచేయుచుండు శ్రీ వేంకటాచలమున వేంచేసియున్న దివ్యభుజ పర్వతములతో నొప్పారు, ఇన్ద్రనీలమణివర్ణుడగు సర్వేశ్వరుని గూర్చి దివ్యభుజబలదర్పితుడగు శ్రీతిరుమంగైయాళ్వారులు ప్రసాదించిన ఈ తిరుమొళిని అభ్యసించిన వారలు పరమపదమునకు విచ్చేసి నిత్యసూరులవలె సదా భగవత్సాక్షాత్కారము గలవారలై, ఎల్లప్పుడును పరమానందము ననుభవించుచుందురు.

శ్రీ తిరుమంగైయాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము.

——[०]——

శ్రీరస్తు

శ్రీమతే పరకాలపరమయోగినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తిరుమంగై యాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరుమొళిలోని

# మంగళాశాసన పాశురములు

(2-వ పది, 1-వ తిరుమొళి — "వానవర్ తజ్గళ్")

## అవతరణిక

మంచి విషయములలోగాని చెడ్డ విషయములలోగాని అభిరుచి గలిగి యుజ్జీవించుటకుగాని, నశించుటకుగాని, ప్రధానసాధనము మనస్సు. కనుకనే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని అభియుక్తులు వాక్రుచ్చియున్నారు.

కాబట్టి, ఆళ్వార్లకు భగవద్విషయమున అత్యన్తప్రావణ్యము గలుగుటకును ఆ మనస్సే హేతువైనందున వారు తమ మనస్సును ప్రశంసించుచు, తిరువేంగడముడైయాన్లను మనసార ననుభవించుచు పరమానందమును బొందుచున్నారు.

(1) అవ :— అందీ మొదటి పాశురమున, 'ఓ నా మంచి మనసా! నిత్యసూరులవలె నీవును తిరువేంగడముడైయాన్లకు శేషవృత్తిని చేసి, నీవు ఉజ్జీవించి, నన్నుజ్జీవింపజేసితివే! ఆహా! ఏమి నీ భాగ్యము, ఔదార్యము? అని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

* వానవర్ తజ్గళ్ శిన్దైపోల ఎన్నెఞ్జమే! ఇనిదువన్దు, మాదవ
మానవర్ తజ్గళ్ శిన్దై అమర్న్దు ఉఱైగిన్ఱ ఎన్దై,
కానవరిడు కారగిల్పుగై ఓజ్గు వేజ్గడమ్మేవి, మాణ్కుఱళ్
ఆన అన్దణఱ్కు ఇన్ఱు అడిమైత్తొழிల్ పూణ్డాయే. ౧

టీక :— ఎన్ నెంజమే=ఓ నా మనసా! మా తవమ్=ఘోరమైన తపమునను ష్ఠించి నటువంటి, మానవర్ తంగళ్ = మనుష్యులయొక్క, చిన్తై = మనస్సున, అమర్న్దు= అమరియుండి, ఉయ్తెజున్త = ఉజ్జీవించుచున్న, ఎన్దై = స్వామియును, కానవర్ = బోయవాండ్రు, ఇడు = సమర్పించుచున్నటువంటి. కార్ అగిల్ పుగై = పరిమళ భరితమైన నల్లని "అగిల్" కాష్ఠములయొక్క పొగ, ఓఙ్గు = ఎల్లెడలను వ్యాపించి యున్న, వేంగడమ్ = శ్రీ వేంకటాచలమున, మేవి = వేంచేసియున్నవాడును, మాణ్ కుఱళ్ ఆన = కపటవామన బ్రహ్మచారి వేషమును ధరించిన, అన్దణన్ కు = ఎమ్బెరుమాన్లకు, వానవర్ తంగళ్ చిన్తైపోల=నిత్యసూరులయొక్క హృదయమువలె, (నీవును) ఇనిదు ఉవన్దు=బాగుగ నాస్వాదించి, ఇన్రు = ఇప్పుడు. అడిమై తొழிల్ = కైంకర్య వృత్తిని, పూణ్డాయే = స్వీకరించితివి గదా! (నీ భాగ్యమే భాగ్యము).

తా॥ నాదు మంచిమనమా! ఘోరతపమాచరించిన పరమ యోగుల హృదయాంబుజములయందు నివసించు స్వామియును, భిల్లులు వంట చేసికొనుటకై "అగిల్" కాష్ఠములను తెచ్చిమంటలువేయగ, ఆర్ద్రేన్ధనసంయోగముచే పైకెగయు ధూమపుంజములచే పరిమళ యుక్తమై నల్లనిదై యుండి కనులపండువజేకూర్చు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచున్నవాడును, కపటవామనబ్రహ్మచారి రూపమును ధరించి మహాబలిని నిగ్రహించి స్వాశ్రితులగు దేవతల గాపాడిన పరమ పురుషుని, నిత్యసూరుల పరిశుద్ధహృదయ కమలములవలె, నీవును బాగుగ నాస్వాదించి, అనుభవించి, తనివిదీరక, ఇప్పుడు నిత్యకైంకర్యవృత్తిని స్వీకరించి యానందించుచున్నావు. ఆహా! ఏమి నీ భాగ్యము ? నిన్ను గలిగియుండు నా భాగ్యమే గదా భాగ్యము !.

(2) అవ :— ఓ మనమా ! ఆ భానబంధువులగు తల్లి, తండ్రి — మొదలగువారల సంబంధముల సవాసనముగవదలి శ్రీ వేంకటాచలపతి దివ్యకల్యాణగుణగణముల విశిష్టతనుగుర్తెఱింగి, వాని తిరువడిగళ్ళలో దాస్యవృత్తినిజేయుచున్నావే! నీ భాగ్య మేమనవచ్చును ? అని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

ఉఱవు శుట్ఱమెన్ఱొన్ఱిలా ఒరువన్ ఉగన్దవర్ దమ్మై, మణ్మిశై
ప్పిఱవియే కెడుప్పాన్ అదుకణ్డు ఎన్ నెఞ్జ మెన్బాయ్ !,
కుఱవర్ మాదర్ గళోడు వణ్డుకుఱిఞ్జి మరుళిశై పాడుమ్, వేఙ్గడత్తు
అఱవ నాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొழిల్ పూణ్డాయే. ౨

టీక :— ఎన్ నెంజమ్ ఎన్బాయ్ = నాదు ప్రశస్తమైన మనస్సా !, ఉఱవు శుట్ఱమ్ = ఆప్తబంధువులు, దాయాదులు, ఎన్ఱు ఒన్ఱు ఇలా = అనునట్టి వివిధమైన ఆభాసమగు సంబంధములు లేక (నిరుపాధిక బంధువగు) ఒరువన్ = అద్వితీయుడై వెలుంగుచున్న సర్వేశ్వరుడు, ఉగన్దవర్ తమ్మై = తాను ప్రీతిజేయు అన్తరంగభక్తులకు, మణ్ మిశై పిఱవియే = అజ్ఞానాంధకారావృతమగు నీ భూమిలో జన్మించుటనే, కెడుప్పాన్ అదుకండు = పోగొట్టును అను స్వభావమును చూచి, కుఱవర్ మాతర్ గళోడు = భిల్లపురంధ్రులతో గూడ, వణ్డు = భృంగములు, కుఱిఞ్జి మరుళ్ ఇశై = కురంజి, మరుళ్, మొదలగు దివ్యగానములను, పాడుచున్న, వేంగడత్తు = శ్రీ వేంకటాచలమున వేంచేసియున్న, అఱవన్ = పరమధర్మిష్ఠుడగు, నాయగఱ్కు = స్వామికి, ఇన్ఱు అడిమైత్తొழిల్ పూణ్డాయే = ఇప్పుడు దాస్యవృత్తిని అనుష్ఠించుచున్నావే? (నీ భాగ్యమే భాగ్యము).

తా॥ నాదు ప్రశస్తమైన మనసా ! ఆప్తబంధువులు, దాయాదులు అనెడు ఆభాసబంధువుల సంబంధమును సవాసనముగ వదలుకొని, అట్టి సోపాధికమగు సంబంధముగాక నిరుపాధికసంబంధము గలిగి, సకలేతర విలక్షణుడై అద్వితీయుడై విరాజిల్లుచుండు సర్వేశ్వరుడు - తన అత్యన్త ప్రీతిపాత్రులగు భక్తశిఖామణులకు, అజ్ఞానాంధకారమును వ్యాపింపజేయు నీ భూలోకమున జన్మించుటయను క్రూరమగు వ్యాధిని నిర్మూల మొనరించును—అని అతని కల్యాణగుణగణ స్వభావముల, బోయతలతో గూడ భ్రమరములును మధురముగ గానముచేయుచుండు పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండు, పరమధార్మికుడగు మన స్వామివారి తిరువడిగళ్ళలో కైంకర్యమునుజేయు భాగ్యమును పొంది యున్నావే ? ఆహా ఏమి నీ భాగ్యము ?

వి. వి:— అఱవన్ -"చలివెందనను బెట్టి మనకైంకర్యముల బడయుటకై తమను మనకు యథేష్టవినియోగార్హముగ సమర్పించిన పరమధార్మికుడు" అని శ్రీ పెరియ వాచ్చాన్‌పిళ్ళైగారు పాదించిరి.

(3) అవ :— సర్వేశ్వరుడు, తన నారాధించుటకై పుష్పములను గైకొనివచ్చు భక్తులను, వారలతో సంబంధముగలవారలను అను గ్రహించి పరమపదమునకుచేర్చు చున్నాడు—అను నతని మహాగుణమును జూచి, ఆ తిరువేంగడముడైయాన్లకు కైంకర్యమునుజేయ సమకట్టితివే? ఆహా! ఏమి నీ భాగ్యమని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

ఇణ్డైయాయినకొణ్డు తొణ్డర్ గళేత్తువా రుఱవోడుమ్, వానిడై
క్కొణ్డు పోయిడవుమ్ అదుకణ్డు ఎన్నెఞ్జమెన్బాయ్!,
వణ్డువాழ் వడవేఙ్గడమలై కోయిల్ కొణ్డదనోడుమ్, మీమిశై
అణ్డమాణ్డిరుప్పాఱ్కు అడిమైత్తొழిల్ పూణ్డాయే. 3

టీక :— ఎన్ నెంజమ్ ఎన్బాయ్ = ఓ నామనమా! ఇణ్డైయినకొండు=పుష్పములనుగైకొని, (తన సన్నిధికి వచ్చి) ఏత్తువార్ = స్తోత్రముచేయునట్టి వారలైన, తొణ్డర్‌గళ్ = భక్తులను, ఉఱవోడుమ్ = వారి సంబంధసంబంధులతో గూడ, కొణ్డుపోయ్ = ఈ భూమినుండి తీసికొనిపోయి, వానిడై=పరమపదమున, ఇడఅదుకండు = (సర్వేశ్వరుడు) చేర్చుచుండుటను చూచి, వణ్డువాழ் = తుమ్మెదలు బలిసి ఉజ్జీవించుచున్న, వడవేంగడమ్ మలై =ఉత్తరదిక్కునందున్న శ్రీవేంకటాచలమును, కోయిల్ కొండు = నిత్యసన్నిధిగాజేసికొని, అదనోడుమ్ = ఆ తిరుమలను, మీమిశైఅణ్డమ్ = నిత్యవిభూతియైన పరమపదమును, అణ్డు ఇరుప్పాఱ్కు = పరిపాలించుచుండు నా సర్వేశ్వరునకు, అడిమైత్తొழిల్ పూణ్డాయే = శేషవృత్తిని చేయుచున్నావే? (నీ భాగ్యమే భాగ్యము).

తా॥ ఓ మనసా! దివ్యములగు పుష్పములనుగైకొని తన వద్దకు వచ్చి తన నారాధించు భక్తులను, వారి సంబంధులను గూడ అజ్ఞానాంధకారావృతమగు నీ భూలోకమునుండి తీసికొనవెళ్ళి పరమపదమున నా సర్వేశ్వరుడుజేర్చు క్రమమును పరికించి, భ్రమరములు దివ్యమకరందము

లను పానముచేసి, మదించి క్రీడించుచున్నవి. అట్టిపరమభోగ్యమైన శ్రీవేంక టాచలమును తనకు నిత్యవాసస్థానముగజేసికొని, ఆతిరుమలను, పరమపద మును అద్వితీయముగ పరిపాలించుచుండు నా సర్వేశ్వరునకు నంతరంగ ములగు కైంకర్యములను చేయుచున్నావు గద! నీ భాగ్యమే భాగ్యము.

(4) అవ :—సర్వేశ్వరుడు, భక్తులు తన కొనరించు కైంకర్యము లను స్వీకరింపవలయునను కుతూహలముతోడనే ఇచట రామకృష్ణాది రూపములతో నవతరించి, అంతటితో దృప్తినొందక, వీరల నిత్యకైంక ర్యముల స్వీకరింప నాసపడి, వీరలను నిత్యవిభూతికి దీసికొనివెళ్లుచున్నాడు. అట్టి తిరువేంగడముడయానులకు కైంకర్యముచేయు భాగ్యమును పొంది యున్నావు గద! అని—తమ మనస్సును ఆళ్వార్లు ప్రశంసించుచున్నారు.

పావియాదు శెయ్దాయ్ ఎన్నెఞ్జమే! పణ్డుతొణ్డు శెయ్దారై, మణ్మిశై
మేవి ఆట్కొణ్డుపోయ్ విశుమ్బేఱవైక్కుమ్ ఎన్దై,
కోవినాయగన్ కొణ్డలున్దుయర్ వేఙ్గడమలై యాణ్డు, వానవర్,
అవియాయిరుప్పార్క్కు అడిమైత్తొழిల్ పూణ్డాయే. ౪

టీక :— ఎన్ నెఞ్జమే=నా ప్రియమైన మనమా! పావియాదు శెయ్దాయ్ = చలింపక దృఢాధ్యవసాయమును చేసికొనియున్నావు, పణ్డు = పూర్వకాలమున, మణ్మిశై = ఈ భూలోకమునందు, మేవి = వచ్చి అవతరించినది, తొణ్డుశెయ్దారై = కైంకర్యముచేసిన వారలను, ఆళ్ కొణ్డుపోయ్=తనకు నిత్యకింకరులనుగ జేసికొనివెళ్ళి, విశుమ్బుమ్ ఏఱవైక్కుమ్ = పరమపదమున స్థాపించునటువంటి, ఎన్దై = స్వామియును, కోవినాయకన్ = గోపికలకు నాథుడును, కొణ్డల్ వన్దు ఉయర్ = మేఘములను తోసివైచునట్లు (ఉన్నతములైన శిఖరములతో) విరాజిల్లు, వేఙ్గడమలై = శ్రీవేంకటా చలమునే, ఆణ్డు = పరిపాలించుచు, వానవర్ అవియామ్ ఇరుప్పార్క్కు=జ్ఞానులను తనకు ప్రాణముగ నధ్యవసించునట్టి వారునునైన సర్వేశ్వరునకు, అడిమైత్తొழిల్ పూణ్డాయే = కైంకర్యములజేయుచున్నావు గదా!.

తా॥ ఓ నా ప్రియమైన మనసూ! చాంచల్యమును వీడి దృఢాధ్యవసాయమును పొందియున్నావు. నీ భాగ్యమే భాగ్యము సర్వేశ్వరుడు పూర్వకాలమున నీ భూలోకమునందవతరించినది - తన భక్తులు తనకు చేయు సేవలగై కొనుటకే. అంతటితో దృప్తినొందక, వీరల కైంకర్యములను నిత్యము స్వీకరింపవలెనను తిరువుళ్ళముగలవాడై, వీరల పరమ పదమునకు దీసికొనివెళ్ళి, వారలకచ్చోట నిత్యవసతి ననుగ్రహించుచున్నాడు. అట్టి స్వామిని, గోపికాజననాథుని, మేఘమండలముపైకి వ్యాపించియున్న రమణీయములగు శిఖరములతో విరాజిల్లుచున్న శ్రీ వేంకటాచలమును పరిపాలించుచున్న శ్రీ శ్రీనివాసుని, జ్ఞానులను తన ప్రాణస్వరూపులనుగ దలచియున్న మనతండ్రిని, సమీపించి, అతనికి నిత్య కైంకర్యము చేయుచున్నావు. ఆహా! ఏమి నీ దృఢాధ్యవసాయము.

(5) అవ :— "ఈ ప్రపంచమున జైనబౌద్ధాది నాస్తిక మతము లెన్నియో వ్యాపించియున్నట్టి ఈ కాలమున, పరమవిలక్షణమగు శ్రీ వైష్ణవసంప్రదాయమున జనించి, సర్వేశ్వరునకు అంతరంగ కైంకర్యములజేయు భాగ్యముగలిగి యుజ్జీవించుచున్నాము గద!" అను తమ సంతృప్తిని ఇటుపై మూడు పాశురములలో వెల్లడించుచున్నారు.

పొజ్గుపోదియుమ్బిణ్డియుమ్ పిడై ప్పుత్తర్ నోన్బియర్ పళ్ళియుళ్ళుఱై,
తజ్గళ్ తేవరుమ్ తాజ్గళుమేయాగ ఎన్నెఞ్జమెన్బాయ్!,
ఎజ్గుమ్ వానవర్ దానవర్ నిఱైన్దేత్తుమ్ వేజ్గడమ్మేవి నిన్ఱరుళ్,
అజ్గణాయఱ్కు ఇన్ఱు అడిమైత్తొழిల్ పూణ్డాయే. 5

టీక :— ఎన్ నెఞ్జమ్ ఎన్బాయ్ = నా ప్రియమైన మనస్సా!, పొజ్గు = కొమ్మలతోడను, రెమ్మలతోడను అభివృద్ధిచెందుచున్న, పోదియుమ్ = అశ్వత్థవృక్షమును, పిణ్డియుమ్ = అశోకవృక్షమును, ఉడై = తమకు పరమోపాదేయములుగ భావించియున్న, పుత్తర్ = బౌద్ధులును, నోన్బియర్ = జైనులును, పళ్ళియుళ్ ఉఱై = తమ దేవాలయములలోనుండు, తజ్గళ్ దేవరుమ్ = తమ దేవతలును, తాజ్గళుమేయాగ = తామేయై, లోకమునందంతటను వ్యాపించియున్నప్పటికిని, (అమతములయందు నీవు

(ప్రవేశింపక), తానవర్ = అసురప్రకృతులును, నిరైన్దు = చుట్టుకొని, ఏత్తుమ్ = స్తోత్రము చేయుచుండగను, వేఙ్గడమ్ = శ్రీవేంకటాచలమున, మేవినిన్ఱు = పరమకృపారసముచే వేంచేసియుండి, అరుళ్ = అందరిని అనుగ్రహించుచున్న, అమ్కణ్ = అందమైన నేత్రములుగల, నాయగర్కు = సర్వేశ్వరునకు, ఇన్ఱు = ఈవేళ, అడిమైత్తొழిల్ పూణ్డాయే = సేవకావృత్తిని చేయుచున్నావు గద!.

తా॥ ఓ నామంచి మనసా! సకలఫలప్రదుడును, సర్వజ్ఞత్వ-సర్వశక్తిత్వాది సమన్వితుడును, పరమకారుణికుడును, సర్వస్వామియునునగు శ్రీమన్నారాయణుడను కల్పవృక్షముండగ, దానిని అనాదరించి, కొమ్మలు రెమ్మలు మొదలగువానితో ప్రవర్ధమానమునై యుండు అశ్వత్థవృక్షములను, అశోకవృక్షములను తమకు పరమోత్తారకములుగ భావించి, వానిని పూజించి నమస్కరించుచుండు జైనబౌద్ధాది నాస్తికమతములు, కటికచీకటివలె నెల్లెడల వ్యాపించియుండగను, నీవు వాని మాయాజాలమున పడక, దేవప్రకృతులు, ఆసురప్రకృతులు-నను విభాగములేక సర్వప్రాణులచేతను నారాధింపబడుచున్న శ్రీవేంకటాచలమను దివ్యపర్వతమున వేంచేసియుండి కరుణారసము నభివర్షించు సుందరతమ నేత్రాంబుజములతో నొప్పారు సర్వేశ్వరునకు నంతరంగకైంకర్యములశేయు భాగ్యమును పొందియున్నావు గద! ఆహా! ఏమి నీ యదృష్టము?

వి. వి:— (1) పోది - అని రావిచెట్టుకు పేరు. కొమ్మలురెమ్మలుగలిగి గుబ్బటముగ బెరిగియుండు రావిచెట్టును పూజించువారలు — బౌద్ధులు. పిణ్డి — అని అశోకవృక్షమునకు పేరు. దానిని పూజించువారు - జైనులు.

(2) అల్పఫలప్రదములగు పలునోముల ననుష్ఠించుటయే వారి పనియైనందున "నోన్బియర్" అని జైనులకు ప్రసిద్ధిగలిగినది.

(6) అవ :— కటి భాగమున కాషాయవస్త్రమును ధరించి, తలలను బోడిక్కొట్టుకొని, ఇచ్చవచ్చిన-చోట్ల, ఇచ్చవచ్చినట్లు తిండితిని, అంతటితో దృప్తినొందక, 'తాజెడ్డకోతి వనమెల్లజెరచెనన్నట్లు' తమవలె ఇతరులను గూడచేయవలయునని యుపదేశించుచు జైనమునులు తండోపతండములుగ సంచరించుచు, లోకములనెల్ల ననర్థపఱచుచుండ, నాపెన్నిధివగు నో మనసా! నీవు మాత్రము వారి బారినిబడక, తప్పించుకొని, పరమ

పురుషుడగు తిరువేంగడముడయానులకు కైంకర్యముజేయగలిగిన భాగ్యమును పొందియున్నావు. అహా! ఏమి నీ పుణ్యపరిపాకము — అని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

తువరియాడైయర్ మట్టైయర్ శమణ్ తొణ్డర్ గళ్ మణ్డియుణ్డు పిన్నరుమ్,
తమరుమ్ తాజ్గళుమే తడిక్క — ఎన్నెఞ్జమేన్బాయ్!,
కవరిమాక్కణమ్ శేరుమ్ వేఙ్గడమ్ కోయిల్ కొణ్డకణ్ణార్ విశుమ్బిడై,
అమరనాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొழிల్ పూణ్డాయే. ౬

టీక :— ఎన్ నెఞ్జమ్ ఎన్బాయ్ = నా పెన్నిధానమగు ఓ మనసా!, తువరి ఆడైయర్ = కటిభాగముల కాషాయవస్త్రములను ధరించిన వారలును, మట్టైయర్ = తలలను బోడిచేసికొన్నవారలనునగు, శమణ్ తొణ్డర్ గళ్ = జైనమతస్థులు, మణ్డి = ఒకరిపై నొకరుపడి, ఉణ్డు=ఇచ్ఛవచ్చినట్లు (నీతినియమములులేక) తినుబండములను తిని, పిన్నరుమ్ = అటుపై, తజ్గళుమ్ తమరుమ్ = వారును వారికి సంబంధించినవారలును, తడిక్క = శరీరముబాగుగబలిసి తిరుగుచుండగ, (నీవును—వారలవలె యథాకామచారివై కామభక్షివైయుండక) కవరిమా కణమ్ శేరుమ్ = చమరీమృగములు గుంపులు గుంపులుగవచ్చి చేరుచున్న, వేఙ్గడమ్ = శ్రీ వేంకటాచలమును, కోయిల్ కొణ్డ = నిత్యసన్నిధిగ చేసికొనియున్నవాడును, కణ్ణార్ = పరమభోగ్యమై విశాలమైయున్న, విశుమ్బిడై = పరమపదమునందున్న, అమరర్ నాయగఱ్కు=నిత్యసూరులకుస్వామియైయుండు సర్వేశ్వరునకు, ఇన్ఱు అడిమై తొழிల్ పూణ్డాయే = ఇప్పుడు కైంకర్య వృత్తిని అవలంబించియున్నావే! (ఇది చాల నాశ్చర్యకరమగు విషయము).

తా॥ ఓ నా ప్రియమైన మనస్సా! ఏమినీ దృఢాధ్యవసాయసంపత్తి? మొలలలో గాషాయముల ధరించి, తలలలోనుండు కేశములను ఊడ పెరికికొని, ప్రాకృతమంత్రముల నుచ్చరించుచు, లోకములను వ్యామోహపఱచు జైనసన్యాసులు—ఒకరిపై నొకరుపడి, కామచార కామభక్షులై, తమ శరీరములందలి కండరముల పెంపొందించుకొని తిరుగుచున్నారు. ఇట్టి అనర్థకరమగుసమయమునను నీవుచాల మెలకువగలదానవై, చమరీమృగములుగుంపులుగుంపులుగవచ్చిచేరుచుండ, చూచువారలకు గన్నుల

పండువచేయుచుండు శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచుండు వాడును, సువిశాలమైన పరమపదమున నివసించుచున్న నిత్యసూరులకు నధినాయకుడునునగు సర్వేశ్వరునకు అంతరంగకైంకర్యవృత్తిని అవలంబించి యున్నావు. ఆహా! ఏమి నీ వివేకము! నీ భాగ్యమే గద భాగ్యము!.

(7) అవ :— శుష్కతర్కములతో వాదులాడుచు, పనికిమాలిన వ్రతముల నాచరించుచు, పెరుగు అన్నములమెక్కుచు తిరుగుచుండు జైనమతస్థులను చూచి, మోసపోక, ఓ నా మనసా! నీవు పరమభోగ్యమగు శ్రీ వేంకటాచలమున విజయముజేసియున్న శ్రీస్వామికి నిరవధికమగు కైంకర్యములజేయు భాగ్యమును గలిగియున్నావు. ఏమి నీ అదృష్టము? అని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

తరుక్కినాల్ శమణ్ శెయ్దు శోఱుతణ్ తయిరినాల్ తిరళై, మిడఱ్ఱిడై
నెరుక్కువా రలక్కణదుకణ్డు ఎన్నెఞ్జమెన్బాయ్!,
మరుట్కళ్ వణ్డుగళ్ పాడుమ్ వేఙ్గడమ్ కోయిల్కొణ్డదనోడుమ్, వానిడై
అరుక్కన్ మేవి నిఱ్పార్క్కు అడిమైత్తొழిల్ పూణ్డాయే. 8

టీక :— తరుక్కినాల్ = శుష్కతర్కములచే, శమణ్ శెయ్దు = తమ జైనమతమును గురించివాదులాడుచు, తణ్ తయిరినాల్ = మంచి పెరుగుతోగూడిన, శోఱుతిరళై = అన్నపు కబళములను, మిడఱు ఇడై = గొంతు కానునట్లు, నెరుక్కువార్ = కూరుచున్నవారలై, కాముచారులై యుండు ఆ జైనులయొక్క, అలక్కణ్ అదు = అటువంటి దురవస్థను, కణ్డు = చూచి, ఎన్ నెఞ్జమ్ ఎన్బాయ్ = నాకు మిక్కిలి ప్రీతిపాత్రమైన ఓ నా మనసా! (నీవు వారలసమూహమున జేరక) వణ్డుగళ్ = తుమ్మెదలు, మరుట్కళ్ = "మరుళ్" మొదలగు దివ్యగానముల, పాడుమ్ = పాడుచున్నస్థలమగు, వేఙ్గడమ్ = శ్రీ వేంకటాచలమును, కోయిల్ కొణ్డు = దివ్యసన్నిధిగ చేసికొని, అదనోడుమ్ = దానితో గూడ, వానిడై = ఆకాశమున తిరుగుచుండు, అరుక్కన్ = సూర్యమండలమునందును, మేవి నిఱ్పార్క్కు = అమరియుండువారికి, అడిమైత్తొழిల్ పూణ్డాయే = దాస్యవృత్తిని జేయు భాగ్యమును గలిగియున్నావు గదా!.

తా॥ ఓ నామనసా! వేదశాస్త్రాదిసమ్మతములుగాని శుష్క-తర్క-ములతో వాదములాడుచు, పెరుగన్నపుపెద్దపెద్ద కబళములను గొంతుల కానునట్లు కూరికొని, గుడ్లుమిటకరించుచు దురవస్థననుభవించుచుండు జైనుల బారినిపడక, మెలకువతో దప్పించుకొని, యథేష్టముగ పూదేనెలు ద్రావి మధుర మధురముగ పాడుచుండు తుమ్మెదలపిండుతో బరమ రమణీయమైయుండు శ్రీవేంకటాచలముననను, ఆకాశమునందున్న సూర్యుని దివ్యమండలమునను శంఖచక్రగదాధరుడై, సరసిజాసనుడై వేంచేసియుండు శ్రీమన్నారాయణునకు నంతరంగకైంకర్యముల నిర్వర్తించుచున్నావు. ఆహా! ఏమి నీ భాగ్యము? నీ దృఢాధ్యవసాయమునకు, నీ భాగ్యమునకును నేనెంతయు మురియుచున్నాను.

వి. వి :— పెరుంశోఱుణ్డుదల్ — గడ్డపెరుగుపోసి ముద్దలుచేసి, గుడ్లుబైటికి వచ్చువఱకు గొంతులోకూరుకొని మ్రింగెదరు జైనులు, అప్పుడు పడుకష్టము అతి దుస్సహమైనది మఱియు, తలపై వెంట్రుకలను శ్రావణముతో మొదట పెరికివైచుకొనెదరు. అదియును మిక్కిలి శ్రమావహమగువిషయము. ఇట్టి యసహజమగు అనర్థావహమైన అఘాయిత్య కార్యముల జేయుదురు జైనులు.

(౨) అవ :—భగవంతుడు కడుదుర్లభుడనియు, అర్చావిగ్రహములన్నియును మనుష్యుల క్రీడాకార్యములనియు, సర్వేశ్వరుడైనచో రామకృష్ణాద్యవతారములనెత్తి, అట్టి దురవస్థలనేల అనుభవింపవలయును? అనియు నీరీతిగ అనేకములగు కువాదములతో గాలక్షేపము జేయుచు తిరుగుచుండు మందమతుల సమూహమునజేరక, నావద్దగూడ నొకమాటనైనను చెప్పక, ఓ మనసా! నీవు హఠాత్తుగ, పరమభోగ్యుడగు తిరువేంగడముడయానుల విషయమున కైంకర్యవృత్తిని అవలంబించియున్నావు. ఆహా! ఏమి నీ వివేకము! — అని తమ మనస్సును ప్రశంసించుచున్నారు.

శేయన్ అణియన్ శిఱియన్ పెరియనెన్బదుమ్ శిలర్ పేశక్కేట్టిరున్దే
ఎన్నెఞ్జమెన్బాయ్! ఎనక్కు ఒన్ఱు శొల్లాదే,
వేయ్‌గళ్ నిన్ఱు వెణ్ముత్తమే శొరి వేఙ్కడమలై కోయిల్ మేవియ,
ఆయర్ నాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొళిల్ పూణ్డాయే. ౮

టీక :— (లోకులను జూచి పరపదనాథుని భజియింపుడు అని ఉపదేశించిన, దానిని సరకుచేయక,) శేయన్ = అతడు కడుదుర్లభుడు (కానసెట్లు అతని సేవించుట) ఎన్బదు = అని దుర్వాదము చేయుటయు, (అతడే పరమసులభుడై అర్చారూపముతో నుండగ, నితడా పరమాత్ముడు? ఇది సబబుకాదు, ఎన్బదు = అని వాదించుటయు, (రామకృష్ణాదిరూపములతో నవతరించిన ఆ పరమాత్ముని సేవింపుడు అనిన, శిఱియన్ = నికృష్టమైన కులములలో మనుష్యమాత్రులై జన్మించి, అనేక దుఃఖములననుభవించిన వీరలా దైవస్వరూపులు? ఎన్నటికినికాదు, ఎన్బదు = అని వాదించుటయు, (వ్యూహస్వరూపునిగాని, అంతర్యామి స్వరూపునిగాని ఆరాధింపుడు అని ఉపదేశించిన), పెరియన్ = చేతికందని వానినెట్లు ఆరాధించుట, ఎన్బదుమ్ = అనివాదించుటయు, (అనునిట్టి దుర్వాదములతో) శిలర్ పేశ = కొందరు దౌర్భాగ్యులు పండితంమన్యులై నోటికి వచ్చినట్లు మాటాడుచుండగ, ఎన్ నెఞ్జమ్ ఎన్బాయ్ = నా ప్రియమైన హృదయమా! (ఆదుర్వాదముల వాదనలపరకుచేయక), ఎనక్కు = నాతోడ, ఒన్ఱు = ఒక మాటయైనను, శొల్లాదే = చెప్పక, వేన్‌గళ్ = వెదుళ్ళు, నిన్ఱు = దట్టముగనిలచియుండి, వెణ్ ముత్తమే = తెల్లని ముత్యములను, శొరి = వెదజల్లుచుండు దివ్యక్షేత్రమైన, వేఙ్కడమలై = శ్రీవేంకటాచలమును, కోయిల్ మేవియ = తనకు తగిన ఆలయమని కుతూహలపడుచుండు, ఆయర్ నాయకఱ్కు = శ్రీగోపాలకృష్ణునకు, ఇన్ఱు అడిమైత్తొళిల్ పూణ్డాయే = ఇప్పుడిట్లు కైంకర్యవృత్తిని అవలంబించి, చేయుచున్నావు. ఏమి నీ వివేక పరిపాకము!.

తా॥ "పరమపదనాథుని ఆరాధింపుడు మీకు సద్గతిగలుగును" అని యుపదేశించిన, ఆ యుపదేశమును పెడచెవినిబెట్టి, మీదు మిక్కిలి "అతడు కడుదుర్లభుడు; అతని ఆరాధించుటయన నీళ్ళలో మూట" అని కుచోద్యములచేయుచు, అట్లైన "పరమసులభుడై యుండు అర్చావతారుని భజింపుడు" అనిన; కాష్ఠలోహపాషాణాది రూపుడగు నితడా దేవుడు?" అని పరిహసింపుచు, "రామకృష్ణాదిరూపములతో నవతరించిన ఆ పరమాత్ముని సేవింపుడు" అనినచో; నీచకులములలో

మనుష్యమాత్రుడై పుట్టి పలుదుఃఖముల ననుభవించిన అతని నా మ్రొక్కుట ?" అని అనాదరించిపలుకుచు, "వ్యూహస్వరూపునిగాని, అన్తర్యామి స్వరూపునిగాని ఆశ్రయింపుము" అనిచెప్పిన ; చేతికందని అతనినెట్లు ఆశ్రయించుట అని ప్రశ్నింపుచు, ఇటులననేక దుర్వాదముల చేయుచుండు బాహ్యకుదృష్టులతో జేరక, వారి ననాదరించి, ఓ నా ప్రియమైన మనసా ! నీవు నాతోడనైనను ఒకమాటయైనను చెప్పకయే, దట్టములుగ పెరిగియుండు వెదుళ్ళు, తెల్లని మంచిముత్యములను వెదజల్లుచుండ, మిక్కిలి సిరిసంపదలతో దులతూగుచుండు శ్రీ వేంకటాచలమును తనకు దివ్యసన్నిధిగా చేసికొని ఎల్లప్రాణులను సంరక్షించుచుండు శ్రీగోపాల కృష్ణస్వామికి నిరంతర నిరవధిక కైంకర్యములజేయు భాగ్యమును పొంది యున్నావు గదా ! ఆహా ఏమి నీ వివేకము ? నీ భాగ్యమేగదా భాగ్యము.

వి. వి :— (1) ఏనుగలకుంభస్థలములనుండియు, వెదుళ్ళనుండియు ముత్యములు ప్రాలునని ప్రసిద్ధి.

(2) సర్వేశ్వరుడు, పర, వ్యూహ, విభవ, అన్తర్యామి, అర్చారూపములతో నుండి చేతనుల సంరక్షించుచుండ సంసారులు అజ్ఞులై అనర్థపడుచున్నారే! అని ఆళ్వార్లు వ్యసనపడుచున్నారు.

(3) శ్రీకృష్ణుడై అవతరించినవాడే ఇప్పుడు తిరువేంగడముడైయానులుగ నున్నారని భావము.

(9) అవ :—ఓ మనసా ! నీవు నిన్నటివరకు ఎట్లుకాలమును గడపితివి ; ఇప్పుడు ఎట్లు మారిపోయితివి ? చాల ఆశ్చర్యముగ నున్నది. అని మిగుల నాశ్చర్యపడుచు నానతిచ్చుచున్నారు.

కూడియాడి యురైత్తదే ఉరైత్తాయ్ ఎన్నెఞ్జమెన్బాయ్! తుణిన్దుకేళ్,
పాడియాడి ప్పలరుమ్ పణిన్దేత్తి క్కాణ్గిలర్,
ఆడుతామరై యోనుమ్ ఈశనుమ్ అమరర్కోనుమ్ నిన్రేత్తుమ్, వేఙ్గడత్తు
ఆడు కూత్తనుక్కు ఇన్రు అడిమైత్తొழిల్ పూణ్డాయే.

టీక :— కూడి = లోకులతోగూడి, ఆడి = వారి విషయములలో నాశపడెదరో, ఆ విషయములతోనే మిక్కిలి నాశతోపాడి, ఉరైత్త = వారు చెప్పిన మాటలనే, ఉరైత్తాయ్ = నీవును ఉచ్చరించితివి, ఎన్ శెజ్జమ్ ఎళ్ళాయ్ = ఓ నా ప్రియమైన మనమా! తుళ్ళిన్దు = ఇప్పుడు నేను నీకు చెప్పెడిమాటలను విశ్వసించి, కేళ్ = వినుము, పలరుమ్ = ఎంతమందియో, పాడి = పలుగుణములను పాడుకొనుచు, ఆడి = నర్తనము చేయుచు, పణిన్దు = నమస్కరించి, ఏత్తి = స్తుతించి, కాణ్గిలా = సాక్షాత్కరించుకొనుటకు శక్యముకానివాడును, ఆడు = జయశీలురగు (మహావైభవోపేతులగు) తామరై యోనమ్ = పద్మజాడగు చతుర్ముఖబ్రహ్మయు, ఈశనుమ్ = పరమశివుడును, అమరర్ కోనుమ్ = దేవేన్ద్రుడును, నిన్ఱు = సన్నిధివాకిటనిలచి, ఎత్తుమ్ = స్తోత్రము చేయుచుండు.

తా॥ వివేకశూన్యులగు లోకులతోగూడి వారి విషయముల నాశపడెదరో, వారివలె నా విషయములనే అనుభవింపవలయునని కుతూహలపడియు, వారు చెప్పెడిమాటలనే చతురములగు వాక్కులుగదలచి, అట్లే నీవును మందుమాదిరిగాక చాలమారి వివేకముగలదానివై ఉజ్జీవించియున్నావు. భగవద్గుణములనెప్పటిం పాడుచు భజనలుచేయుచు మైమరచి నృత్యముచేయుచు కీర్తించుచుండు వారలకును సాక్షాత్కరించుకొనుటకు మిక్కిలి దుర్లభుడై యుండువాడును, మహావైభవోపేతులగు బ్రహ్మరుద్రమహేంద్రాదులును సన్నిధికి వాకిట నిలచిస్తోత్రముచేయుచుండు మహావైభవోపేతమైన శ్రీ వేంకటాచలమున నిత్యవాసముచేయుచుండువాడును, మున్ను గోపికలతోగూడ ఆడుచుపాడుచు బాల్యక్రీడల ననుభవించిన నా సర్వేశ్వరునకు ఇట్లు అంతరంగకైంకర్యములజేయునట్టి భాగ్యమును గలిగియున్నావే? నీది గదా భాగ్యము! నీ సంబంధముచే నేను గూడ ధన్యుడనైతిని. తరించితిని.

(10) అవ :— శ్రీ తిరువేంగడముడయానులను గూర్చి తాము పాడించిన ఈతిరుమొళిని అభ్యసించినవారలకు ఫలమును చెప్పుచున్నారు.

* మిన్నుమామఁగిల్ మేవు తణ్ తిరువేఙ్గడమలై కోయిల్ మేవియ,
అన్నమాయ్ నిగన్ద అమరర్ పెరుమానై,
కన్నిమామదిళ్ మఙ్గైయర్ కలికన్ఱి ఇన్ తమిళాలురైత్త, ఇమ్
మన్నుపాడల్ వల్లార్కట్కు ఇడమాగుమ్ వానఁలగే. ౧౦

టీక :— మిన్ను మ్ = మెరుపులతో మెరయుచుండు, మామగిల్ మేవు = పెద్దకారుమేఘములువచ్చి విడిసియున్న, తణ్ తిరువేంగడమ్ మలై = చిక్కని మనోజ్ఞమైన శ్రీవేంకటాచలమును, కోయిల్ మేవియ = నిత్యసన్నిధిగ చేసికొనియున్నవాడును, అన్నమ్ ఆయ్ = హంసరూపుడై, నిగన్ద = అవతరించినవాడును, అమరర్ పెరుమానై = నిత్యసూరులకు నాథుడునగు పెరుమాళ్ళ విషయముగ, కన్నిమామదిళ్ = సుదృఢములైన పెద్దప్రాకారములతో జుట్టబడియుండు, మఙ్గైయర్ కలికన్ఱి = తిరుమంగై దేశమున నివసించువారలకు స్వామియైన ఆళ్వార్లు, ఇన్ తమిళాల్ = చెవులకింపునుగూర్చు మృదుమధురమైన ద్రావిడభాషలో, ఉరైత్త = సాదించిన, మన్ను = వేదమువలె నిత్యమైన, ఇప్పాడల్ = ఈ పదిపాశురములనుగల తిరుమొళిని, వల్లార్క్కు = అభ్యసించువారలకు, వానమ్ ఉలగు = పరమపదము, ఇడమ్ ఆగుమ్ = వాసస్థానమగును

తా॥ మెరుపులతోఁగూడి పరమరమణీయములై యుండు కాళ మేఘములు ఎచ్చటఁజూచినను శిఖరములయందు వాసముచేయుచుండుటచే శీతల రమణీయమగు శ్రీ వేంకటాచలమున వేంచేసియుండువాడును, వేదముల నుద్ధరించుటకై హంసరూపియై యవతరించినవాడును, నిత్యసూరులకు స్వామియునగు సర్వేశ్వరునిగూర్చి, మహోన్నతములగు ప్రాకారములతో పరివృతమైయుండు తిరుమంగై దివ్యదేశమునందు నివసించువారలకు స్వామియగు ఆళ్వార్లు శ్రవణసుభగమగు మృదుమధురమైన ద్రావిడభాషలో ననుగ్రహించిన సంస్కృతవేదమువలె పరమ ప్రమాణమైన ఈ పదిపాశురములను అభ్యసింపశక్తిగలవారలకు పరమపదము కరతలామలకమై, నిఖిలసౌఖ్యములును చేకూరును.

శ్రీ తిరుమంగై యాళ్వార్ల తిరువడిగళ్లే శరణము.

——[०]——

శ్రీరస్తు

శ్రీమతే పరకాలమహాయోగినే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ తిరుమంగైయాళ్వార్లు ప్రసాదించిన పెరియతిరుమొళిలోని

# మంగళాశాసన పాశురములు

(4-వ పది, 3-వ తిరుమొళి, 8-వ పాశురము)

(8) అవ :—తన మనుమడగు అనిరుద్ధుని చెరనుంచిన బాణాసురుని భుజసహస్రమును ఛేదించిన శ్రీ కృష్ణస్వామియును, తిరువేంగడముడయానులును శ్రీ వరదరాజస్వామిగ నాకు సేవసాదించిరని చెప్పుచున్నారు.

అన్ఱియవాణ నాయిరమ్ తోళుమ్, తుణియ అన్ఱు ఆళితొట్టానై,
మిన్ తిగళ్ కుడుమి వేఙ్గడమలై మేల్, మేవియ వేదనల్ విళక్కై,
తెన్ తిశై త్తిలద మనైయవర్ నాఙ్గై, చ్చెమ్బొన్ శెయ్ కోయిలి నుళ్ళే,
మన్ఱదు పొలియ మగిళ్న్దు నిన్ఱానై, వణఙ్గినాన్ వాళ్న్దొళిన్దేనే.

టీక :— అన్ఱియ = కోపించి ఎదిరించిన, వాణన్ = బాణాసురునియొక్క, ఆయిరమ్ తోళుమ్ = వేయిభుజములును, తుణియ = తెగి క్రిందిపడునట్లు, అన్ఱు = ఆకాలమున, ఆళితొట్టానై = సుదర్శనాళ్వానులను ప్రయోగించినవాడును, మిన్ తిగళ్ = ప్రకాశించుచున్న కుడుమి = శిఖరములు గలిగినటువంటి, వేఙ్గడమ్ మలై మేల్ = శ్రీ వేంకటాచలముపై, మేవియ = అమరియున్నట్టివాడును, వేదమ్ నల్ విళక్కై = వేదములచే చూడగలిగిన మంచి ప్రదీపమైనవాడును, తెన్ తిశై = దక్షిణ దిక్కునకు, తిలగమ్ = తిలకమువలె ప్రధానులైయున్నట్టి, అనైయవర్ = ఏ మహాపురుషులు నివసించుచున్న (నాఙ్గై శెమ్బొన్ శెయ్ కోయిల్ అను దివ్యక్షేత్రమున నివసించుచున్న); మన్ఱు అదు పొలియ = శ్రీవైష్ణవులగోష్ఠి వెలుంగ, మగిళ్న్దు = ప్రీతిపూర్వకముగ; నిన్ఱానై = నివసించుచున్నట్టి పెరుమాళ్ళను, నాన్ వణఙ్గి = నేను నమస్కరించి, వాళ్న్దొళిన్దేనే = ఉజ్జీవించితిని గద !

తా॥ పూర్వకాలమున, కోపించి తన నెదిరించిన బాణాసురుని భుజసహస్రము, తెగిక్రిందపడునట్లు చక్రాయుధమును ప్రయోగించిన

వాడును, మహోన్నతములై దేదీప్యమానములై యున్న శిఖరములగల శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నవాడును, దక్షిణదిశకు తిలకమైయున్న "శెమ్పోన్ శెయ్‌కోయిల్" అను దివ్యదేశమున శ్రీవైష్ణవుల గోష్ఠి ప్రకాశింప పరమప్రీతితో నెలకొనియున్న సర్వేశ్వరుని నేను సేవించి యుజ్జీవించితిని. నా భాగ్యమే భాగ్యము.

వి. వి —(1) "అழிత్తోట్టానై" బహులాఘవముగ బాహువులను ఛేదించెను. అని సర్వేశ్వరుని సామర్థ్యాతిశయము సూచింపబడుచున్నది.

(2) అనేకవంది కూడియుండు చోటునకు "మన్రు" అని పేరు. ఈ దివ్యమున నెల్లప్పుడును నాలుగువేల శ్రీవైష్ణవులు సేవాకాలము చేయుచుందురట "నాన్గై నాలాయిరమ్" అని సామెతయును గలదు.

(4-వ పత్తు 7-వ తిరుమొழி, 5-వ పాశురము)

(5) అవ :— తిరువేంగడము మొదలగు దివ్యదేశములయందు వేంచేసియున్నట్టి స్వామీ! నిన్నే కీర్తించుచున్న దాసుని పాపపుంజముల నన్నింటిని నశింపజేయుమా అని ప్రార్థించుచున్నారు.

వేడార్ తిరువేఙ్గడమ్ మేయవిళక్కే!,
నాడార్ పుగழ் వేదియర్ మన్నియనాఙ్గూర్,
శేడార్ పొழிల్‌శూழ் తిరువెళ్ళక్కుళత్తాయ్!,
పాడావరువేన్ విన్నైయాయినపాఱ్ఱే. ౪-౭-౫.

టీక : — వేడుఆర్ = బోయవాండ్రు నివసించుచున్నట్టి, తిరువేంగడమ్ = శ్రీవేంకటాచలమున, మేయ = నిత్యవాసము చేయుచున్నట్టి, విళక్కే = ప్రదీపమువలె ప్రజ్వలించుచున్నవాడా! నాడు ఆర్ పుగழ் = దేశమంతయును వ్యాపించియున్న కీర్తిగల, వేదియర్ = వైదికులు, మన్నియ = నిత్యవాసము చేయుచున్నట్టి, నాఙ్గూర్ = తిరునాంగూరిలో, శేడు ఆర్ పొழிల్ శూழ் = పనుమగరితేములకు వృక్షలతాదులతో పూర్ణములైన ఉద్యానవనములతో చుట్టబడియున్న, తిరువెళ్ళకుళత్తాయ్ = 'తిరువెళ్ళక్కుళ' మను దివ్యదేశమున వేంచేసియున్న స్వామీ!, పాడా = నిన్ను కీర్తించుచు, వరువేన్ = వచ్చుచున్న దాసని, విన్నైఆయిన = పాపములనియున్న సమస్తములను, పాఱ్ఱుఏ = నశింపజేయవలయును సుమా!

తా॥ కిరాతులు పరమభక్తితో కుటుంబకుటుంబములుగా నివసించుచున్న శ్రీవేంకటాచలశిఖరమున వెలుంగుచున్న ప్రదీపమా! దేశము నందంతటను వ్యాపించియున్న కీర్తిగలుగు పరమవైదికులు నివసించునట్టి "తిరువాంగూరు" దివ్యక్షేత్రమునను పరిమళభరితములగు కుసుమమాలతో నిండి శోభాయమానంబులై యున్న రమ్యోద్యానములచే జుట్టబడియుండు "తిరువెళ్ళక్కుళమ్" అను దివ్యదేశమునను విజయము చేసియున్న పురుషోత్తమా! నిన్నే సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందును కీర్తించుచువచ్చుచున్న దాసుని పాపముల నన్నిటిని పటాపంచలుచేయుమా!

వి. వి:—(1) మహోన్నతమైన పర్వతశిఖరమున వెలుగుచుండు నఖండమంగళ దీపముల వెలుగు ప్రక్కలనుండు చీకటిని పోగొట్టి స్వయంప్రకాశమై (తాను వెలుంగుచు) జనులకు మహోపకార మొనరించునో, అటులనే మలైకుప్పక్ స్వామి వారును మహోపకారకుడై ప్రకాశించుచున్నందున వీరిని "ప్రదీప" మని యభివర్ణించుట చాల దగియున్నది.

(4) "కణ్ణార్ కడల్ శూళ్" అను తిరుమొళివలె నిదియును అమరియున్నది.

(5-వ పత్తు 3-వ తిరుమొళి, 4-వ పాశురము)

(4) అవ:—'తిరువెళ్ళరై' 'తిరువేంగడమ్' అను దివ్యదేశములయందు విజయముచేసియున్నట్టి పాండవసంరక్షకుడవగు నో శ్రీకృష్ణస్వామీ! నీ చరణారవిన్దములయందు పరమభక్తిని దాసునకు గలుగజేయు నను గ్రహింపుమా! అని ప్రార్థించుచున్నారు.

వాప్పురియుగమన్నర్ దమ్ముయిర్ శెగ ఐవర్ గట్కు అరశళిత్త,
కాప్పినార్ తిరువేజ్గడప్పొరుప్ప నిన్ కాదలై అరుళ్ ఎనక్కు,
మాంపొళిల్ తళిర్ కోదియమడక్కుయిల్ వాయదుతువర్ ప్పెయ్‌ద,
తీప్పులజ్గళిత్తేనదునుగర్ తిరువెళ్ళరై నిన్రానే. ౫-3-౪.

టీక :— మామ్పొழிలిల్ = తియ్యమామిడితోపులలో, తళిర్ = వాని చిగురులను, కోదియ = తమ ముక్కులతో పొడిచిపొడిచి ఆస్వాదించిన, మడక్కుయిల్ = సుందరములైన కోకిలములుల, వాయ్ అదుతువర్ప్ప ఎయిద = తమ నోటనకు వగరుచేరుటుదోపగా (అరసమును మార్చుటకై) తీమ్ = తియ్యని, పలజ్క్కాని = పనసపండ్లయందున్న, తేన్ ఆదు = మధువును, నుగర్ = పానము చేయుచుండు, తిరువెళ్ళరై = "తిరువెళ్ళరై" అను దివ్యదేశమున విజయము చేసియున్న స్వామీ!, వామ్పరి = (భారత యుద్ధమయమున) పైపైకి వచ్చుచున్న అశ్వములు, ఉగ = మృతిచెందునట్లును, మన్నర్దమ్ = స్వాశ్రితులకు శత్రుకోటిలోని రాజులయొక్క, ఉయిర్ = ప్రాణములు, శెగ = పోవునట్లును చేసి, ఐవర్గట్కు = పంచపాండవులకు, అరశు = రాజ్యమును, అళిత్త = అనుగ్రహించిన, శామ్బిన్ ఆర్ = వెదుళ్ళచే నిండియున్న, తిరువేంగడమ్ పొరుప్ప = శ్రీవేంకటాచలమున వేంచేసియున్న పరమపురుషా! నిన్ కాదలై = నీ విషయమగు పరమభక్తిని, ఎనక్కు = దాసునకు, అరుళ్ = అనుగ్రహింపవలయును.

తా॥ తియ్యమామిడితోపులలో నివసించుచు, పరమభోగ్యములగు తియ్యని మామిడిచిగుళ్ళను బాగుగ మెక్కుచూయుండు కోయిలలు వగురుచేత తమ నోటిరుచికుంటుపడగా తియ్యని పనస తోనలయందున్న మధువును పానముచేసి ఆనందించుచుండు "తిరువెళ్ళరై" దివ్యక్షేత్రమున విజయము చేసియున్నస్వామీ! భారతయుద్ధమున పైపైకివచ్చుచున్న అశ్వముల గ్రుక్కడచి, ఆశ్రితులయొక్క విరోధుల నశింపజేసి పంచపాండవులకు పట్టాభిషేకమొనరించిన పుణ్యమూర్తీ! వెదుళ్ళపొదలచే నిండియుండు శ్రీవేంకటాచలమున నెలకొనియుండు పరమపురుషా! నీ చరణారవిన్దముల యందలి నిరన్తర నిరవధిక భక్తిని నాకనుగ్రహింపుమా!.

వి. వి :—(1) శ్రీ వేంకటాచలమున నిలచియున్నవాడును, తిరువెళ్ళరై దివ్యదేశమున వేంచేసియుండువాడును, ఒకటే వ్యక్తియని తెలుపుటకై "తిరువేంగడప్పొరుప్ప— తిరువెళ్ళరైనిన్ఱానే" అని యామంత్రించుచున్నారు.

(2) "నిన్ కాదలై అరుళెనక్కు" దేవరవారి శ్రీపాదములలో, కైంకర్యమునకు పూర్వము గలిగిన పరమభక్తిని నాకెల్లప్పుడును ప్రసాదింపవలయును — అని ఇచ్చట వ్యాఖ్యాన వాచస్పతులగు శ్రీ పెరియవాచ్చాన్పిళ్లైగారి శ్రీసూక్తి.

(5-వ పత్తు 5-వ తిరుమొழி, 1-వ పాశురము)

(1) అవ :— అழுగియమణవాళన్నను అనుభవింపవలయునని ఆழ்వార్లకు గలిగిన నిరవధికమగు అభినివేశ ప్రకర్షముచే నాழ்వారు నాయకీభావమునుపొంది, పురుషోత్తముని విశ్లేషమును తాళజాలక మిక్కిలి వేదన ననుభవించుచుండిరి. దానిని చూచి వారి తిరుత్తాయారు (జనని), నాయకునియందలి వారి ప్రావణ్యాతిశయమును, దానిచే గలిగిన వేదనలను అభివర్ణించుచున్నారు.

* వెరువాదాళ్ వాయ్వెరువి వేఙ్గడమే,
వేఙ్గడమే ఎన్గిన్ఱాళాల్,
మరువాళాల్ ఎన్కుడఙ్గాల్ వాళ్ నెడుఙ్గణ్,
తుయిల్ మఱన్దాళ్ వణ్డార్ కొణ్డ,
లురునాళన్ వానవర్ద ముయిరాళన్,
ఒలిదిరై నీర్ప్పావమ్ కొణ్డ,
తిరువాళన్ ఎన్మగళై చ్చెయ్దనగళ్,
ఎఙ్గనమ్ నాన్ శిన్దిక్కేనే. 5-5-1.

టీక :— (నా కుమార్తె) వెరువాదాళ్ = భయపడనిదై, వాయ్వెరువి = ప్రలపించుచున్నదై, వేఙ్గడమే! వేఙ్గడమే! ఎన్గిన్ఱాళ్ = "వేంకటాచలమే వేంకటాలమే" అని పలవరించుచున్నది. ఎన్కుడఙ్గాల్ = నాదుబడిలో, మరువాళ్ = నిలచుటలేదు, వాళ్ నెడుమ్ కణ్ = ఈటెలవలె తీక్ష్ణములైన వెడదకన్నులతో, తుయిల్ = నిద్రను, మఱన్దాళ్ = మఱచిపోయినది, వణ్డు = తుమ్మెదలవలెను, అర్ కొండల్ = పూర్ణమేఘములవలెను, ఉరుఆళన్ = ఆకారముగలవాడును, వానవర్ దమ్ ఉయిర్ ఆళన్ = నిత్యసూరులకు ప్రాణముల వంటివాడును, ఒలితిరై నీర్ = ఘోషించుచు పెద్ద అలలతో గూడుకొనియుండు ఉదకముతో పూర్ణమైయున్న, పావమ్ = క్షీరసముద్రమునుండి, కొణ్డ = స్వీకరింపబడిన, తిరుఆళన్ = శ్రీలక్ష్మీదేవిని పరిపాలించు వల్లభుడునగు సర్వేశ్వరుడు, ఎన్మగళై = నాకుమార్తె విషయమై, శెయ్దనగళ్ = చేసినవానిని, నాన్ ఎఙ్గనమ్ శిన్దిక్కేనే = నేను స్మరించుటకు శక్యములగునా!.

తా: ఓ అమ్మలారా! నా కుమార్తె కొంచెమైనను సిగ్గుబిడియములులేక "వేంకటాచలము, వేంకటాచలము" అని సదా సర్వకాలములును పలవరించుచున్నది. నా ఒడిలో ఒక్కక్షణమైనను అణిగిపండుకొనుటలేదు ఈటెలవలె తీక్ష్ణములగు వెడదకన్నుల నెల్లప్పుడును తెఱచియే యున్నది. కొంచెమైనను కనుమూయుటలేదు. తుమ్మెదలవలెను, కారు మొగిళ్ళవలెను నల్లనై సుకుమార రమణీయమైయుండు దివ్యమంగళవిగ్రహముగలవాడును, నిత్యసూరులకు ప్రాణతుల్యుడును, పెద్దఅలలతోగూడి ఘోషించుచున్న క్షీరసముద్రమునుండి ఆవిర్భవించిన శ్రీమహాలక్ష్మీదేవిని స్వీకరించి తనదు భార్యనుగా జేసికొనినవాడునునగు సర్వేశ్వరుడు నా కుమార్తెనుపెట్టు యాతనలు ఇంతని వర్ణింపతరమగునా? స్మరింపశక్యమగునా?

వి. వి :—శ్రీరంగనాథుని విషయముగ ప్రావణ్యము గలిగియుండగా, తిరువేంగడమును సంకీర్తనజేయుట ఎట్లు పొసగును? అనినచో "అమలనాదిపిరాన్" పాశురపు విశేషార్థము నిచ్చట చూడనగును.

కావేరీ విరజా సేయం వైకుంఠం రంగమన్దిరమ్ ॥
శ్రీవాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్ ॥
మాయావీ పరమానన్దం త్యక్త్వా వైకుంఠముత్తమమ్ ।
స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే ॥

అను శ్లోకము లిచ్చట ననుసంధింపదగినవి. పరమపదనాథుడగు పరవాసుదేవుడు అవతరించినపుడు మొదట శ్రీవేంకటాచలమున వేంచేసియుండి, తదుపరి శ్రీరంగమునకు విచ్చేసెను. అందుచే మూలకందము శ్రీవేంకటాచలము. మఱియు, శ్రీరంగనాథులు కలాపకాలమున తిరువేంగడమున బహుకాలముండిరి.

(5-వ పత్తు 6-వ తిరుమొళి, 7-వ పాశురము)

(7) అవ :—ధ్యానమునకు విషయుడును, శ్రియఃపతియును, శ్రీవేంకటాచలమునకు నిర్వాహకుడును, నా మనోనాయకుడును, లోకముల గొలిచిన స్వామియునునైన పరమాత్మని నేను చూడ గలిగినది శ్రీరంగ దివ్యక్షేత్రముననే—అని ఆనతిచ్చుచున్నారు.

శిన్దనైయై త్తవనెఱియై త్తిరుమాలై ప్పిరియాదు,
వన్దెనదుమనత్తిరున్ద వడమలైయై వరివణ్డార్,
కొన్దణైన్దపొழிల్ కోవల్ ఉలగళప్పాన్ అడినిమిర్న్త,
అన్దణనై యాన్కణ్డదు అణినీర్ త్తెన్నరఙ్గత్తే. ౫-౬-౭.

టీక :— శిన్దనైయై = నామనోరథమునకు విషయమైనవాడును, తవమ్ నెఱియై = ఉపాయమార్గమైనవాడును, తిరుమాలై = శ్రియఃపతియును, వడమలైయై = శ్రీవేంకటాచలమునకు నిర్వాహకుడును, (వానినన్నిటిని వదలి) వన్దు = విచ్చేసి, ఎనదు మనత్తు = నాదు మనస్సులో, పిరియాదు ఇరున్ద = ఒక త్రుటికాలమైనను ఎడతెగక యుండువాడును, వరివణ్డు ఆర్ = సుందరములగు తుమ్మెదలు మూగియున్న, కొన్దు = పూలగుత్తులు, అణైన్ద = దట్టములైయుండునట్టి, పొழிల్ = ఉద్యానవనములతో గూడు కొనియుండు కోవల్ = తిరుక్కోవలూరిలో, ఉలగు అళప్పాన్ అడినిమిర్న్ద = లోకములు గొలుచుటకై జాచబడిన శ్రీపాదములతో సేవసాదించుచున్న, అన్దణనై = పరమాత్మని, యాన్ కణ్డది = నేను సేవించినది, అణినీర్ = రమ్యమగు తీర్థముతో గూడిన, తెన్ అరంగత్తు = సుందరతమంబై యుండు శ్రీరంగదివ్యక్షేత్రమునందే.

తా॥ నా మనోరథములకెల్ల విషయమైనవాడును, మోక్షము పొందుటకు పరమోపాయమైనవాడును, పురుషకారభూతయైన శ్రీదేవికి వల్లభుడును, రమ్యమగు శ్రీ వేంకటాచలమునకు స్వామియును, వాని నన్నిటినివదలి నా మానస్సును ఒక్క త్రుటికాలమైనను విడువజాలక అచ్చటనే వేంచేసియున్నవాడును, సుందరతమములగు తుమ్మెదలు మూగి యున్న పూలగుత్తులతో గూడి రమ్యములై యుండు దివ్యోద్యానము లతో బరివృతమైయుండు తిరుక్కోవలూరిలో త్రివిక్రమావతారుడై సేవసాదించు చున్నవాడునునగు పరమాత్మని నేను సేవించినది—రమ్యములగు కావేరీ తీర్థములతో గూడి పరమపవిత్రమైయుండు శ్రీరంగ దివ్యక్షేత్రముననే.

వి. వి :—(1) సర్వేశ్వరుడు, పరమభోగ్యమైన తిరువేంగడపర్వతమును దనకు భోగస్థానముగ గలిగియుండియు, దానిని వదలి, అతినిహీనమైన నా మనస్సులో నిత్య వాసము జేయుచున్నాడు. ఆహా ! ఏమి యతని యా శ్రితవ్యామోహము ? ఏమి వాత్స ల్యము ? ఏమి ఔదార్యము ? ఏమి సౌశీల్యము ? అని మోహమూర్ఛితులగుచున్నారు.

(²) పరమపదమున వేంచేసియుండువాడును, సకలభూతసుహృత్తయి విభవావతారముల స్వీకరించినవాడును, తిరుమలయందును, తిరుక్కోవిలూరునను, తిరువరంగమునను వేంచేసియుండు పరమభోగ్యస్వరూపుడును ఒకడే యనియు, అడడే ఆళ్వార్ల హృదయమున నొకక్షణకాలమైనను విడువక నిత్యవాసము చేయుచున్నాడనియును సూచింపబడుచున్నది.

(6-వ పత్తు 8-వ తిరుమొழி, 1-వ పాశురము)

(¹) అవ :- కృష్ణాజినముతో తన దివ్యవక్షఃస్థలమునందుండు శ్రీదేవిని మరుగుపఱచుకొని మహాబలిని మూడడుగులు భూమిని యాచించి త్రివిక్రమావతారుడై లోకములనెల్ల ఆక్రమించి అందఱిని ఉజ్జీవింపజేసి, ఎల్లకాలములయందును ఎల్లఱును వచ్చి తనను సేవించి తరించునట్లు గాక, అని తిరుమలలో వేంచేసియుండు పరమపురుషుని తిరునఱైయూరిలో సేవింపగల్గితిని—అని ఆనతిచ్చుచున్నారు.

* మాన్ కొణ్డతోల్ మార్విన్ మాణియాయ్ మావలిమణ్,
తాన్ కొణ్డు తాళా లళన్ద పెరుమానై,
తేన్ కొణ్డశారల్ తిరువేఙ్గడత్తానై,
నాన్ శెన్రునాడి నఱైయూరిల్ కణ్డేనే. ౬-౮-౧.

టీక :— మాన్ కొండతోల్ = జింకచర్మమును, మార్విల్ = తనదువక్షఃస్థలమున ధరించి (దానిచే మహాలక్ష్మిని మరుగుపఱచి), మాణిఆయ్ = బ్రహ్మచారియై, మావలి = మహాబలివద్ద, మణ్ = భూమిని, తాన్ కొండు = తానుయాచించి స్వీకరించి, తాళాల్ = తనను శ్రీపాదములచే, అళన్ద = కొలిచిన, పెరుమానై = పరాత్పరుడును, తేన్ కొండశారల్ = తేనెలు ప్రవహించుచుండు చరియలతో కూడుకొనియుండు, తిరువేంగడత్తానై = శ్రీవేంకటాచలమున నిత్యవాసముచేయుచున్న వాడునునగు సర్వేశ్వరుని, నాన్ = నేను, నాడిశెన్రు = వెదకికొనివెళ్ళి, నఱైయూరిల్ = తిరునఱైయూరిలో, కణ్డేనే = సేవింపగలిగితిని గదా!

తా॥ కృష్ణాజినముచే తనదు దివ్యవక్షఃస్థలమున నిత్యవాసము జేయుచున్న శ్రీమహాలక్ష్మిని జింక చర్మముచేగప్పి మరుగు పఱచుకొని మహాబలివద్దకు వెళ్ళి అతనిని మూడడుగుల భూమినియాచించి, ఆతడివ్వగ

స్వీకరించి, తన శ్రీపాదములచే లోకములనన్నిటిని ఆక్రమించిన త్రివిక్రమావతారుడును, తేనెలు ప్రవహించుచుండు చరియలతో విరాజమానమైయుండు శ్రీవేంకటాచలమున నిత్యవాసముజేయుచున్నవాడును నగు పరాత్పరుని వెదికికొనుచువెళ్ళి తిరునఱైయూరిలో సేవింపగల్గితిని. ఆహా! నా భాగ్యమే భాగ్యము.

వి. వి :—(1) "మాన్ కోణ్డతోల్ మార్విన్" ఎల్లప్పుడును శ్రీమహాలక్ష్మీదేవి సర్వేశ్వరుని దివ్యవక్షఃస్థలమున నిత్యవాసము చేయుచుండుటచే, ఆమెను మరుగుపఱచుటకై ఈ కపటవామనబ్రహ్మచారికి నీ కృష్ణాజినము మిగులనుపకరించినది. ఆ మహాలక్ష్మి కనబడినచో నీ శ్రియఃపతికి బిచ్చమెవ్వరైననునిత్తురా? అను సారస్యమిచ్చట వ్యంగ్యము.

(2) "తాళాలశన్ద — తిరువేంగడత్తానై". "అన్ఱు ఞాలమళన్దపిరాన్ శెన్ఱుశేర్ తిరువేంగడమామలై" అను శ్రీనమ్మాళ్వార్ల పాశురమును హృదయమున నుంచుకొని దీనిని సాధించినట్లున్నది.

(3) "నాన్ శెన్ఱునాడి" మిక్కిలి శ్రమపడి తిరుమలనెక్కి దర్శింప నవసరము లేకుండునటుల నాశ్రితవాత్సల్యము మీఱ "దప్పియైనచోట చలిపందిరి సాక్షాత్కరించినటుల" తిరునఱైయూరులో వేంచేసియుండు పెరుమాళ్ళను సపర్యించితిని; ధన్యుడనైతిని – అననది అన్తరార్థము

(7-వ పత్తు 3-వ తిరుమొழி, 5-వ పాశురము)

(5) అవ :—అసంఖ్యాకములగు నానావిధములైన పాపముల నను ష్ఠించి, వానిఫలము ననుభవించుటకై నరకములలో బడి యమయాతనల ననుభవించుచుండ, దానిని చూచి సహింపజాలక అచ్చటికివచ్చి, అబ్బాయీ! నేనుండగ నీవిట్లు శ్రమముల ననుభవింపవచ్చునా? భయపడకుము; అని అభయప్రదానమునుజేసి రక్షించుచున్నట్టి ఎమ్బెరుమాన్లను నా మనస్సు ఎల్లప్పుడును చింతించుచున్నది—అని ఆనతిచ్చుచున్నారు.

ఆణ్డువెన్నరగత్తు అழுన్దుమ్ పోదు,
అఞ్జేలెన్ఱు అడియేనై అఞ్జేవన్దు,
తాణ్డు తామరై యన్న పొన్నారడి,
ఎమ్బిరానై ఉమ్బర్క్కణియాయ్ నిన్ఱ,

వేఙ్గడత్తరియై ప్పరికీఱియై,
వెణ్ణెయుణ్డు ఉరలినిడై యాప్పుణ్డ,
తీఙ్గరుమ్బినై త్తేనై నన్ పాలై యన్ఱి
ఎన్ మనమ్ శిన్దై శెయ్యాదే. 2-3-5.

టీక :— అఙ్గువెమ్నరగత్తు = వర్ణించుటకు శక్యముగాని అట్టి తీవ్రములగు నరకములలో, అழున్దుమ్ పోదు = పడిశ్రమపడుచుండు కాలమున, అఙ్గేవన్దు = అచ్చటికి వచ్చి, అఞ్జేల్ ఎన్ఱు = భయపడకుము అని, అడియేనై = దాసుని, కాంగు = సంరక్షించిన, తామరై అన్న = తామరపుష్పమువలె, పొన్ ఆర్ = మనోజ్ఞములైన, అడి = తిరువడి గళ్ళనుగలవాడును, ఎమ్బిరానై = నాకుపకారకుడును, ఉమ్బర్కు అణిఆయ్నిన్ఱ = ఊర్ధ్వలోకములకన్నిటికిని అలంకారభూతుడైయున్న, వేంగడత్తు = శ్రీవేంకటాచలమున వేంచేసియున్న, అరియై = సింహమువంటివాడును, పరికీఱియై = గుఱ్ఱపురూపలో వచ్చిన హయాసురుని నోటినిచీల్చివైనవాడును, వెణ్ణెయ్ ఉణ్డు = వెన్నను (దొంగిలించి) బాగుగ నారగించి, ఉరలినిడై = రోలుతోగూడ, ఆప్పుణ్డ = కట్టబడినవాడును, తీయ్కరుమ్బినై = తియ్యని చెఱకుపాలవలె పరమభోగ్యమైనవాడును, తేనై = తేనెవలె పరమాస్వాద్యుడును, నన్ పాలినై = మధురమైన పాలవలె మిక్కిలి మనోజ్ఞమైనవాడునునైన, (తిరునఱైయూర్ నమ్బిని) అన్ఱి = తప్ప (ఇతరుల నెవరిని), ఎన్ మనమ్ = నా మనను, చిన్దై శెయ్యాదు = చింతింపదు,

తా॥ సహింపశక్యములుగానటువంటి దుర్భరతీవ్రనరకములయందు పడి యమయాతనల ననుభవించుచుండ, అచ్చటికి విచ్చేసి “ నేనుండగ నీకిట్టి బాధలుగలుగవచ్చునా ? భయపడకుము ” అని అభయమునిచ్చి నన్ను సంరక్షించిన నా స్వామియును, దివ్యరమణీయ పాదపంకజుడును, దాసునకు మహోపకారముచేసినవాడును, పైలోకముల కన్నిటికిని నలంకారభూతమైయుండు శ్రీవేంకటాచలమున వేంచేసియుండు పురుషసింహమైనవాడును, హయాస్యుని నోటిని చీల్చిపారవైచినవాడును, వెన్నను (దొంగిలించి) బాగుగ నారగించిన నేరమునకై తల్లియగు శ్రీయశోదాదేవిచే రోలునకుగట్టబడిన పరమసులభుడును, తియ్యనిచెఱకుపాలవలెను, తేనెవలెను, గంగగోవుపాలవలెవలెను పరమభోగ్యుడునునగు తిరునఱైయూర్ దివ్యక్షేత్రమున వేంచేసియుండు పరాత్పరునిదప్ప ఇతరులను కొంచెమైనను నా మనస్సుచింతింపదు. ఇట్టి మనస్సు నాకు సంభవించుట నాభాగ్యవిశేషమే.

వి వి :—(1) ఉమ్బర్ - ఊర్ధ్వలోకములు ; లేక, ఊర్ధ్వలోకములందుండు వారలు. మొదటిపక్షమున శ్రీవేంకటాచలము పరమపదమువఱకును వ్యాపించియున్నదను అతిశయోక్తి ధ్వనితము ; రెండవపక్షమున, నిత్యసూరినిర్వాహకుడు, వారలవదలి మాదృశుల సంరక్షించుటకై తిరుమలను విచ్చేసెను - అను పరమార్థము ధ్వనితము.

2) పరికేశియై - "కేశి" అను హయాసురుని శ్రీకృష్ణస్వామి, నోటిని చీల్చి వధించిన విషయమిచ్చట అనుసంధింపదగినది.

(7-వ పత్తు 10-వ తిరుమొళి, 3-వ పాశురము)

(3) అవ :— మమ్మనుగ్రహించు సర్వేశ్వరుడును, పార్వతీపతిని తన పార్శ్వమున నుంచుకొనినవాడును, సుశీలుడును, ఆకాశస్వరూపుడును, సూర్యమండల మధ్యవర్తియును, శ్రీవేంకటాచలమున వేంచేసియుండు వాడును, సర్వజనసంసేవ్యుడును, దివారాత్రులకు కారకుడునునగు సర్వేశ్వరుని వెదికివెదకి తిరుక్కణ్ణమంగై దివ్యక్షేత్రమున సేవింపగలిగితిని అని ఆనతిచ్చుచున్నారు.

ఎజ్గళుక్కు అరుళ్ శెయ్‌గిన్ఱ ఈశనై,
వాశవార్ కుழలాళ్ మలై మజ్గైతన్,
పజ్గనై ప్పజ్గిల్ వైత్తుగన్దాన్ తన్నై,
ప్పానై ప్పైయెప్పనిమామాదియమ్ తవழ్,
మజ్గై చ్చుడరై వడమామలై,
యుచ్చియై నచ్చినామ్ వణజ్గప్పడుమ్,
కజ్గలై ప్పగలై చ్చెన్ఱునాడి,
క్కణ్ణమజ్గైయుళ్ కణ్డుకొణ్డేనే. ౭-౧౦-3.

టీక :— ఎజ్గళుక్కు = మా విషయమున, అరుళ్ శెయ్‌గిన్ఱ = కృపను ప్రసరింప జేయుచున్న, ఈశనై = సర్వేశ్వరుడును, వాశమ్‌వార్ కుழలాళ్ = దివ్యగంధములు వీచుచున్న దివ్యకుంతలములతో నలరారుచున్న, మలైమజ్గై తన్ పంగనై = పార్వతిని తనకు నర్ధాంగిగాగల పరమేశ్వరుని పంగిల్ వైత్తు ఉగన్దాన్ తన్నై = తన కొకప్రక్క నుంచుకొని సంతోషించుచున్నవాడును, పాన్మైయై = ఇట్టి సౌశీల్యమే మూర్తిగా

గలవాడును, పనిమామది తవళ్ మఱులై = చల్లని పూర్ణచంద్రుడు సంచరించు ఆకాశ స్వరూపుడైయుండువాడును, శుడరై = సూర్యునకు అన్తర్యామియైయుండువాడును, వడ మామలై ఉచ్చియై = ఉత్తరదిక్కునకు తిలకమైయుండు శ్రీ వేంకటాచల శిఖరమునకు ఆభరణమైయుండువాడును, నచ్చినామ్ వణఙ్గప్పడుమ్ = ఆశపడిమనలచే నాశ్రయింప బడువాడును, కఙ్గులై = రాత్రికాలమునకు ప్రవర్తకుడును, పగలై = పగటివేళకు ప్రవర్తకుడును, ఆగు సర్వేశ్వరుని, శెన్ఱునాడి = వెదకికొనుచువెళ్ళి, కణ్ణమంగైయుళ్ = తిరుకణ్ణమంగై దివ్యదేశమున, కణ్డుకొణ్డేనే = సేవింపగలిగితిని

తా॥ ఆశ్రితులమగు మనయందు తనదునిర్హేతుక దివ్యకృపారసమును వెదజల్లుచున్నవాడును, మంచి పరిమళములు వీచుచున్న మనోజ్ఞములగు కుంతలములతో నొప్పారు పార్వతికి నాథుడైన పరమశివుని తనదు పార్శ్వమున నిలుపుకొని సంతోషించుచున్నవాడును, సౌశీల్యమే మూర్తిగా గలవాడును, సుభగశీతలుడగు చంద్రుడు సంచరించు పరమాకాశ స్వరూపుడై యుండువాడును, సూర్యమండల మధ్యవర్తియై యుండు వాడును, ఉత్తరదిక్కునకు తిలకమైయుండు శ్రీ వేంకటాచలశిఖరమునకు నాభరణమైనవాడును, మనలచే, మిక్కిలి యాశతో నాశ్రయింపబడు వాడును, రాత్రి పగలు అనుకాలములకు ప్రవర్తకుడును నగు సర్వేశ్వరుని వెదకికొనుచువెళ్ళి కడపట తిరుకణ్ణమంగై దివ్యదేశమున సేవింపగలిగితిని; ఆహా ! నా భాగ్యమే భాగ్యము.

(8-వ పత్తు 2-వ తిరుమొழி, 3-వ పాశురము)

(3) అవ :— ఆళ్వార్లు, సర్వేశ్వరుని యందలి ప్రావణ్యము మిక్కుటముకాగా నాయికాభావమునుపొంది విరహావస్థననుభవించు చుండిరి. దీనిని చూచి సహింపజాలక ఆమెతల్లి “ఈ పరకాలనాయిక ఇట్లు శ్రమపడుచున్నదే ? ఇందులకు నా పాపమే కారణముగాని వేఱు గాదు ” అని వ్యసనపడుచున్నది.

* అరుమ్పోరొళ్ వేఙ్గడమ్ నీర్ మలై యెన్ఱువాయ్

వెరువినాళ్, మెయ్యమ్ విసవి యిరుక్కిన్ఱాళ్,

పెరుగుశీర్ కణ్ణపురమెన్ఱు పేశినాళ్,
ఉరుగినాళ్ ఉళ్ మెలిన్దాళ్ ఇదు ఎన్ గొలో ?. ౭-౨-౩.

టీక :— ఇవళ్ = ఈపరకాలనాయకి. అరువిశోర్ వేంగడమ్ = సెలయేళ్ళు ప్రవహించుచున్న శ్రీవేంకటాచలము, నీర్ మలై = తిరునీర్ మలై దివ్యదేశము, ఎన్ఱు = అని చెప్పుచు, వాయ్ వెరువినాళ్ = పలవరించుచున్నది ; మెయ్యమ్ = తిరుమెయ్యమ్ దివ్యదేశమునుగుఱించి, వినవి = అడిగి (దీనికి బదులు చెప్పువారెవ్వరును లేనందున) ఇరుక్కిన్ఱాళ్ = మౌనమువహించియున్నది ; పెరుగుశీర్ = సిరిసంపదలతో దుల దూగుచుండు, కణ్ణపురమ్ ఎన్ఱు = తిరుక్కణ్ణపురమని, పేశినాళ్ = నోరార కీర్తించుచున్నదై (వెంటనే), ఉరుగినాళ్ = ద్రవించుచున్నది ; ఉళ్ మెలిన్దాళ్ = శిథిల మనస్కయైనది, ఇదు ఎన్ గొల్ = ఇట్టి సంకటపరిస్థితి గలుగవచ్చునా ? (అయ్యో !).

తా॥ ఈ పరకాలనాయకి "ఎల్లప్పుడును పెద్దశబ్దములతోడ ప్రవహించుచుండు సెలయేళ్ళచే శోభాయమానమైయుండు శ్రీవేంకటాచలము, తిరునీర్మలై" అని అభివర్ణించుచు పలవరించుచున్నది ; తిరుమెయ్యమ్ దివ్యదేశమును గూర్చి విచారించుచున్నది. సిరిసంపదలతో తులదూగుచున్న తిరుక్కణ్ణపురమని నోరారకీర్తించుచు నిలువున నీరగుచున్నది. మనస్సు చెడిపోయినది. అయ్యో! కడుసంకటపరిస్థితి ఏర్పడినదే? సంరక్షించువారెవ్వరును లేరా ?

(9-వ పత్తు 7-వ తిరుమొழி. 4-వ పాశురము)

(4) అవ :— తేనె లొలుకుచున్నట్లుమాటలాడి పురుషులను స్వాధీన పఱచుకొనునట్టి యువతుల బారినిబడక, నిత్యసూరులకు నెల్లప్పుడును సర్వేశ్వరుని సాక్షాత్కారమును ప్రసాదించు పరమపదముతో సమానమైన శ్రీవేంకటాచలము సేవించేసియుండు పరమాత్ముని దివ్యదేశమగు "తిరువల్లివాళ్" అనుదివ్యక్షేత్రమున నగుచుండుమా! అని తన్ను మనస్సును గూర్చి ప్రబోధించుచున్నారు.

పణ్ణులామ్ మెన్మొழிయార్ పైయవే మాల్ పణిమొழிయై యున్నాదు మనమేన్ఱు,
ఎణ్ణువార్ ఎణ్ణమదొழிత్తు నీప్పిழைత్తుయ్యక్కరుదినాయేల్,

విణ్ణుళార్ విణ్ణిల్ మీదియన్న వేఙ్గడత్తుళార్, వళఙ్గొళ్ మున్నీర్
వణ్ణనార్ వల్లవాழ் శొల్లుమా వల్లైయాయ్ మరువునెఞ్జే! ౯-౭-౮.

టీక :— నెంజే = ఓ మనసా ! పణ్ ఉలామ్ = తేనెలొలుకునట్టి, మెల్ మొழி = మృదుమధురములగు భాషణములతో నెట్టి వారలనైనను వశ్యము చేసికొనునట్టి, పావైమార్ = రమణీమణులయొక్క ఎణ్ణమ్ అదుజ్ఞిత్తు = అట్టి చింతనను పోగొట్టి, నీ పిழைత్తు = నీవు బ్రదికి, ఉయ్య కరుదినాయ్ ఏల్ = ఉజ్జీవింపవలయునని తలంచితివేని, విణ్ ఉళార్ = నిత్యసూరులకె, విణ్ణిన్ మీదు = పరమపదమున, ఇయన్న సేవసాదించుచుండువాడును, వేంగడత్తు ఉళార్ = శ్రీవేంకటాచలమున పరమప్రీతితో వేంచేసియుండువాడును, వళమ్‌కొళ్ మున్నీర్ = సుందరమగు సముద్రమువంటి శరీరము గలిగిన, వణ్ణనార్ = పరమాత్మని, వల్లవాழ் = తిరువల్లవాழ் అను దివ్యతిరుపతిని, శొల్లుమ్ ఆ = నోరారా చెప్పుటలో, వల్లై ఆయ్ = సమర్థురాలవై, మరువు = ఉజ్జీవింపుమా !.

తా॥ తేనె లొలుకునట్టి తే మృదుమధురభాషణములచే హృదయముల గొల్లగొట్టి ఎట్టివారలనైనను వశపరచుకొనునట్టి రమణీమణుల యొక్క నిబిడములగు స్తనమండలముల గాఢముగ కౌగలించుకొని యానందము ననుభవింపవలయును-అను అనుసంధించువారల బారినిపడక, నీవు ఉజ్జీవింపవలయునని ఎంచుచుంటివేని, నిత్యసూరులకు నెల్లప్పుడును పరమపదమున సేవసాదించుచుండువాడును, శ్రీ వేంకటాచలమున పరమ ప్రీతితో రమాసహాయుడై వేంచేసియుండువాడును, సముద్రవలె గంభీరమగు దివ్యమంగళవిగ్రహముగలవాడుననగు పరమాత్ముని తిరువల్లవాழ் అను దివ్యదేశమును ఎల్లప్పుడును నోరార అనుసంధించుండుము ; నీకు ఉజ్జీవనము తప్పక గలుగును.

(9-వ పత్తు 9-వ తిరుమొழி, 9-వ పాశురము)

(9) అవ :— శంఖచక్రముల ధరించిన భుజపర్వతములచే విరాజిల్లువాడును, శ్రీవేంకటాచలమునను, తిరుమాలిరుంశోలై పర్వతమునను, వేంచేసియున్నవాడుననగు దివ్యకల్యాణగుణగణ పరిపూర్ణుని, మంచి నొసలుగల నా కుమార్తె సంశ్లేషింపగలదా ? అని శ్రీపరకాలనాయికియొక్క జనని, తన కుమార్తె విరహయాతనలకు చింతించుచున్నది ; అభిలషించుచున్నది.

* వలమ్బురి యాழியనై వరైయార్ తిరళ్ తోళ్ తన్నై,
పొలమ్బురినూలవనై పొழిల్ వేఙ్గడ వేదియనై,
శిలమ్బియలాఱుడైయ తిరుమాలిరుఞ్జోలై నిన్ఱ,
నలన్దిగழ் నారణనై నణుగుఙ్గొల్ ? ఎన్ నన్నుదలే. ౯-౯-౯.

టీక :— వలమ్బురి అழியనై = దక్షిణావర్తశంఖమగు శ్రీపాంచజన్యమును, శ్రీసుదర్శనమను చక్రాయుధమును ధరించియున్నవాడును, వరై అర్ తిరళ్ తోళ్ తన్నై = పర్వతములవలె సుదృఢములై వర్తులములైయుండు దివ్యభుజములచే నలంకృతుడైనవాడును, పొలమ్ పురినూలవనై = మనోహరమైన యజ్ఞోపవీతము గలవాడును, పొழிల్ వేఙ్గడమ్ = రమ్యములగు నుద్యానవనములచే జుట్టబడిన శ్రీవేంకటాచలమున వేంచేసియున్నవాడును, వేదియనై = నిఖిలవేదప్రతిపాద్యుడును, శిలమ్బు ఇయల్ ఆఱు ఉడైయ = శిలమ్బు అని వ్యవహరింపబడు మనోజ్ఞములగు నందెలచే నలంకృతుడును, తిరుమాలిరుమ్ శోలైయిల్ = తిరుమాలిరుమ్ శోలై అను దివ్యపర్వతమున, నిన్ఱ = నిలచియున్నవాడును, నలమ్ తిగழ் = దివ్యకల్యాణగుణగణములచే ప్రకాశించుచున్న, నారణనై = శ్రీమన్నారాయణుని, ఎన్ నన్నుదల్ = అందమైన నొసలుగల నాకుమార్తె, నణుగుమ్ కొల్ = పొందగలుగునా ?.

తా॥ సుందరమైన ఫాలభాగముగల నా కుమార్తె, దివ్యములగు శంఖచక్రముల ధరించినవాడును, పర్వతములవలె సుదృఢములగు భుజములతో విరాజిల్లుచున్నవాడును, మనోజ్ఞమగు యజ్ఞోపవీతమును ధరించినవాడును, రమ్యములగు నుద్యానవనములచే శోభాయమానమైయున్న శ్రీవేంకటాచలమున ప్రీతిమీఱ నిత్యవాసము చేయుచున్నవాడును, నిఖిల వేదవేదాంతప్రతిపాద్యుడును, మనోహరముగ శబ్దించుచున్న రమణీయములగు నూపురములచే నలంకృతమైన పాదాంబుజములు గలవాడును, పరమ భోగ్యమగు తిరుమాలిరుమ్ శోలై దివ్యపర్వతమున వేంచేసియున్నవాడును, దివ్యకల్యాణగుణగణసంపన్నుడునునగు శ్రీమన్నారాయణునిపొంది, సంశ్లేషించి సుఖింపగలుగు సౌభాగ్యముగల దగునా ?.

వి. వి :— శిలమ్బు-నూపురము (అందె) ; శిలమ్బు ఇయాల్ ఆఱు-నూపురగంగ; శ్రియఃపతి లోకములగొలచిన సమయమున పెరుమాళ్ళ శ్రీపాదము సత్యలోకమునకు వ్యాపింపగా, బ్రహ్మ తన చేతిః మండలోదకముచే గడిగెను ; అప్పుడు పరమాత్ముని నూపురమునుండి యుద్భవించినందున దీనికి నూపురగంగ, అను ప్రసిద్ధిగలిగినది.

"స్వర్గమునండి అప్సరసలు వచ్చి ఆశ్రయింప, వారల కాళియందెల స్పర్శము వలన గలిగిన ఏఱు" అని శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళైగారు నతిచ్చియున్నారు.

(10-వ పత్తు 1-వ తిరుమొழி, 2-వ పాశురము)

(2) అవ :— పరమరమ్యమగు దివ్యకల్యాణవిగ్రహముతో గూడి యుండి, నన్ను దాసునిగ జేసికొనియున్న నా స్వామిని నిన్న శ్రీవేంకటాచలమున సేవించితిని ; ఈ దినము 'తిరుత్తణ్ కావిల్' అను దివ్యదేశమునకు వెళ్ళి సేవించెదను — అని ఆనతిచ్చుచున్నారు.

* పొన్నై మామణియై అణియార్ న్దదోర్
మిన్నై, వేఙ్గడత్తు ఉచ్చియిల్ కణ్డుపోయ్,
ఎన్నై యాళుడై ఈశనై ఎమ్బిరాన్
తన్నై, యామ్ శెన్రుకాణ్డుమ్ తణ్ కావిలే. ౧౦-౧-౨.

టీక :— పొన్నై = సువర్ణమువలె మిక్కిలి స్పృహణీయుడును, మామణియై= ఇంద్రనీలమణులవలె కన్నులపండువైనవాడును, అణియార్ న్దదు = సౌందర్యసౌభాగ్యములతో నతిశయించియుండు, ఓర్ మిన్నై = ఒక మెరుపుతీగతో సమానమైన ఉజ్జ్వలస్వరూపుడును, ఎన్నై ఆళుడై ఈశనై=నన్ను దాసునిగజేసికొనిన స్వామియును నగు, ఎమ్బిరాన్ తన్నై=సర్వేశ్వరుని దాసులమగు మనము, (నెరునల్ = నిన్నటిదినము), వేఙ్గడత్తు ఉచ్చియిల్ = శ్రీవేంకటాచలముయొక్క శిఖరభాగమున, కణ్డు = సేవించి, (ఇన్రు = ఈ దినము), తణ్ కావిలే = శీతలరమణీయమైన తిరుత్తణ్ కావిల్ అను దివ్యదేశమునకు, శెన్రు = వెళ్ళి, కాణ్డుమ్ = సేవించెదము.

తా॥ మేలిమిబంగారమువలె అందరిచేతను నాశపడదగినవాడును, నీలమాణిక్యమువలె మనోజ్ఞమైన దివ్యమంగళవిగ్రహము గలవాడును, అందచందములతో గూడియుండు మెరుపుతీగవలె కనులకు మిరుమిట్లు

గొలుపు మహోజ్జ్వలమూర్తియునగు సర్వేశ్వరుని, మనము నిన్నటి దినము శ్రీవేంకటాచలశిఖరమున సేవించితిమి; ఈ దినము తిరుత్తణ్ కావిల్ అను దివ్యదేశమునకు వెళ్ళి అచ్చట సేవించెదము.

వి వి:— "తిరుత్తణ్కా" కాంచీపురమునందలి దివ్యదేశము. "తిరుత్తణ్కాల్" అనునది పాండ్యదేశమునందున్నది. అది వేఱు.

(10-వ పత్తు 10-వ తిరుమొழி, 5-వ పాశురము)

( ) అవ:— ఆళ్వార్లకు సర్వేశ్వరుని యందలి ప్రావణ్యాతిశయముచే నాయకీభావము గలుగగ, యథేచ్ఛముగ సంచరించు చిలుక, గోరువంక మొదలగు పక్షులను జూచి, అవి తన నాయకుడగు శ్రీ తిరువేంగడముడయానులవద్దకు వెళ్ళుచున్నవని భావించి, వానిని పిలచి, తాను పంపుసందేశమును తన మనోనాథునకు తెలుపుడని ప్రార్థించుచున్నారు.

* శొల్లాయ్ పైజ్గిళియే!,
శుడరాழி వలనుయర్త్త,
మల్లార్తోళ్ వడవేజ్గడవనై వర
చ్చొల్లాయ్ పైజ్గిళియే. ౧౦-౧౦-౫.

టీక:— పైజ్గిళియే = పచ్చని చిలుకా! శుడర్ ఆழி = ప్రజ్వలించుచున్న శ్రీ సుదర్శనచక్రమును, వలన్ = కుడిచేతిలో, ఉయర్త్త = ధరించియున్నవాడును, మల్ ఆర్ తోళ్ = బలదర్పితములగు దివ్యభుజములుగలవాడును, వడ వేంగడవనై = ఉత్తరదిక్కునందుండు శ్రీ వేంకటాచలమున వేంచేసియున్నవాడును నైన సర్వేశ్వరుని, వరశొల్లాయ్ = దయచేసి ఇచ్చటకి రమ్మనమని చెప్పుము.

తా॥ అందమైన పచ్చని నా ముద్దుల చిలుకా! నా విరహావేదనను దెలిపి, జాజ్వల్యమానమగు శ్రీ సుదర్శనచక్రమును తనదు కుడిచేతిలో ధరించినవాడును, బలదర్పితములై మొలికలుదేలియుండు దివ్యములగు భుజములతో నొప్పారువాడును, ఉత్తరదిక్కునందుండు శ్రీ వేంకటాచలమున విజయము చేసియుండువాడును నైన నాప్రాణనాథుని దయచేసి యిచ్చటికి రమ్మని చెప్పుము. నీకు పుణ్యముండును.

(11-వ పత్తు 3-వ తిరుమొళి, 7-వ పాశురము)

(7) అవ :— శ్రీశఠగోపనాయకివలె ఈ పరకాలనాయకియు తన మనస్సునన సర్వేశ్వరుని సాక్షాత్కారమును నిత్యసంశ్లేషమును బొంది యుండియు, దానితో దృప్తిపడక, బాహ్యసంశ్లేషముగూడ గలుగవలయు నని యాశపడుచు, అది లభ్యముగానందున చేతిగాజులు జారిపోవునట్లు కృశించి విరహావస్థ ననుభవించుచున్నారు.

కణ్ణన్ మనత్తుళ్ళే నిఱ్కవుమ్, కైవళైగళ్
ఎన్నోకళన్ద ? ఇవై ఎన్నమాయఙ్గళ్ ?,
పెణ్ణానోమ్ పెణ్మైయోమ్, నిఱ్క, అవన్ మేయ
అణ్ణల్ మలైయుమ్ అరఙ్గముమ్ పాడోమే. ౧౧-3-7.

టీక :— కణ్ణన్ = శ్రీ కణ్ణపిరాన్లు, మనత్తుళ్ళే = నా మనస్సులో, నిఱ్కవుమ్ = వేంచేసియున్నప్పటికిని, కైవళైగళ్ = (నాదు) చేతిగాజులు, ఎన్నోకళన్ద = ఏలకో జారిపోవుచున్నవి ; ఇవై ఎన్నమాయఙ్గళ్ = ఇవి ఏమి ఆశ్చర్యములు, పెణ్ ఆనోమ్ = స్త్రీజాతిలో జన్మించినమనము, పెణ్మైయోమ్ = మిక్కిలి అందచందములతో గూడిన స్త్రీత్వమును గలిగియున్నాము ; నిఱ్క = ఇది అటులనుండనిండు ; అవన్ మేయ = ఆ సర్వేశ్వరుడు మిక్కిలి ప్రీతితో వేంచేసియుండు దివ్యస్థలమై, అణ్ణల్ = ఉత్కృష్టతమమైయుండు, మలైయుమ్ = శ్రీ వేంకటాచలమును, అరంగముమ్ = శ్రీరంగమును, పాడోమే = పాడుటకుగూడ ప్రతిబంధకమును గలిగియున్నారమా ?.

తా॥ సర్వేన్ద్రియరసాస్వాదము నొసగు శ్రీకృష్ణపరమాత్మ నా హృదయమున నిత్యవాసముచేయుచున్నప్పటికిని ఎలకో నా చేతిగాజులు జారిపోవుచున్నవి ? ఇదియేమి ఆశ్చర్యము ? మనము స్త్రీజాతిలో జన్మించి మిక్కిలి అందచందములు గలవారలుగ నున్నాము. అది అటులనుండనిండు. సర్వేశ్వరుడు పరమప్రీతితో వేంచేసియుండు పుణ్యక్షేత్రతల్లజములగు శ్రీ వేంకటాచలమును, శ్రీరంగమును నోరార పాడుటకు గూడ ప్రతిబంధకములు గలిగియున్నారమా ?

(11-వ పత్తు 5-వ తిరుమొழி, 10-వ పాశురము)

(10) అవ :— "సఖియా ! నీవు వరించు సర్వేశ్వరుడు ప్రామాణికుడు కాదు, నయవంచకుడు ; అది ఎటులున్నను అతడు ఎవరికిని అందుబాటులో లేనట్లు క్షీరసముద్రమునను తిరువేంగడముననువేంచేసియున్నాడు. అతని నెట్లు నీవు పొందుట?" అని పరకాలనాయకిని గూర్చి యామె సఖి యొకతె అడుగగ, "చెలియా ! అతడిప్పుడు ఆ స్థానములన్నిటిని వదలి నాహృదయమున గదా నిత్యవాసము జేయుచున్నాడు. ఆ విషయము నీకు తెలియనట్లున్నది" అని శ్రీపరకాలనాయకి బదులు చెప్పుచున్నారు.

* కళ్ళత్తాల్ మావలియై మూవడిమణ్ కొణ్డళన్దాన్,
వెళ్ళత్తాన్ వేఙ్గడత్తాన్ ఎన్బరాల్ కాణేడీ!,
వెళ్ళత్తా ళ్వేఙ్గడత్తానేలుమ్, కలిగన్ఱి
ఉళ్ళత్తినుళ్ళే ఉళన్కణ్డాయ్ శాழలే !. ౧౧-౫-౧౦.

టీక :— ఏడీ = ఓ సఖియా ! కళ్ళత్తాల్ = కపటవేషముచే మావలియై = మహాబలిచక్రవర్తివద్దనుండి, మూ అడి మణ్ కొణ్డు = మూడడుగులభూమిని యాచించి, స్వీకరించి, అళన్దాన్ = కొలిచెను (ఆక్రమించుకొనెను ; (ఎవరికిని అందుబాటులో లేనట్లు, వెళ్ళత్తాన్ = క్షీరాబ్ధిలోనున్నాడు ; వేఙ్గడత్తాన్ = మహోన్నతమగు శ్రీవేంకటాచలముననున్నాడు ; ఎన్బర్ కాణ్ = అని చెప్పుచున్నారుగద ! (అని ఒక చెలికత్తె అడుగగ,) శాழలే = చెలియా ! వెళ్ళత్తాన్ = క్షీరాబ్ధియందు పవ్వళించియుండినవాడును, వేఙ్గడత్తాన్ ఏలుమ్ = గహనమగు శ్రీవేంకటాచలమున వేంచేసియున్నవాడును నైనప్పటికిని, (ఇప్పుడు) కలిగన్ఱి = శ్రీకలియనులయొక్క (తిరుమంగయాళ్వారుల యొక్క), ఉళ్ళత్తిన్ ఉళ్ళే = హృదయమునందే, ఉళన్ కణ్డాయ్ = నిత్యవాసము చేయుచున్నాడు సుమా ! (దీనిని నీవు తెలిసికొనలేదా !).

తా॥ "ఓ సఖియా ! నీవు వలవరించు నరుడు మహావంచకుడు; నీవు వినలేదా ? అతడు కపటబ్రహ్మచారియై మహాబలిని మోసగించి మూడడుగులు భూమిని దానముగగొని ఆకాశభూములకువ్యాపించి నిఖిల లోకములను తనదు రెండు శ్రీపాదములతోనే కొలచుకొనెనట గదే ?

అది అటుండనుడనిమ్ము. అతనిని నీ వెట్లుపొందగలవు? అతడు ఎవరికిని అందుబాటులో లేనట్టి క్షీరసముద్రమునను, శ్రీవేంకటాచలమునను గదా వేంచేసియున్నాడు?" అని తనను చెలికత్తె చెప్పగా; "చెలియా! అతడిప్పుడు వానినన్నిటిని వదలి నా హృదయమున నిత్యవాసము చేయుచున్నాడు. ఈ విషయము నీకు తెలియదు కాబోలు" అని పరకాలనాయకి బదులు చెప్పెను.

వి. వి:—(1) పరమపదము, క్షీరసముద్రము, శ్రీరంగము, శ్రీవేంకటాచలము, శ్రీకాంచీపురము - మొదలగు దివ్యదేశములలో నుండుటకంటెను సర్వేశ్వరునకు నిజమైనభక్తుల హృదయారవిన్దములలో నివసించుటయే పరమభోగ్యమైయుండుననియు, సమయముజూచి యచ్చట ప్రవేశించుటకే దివ్యతిరుపతులలో నతడు నివసించియున్నాడు — అని యీను పరమహృదయము సూచింపబడుచున్నది.

(2) "ఎన్నాదన్ దేవిక్కు" "కదిరాయిరమిరలి" అను తిరుమొழிలో శ్రీ పెరియాళ్వారులును, "పట్టిమేయ్ న్దోర్ కారేఱు" అను తిరుమొழிలో "ఇక్కే పోదకణ్డీరే" "విరున్దావనత్తే కణ్డోమే" అని వారి తిరుక్కుమార్తెయును ఈ రసమును అనుభవించిరి. వానిని చూడుడు.

(3) రెండువ్యక్తుల అవస్థను ఒకే సమయమున నొకరు అనుభవింప శక్యమగునా? అనినచో; జ్ఞానాన్దముల ప్రతిబన్ధకము దొలగినచో నంతయును ఉపపన్నమే. నిత్యముక్తులు — ఏకకాలమున అనేక శరీరముల స్వీకరించి సర్వేశ్వరునకు అనేక విధములగు కైంకర్యముల నిర్వహించుచు అనేక కల్యాణగుణచారిత్రముల ననుభవించుచున్నారు - అని శ్రుతి చెప్పుచున్నది. "సౌభరి" మహర్షియనుభవముగూడ నిచ్చట నిదర్శనము.

శ్రీ తిరుమంగైయాళ్వార్ల తిరువడిగళే శరణము.



శ్రీరస్తు

శ్రీమతే పరకాలమహాయోగినే నమః

# శ్రీతిరుమంగై యాళ్వార్లు ప్రసాదించిన తిరుకుఱున్దాణ్డకములోని

# మంగళాశాసన పాశురములు

## 7-వ పాశురము

(7) అవ:— శ్రీ తిరుమంగై యాళ్వార్లు, "అమరర్ శెన్నిపూవినై" ('నిత్యసూరులకు చూడామణివై యున్నావు') అని సర్వేశ్వరుని వర్ణించిరి. అందుపై సర్వేశ్వరుడు మీకేందులకా కొరత; 'మీ శిరస్సునకును మణిగ నుండెదను; మీ శిరస్సును జూపుడు' అని ఆనతివ్వగ, 'నీవు వలదు, నీ సౌశీల్యమును సదాధ్యానించు భక్తశిఖామణులే నా శిరోభూషణములై యుండవలయును' అని ఆళ్వార్లు ప్రత్యుత్తరమిచ్చుచున్నారు.

ఇమ్మైయై మఱుమై దన్నై ఎమక్కు వీడాగి నిన్ఱ,
మెయ్మ్మైయై విరిన్ద శోలై వియన్ తిరువరఙ్గమ్ మేయ,
శెమ్మైయై కరుమై దన్నై తిరుమలై యొరుమై యానై,
తన్మైయై నినైవార్ ఎన్దన్ తలై మిశై మన్నువారే. ౭

టీక:— ఎమక్కు = మాకు, ఇమ్మైయై = ఈ లోకమునందలి ఆనందముల ననుగ్రహించువాడును, మఱుమైతన్నై = పరలోకమునందలి ఆనందముల నిచ్చువాడును, వీడాగినిన్ఱ = పరమావధియగు పరమపదమునందలి, మెయ్మ్మైయై = బ్రహ్మానంద స్వరూపుడును, విరిన్దశోలై = విస్తారములైన పూదోటలతో గూడుకొనియుండు, వియన్ = అత్యాశ్చర్యకరమైన, తిరువరఙ్గమ్ = శ్రీరంగదివ్యక్షేత్రమున, మేయ = నిత్యవాసముచేయుచుండువాడును, శెమ్మైయై = యుగభేదముచే ఎఱ్ఱనివర్ణముగలవాడును, కరుమైతన్నై = నీలవర్ణముగలవాడును, తిరుమలై = శ్రీవేంకటాచలమున, నెలకొనియుండి, ఒరుమైయానై = (భూలోకమున నివసించువారలకును, పరమపదమున నివసించువారలకును) ఒకే విధమగు భోగ్యతనిచ్చు సర్వేశ్వరునియొక్క, తన్మైయై = సౌశీల్యమును, నినైవార్ = ఎల్లప్పుడును తలంచువారలు, ఎన్దన్ = దాసునియొక్క, తలైమిశై = తలపై, మన్నువార్ = అమరియుందురు (శిరోభూషణములై యుందురు).

తా॥ భక్తులకు నైహికసుఖములను, ఆముష్మికసుఖములను అనుగ్రహించువాడును, ఆనందములకు పరమావధియైన మోక్షానందమును అనుగ్రహించువాడును, సువిశాలములగు ప్రాకారములతో చుట్టబడియుండు పరమభోగ్యమగు శ్రీరంగ దివ్యక్షేత్రమున నిత్యవాసముచేయువాడును, యుగభేదముచే నీలారుణాది వర్ణవిశిష్టుడును, మహోన్నతమై పరమరమణీయమగు శ్రీ వేంకటాచలమున విజయముచేసియుండి, లీలావిభూతియందును, నిత్యవిభూతి యందును నివసించు నిఖిలప్రాణులచేతను నొకే విధముగ సేవింపబడుచుండువాడునునైన సర్వేశ్వరుని సౌశీల్యగుణమునందత్యంత ప్రవణులై, దానినే సదా ధ్యానించుచుండు పరమభక్తశిఖామణులే నా శిరోభూషణమై అలరారుచున్నారు.

వి. వి:— శెమ్మైయొక్కురుమై తన్నై — ఉపాసకానుగ్రహమునకై సర్వేశ్వరుడు ఒక్కొక యుగమునందును, ఒక్కొకవర్ణమును స్వీకరించును. కృతయుగమున సత్వగుణపూర్ణుడగుటచే శుద్ధమైన వర్ణమును గోరువారలగుటచే, వారలకై పాలవంటి వర్ణమును స్వీకరించును; త్రేతాయుగమున ఎఱ్ఱనివర్ణమును స్వీకరించును; ద్వాపరయుగమున పచ్చనివర్ణమును స్వీకరించును; కలియుగమున నల్లనివర్ణమును స్వీకరించును.

దీనిని "పాలినీర్మై శెమ్పొనీర్మై" అను తిరుచ్చన్దవిరుత్త పాశురమునను, "నిగళ్న్దాయ్ పాల్ పొన్ పశుప్పు కార్ వణ్ణమ్ నాన్గుమ్" అను నాన్ముగన్ తిరువన్దాది పాశురమునను తిరుమళిశైయాళ్వార్లు వివరించిరి; చూడుడు.

శ్రీ తిరుమంగైయాళ్వార్ల తిరువడిగళే శరణము.

శ్రీరస్తు
శ్రీమతే పరకాలపరమయోగినే నమః
శ్రీమతే రామానుజాయ నమః

## శ్రీతిరుమంగైయాళ్వార్లు ప్రసాదించిన తిరునెడున్దాణ్డకములోని

# మంగళాశాసన పాశురములు

## 8-వ పాశురములు

(8) అవ:—అనేకములగు, భగవంతుడు ప్రీతిమీఱ వేంచేసియుండు దివ్యతిరుపతులను గీర్తించుచు, మొఱలిడుచున్నారు.

* నీరగత్తాయ్ నెడువరైయి నుచ్చి మేలాయ్!,
నిలాత్తిజ్గళ్ తుణ్డత్తాయ్! నిఱైన్దకచ్చి,
ఊరగత్తాయ్!, ఒణ్ తుఱైనీర్ వెంఃకావుళ్ళాయ్!,
ఉళ్ళువా రుళ్ళత్తాయ్! ఉలగ మేత్తుమ్,
కారగత్తాయ్! కార్వానత్తుళ్ళాయ్! కళ్వా!,
కామరుపూ జ్గావిరియిన్ తెన్పాల్ మన్ను,
పేరగత్తాయ్!, పేరాదుఎన్ నెఞ్జి నుళ్ళాయ్!,
పెరుమాన్! ఉన్ తిరువడియే పేణి నేనే. ౮

టీక :— నీరగత్తాయ్=తిరునీరకమను దివ్యతిరుపతిలో వేంచేసియున్నవాడా!, నెడువరైయిన్ ఉచ్చిమేలాయ్ = పరమవిలక్షణమైన శ్రీవేంకటాచలముయొక్క శిఖరమునను ఆభరణమైయున్నవాడా!, నీలాత్తిజ్గళ్ తుణ్డత్తాయ్ = "తిరునీలాత్తిజ్గళ్ తుణ్డ" మను పుణ్యక్షేత్రమున వేంచేసియున్నవాడా! నిఱైన్దకచ్చి ఊరగత్తాయ్ = సంపత్సమృద్ధమైన శ్రీకాంచీపురమున "తిరుఊరక" మను పుణ్యక్షేత్రమున వేంచేసియున్నవాడా! ఒణ్ తుఱైనీర్ వెఃకాఉళ్ళాయ్ = సుందరమై ఏటిరేవుగట్టున నున్న "తిరువెఃకా" అను పుణ్యక్షేత్రమున నాగపర్యంకముపై పవ్వళించియున్నవాడా!, ఉళ్ళువార్ ఉళ్ళత్తాయ్ = ధ్యానించు పరమయోగుల హృదయకమలములయందున్నవాడా!, ఉలగమ్ ఏత్తుమ్ కారగత్తాయ్ = నిఖిలలోకములచేతను స్తుతింపబడుచున్న "తిరుక్కారకమ్" అను దివ్యక్షేత్రమున విజయముచేసియున్నవాడా!,

కార్ వానత్తు ఉళ్ళాయ్ = "తిరుక్కార్ వానమ్" అను దివ్యతిరుపతిలోనున్న వాడా!, కళ్వా = నవనీతచోరుడా!, కామరు = స్పృహణీయమై, పూ = సుందరమైన, కావిరియిన్ = తిరుక్కావేరియొక్క, తెన్ పాల్ = దక్షిణదిక్కున, మన్ను = అమరియున్న, పేరగత్తాయ్ = "తిరుప్పేర్ నగరమ్" అను దివ్యక్షేత్రమునకు స్వామియైనవాడా!, ఎన్ నెఞ్జిల్ = నా హృదయమున, పేరాము ఉళ్ళాయ్ = ఎడబాయక ఉన్నవాడా! పెరుమా = సర్వలోకములకును స్వామియైనవాడా!, ఉన్ తిరువడియే = దేవరవారి దివ్యపాదారవిందములనే, పేణినేన్ = మిక్కిలి ఆశపడియున్నాను

తా॥ శ్రీ కాంచీపురమున "తిరుఊరగమ్" అని ప్రసిద్ధమైన శ్రీఉలగళన్ద పెరుమాళ్ సన్నిధిలోనున్న 'తిరునీరగమ్[1]' అను దివ్యదేశమునందున్నవాడా! భూలోకవాసులు మాత్రమేగాక పైలోకములందున్న వారును అనుభవించునట్లు ఎత్తుగ పైకి వ్యాపించియున్న శిఖరములుగల తిరుమలలో సర్వసులభుడవై వేంచేసియున్నవాడా!, తొండమండలము నందలి ఇరువదిరెండు తిరుపతులలో నొకటగు 'నీలాత్తిజ్గల్ తుణ్డమ్[2]' అను దివ్య తిరుపతిలో వేంచేసియున్నవాడా! 'ఉరగమ్[3]' అని ప్రసిద్ధిజెందిన ఉలగళన్ద పెరుమాళ్ సన్నిధిలో వేంచేసియున్నవాడా! శ్రీతిరుమఙ్గై యాళ్వార్లు పరమవృద్ధులై తీర్థమాడిన పరమభోగ్యమగు రేవుతో గూడుకొనియున్న ఏటిగట్టుగనుండు 'తిరువెంకా[4]' అను దివ్యక్షేత్రమున

1. కారుణ్యమను నీరును కలిగియున్న పెరుమాళ్ళు వేంచేసియున్నందున ఈ స్థలమునకు "నీరగమ్" అని వ్యవహారము కలిగియున్నది.

2. ఇది పెద్దకాంచీపురమున దేవతాంతరాలయమున నున్నది.

3. ఉరగ (ఆదిశేషు) స్వరూపముతో నిచ్చట పెరుమాళ్ళు సేవసాధించుచున్నందున "ఊరగమ్" అను పేరు గలిగినది.

4. బ్రహ్మదేవుని యాగమును ధ్వంసముజేయుటకై ఏతెంచిన వేగవతీనదిని అడ్డగించుటకై, దానికి ఆనకట్టగ పెరుమాళ్ళు పవ్వళించియున్నందున, దీనికి సంస్కృతమున "వేగాసేతు" అను పేరు గల్గినది. అదే అరవమున "వేగవణై" యై, తరువాత "వెంకణై" యై, తరువాత "వెంకా" యైనది.

వేంచేసియున్నవాడా! సదా ధ్యాన నిమగ్నులగు[1] పరమయోగుల హృదయకమలములందున్నవాడా! నిఖిలలోకములచేతను స్తుతింపబడు '[2] కారకమ్' అను దివ్యదేశమున వేంచేసియున్నవాడా! తిరుకళ్వనూర్ అను దివ్యదేశమునందు వేంచేసియున్నవాడా! లేక నవనీతచోరుడా! స్పృహణీయమై పరమసుందరమైయుండు తిరుక్కావేరికి దక్షిణతీరమునందు పరమభోగ్యమగు తిరుప్పేర్ నగరమును అప్పక్కుడత్తాన్ సన్నిధిలో ప్రజ్వలించియున్నవాడా! ఈ దివ్యదేశములకంటెను నా హృదయమున, మిక్కిలి ఆశపడి ఒకక్షణమైనకూడ నెడతెగక పరమకృపతో నివసించుచున్నావు. ఆహా! నీ సౌశీల్యము నకేమందును! సర్వేశ్వరా! నీ దివ్యపాదారవిందములయందే మిక్కిలి ఆసక్తిగలవాడనై యున్నాను. నన్ను అనుగ్రహింపుము. నీవు చేసిన మహోపకారమునకు నేనేమి సమర్పింపగలను.

వి. వి :— (1) నీరగమ్ — 'తిరునీరగ' మను దివ్యదేశము కాంచీపురమున 'తిరుపూరగ' మని ప్రసిద్ధిచెందిన ఉలగళన్దపెరుమాళ్ సన్నిధిలో నున్నది. నీటి స్వభావముగల సర్వేశ్వరు డచ్చటనుండుట చే 'నీరగ' మని ప్రసిద్ధిగలిగినదనుచున్నారు.

(2) నెడువరై — పైలోకముల యందుండువారలునువచ్చి సేవించుటకుల నున్నతమైయున్నది శ్రీవేంకటాచలము. అందుచేతనే "తిరుమలై" అనియే దానికి నిరూపకనామ మేర్పడినది.

(3) నిలాత్తిఙ్గళ్ తుణ్డమ్ — ఇది పెద్దకాంచీపురమున దేవతాన్తరాలయమున నున్నది.

---

1. "నిలాత్తిఙ్గళ్ తుణ్డమ్" అను దివ్యదేశమువలె, "ఉళ్ళువారుళ్ళమ్" అను దివ్యదేశముకూడ దేవతాంతరాలయమున నున్నదనియు, అచ్చట వేంచేసియున్న పెరుమాళ్ళను ఆళ్వార్లు ఇచ్చట అభివర్ణించియున్నారనియు కొందరు చెప్పుచున్నారు. అదియే సందర్భానుగుణముగ నున్నదనితోచుచున్నది.

2. ఇదియును, శ్రీకాంచీనగరమున ఉలగళన్దపెరుమాళ్ సన్నిధిలోనే చేరియున్నది. మేఘముయొక్క స్వభావముగల పెరుమాళ్ళు ఇచ్చట వేంచేసియున్నందున ఈదివ్యదేశమునకు "కార్ అగమ్" అను పేరుగలిగియుండవచ్చును.

(4) ఊరగమ్ — ఉలగళన్ద పెరుమాళ్ సన్నిధి ఉరగరూపమున పెరుమాళ్ళిచట సేవసాదించుటచే దీనికి "ఊరగ" మను పేరు ప్రసిద్ధులు గలిగినవి—అని అనెదరు.

(5) వెహ్కా — యథోక్తకారిసన్నిధి ; బ్రహ్మజేసిన యాగమును నాశముజేయ వచ్చిన "వేగవతీ" నదిని అడ్డగించుటకై దానికి ఆనకట్టగనడ్డముగ పరుండెను. అందుచే "వేగాసేతు" అని సంస్కృతమున వచ్చినది. అది అపరమున "వేగవణై" అని వ్యవహరింపబడుచున్నది. ఆ పదమే మారిమారి 'వెహ్కా' అని మారియుండవచ్చును.

(6) కారగమే — ఈ దివ్యదేశముగూడ, కాంచీపురమున ఉలగళన్ద పెరుమాళ్ సన్నిధిలో నన్తర్భూతమైన దివ్యదేశములు - "ఊరగమ్, నీరగమ్, కార్గానమ్"—అను నాల్గింటిలో నొకటి.

(7) కార్ వనమ్ — ఈ దివ్యదేశముగూడ ఉలగళన్దపెరుమాళ్ళ కోవిలలో నున్నది.

(8) కళ్వా — తిరుక్కళ్వనూర్ ఇతరులు తెలిసికొనలేనట్లు కార్యముచేయుట దొంగతనము "ఇరామడమూట్టువారైప్పోలే ఉళ్ళేపది డన్ను" అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు సాదించినటుల చోరశిఖామణి.

(9) పేరగమ్, తిరుప్పేర్ నగర్ అను అప్పక్కుడత్తాన్ సన్నిధి.

(9) అవ :— సర్వేశ్వరా! దివ్యతిరుపతులలో నిత్యసన్నిధిజేయుచుండు నీ అప్రాకృత సౌందర్యమును, నీ సౌశీల్యమును సంకీర్తనము చేయుచు నలుదిక్కుల చాటెదను. అని వక్కాణించుచున్నారు.

వజ్ఞత్తాల్ మామణివ న్నను మున్నీర్,
మలైయాయ్! మదిళ్ కచ్చి యూరాయ్! పేరాయ్!,
కొజ్ఞత్తార్ వళజ్గొన్రై యలజ్గల్ మార్వన్,
కులవరై యన్ మడప్పావై ఇడప్పాల్ కొణ్డాన్,
పజ్ఞత్తాయ్! పాల్కడలాయ్! పారిన్ మేలాయ్,
పనివరైయుచ్చి యాయ్! పవళ వణ్ణా!,
ఎజ్ఞుళ్ళాయ్! ఎమ్బెరుమాన్! ఉన్నై నాడి,
ఏழையేన్ ఇజ్ఞనమే ఉళ్ళదరుగేనే.

టీక :— వఙ్గత్తాల్ = నావలతో, మామణి = ప్రకృష్టమైన రత్నములను, వన్దు = కొనివచ్చి, ఉన్దు = రాసులుగపోయుచున్న, మున్నీర్ = సముద్రపు ఒడ్డున నున్న, మల్లైయాయ్ = తిరుక్కడల్ మల్లై అను దివ్యదేశమున విజయముచేసియుండు వాడా, మదిళ్ కచ్చి ఊరాయ్ = మహోన్నతములగు ప్రాకారములతో విరాజిల్లు చుండు శ్రీకాంచీ దివ్యదేశమున (తిరువెంకాలో) నిద్రించుచున్నవాడా !, పేరాయ్ = తిరుప్పేర్ నగరమున నివసించువాడా ! కొఙ్గువార్ = తేనెతో నిండియుండునదియు, వళమ్ = ఎఱ్ఱనైనట్టిదియునైన, కొన్ఱై అలఙ్గల్ = కొన్ఱ పుష్పముల మాలతో గూడు కొనియున్న, మార్వన్ = శివ్యవక్షఃస్థలముగలవాడును, కులమ్ = సద్వంశముగల, వరై యిన్ = హిమవత్పర్వతమునకు, మడప్పావై = ముద్దులకూతురైన పార్వతీదేవిని, ఇడప్పాల్ = ఎడమ ప్రక్కన, కొణ్డాన్ = కలిగియున్న పరమశివుని, వఙ్గత్తాయ్ = దక్షిణపార్శ్వమున గలవాడా!, పాల్ కడలాయ్ = క్షీరసముద్రమున యోగనిద్రలో పవ్వళించియున్న వాడా! పారిన్ మేలాయ్ = (రామకృష్ణాదిరూపములతో నవతరించి) భూమిపై పాదచారియై సంచరించినవాడా !, పనివరై యిన్ = శీతలమణిమయమైయుండు శ్రీ వేంకటాచలము యొక్క, ఉచ్చియాయ్ = శిఖరమున నివసించువాడా ! ఎఙ్గుఉఱ్ఱాయ్ = ఎచ్చట నున్నావు ?, పవళవణ్ణా = పగడమువలె మనోజ్ఞమైన వర్ణముగలవాడా, ఎమ్ పెరుమాన్ = నా స్వామీ ! ఏழైయేన్ = (బీదవాడను మిక్కిలిచపలుడను) దానును, ఉన్నైనాడి = నిన్ను వెదకికొనుచు, ఇఙ్గనమే = ఈప్రకారమే, ఉరుతరుగేన్ = శ్రమపడుచున్నాను

తా॥ నావలతో ప్రకృష్టములగు రత్నములగొనివచ్చి నింపబడుచున్న సముద్రపుటొడ్డుననున్న తిరుక్కడల్ మల్లై పుణ్యక్షేత్రమున మిక్కిలి ఠీవితో వేంచేసియున్నవాడా ! మహోన్నతములగు ప్రాకారములచే పరివృతమగు తిరువెంకా దివ్యక్షేత్రమున నిద్రించుచున్నవాడా ! తిరుప్పేర్ నగరమున పరమ రసికుడవై విజయముచేసియున్నవాడా ! మకరందనిర్భరములై అరుణరమణీయములగు కొన్ఱైపుష్పమాలలచే నలంకృతమైన దివ్యవక్షఃస్థలము గలవాడును, పర్వతరాజపుత్రియైన శ్రీ పార్వతీదేవిని ఎడమభాగమున గలిగినవాడును నగు పరమేశ్వరుని తనదు దక్షిణపార్శ్వమున కలిగియుండి విరాజిల్లుచున్నవాడా! క్షీరసముద్రమున నాగపర్యంకముపై పవ్వళించియున్నవాడా ! రామకృష్ణాది రూపములతో

